వేదములు

# యజుర్వేదం



ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్

www.freegurukul.org

# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని ఆర్కైవ్ వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ఆర్కైవ్ వారి వెబ్ సైట్: https://archive.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li ×

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search

Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements** (more)

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web** 426 billion pages saved over time

INTERNET ARCHIVE WaybackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** 1,721,625 movies — Browse (by keyword)

Curator's Choice (more)

Noveltoon: The Stupidstitious Cat

A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...

Recent Review

Little Ol Bosko In Bagdad

Average rating:

**Live Music** 131,731 concerts — Browse (by band)

Curator's Choice (more)

Yarn Live at Towne Crier Cafe on 2014-02-16

01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...

Recent Review

Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30

Average rating:

**Audio** 2,095,303 recordings — Browse (by keyword)

Curator's Choice (more)

contra32: Infex - Type-E

How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...

Recent Review

KM/TB Sol Rezza 2014

Average rating:

**Texts** 6,509,320 texts — Browse (by keyword)

Curator's Choice (more)

The Orchid world. A monthly illustrated journal...

No more published

Recent Review

الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم

Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శుక్లయజుర్వేదీయ సంహిత

వేదభాస్కరుడు

ఓంనమో వేద పురషాయ

హృదయందక్షిణం చాక్షి మండలంచాధిరుహ్యాయః।

చేష్టతేతమహం నౌంఋుగ్యజుస్సామంగ్రహం ॥

భగవానుడునన్ను అనుగ్రహించాడు.కేవలం పరమాత్మునికరుణా కటాక్షం వలనశ్రీమద్రామాయణ(1963), శ్రీమహాభారత(1994), శ్రీమహాభాగవత(1970) గ్రంథాలను ఆంధ్రవచనంలో రచించగలిగాను.భారత సంస్కృతికిమూలస్థంభాలుఆ గ్రంథాలు. ఆ మూడింటినీఒక్కడు రచించినదృష్టాంతరాలు అరుదు.

భగవదనుగ్రహంలేక ఏ కార్యము ప్రారంభంకాదు. కొనసాగదు, పూర్తికాదు,ఏలనన సకల కర్మలుభగవదధీనములు.

ఈ మూడుమహాగ్రంథాలనుశ్రీరామా పబ్లిషర్, సిద్దంబర్‌బజార్, హైదరాబాదు- 012 వారు ప్రచురించారు. అందుబాటులోఉంచారు.

కేవలంభగవదనుగ్రహంవలన నాలుగువేదాల వచనానువాదంచేశాను. ఇది మానవమాత్రులకు అసాధ్యకార్యం. భగవానుడునన్ను ప్రోత్సహించాడు.వ్రాయించాడు. కాకున్నవార్ధక్యంలో, బలహీనశరీర మనస్సులతో ఇంతటిమహత్కార్యంనావంటి సామాన్యునికిసాధ్యం కాదు.

వేదంఅనువదించాలనేఆలోచన ఆరున్నరపదులుదాటింతరువాతరావడం ఏంటి? అదిఆవేశం కావచ్చు. ఆరాటంకావచ్చు. అణగిపోరాదా!పోదే! పట్టుకొని వదలదే?ఇదేమైన సామాన్యకార్యమా? ఉత్తరమా!కథయా! నవలయా!వేదమంటే వేదం!! సామాన్యం కాదు. సాధారణంకాదు. అసామాన్యం! అసాధారణం!అదేమన్నా మానవప్రోక్తమా?

"పురుషఏవేదగ్ ం సర్వం యద్భూతంయచ్చభవ్యం"

సర్వమూవేద పురుషుడే. జరిగిందీ,జరుగనున్నదీసర్వమూ వేదమే!

వేదంహిమవదున్నతం.ఆకాశమంటి శాలం.సముద్రమంతటిగహనం, గంభీరం.వాయువు వలెసర్వవ్యాప్తం.

వేదంఅంత గొప్పది. నేనుఎంతో చిన్నవాణ్ణి.నేనేంటి? వేదానువాదంగురించి

ఆలోచించడంఏ◌ిటి? రచనకు పూనుకోవడంఏ◌ిటి?

ఇది కేవలం భగవదనుగ్రహం.అంతకన్న వేరు కాదు.

ప్రతిప్రాణికీ పరి◌ిత శక్తిఉంటుంది. అదీ పరాత్పరుడుప్రసాదించే. ఆ శక్తివరకు ఏదైనా చేస్తేఅతని శక్తి అనవచ్చు.చెప్పుంటే చెప్పుకోవచ్చు.వప్పుకున్నావప్పుకోవచ్చు.

కానిశక్తికి ◌ించిన కార్యం చేసిందంటే?చీమ కొండను కదిలించిందంటే?దోమ ఆకాశానికి ఎగిరిందంటే?బిందువు సముద్రాన్ని◌ింగిందంటే? ◌చిత్రంకదా? ఆశ్చర్యం కదా? అచ్చెరువుకదా! అయినా అప్పుడప్పుడూఅలాంటి◌ జరుగుతాయి.అది కేవలం భగవదనుగ్రహంవలన జరుగుతాయి!

అలాంటిదేనేను వేదాధ్యయనానికిపూనుకోవడం. అర్థం చేసికొనడం.అనువదించడంఆశ్చర్యకరమేమరి! ◌ికుకాదు. వ్రాసిన వాణ్ణినాకే ఆశ్చర్యం?! ఆంధ్రసాహిత్యచరిత్ర వేయేళ్ళునిండింది. ఇందులోఎంత మంది మహాకవులు! మహనీయులు!మహితాత్ములు!మహానుభావులుఎవరి కారణాలు వారి◌.ఎవరూ నాలుగు వేదాలఅనువాదానికి పూనుకోనేలేదు. అంతటిసుదీర్ఘ కాలంలో భగవానుడునాకే సంకల్పం కలిగించాడు!మరి ◌చిత్రమేకదా! అచ్చెరునే కదా!ఆశ్చర్యమే కదా!

"ఒనరన్నన్నయ తిక్కనాదికవులీయుర్వింబురాణావళుల్
తెనుగుల్సేయుచు మత్పురాకృతశుభాధిక్యంబుదానెట్టిదో
తెనుగుంజేయరు మున్నుభాగవతమున్దీనిన్ దెనింగించినా
జననంబున్సఫలంబు చేసెదబునర్జన్మంబులేకుండగన్"

అన్నాడుభక్తి శిఖామణిబమ్మెర పోతనామాత్యుడు.అది నాకూ వర్తించవచ్చు.కాని అంత అందంగా చెప్పడంరాదు. అందుకే గంటం తేనెలోముంచి వ్రాసిన పోతనపద్యం ఉదాహరించాను.

పోతనామాత్యుడునాకు ఆదర్శం. అతనికి సాటిరాలేను. అందుకే వచనాన్నివరించాను.

ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి,పురంబులు వాహనంబులున్
సొమ్ములుగొన్ని పుచ్చుకొని సొక్కి, శరీరముబాసి కాలుచే
సమ్మెటపోటులంబడకసమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు భాగవతంబుజగద్ధితంబుగన్

పోతనమనుజేశ్వరాధములకుఅంకితం ఇవ్వలేదు.నేనూ కాసుకు ఎవరికీ అంకితంఇవ్వలేదు. మహానుభావుడుపోతన జగత్హితానికి భాగవతంరచించాడు. నేనూఏ రజనా కాసుకోసం గాని, కీర్తి కోసంగాని చేయలేదు.నా ధర్మంగా

రచించాను.జనుల కోసం రచించాను.రచన చేసి ఆర్జించిందిఅతి తక్కువ!

బాలరసాల పుష్ప నవపల్లవకోమలకావ్యకన్యకన్
గూళలకిచ్చియప్పడుపుగూడు భుజించుటకంటె సత్కవుల్
హాళికులైననేఁ యంతకు నాయతిలేనినాడుగౌ
ద్దాలికులైననేఁ **నిజాదారసుతోదరపోషణార్థమై**

పోతనదిగాచెప్పబడుతున్నఈ పద్యం మంచన'కేయూరబాహుచరిత్ర' 1-13లోనిది.

నేనూనిజదార సుతోదర పోషణార్థంఉద్యోగం చేసుకున్నానుతప్ప కాసుకు కావ్యాన్ని అమ్ముకోలేదు,71 సంవత్సరాల జీఁతంలోఒకణ్ణి అర్థించి ఎరుగను.

నాబాల్యంలోనూతండ్రిగారు వేదంలోనిదిఅని చెప్పబడేదిగువ శ్లోకం ఉదాహరిస్తుండేవారు.

**"దంతాన్ధావయేత్ ప్రాత:పలాశ వట పిప్పలైః"**

ఉదయంపళ్లు తోముకోవాలి-మోదుగు, మర్రి, రాఁ పుల్లలతోదంతధావనంనుంచి జీఁతంసమస్తం వేదంలోఁవరించబడిందనిచెప్పడం వారి ఉద్దేశ్యం.

ఆనాడేనాకు వేదం ఁద ఆసక్తికలిగింది. మాది ఁద్వత్కుటుంబం. ఇంట్లో ఆంధ్ర,ద్రాఁడ, సంస్కృత గ్రంథాలుఅనేకం ఉండేఁ. వాటిలోవేదం వెదకాలనినా ఆతురత. అలా వెదుకుతూనేను పడిపోయాను.నా ఁద భారీ గ్రంథాలుపడ్డాయి. ఆ చప్పుడుకు ఇంట్లోనివాళ్లంతా ఉరికి వచ్చారు.గ్రంథాలు తీశారు. నన్నుబయటకు తీశారు.

"ఏంవెదుకుతున్నావు?"మా నాయన అడిగారు.వారి ధ్వనిలో ఁసుగూ ఉంది,కోపం ఉంది.

"వేదం"అన్నాను.

నాయనఅంత కోపంలోనూ పగలబడినవ్వారు-వారిని చూచిఅంతా నవ్వారు.

నేనుచిన్నబుచ్చుకున్నాను.

"వేలెడులేడు వేదం చదువుతాడట"అన్నారు నాయన. వారుఈ ఁషయం చాలమందికిసగర్వంగా చెప్పుకున్నారు!.

రెండోప్రపంచ యుద్ధంజరుగుతున్న రోజుల్లోనేను 5,6 తరగతిచదువుతున్నాననుకుంటానలుగురు కలిసినచోట వేదప్రస్తావనవచ్చేది. హిట్లర్మన వేదాలు ఎత్తుకుపోయాడు.వేదాలననుసరించేబాంబులు చేస్తున్నాడు.జర్మనులు ఆర్యులు.హిట్లరే గెలవాలిఅనుకునేవారు. ఇంగ్లీషు వారిఁద

ద్వేషంతో హిట్లరుగెలవాలనేవారనుకుంటా.మరొక కారణమూ ఉంది.హిట్లరు పతాకంలో''స్వస్తిక్'' ఉండేది. హిట్లర్‌తనను ఆర్యుడుఅనుకునేవాడు. ఆర్యులకేలోకాలను పాలించేఅధికారంఉందనుకునేవాడు.''కృణ్వంతో ిశ్వమార్యం''లోకాన్ని ఆర్యమయంచేద్దాం అనేదిఅతని నినాదం.

'' **కృణ్వంతోంశ్వమార్యం''** కుహిట్లరుదికువ్యాఖ్యానం. లోకమంతటినీసభ్యసమాజంచేద్దామని అసలుఅర్థం. రాజకీయ ఆధిపత్యంవేద నినాదం కాదు.సమాజాలను సంస్కరించడంవేదపు లక్ష్యం. ఈ ిషయాలుతరువాతి అవగాహన.ఆనాడు నేనూ హిట్లరుగెలవాలనే అనుకున్నాను.

తదుపరికాలంలో నాకు ప్రజాఉద్యమాలతో సంబంధంఏర్పడింది. బోల్షింక్

రష్యామా ంద అనంత ప్రభావంవేసింది. రాజకీయఅవగాహన ఏర్పడింది.జాతి దురభిమానంప్రమాదకరం అని అర్థంఅయింది. అప్పుడు హిట్లర్‌ఓడాలనుకున్నాం.

ప్రజాస్వామ్యంగెలవాలనుకున్నాం.హిట్లర్ ఓడాడు.ప్రజాశక్తులు ిజయంసాధించాయి!

నేనునిజాం వ్యతిరేకసాయుధ పోరాటంలోపాల్గొన్నాను. 1948లోనిజాం రాజ్యంందపోలీసు చర్య ిజయవంతంఅయింది. నిజాం రాజ్యంభారత యూనియన్‌లోంలీనం అయింది. కొద్దిరోజుల్లోనే వచ్చినస్వాతంత్ర్యం 'మేడిపండు'అనితేలిపోయింది. ప్రాణాలకు

తెగించిపోరాటాం జరిపిన వారుబికారులైనారు. నిన్నటినిజాం తొత్తులుఖద్దరు కట్టిరాజ్యమేలారు!

పోరాటకాలంలో ిప్లవ సాహిత్యంఅధ్యయనం చేశాం.దాంతో భారతీయసాహిత్యం ిషయంలోంముఖత ఏర్పడింది.ంముఖత సరైనపదం కాదు. అసహ్యంఏర్పడింది అంటే వాస్తవంఅవుతుంది. భారతీయసంస్కృతీ సాహిత్యాలకుఆంగ్ల సాహిత్యంతోబాటు వామపక్షాలుద్రోహం చేస్తున్నాయనేదినేటి నా నిశ్చితాభిప్రాయం.

వామపక్ష సాహిత్యం ప్రభావంనుంచి బయటపడడం దుర్లభం.అయితే నాకు గల సంప్రదాయప్రభావమో, భగవదనుగ్రహమోనేను ఆ ప్రభావంనుంచి బయటపడ్డాను. కాని కమ్యూనిస్టుపార్టీలను గాని, కమ్యూనిస్టుసాహిత్యాన్నిగానిద్వేషించడం లేదు.

ద్వేషించడంనా స్వభావానికి ిరుద్ధం!

అలాబయట పడ్డాను.భారత సాహిత్య,సంస్కృతులను పునరధ్యయనంచేశాను. అప్పుడు భారతసాహిత్యం హిమవదున్నతం.అనన్యసామాన్యంఅని అర్థం అయింది. ఒక్కొక్క గ్రంథఅధ్యయనానికి జీంతాలుసరిపోవు. జన్మజన్మలుకావాలని గ్రహించాను.

1963అనుకుంటాను నేనురామాయణం రచించినసందర్భంగా క◌సామ్రాట్◌శ్వనాథ సత్యనారాయణగారునాకు సన్మానం చేశారు.ఈ ◌షయం నా 'జీవనయానం'లో◌వరించాను.

సభముగిసింది. ◌శ్వనాథ నన్నుగట్టిగా కౌగిలించుకున్నారు.నా చె◌లో మూతిపెట్టి అడిగారు.

"రంగాచార్లూ!రామాయణం నీకేమైనాఅర్థమైందీ?"
"గురువుగారూ!నాకే◌ అర్థం కాలేదు"అనే వాస్తవం చెప్పాను.

"ముప్పయ్యేళ్లుఏడ్చిన ముండావాణ్ణినాకే అర్థం కాలేదు,
నీకేమర్థమవుతుందీ"అన్నాడు. మహానుభావుడు.వారు 30ఏళ్లు శ్ర◌ంచి'రామాయణ కల్పవృక్ష'మహాకావ్యంరచించారు.
నేనునాలుగుసార్లు రామాయణంవ్రాశాను. 1. శ్రీమద్రామాయణము,2. సీతాచరితం, 3.బాలల రామాయణం,4. రామాయణ పాత్రలు.

వాల్మీకిరామాయణ పారాయణంకాదు- అధ్యయనంఎని◌ది సార్లు చేశాను.ప్రతి తడవా వాల్మీకిక◌త నిత్యనూతనంగాకనిపిస్తుంది.

**"సముద్ర◌వరత్నాఢ్యంసర్వశ్రుతి మనోహరమ్"**

సముద్రంలోరత్నాలుంటాయి. కనిపించవు.వెదకాలి. అప్పుడేరసాస్వాదం.

ఇహలోకంతోపని ఉండదు. రామాయణంలోమునిగిపోతాం.

రామాయణంవంటి కావ్యం భరతజాతికే ఉంది. గర్వించండి.ఈ అదృష్టం మరొక జాతికిలేదు!

**"యథాసముద్రోభగవాన్ యథామేరుర్మహానగః**

**ఉభౌఖ్యాతౌరత్ననిధయః తథాభారతముచ్యతే"**

సముద్రం,మేరు పర్వతం, రత్ననిధులు అని ప్రసిద్ధి.భారతం ఆ రెంటివంటిది.

**మానవజాతిసాంతం వ్యాసభగవానునికిరుణపడి ఉంటుంది.ఏ◌ చేసినా అతని రుణంతీరదు. అతడు మనకుతరగని సంపద ఇచ్చాడు.అది అక్షయపాత్ర. ఇవ్వదలచినంతఇవ్వండి, ఇంకా ◌గిలి ఉంటుంది!**

లలితస్కంధము గృష్టమూలముశుకాలాపాభిరామంబు

మంజులతా శోభితమున్సువర్ణ సమనస్సుజ్ఞేయమున్సుందరో

జ్జ్వలవృత్తంబు మహాఫలంబుఁమల వ్యాసాలవాలంబునై

వెలయున్'భాగవతాఖ్య'కల్పతరు వుర్విన్సద్ద్విజ శ్రేయమై

పోతనశ్రీమహాభాగవతము1-20

## సాహిత్యం-దశలు

**నరునికిసభ్యత, సంస్కారం,నాగరికత, సామాజికజీఁతం నేర్పిందిసాహిత్యం, రాజకీయంకాదు.రాజకీయాలను, రాజ్యాలను,రాజులను ఏర్పరచిందికూడ సాహిత్యమే!మానవజీఁతంశాంతిమయం, సుఖప్రదంకావడానికి నిర్విరామ కృషి చేసిందిసాహిత్యం.**

పాశ్చాత్యసాహిత్యానికి ప్రచారమే-ఇంకా పాలపళ్లు రాలలేదు.ఆ సాహిత్యానికి ఁనోదంప్రధానం. ఁశ్వ శ్రేయస్సుకోరేదీ, అందుకు కృషి చేసేదీభారత సాహిత్యం." **ఁశ్వశ్రేయః కావ్యమ్**"

సాహిత్యసందేశాలను నరుడుపాటించి ఉంటేప్రభుత్వాల పనిఉండేది కాదు. '**మాఁద్విషావహే**' - మేము ద్వేషించుకొనం,ప్రపంచంలో యుద్ధాలనుంచికుటుంబ కలహాలదాక ద్వేషమే కారణంఅవుతున్నది.ఒక్కసారి ద్వేషం లేని,ప్రేమైక సమాజాన్నిఊహించండి. నాడుప్రభుత్వం, పోలీసుసైన్యం, న్యాయస్థానంఅవసరం ఉండదు!

'**మాగృధఃకస్యచిద్ధనం**' మరొకసారి ధనాన్ని హరించకు.లోకంలో ఉన్న తగాదాలన్నీధనం చుట్టేపరిభ్రఁస్తున్నాయి.ధనం అంటే చిరస్థిరఆస్తులు. ఎవని ధనమూఎవడూ అపహరించడు.అలాంటప్పుడు రాజ్యాలు,యుద్ధాలు, హింస,మారణ హోమాలుఉండవు. శాంతి పరిమళాలువెల్లి ఁరుస్తాయి. స్వర్గంఅనేది నేలకు దిగివస్తుంది.

ధనం,మానవ సంబంధాలేఅశాంతికి కల్లోలాలకుకారణాలు. ముఖ్యంగాస్త్రీ పురుష

సంబంధాలుజగడాలకు కారణాలుఅవుతాయి. సాహిత్యంఆస్తిని గురించి అనేక సంప్రదాయాలుఆచారాలు స్థిరపరిచింది.చాలా వరకు ద్వేషకావేశాలనునివారించగలిగింది.

ఇప్పుడున్నఆస్తి ఁషయక వ్యాజ్యాలుఒక శాంతం కూడా కావు. సామాజికనేతలు, సాహిత్యం,తొంబది తొఁమ్మదిశాతం మందికి శాంతిప్రసాదించగలిగారు!

వాస్తవంఁజయం సాధించిందిలైంగిక సంబంధాల్లో!ఎంతటి నీచుడైనాతల్లీ-అక్కా

చెల్లెళ్ళపొందు కోరడు!! ఒక భార్య-ఒక భర్త ఇది అనంతంజయం. 'అనన్యారాఘవేణాహంభాస్కరేణ ప్రభాయథా'అంటుంది సీత. రాముడూనేను అన్యులంకాం-అనన్యులం,సూర్యుడూ వెలుగు వలెకలిసిపోయినవాళ్ళం.ఇలాంటి బాంధవ్యంకలిగించడం ఎంతకష్టం? నేటి సమాజంలోసహితం అత్యధికశాతం దంపతులుదీన్ని పాటిస్తున్నారు.

పూర్తిస్వేచ్ఛ ఎక్కడా, ఏనాడూఉండదు. స్వేచ్ఛకుశృంఖలాలుంటాయి.ఆ పరిధిలోనే స్వేచ్ఛ.అది దాటితేనేరం. నేటి సమస్తసమస్యలకూ, రుగ్మతలకుకారణం 'శృంఖల స్వేచ్ఛ'ఇది నరుని జంతుదశనాటిది! దీన్నినాగరికత అనడంలోనేఉన్మాదం ఉంది. ఉన్మాదానికికార్య కారణ సంబంధంఉండదు. అది వెర్రివానిచేతిరాయి.

నరునికిసభ్యత, సంస్కారంనేర్పడానికి సాహిత్యంఅనేక అవతారాలు ఎత్తాల్సివచ్చింది. సంగ్రహంగాఅ ఇలా ఉంటాయి.

**1.ప్రభు సంహిత.**

సమాజానికి,శ్వానికి హితం కూర్చేదిసంహిత. 'హితం'అంటే రానున్న మేలు.'ప్రియం' అంటే అప్పటిమేలు. అప్పటికికటువైనా దీర్ఘకాలపుప్రయోజనం కలిగించేది'హితం'. మదులుతత్కాలకటువు.తరువాత ఆరోగ్యం, ఆయుష్యంకలిగిస్తాయి.

**"సులభాఃపురుషా రాజన్ సతతంప్రియవాదినః**
**అప్రియస్యతుపథ్యస్య వక్తా శ్రోతాచదుర్లభః**

ఇదిరామాయణంలోనిశ్లోకం. భీషణుడురావణునితో అన్నమాటలి.

రాజా! నిత్యం ప్రియమైన మాటలు చెప్పేవారు సులభంగా లభిస్తారు. కాని అప్రియం అయినా హితం చెప్పేవారు, నేవారూ దుర్లభులు.

తొలుత సాహిత్యం ప్రభుసంహిత అయింది. అది ప్రభువు వలె శాసించింది. మనిషికి నాగరికత, సంస్కారం నేర్పింది. వేదం ప్రభుసంహిత. వేదానికి తిరుగులేదు. వేదం చెప్పింది ఆచరించాల్సిందే. గత్యంతరం లేదు. వేదం శాసిస్తుంది. శాసనానికి అంతా లొంగాల్సిందే!

**"దంతాన్ ధావయేత్ ప్రాతః "** ఉదయం దంత ధావనం చేసుకోవాలి. అది ధి, శాసనం. "కర్తా స్వయం పాదౌ ప్రక్షాళ్య" కర్త స్వయంగా తన కాళ్లు కడుక్కోవాలి. అంతే మరొకణ్ణి కడగమనరాదు.

**2. త్ర సంహిత**

ఈ నరుడున్నాడే-వాడు ◌చిత్రాతి ◌చిత్రుడు. అతడు ఎల్లప్పుడూ ఒకదానికే కట్టుబడి వుండడు. అతనికి కట్లు బాట్లు ఇష్టం ఉండవు. స్వేచ్ఛాచారి కావాలనుకుంటాడు. అడ్డు లేని ఆకాశంలో ◌హరించాలనుకుంటాడు!

నరుడు ప్రభుసంహితమగు వేదాన్ని ప్రశ్నించాడు. అందులోని గతినే ప్రవర్తించాలనే నియమమేం? అన్నాడు. ధిక్కరించాడు.

బిడ్డ తల్లి రొమ్మును తంతుంది. తొక్కుతుంది. తల్లి కోపించదు. ముద్దులు కురిపిస్తుంది. సాహిత్యం వ్యక్తికీ, సమాజానికీ తల్లి లాంటిది. బిడ్డలు వేదం చెప్పింది ◌నలేదు. అందుకు వేదం కోపగించలేదు. నరుని సక్రమ మార్గాన నడిపించాలనుకుంది. అన్వేషణ- పరిశీలన- తపస్సు కొనసాగించింది. ఆ తపస్సు లోంచి ఆ◌ష్కరించిన అమృతమే 'కథ' కథ ◌నడానికి సొంపుగా ఉంటుంది. ఆ కథలో సందేశాన్ని చేర్చడం ఈ టెక్నిక్కు.

◌త్రుడు చెపుతే నరుడు ◌ంటాడు. కాబట్టి సాహిత్యం సమాజానికి ◌త్రం అయింది. ఆ◌ధంగా సమాజం కోసం తన స్వరూపాన్ని మార్చుకుంది. పేరు మార్చుకుంది. కానిగుణం మార్చుకోలేదు. **"◌శ్చేశ్రేయః కావ్యం"**

రామాయణ- భారత- భాగవత - పురాణాదులు ◌త్రసంహితలు.

దశరథుడు ముసలితనంలో వయసు పెళ్లాం కైకను తెచ్చుకున్నాడు. కైక మాట జవదాటలేకపోయాడు. కుటుంబం ◌చ్ఛిన్నం అయింది. దశరథుడు నశించాడు. ఈ సందేశం కోసం అద్భుతం అయిన కథ అల్లారు వాల్మీకి. కథ బోనసులాంటిది. సందేశం సరుకు లాంటిది. సరుకుల అమ్మకం కోసం బోనస్ ఇస్తాడు. మనమ బోనస్ కోసం సరుకు కొంటాం. ◌త్ర సంహిత బోనస్ చూసి సందేశం అందించడం లాంటిది.

నాటి నుంచి నేటి వరకు కథ జనులకు అత్యంత ప్రియం అయింది. నేడువ్యాపార సంస్థలు కూడా దీన్ని వాడుకుంటున్నాయి.

### 3. కాంతాసంహిత

◌త్రవాక్యం తు కర్తవ్యం. ◌త్రుడు ఎలాంటి వాడు? కర్ణుని వంటివాడు. సుగ్రీవుని వంటివాడు. పోగాలము దాపురించినవాడు దీప నిర్వాణ గంధమును, అరుంధతిని, ◌త్ర వాక్యమును మూర్కొనరు, కనరు, ◌నరు అని చిన్నయసూరి నీతిచంద్రిక. అట్లయినా కావ్య ఇతి హాస పురాణాదులు జనం ◌నోదం కోసం ◌న్నారు. సందేశం పట్టించుకోలేదు.

**సాహిత్యం, సాహిత్యకారులు సమాజానికి పితృతుల్యులు. తప్పుదోవ పట్టిన బిడ్డను వదులుకొనరు. సాహిత్యం మళ్ళీ ఆలోచనలో పడింది. ◌న్నదానికన్న చూచి, ◌న్నదాని ప్రభావం అధికం అవుతుందని కనిపెట్టారు!**

ు్రతుని మాట ినడు. ప్రియురాలి మాట ినకుండా ఉండలేడు. ప్రియుడు మేను వాలుస్తాడు. ప్రియురాలు పడకటిద కూర్చుంటుంది. ఆకులు, పోకలు అందిస్తూ చెపుతుంది. అతడు తన చేతి వేళ్లు ఆమె ముంగురుల్లో దూరుస్తాడు. ింటాడు. ినకుండలేడు! అది మనసుకు పడ్తుంది. తప్పక ఆచరిస్తాడు.

అలాంటిది నాటకం. అది కాంతా సంహిత. ప్రేక్షకుడు నాటక ప్రదర్శనలో లీనం అవుతాడు. చూచినంత సేపు అతనిని మాయకప్పుతుంది. పాత్రధారులను మరుస్తాడు. పాత్రలను నిజమైనిగా భాిస్తాడు. అందులో లీనం అవుతాడు.

"నాటకాంతం హి సాహిత్యం" అన్నారు.
"కావ్యేషు నాటకం రమ్యం" అన్నారు.

కాళిదాసు 'అభిజ్ఞానశాకుంతలం' నాటకాల్లో రమ్యం అయింది.

శకుంతల 'అనాఘ్రాతం పుష్పం' వాసన చూడని పూవు. దుష్యంతుని వ్యామోహంలో పడింది. కాలు జారింది. గర్భవతి అయింది. ఇది తల్లి దండ్రుల అనుమతి లేకుండా పురుష సమాగమపు పరిణామం. అందుకు ఫలితంగా శకుంతల నానాపాట్లు పడింది. ఇది అివాహితులకు హెచ్చరిక!

"మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని" కావ్యం శుభారంభం కావాలి కావ్య మధ్యంలో శుభం జరగాలి. కావ్యం సుఖాంతం కావాలి.

శకుంతల పరితపిస్తుంది. నాటకం సుఖాంతం అవుతుంది.

సినిమా ముగియగానే 'శుభం' వేస్తారు. అది మన సంప్రదాయ సిద్ధం అయిన మంగళాంతం.

గ్రంథాన్వేషణ

నా రచన శ్రీ మహాభారతము 2,000 పేజీలది. అది మూడు సంపుటాల్లో అచ్చయింది. సిద్ధం అయింది. భవ నామ సంవత్సరం ఉగాది 11-04-94 ఆిష్కరణ జరిగింది. నాటి నుంచి నాకు వేదాన్ని గురించిన ధ్యాస వెన్నంటింది. వదలలేదు. వేదం జంతు దశ నుంచి నరుణ్ణి మానవునిగా సిద్ధం చేసింది. అంతటి గ్రంథం మానవ జాతికి మరొకటి లేదు. వేదం భారతదేశంలో అవతరించింది. అంత మాత్రాన భారతజాతికీ - అందునా ఏదో ఒక మతానికి

చెందింది మాత్రం కాదు. సూర్యుడు ఉదయించడం మాత్రమే తూర్పుదిశన. అతడు సకల దిశలకూ ప్రకాశం ప్రసాదిస్తాడు. వేదం సూర్యుడు. వేద ప్రకాశం సకల ప్రపంచానికి వ్యాపించింది. ఆధునిక యుగంలో పాశ్చాత్యులే వేదాన్ని ఎక్కువ అధ్యయనం చేశారు. పరిశీలన- పరిశోధన చేశారు.

భారత దేశానికి వేదం ప◌త్రం. చరిత్ర-కాలం-కారణాలు ఏమైనా వేదం కొన్ని వర్గాలకే పరి◌తం అయింది. ఆ వర్గాలు సహితం వేదార్థం గ్రహించలేదు. వేదంలో కొన్ని భాగాల పఠనం చేశారు. ద్వివేది- త్రివేది - చతుర్వేది అనే వంశనామాలు ఇందుకు ఉదాహరణలు. ఆ వర్గాల వారు వేదం తమ 'గుత్తసొమ్ము' అన్నట్లుగా వ్యవహరించారు. ఆ వర్గంలో 'స్త్రీలకు సహితం వేదాన్ని ముట్టుకునే అర్హత లేదు' అన్నారు. ◌గతా వర్ణ, వర్గాల వారికి వేదం స్మరించే అర్హత లేదని నిషేధించారు!

ఈ ◌ధి, నిషేధ కారణంగానే పూర్వ కవులు వేదాలను, ఉపనిషత్తులను అనువదించడానికి పూనుకోలేదు. అందువల్ల సాధారణ మానవులకు వేదం అవకాశం లభించలేదు. ఒక వర్గం చేత బహుజనులు వంచితులు అయినారు. జ్ఞాన ◌జ్ఞానాలు సూర్య చంద్ర కాంతులవంటి◌. జ్ఞానం ఏ ఒక్కరి అధికార పరిధిలోనిది కాదు. ప్రకృతి ప్రకాశాన్ని మూట గట్టి, ఇనప్పెట్టెలో దాచి పెట్టడం అసాధ్యం. తృష్ణ గలవారు సాధించి తీర్తారు. ఆంగ్లేయులు, మహమ్మదీయులు కూడా వాటిని అధ్యయనం చేశారు.

బయట వారికి వేదం అందుతున్నది, మనవారు ఎందుకు వంచితులు కావాలి? ఈ ఆలోచన నన్ను వెన్నాడింది. నిద్ర లేకుండా చేసింది. ఇది ఆశయం మాత్రమే. కొన్ని ఆశయాల సాధన ఒక జన్మతో సాధ్యపడదు. వేదం ◌స్తృతిలోనూ, గంభీరతలోనూ మహామహాగ్రంథం. అది మనకు అర్థం అవుతుందా? అర్థం చేసుకోవడం వేరు - ఇతరులకు అర్థం చేయించడం వేరు. అది కష్టతరం. సాధించగలమా? అనే సంశయం కొన్నాళ్ళు కొనసాగింది.

మనిషి సాధిద్దాం అనుకుంటాడు. అడ్డుకునేవాళ్లు అనేకులుంటారు. నాకూ అడ్డంకులు ఎదురైనాయి. శక్తి స్తోమతలు అర్హతానర్హతల పేర అనేకమంది అడ్డుకట్టవేశారు. "నీకిది క్షేమం కాదు" అని హెచ్చరించినవారున్నారు. నేను జన్మతః ◌శిష్టాద్వైతిని, సిద్ధాంతపరంగా వేద కర్మలకు అనుకూలురంకాదు. వేదాధ్యయనం వృత్తిగా చేసేవాళ్ళం కాదు. వేదాన్ని అద్వైతులు తమ జన్మహక్కుగా భా◌స్తారు. వారూ, మావాళ్ళూ, ◌కృత భ◌ష్యత్తు చూపి భయపెట్టారు. భయం మానస స్వభావం. కుటుంబం గలవాణ్ణి, అరవయ్యేదేళ్ళ వృద్ధుణి భయపడడం స్వభావమే!

నా స్వభావంలో తిరుగుబాటుంది. మహా భారత రచన పూర్తి చేసినవారు అరుదు. నాకూ పుత్ర◌యోగం - నాకు ప్రాణాంతకం కలిగాయి. అయినా భగవంతుని ◌ద భారం వేశాను. పూర్తి చేశాను. వేదం భారతాన్ని ◌ంచింది. వేదాన్ని ◌ంచింది లేదు. భారం భగవంతుని ◌ద చేశాను. వేదాలు నాలుగూ తెలుగు 'సులభ' వచనంలో అనువదించడానికి కృత నిశ్చయుణ్ణి అయినాను.

ఆరంభింపరు నీచమానవులు ◌ఘ్నాయస సంత్రప్తులై
యారంభించి పరిత్యజింతురు ◌ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ ◌ఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సు◌ ప్రజ్ఞానిధుల్ గావుతన్

భర్తృహరి - ఏనుగు లక్ష్మణ క◌.

భర్తృహరి కార్య ిషయంలో నరులను మూడు రకాలుగా ిభజించాడు.

1. నీచులు - ిఘ్న భయంతో ప్రారంభించరు.
2. మధ్యములు - ప్రారంభిస్తారు. ిఘ్నం కలిగితే మానేస్తారు.
3. ధీరులు - ఎన్ని ిఘ్నాలు వచ్చినా ఆరంభించిన కార్యం పూర్తి చేస్తారు.

మధ్యమునిగా ప్రారంభించడానికి నిర్ణయించాను. "శ్రేయాంసి బహుిఘ్నాని" అని ఆర్యోక్తి శ్రేయోకార్యానికి అనేక ిఘ్నాలు. 'తొలిముద్దలోనే ఈగ' అన్నట్లుగ్రంథాలు లభించడం దుష్కరం అయింది.

ఆధునిక యుగంలో పుస్తకాలు పుట్టల కొద్దీ-గుట్టల కొద్దీ దొరుకుతున్నాయి. ిటిలో ఆంగ్ల గ్రంథాలు ఎక్కువ. తదుపరి భారతీయ భాషా గ్రంథాలు దొరుకుతాయి. సంస్కృత గ్రంథాలు దొరకవు. షేక్స్పియరు నాటకాలు మూలమో, అనువాదమో చదిిన వారున్నారు. కాని భాస, కాళిదాసు, అశ్వఘోష, భవభూతి నాటకాలు ఎందరికి తెలుసు? పాఠ్యాంశాల్లో ఉన్నందున శాకుంతలం పేరు తెలుసు, ఆ నాటకాన్ని చదిిన వారెవరు? కాళిదాసు రచనలు శాకుంతలం- మాళిికాగ్ని ిుత్రం- ిక్రమోర్వశీయ నాటకాలను 1960 లో పిల్లల కోసం సులభ శైలిలో రచించాను.

ఆంగ్లంలో వేదాలను గురించిన గ్రంథాలు చదివాను. కాని అి వేదం చదిి వ్రాసినట్లుగా కనిపించలేదు. ఒకరి గ్రంథం ఆధారంగా మరొకరు వ్రాసినట్లు అనిపించింది. సంస్కృత మూల వేదం కోసం అన్వేషణ సాగించాను.

అప్పుడు నాకు కొత్త ఢిల్లీ వేద ప్రతిష్ఠాన్ వారి 'ఋగ్వేద సంహిత' లభించింది. ఇందులో మూలమంత్రం 'దేవనాగరి'లోనూ- ఇంగ్లీషు లిపిలోనూ ఉంది. మంత్రానికి ఆంగ్లానువాదం స్వాిు సత్య ప్రకాశ సరస్వతి-సత్యకామ్ ిద్యాలంకార్ కలిసి చేశారు. అనువాదం బాగుంది. ఇది మహత్తమ కార్యం, అయితే ఇంకాపూర్తి కాలేదు. అయిదు మండలాల ప్రచురణ మాత్రం జరిగింది. ఇది భారతీయ దృక్పథంతో వేదాన్ని పాశ్చాత్యులకు అందించే తొలి యత్నం.

ఆ పుస్తకం దొరికింది. నిధి దొరికినంత సంబరపడ్డాను. అరుదైన పుస్తకం లభించినప్పటి ఆనందం పుస్తకాభిమానులే తెలియగలరు. పుస్తకం చదివాను. ఎంతో బావుంది. అనువాదకులు ఎంతో శ్రిుంచారు. ివరణలు ఇచ్చారు. లభించిని అయిదు మండలాలే! ముందు అది ముగింతాం. అన్వేషణ కొనసాగింతాం అనుకున్నాను. అనువాదం ప్రారంభించాను. వంద సూక్తాలు అనువదించాను.

వందసూక్తాల తరువాత నాకు సంతృప్తి కలుగలేదు. అసంతృప్తి వెంటపడింది. కారణాలకై అన్వేషించాను. అప్పుడు నాకు తెలిసిని.

1. ఆంగ్లానువాదం స్వతంత్రం.

2. ఆధునిక వ్యాఖ్యాతలను అనుసరించారు.

3. దేవతల పేర్లు ◌శేషణాలు అయినాయి.

4. సంప్రదాయానుగుణంగా లేదు.

ఈ గ్రంథం చదవడానికి చాలా బావుంటుంది. కాని అనువదించి అందించడానికి ఉపకరించదు. ఎంత ఉత్సాహంగా ప్రారంభించానో అంత నిరుత్సాహంగా నిలిపి వేశాను.

కార్య సాధకుల్లో మధ్యమునిగా ◌గిలిపోతానేమోనని దిగులు పట్టుకుంది.

నా వేదన చూచిన ఒక ◌త్రుడు 'ఆంధ్ర వేదములు -ఋగ్వేదము' అనే గ్రంథం తెచ్చిచ్చారు. దానిలో మంత్రం-మంత్రానికి తాత్పర్యం ఉంది. తాత్పర్యం సాయణ వ్యాఖ్యను అనుసరించారు. దీని ప్రచురణకు ఒక ప◌త్ర చరిత్ర ఉంది.

మహాత్ముని స్వాతంత్ర్య ఉద్యమం అచ్చం ఆంగ్లేయులను పారదోలడం వరకు పరి◌తం కాదు. భారత జాతీయతను పునరుజ్జీ◌ంప చేయడం కూడా పోరాటంలో భాగమే. "బ్రాహ్మణ, బ్రాహ్మణేతర అసమానత్వమును తొలగించుటకు వేదవేదాంగములను ఆంధ్రీకరించి ఆంధ్రుల కెల్లరకు హస్త గత మొనర్చుట భావ్యమని" గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు, రాంబొట్ల పాలెం, గుంటూరు జిల్లాలో ◌నయాశ్రమం ప్రారంభించారు. మహాత్మాగాంధీ ◌నయాశ్రమాన్ని శ్రీముఖ సం॥ మార్గశిర బహుళ సప్త◌ 23-12-1933లో ప్రారంభించారు.

పురాణ వాచస్పతి బంకుపల్లె మల్లయ్య శాస్త్రి గారు ఋగ్వేదానువాదం చేశారు. దీని ప్రచురణ 1940, 480 పేజీల గ్రంథం రెండు రూపాయలన్నారు. తొలి సంపుటికో ద్వితీయాకష్టకంలో తృతీయాధ్యాయం వరకు మాత్రమే ఉంది. అంతటితో ఆ ప్రయత్నం నిలిచిపోయినట్లుంది!

◌గతా సంపుటులను గురించి నేను ◌నయాశ్రమం కోసం అన్వేషణ సాగించాను.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు వేదాల మూల సహితి పద్యానువాదం ప్రచురించారు. దానిది బ్రహ్మ స్వరూపం. ఉన్నదిగాని అగుపించలేదు. ఆ గ్రంథాలు గల అనేకమంది దగ్గరకు నేనూ ◌త్రులం వెళ్లాం. వారుసత్యవాదులు. లేదన లేదు! ఇవ్వలేదు! సాక్షాత్తు దేవస్థానం ప్రచురణ ◌భాగం వారిని అర్థించాను. వారు పరబ్రహ్మలు. నిరాకారులు! అగుపించలేదు!

భువన వాణి ట్రస్టు లక్నో వారు నాలుగు వేదాలను హిందీ అనువాదంతో ప్రచురించే ప్రణాళిక రచించారు. ఇది మహత్తమ కార్యం. ఇప్పటికి వారు నాలుగు వేదాల ఒక్కొక్క సంపుటి మాత్రం ప్రచురించారు. మూలమంత్రం - ప్రతిపదార్థం - హిందీ గేయానువాదం - తాత్పర్యం ఇదీ పథకం.

ఈ ప్రణాళికలో భాగంగా ఋగ్వేదంలో ప్రథమాష్టకం మాత్రం ప్రచురించబడింది. నాకు అర్థం అయినంత వరకు అనువాదం సంప్రదాయానుగుణం కాదు.

సంస్కృత ప్రచురణ కర్తల కేటలాగులు తెప్పించి చూచాను. చౌఖంబ ిద్యాభవన్- వారణాసి వారి కేటలాగు నాకు పెన్నిధిగా కనిపించింది. ఈ సంస్థను నలుగురు అన్నదమ్ములు నడుపుతారు. అంతా వృద్ధులే. 'చౌఖంబ' అంటే నాలుగు స్తంభాలు. నలుగురు స్తంభాలుగా ప్రచురణ సంస్థను నిర్వహిస్తున్నారు. ఈ సంస్థ సంస్కృత సాహిత్యానికి ఎంతో సేవ చేస్తున్నది నేను ఢిల్లీ, వారణాసి పుస్తక కేంద్రాలకు వెళ్లాను. యజమానులు భారత సాహితీ, సంస్కృతుల ిషయంలో ఎంతో శ్రద్ధాసక్తులు గలవారు.

చౌఖంబ వారు ఋగ్వేద సంహిత నాకు అవసరం అయింది. అనుకూలం అయింది.

1. ఇది సంపూర్ణ ఋగ్వేదం. ఇందులో ఎనిిది అష్టకాలు- దశ మండలాలూ ఉన్నాయి.

2. మంత్రం స్వరయుక్తంగా ఉంది.

3. పదపాఠున్నాయి.

4. సాయణాచార్యుల వ్యాఖ్య ఉంది.

5. పండిత రామగోింద త్రిపాఠీ హిందీ వచనానువాదం ఉంది.

ఇంతటి గ్రంథం లభించడం భగవదనుగ్రహమే! అయితే మరి ఇంత ినిపించడం ఎందుకయా అంటే ేడికున్న శ్రద్ధ సంకల్పం, కృషి ఎంతటిి అని పరీక్షిస్తాడు స్వాిు.

తల్లి బిడ్డ ఏడుపు ింటుంది. పనిలో ఉంటుంది. వెంటనే పనివదలదు. పరిగెత్తి రాదు. బిడ్డ బిగ్గరగా ఏడుస్తుంది. తల్లి పని వదులుకుంటుంది. పరిగెత్తుకు వస్తుంది. బిడ్డకు చన్నిస్తుంది.

## భగవంతుని మాతృ స్వరూపం

సంపూర్ణ ఋగ్వేదం సంహిత లభించింది. నాకు సంజీిి లభించినట్లయింది! అమృత భాండం అందినట్లయింది! చందమామ దోసిట నిలిచినట్లయింది. పుస్తక ప్రియులకు వలసిన పుస్తకం లభించడం వలచిన వనిత లభించడం లాంటిది !!!

## రచనా యజ్ఞం

ఒకే వ్యక్తి నాలుగు వేదాల అనువాదానికి పూనుకున్న జాడ, పూర్తి చేసిన జాడ లేవు. భగవంతుడు నాకు ఆ భాగ్యం కలిగించాడు.

భగవద్గీతలోని ఆరవఅధ్యాయం, ఆత్మసంయమ యోగం. భగవానుడు ఆత్మ సంయమనం ఉపదేశిస్తాడు. అర్జుననికి సంశయం కలుగుతుంది. అడుగుతాడు.

అయతిశ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః

అప్రాప్య యోగ సంసిద్ధం కాం గతిం కృష్ణ! గచ్ఛతి !!

అతడు శ్రద్ధావంతుడే కాని అనియతడు. అందువల్ల అతని మనసు చలిస్తుంది. యోగ భ్రష్టుడు అవుతాడు. కృష్ణా! అలాంటి వాని పరిస్థితి ఏం?

భగవానుడు ఉపదేశిస్తున్నాడు :-

ప్రాప్య పుణ్యకృతాం లోకానం శిత్వా శాశ్వతీః సమాః ।

శుచీనాం శ్రమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే ॥

యోగభ్రష్టుడు పుణ్యలోకాలకు చేరుకుంటాడు. అక్కడ కలకాలం ఉంటాడు. తదుపరి శుచిమంతులగు శ్రీమంతుల ఇంట్లో జన్మిస్తాడు.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వ దైహికం ।

యతతేచ తతో భూయః సంసిద్ధౌ కురునందన! ॥

అర్జునా! అతనికి పూర్వజన్మపుబుద్ధి సంయోగం ఈ జన్మలో చేరుతుంది. మళ్ళీ అతడు సంసిద్ధి కోసం ప్రయత్నిస్తాడు.

సత్కార్యం ప్రారంభించిన వాడు అది పూర్తి కాకుండా జన్మ చాలిస్తే దాన్ని మరుసటి జన్మలో సాధిస్తాడు.

నేను యోగభ్రష్టుణ్ణి అనుకుంటున్నాను. గత జన్మలో వేదానువాదం సగంలో వదలినట్లున్నాడు ఆ సత్కార్యం పూర్తి చేయడానికే స్వాం ఈ జన్మను ప్రసాదించినట్లున్నాడు.

ధనిక ధర్మసంస్థలు, రాజాస్థానాలు, ప్రభుత్వాలు తప్ప వేదవ్యాఖ్యాన, వేదానువాదలకు

పూనుకోలేదు. ఆ సంస్థలో అనేకమంది పండితులు నిత్యం శ్రంంచారు. అయినా నాలుగు వేదాలు పూర్తి చేయటం కష్టతరం అయింది.

కార్యం అలంటిది కాగా అన్యసహాయం లేక వంటరిగా నాలుగు వేదాల అనువాదం చేయడం అసామాన్యం. అసామాన్య కార్యాలన్నీ భగవంతుడు చేయిస్తాడు!

భవ సంవత్సర పుష్య పూర్ణిమ 16-1-1995 నాడు భగవదారాధన చేసి ఋగ్వేదం అనువాదం ప్రారంభించాను. ఈశ్వర సంవత్సర పుష్య శుక్ల ఏకాదశి 24-1-98 శనివారం ఉదయం 7-15కు అథర్వ వేదం అనువాదం ముగించాను. మూడు సంవత్సరాల్లో నాలుగు వేదాలు అనువాదం సుమారు 5000 వ్రాత పేజీల్లో పూర్తి చేశాను. 70 సంవత్సరాల

వార్ధక్యంలో ఈ మహత్కార్యం వంటరిగా ఒకే జన్మలో పూర్తి చేయడం కేవలం పరాత్పరుని కరుణా కటాక్షమే.

ఈశ్వర పుష్య శుక్ల ఏకాదశి ఒక పర్వదినం! ఒక పండుగ, ఒక ఉత్సవం, ఉదయం 7:15కు అథర్వ వేదంలోని చివరి మంత్రం అనువదించాను. ఋగ్యజుస్సామాథర్వ వేదాల అనువాదం పూర్తి అయింది. ఒక మహాయజ్ఞం ముగిసింది. ఒక తపస్సు ఫలించింది. ఒక మహత్కార్యం సఫలం అయింది. ఒక స్వప్నం సాకారం అయింది. ఒక కల నిజమైంది!!!

ఈశ్వర పుష్య శుక్ల ఏకాదశి నాడు నా ఆనందానికి అవధులు లేవు. ఒక నిధి దొరికినా ఒక పదం చేతికందినా, ఒక దేవత ప్రత్యక్షం అయినా అంతటి ఆనందం లభించదు. ఆనందం అక్షరానికీ శబ్దానికి అందదు. అది అనిర్వచనీయం! మనసు పొంగింది. ఉప్పొంగింది. ఉరకలుపెట్టింది. పరుగులు తీసింది! 70 ఏళ్ళవాణ్ణి. వార్ధక్యం దేహానికి! మనసుకు వయసుతో నిుత్తం లేదు. మనసు పురి ప్పింది. నాట్యం చేసింది. ఎగిరింది. గంతులు వేసింది. తైతక్కలాడింది. నా చేతికి ఆకాశం అందింది. చుక్కల్ని పిడికిట పట్టాను.

చంద్రుడు చేతిలో వాలాడు. అరచేతిలో గంతులు వేస్తున్నాడు! నేను ఆకాశంలో హరిస్తున్నాను. సముద్రాల్లో తేలియాడుతున్నాను జలపాతాలను తాకుతున్నాను. పూలరాశులను చెల్లాచెదురు చేస్తున్నాను. యువతులకు పంచిపెడ్తున్నాను.

ఈశ్వర పుష్య శుక్ల ఏకాదశి నాడు నాకు పరమానందం, ఊపిరి ఆగినట్లనిపించింది. ఇంతటి ఆనందార్ణవంలో నన్ను ముంచిందెవరు? భగవానుడు! స్వాుని సేంచాలి. బంధు ుత్ర సపరివారంగా జీడికల్లు చేరుకున్నాం. రాముడు లేడిని కొట్టింది ఇక్కడేనట! లేడి గిట్టలు గుర్తులు స్వాు పాదచిహ్నాలు ఉన్నాయి. అక్కడ వంటలు. వంటల రుచులు అద్భుతం. శ్రీరామచంద్రస్వాు కళ్యాణం చేయించాం. సాయంత్రం యాదగిరిక్షేత్రం. దిగువ స్వాు దర్శనం గుట్టంద రాత్రి డిది. ద్వాదశి - ఆదివారం 25-1-98 నాడు స్వాు వారికి అ రచనలు, కళ్యాణం, అదొక అనుభూతి!

స్వాు కటాక్షానికి మూల్యం చెల్లించగలమా! అంతా స్వాుదే! ఇవ్వడానికి మనదగ్గర ఏముంది. గంగాజలం, గంగకే అర్పిస్తాం. పత్రం, పుష్పం, ఫలం, తోయం అన్నాడు

పరమాత్మ. అంతే అదొక తృప్తి! అదొక కృతజ్ఞత! అది భక్తిభావం. అది ప్రపత్తి!

తండ్రి కొడుకును కంటాడు. ద్యాబుద్ధులుకలిగిస్తాడు. పెద్దవాణ్ణి చేస్తాడు. పుత్రుడు తన సంపాదనలో తృణమో, పణమో చేతిలో పెడ్తాడు. తండ్రి ముమ్మురిసిపోతాడు! అంతా తాను చేసిందే అనుకోడు, ఆ తృణానికి తృప్తి పడతాడు. ఎగిరిపడ్తాడు.

పరాత్పరుడు సహితం అంతే. అతడే తండ్రి ; అతడే తల్లి ; అతడే బంధువు ; అతడే ుత్రుడు. స్వాుకి అర్థమా! కాదు అతడు ప్రేమ పిపాసి- భక్తితాపసి "యోగక్షేమం వహామ్యహం. అని అభయం ఇచ్చారు. ఇస్తున్నారు. ఇస్తారు.

"ఓం నమో భగవతే వాసుదేవాయ"

ఆనందపు ఆవేశం నుండి బయట పడితే వేదం ప్రత్యక్షం అవుతుంది. వేదం పంిత్రాతి పంిత్రం. అయితే అన్య మత గ్రంథాల వలె దీనికి పూర్వం 'పంిత్ర'పదం లేదు. సూర్య, చంద్ర, నక్షత్రాదులను పరిచయం చేయ పనిలేదు. అంి ప్రభావాత్మకములు అని చెప్పనక్కరలేదు. అంి అందరికీ తెలిసినవే! వేదం పావనం. మంత్రానికి మాన్యత ఉంది. మంత్రానికి ప్రభావం ఉంది. ఈ ిషయం వేదంలో చెప్పబడలేదు. అగ్ని కాలుతుంది అని చెప్పనవసరం లేదు!

అనువాద రచన మూల రచన కన్న కష్టతరం. నేను మూల రచనలు చేశాను. అనువాదాలు చేశాను. ఇది స్వానుభవం. స్వీయ రచనలో స్వేచ్ఛ ఉంది. భావాలు మనిి. భాష మనది. స్వేచ్ఛా ిహంగంలో రచన సాగుతుంది. అది నేను కన్న బిడ్డ ; దాని మంచి చెడులు నాంి.

అనువాదం అలాకాదు. భావం మూలరచయితది. అది స్వేచ్ఛా ిహంగం. నేను దానికి భాష సమకూర్చాలి. నేను అతని భావాల పంజరంలో బందీని. అయినా అనువాదం అనిపించదు. పరిధి సంకుచితం అవుతుంది. మూల రచయితది 'లక్ష్మణరేఖ' ఆ రేఖను అతిక్రింంచరాదు. అది మరొకరి కన్న బిడ్డ! 'ముద్దూ ముచ్చట' నేను తీర్చాలి. మూల రచయిత అనుభూతులు ఆవేశాలు, సందర్భాలు నాకు లేవు. అతణ్ణి కొడితే నేను ఏడవాలి!

నేను సంస్కృతం - హిందీ - ఉర్దూ - ఇంగ్లీషుల నుంచి అనువాదాలు - అందరు మెచ్చేలా చేశాను.

ఆ రచనలు వేరు. అంి మానవ మాత్రులు - నాలాంటి వారే రచించారు. కాని ఇది వేదం అపౌరుషేయం. ఋషిప్రోక్తం. మంత్రమయం మహిమాన్వితం. ప్రాచీనం పరమ పంిత్రం. ఇది భగీరథ ప్రయత్నం. నాకు దృఢ సంకల్పం ఉంది. ఆశయం ఉంది. ఆవేశం ఉంది, సాగాను.

సంస్కృతం సనాతన, పురాతన భాష, సంస్కృతం సంపూర్ణ భాష. సంస్కృతసంపన్న భాష. సంస్కృతం అనగానే ఒక చెదలు పట్టిన భాష అనే అభిప్రాయం ఆంగ్లేయులు కల్పించారు పాలకులతో 'ఆధునికులం' అనిపించుకోవాలనే ఆత్రంలో మనవాళ్ళు దానికి బూజు పట్టిన భాష అని ప్రచారం చేశారు. **గురజాడ వారి 'కన్యాశుల్కం' నాటకంలో ప్రమాణం చేయడానికి సహితం సంస్కృత గ్రంథం పనికిరాదు! సంస్కృతం భారతభాష, దాన్ని హేళన చేస్తున్నాం అది మనకు మనం హేళన చేసికోవడం అని గ్రహించలేకున్నాం.**

సంస్కృతం అనగానే వేదాంతం అని ప్రచారం జరిగింది. వేదాంతం అంటే వైరాగ్యం అనే అర్థం ప్రసరించింది. ఇందులో ఆవ గింజంత వాస్తవం లేదు. నాకు తెలిసినంత వరకు సంస్కృత సాహిత్యం జీంితాన్ని సుసంపన్నం చేసింది. నరునికి జీింంచడం నేర్పింది. పలాయనం నేర్పలేదు. అత్యవసరం అయినప్పుడు తప్ప వైరాగ్యం బోధించలేదు. మనకు సైన్సు పేర ఆంగ్లేయులు కొన్ని మూఢ నమ్మకాలు కలిగించారు. వాటి నుంచి బయట పడాలి. అప్పుడు సంస్కృతపు 'ిశ్వరూపదర్శనం' అవుతుంది.

సంస్కృతం భాష ఒకటే. దానికి ిభిన్న రూపాలున్నాయి. నరులంతా ఒకటే వారిని ిభిన్న రూపాలు. ిభిన్న వృత్తులు, ిభిన్న రుచులూ, అలాగే సంస్కృతం కావ్య సంస్కృతం

వ్యాకరణ, వైద్య, జ్యోతిష, వాస్తు సంస్కృతం మున్నగు రూపాలున్నాయి సాంకేతిక పద ప్రయోగం భిన్నంగా ఉంటుంది. వేద సంస్కృతం కావ్య సంస్కృతం కాదు. నాకు సాహిత్య సంస్కృతం తెలుసు. వేదాన్ని అర్థం చేసుకోవడానికి అదిమాత్రం చాలదు. వేద సంస్కృతం అర్థం చేసుకోవడానికి ప్రత్యేక కృషి చేయాల్సి వచ్చింది.

అన్ని భాషల్లోనూ ఒక్కొక్క పదానికి ఒకటికి ించిన అర్థాలుంటాయి. అర్థం అంది తెలియపరచడం. అర్థం అంటే కారణం. అర్థం అంటే ధనం. అర్థం అంటే ప్రయోజనం.

వేదమంత్రాలు అనాది కాలపుి. ఆ పదాలకు అనేక అర్థాలుంటాయి. ఏ పదానికైనా సమయం సందర్భాన్ని బట్టి అర్థం చెప్పుకోవాలి. ఈ సమయ సందర్భపు అర్థం చెప్పేవాడే వ్యాఖ్యాత, భాష్యకారుడు. ఒక అమూల్య పదార్థం మన ముందే ఉంటుంది. మనందాన్ని తెలుసు కోలేం. దాని ిలువనూ, ప్రయోజనాన్ని తెలియజేస్తాడు వ్యాఖ్యాత, భాష్యకారుడు అతని వెలుగు లేకుంటే పదాలన్నీ తిిరగోళాలే! ఇది అన్ని కాలాల సాహిత్యాలకూ వర్తిస్తుంది. మల్లినాథుని వ్యాఖ్య లేనిది కాళిదాసు సౌందర్యం ఆస్వాదించలేం. ఇది ఆధునిక సాహిత్యానికీ వర్తిస్తుంది.

వేదం ఒక ఆకాశం. ఒక సముద్రం. వాటిలోని మంత్రాలను నేను భాష్యకారుని వ్యాఖ్యాన నేత్రం నుంచి దర్శించాలి. ఒక్క ఋగ్వేదంలోనే 1017 సూక్తాలు, 10580 మంత్రాలు, 1,53,826 శబ్దాలు, 4,32,000 అక్షరాలున్నాయి.

నేను ప్రతి మంత్రాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలి. అనుమానాలను నివృత్తి చేసుకోవాలి. ప్రతి మంత్రం తన సంపూర్ణ జ్యోతితో దర్శనం ఇవ్వాలి. నాకే అర్థం కానిది నేనేం చెప్పగలను? నాకు అర్థం అయిందాన్ని చదువరులకు అర్థం అయ్యే తెలుగులో అనువదించాలి. అది సొగసుగా ఉండాలి. అందపు అనుభూతి కలగాలి. ఇది యత్నం. ఫలితం భగవదధీనం!

వేదాన్ని అర్థం చేసికోవడానికీ, తెలుగు వారికి అర్థం చేయించడానికీ, నేనొక తపస్సు చేసాను. కనీసపు నిద్రా లేదు. రోజుకు పది పన్నెండు గంటలు శ్రించాను. వేరే ధ్యాస లేదు.

వేద మంత్రాలే! ఇరవై నాలుగ్గంటలు అదే మననం. నిద్రలో సహితం మంత్రాల పలవరింపులే!

కమల బెదిరిపోయింది వెర్రివాణ్ణి అవుతానని! అవును వెర్రియో! వెర్రివాడు కాంది. ఏదీ సాధించలేడు! నాకు ఫలాపేక్ష ఉండదు. 'కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన' అని బోధించాడు పరమాత్మ!

**వేదం ముందు పెట్టుకొని కూర్చుంటాను. భయం అవుతుంది. మహారణ్యం కనిపిస్తుంది. చెట్లు, చీకట్లు, బాట కనిపించదు. సింహాలు, పులులూ భయపెడ్తాయి. భయంకర సర్పాలు అడుగుపెట్టనివ్వవు. ఇహ రచన సాగదు అనిపిస్తుంది.**

**అప్పుడు కళ్ళు మూసుకుంటాను. నామ మాత్రపు ధ్యానం. వెలుగు కిరణం ప్రత్యక్షం అవుతుంది, కళ్ళు తెరుస్తాను, మహారణ్యం ఉద్యానం అవుతుంది, రాచబాటలు పరచుకుంటాయి.**

**పూలపొదలు, వృక్షచ్ఛాయలు, లతాగుల్మాదులు - కొలనులు, తామరలు-నెమళ్ళు, పావురాలు-పక్షులు ఒక సుందర దృశ్యం అవుతుంది.**

రచన అనాయాసంగా సాగుతుంది. ఏదో మహత్తర శక్తి నాతో వ్రాయిస్తున్నట్లు అనిపిస్తుంది! దిక్కులు చూస్తాను. ఆ దృశ్యం! ఏమీ ఉండదు! వెర్రివాణ్ణి శక్తికి రూపం ఏమిటి? దానికోసం నేను చూడడం ఏమిటి? అవును వెర్రివాణ్ణే! మై పాగల్ హూ. ఒ ఆః ఙ వ్రాస్తున్నంత సేపు ఏదో తెలియని చల్లని, మెల్లని వెలుగు నన్ను నడిపిస్తుంది. ఆ వెలుగు వేలపట్టుకుని నేను నడుస్తాను. ఆ వెలుగూ నా తల్లి- నన్ను నడిపిస్తుంది!

"అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలపె

ద్దమ్మ సురారులమ్మ కడుపారడి పుచ్చినయమ్మ తన్నులో

నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ మా

యమ్మ కృపాబ్ధి యీవుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్

పోతన భాగవతం

ఎన్నని చేప్పను? ఎన్నో చిత్ర, విచిత్ర, విశేష, విశిష్ట సంఘటనలు!

ఒక్కొక్కసారి వాక్యం ప్రారంభిస్తాను. సాగదు. ఆగుతుంది. అయోమయం. లిప్తలో కలం వెంట వెలుగుపాయ సాగుతుంది! అనువాదం పూర్తవుతుంది. అది నాకే ముద్దు వచ్చేట్లుంటుంది.

శ్రీమదాంధ్ర మహాభాగవతంలో 'సిరికించెప్పడు' పోతన రచనకాదట. స్వయంగా శ్రీరామచంద్రమూర్తి దాన్ని పూరించాట్ట! అలాంటివి నాకు ప్రత్యక్ష అనుభవాలు. భగవంతుడు ప్రత్యక్షం అయినాడని అబద్ధం చెప్పను. కాని స్వామియే వ్రాయించిన అద్భుత, ఆశ్చర్యకర అనుభూతులు అనేకం. వాటికి భాష, అక్షరం అపర్యాప్తములు.

పరమాత్మ అంతటి కృపా కటాక్షం కురిపించాడు. అందుకు అంత మహత్కార్యం. అంత కొలది వ్యవధిలో పూర్తయింది. కాకున్న అనితర సాధ్యం! అసాధ్యం!

1. నేను డెబ్భయేండ్ల వృద్ధుణ్ణి.

2. మధుమేహ వ్యాధి గ్రస్తుణ్ణి.

3. మరీ అంత ఆరోగ్యవంతుణ్ణి కాను.

4. నా దేహం దుర్బలం.

అలాంటివాణ్ణి మూడేళ్ళలో నాలుగు వేదాలు అనువదించాను. ఎన్ని వేల పేజీలు అధ్యయనం చేశానో? అయిదువేల పేజీలు వ్రాశాను!

1. ఈ మహత్కార్యంలో ఏ ఒక్కరూ నాకు సాయపడలేదు. సలహా ఇవ్వలేదు.

2. కనీసం అడిగిన పుస్తకం అందించినవారులేరు.

3. ఒక్కడు ప్రోత్స హించలేదు-అడ్డంకులు కల్పించారు.

4. ఒక్క అక్షరం మరొకడు వ్రాయలేదు.

5. అంతటి గ్రంథం నేనే స్వయంగా వ్రాశాను.

6. నాకు వ్రాయసగాళ్ళు లేరు. వారిని పెట్టుకొనే ఆర్థిక స్తోమత లేదు నాకు.

ఇంత పని చేయించాడు మా నాయన - మాస్వామి!

**తొలిప్రతియే తప్ప శుద్ధ ప్రతి వ్రాయలేదు. వ్రాసింది వెనుదిరిగి చూడలేదు. వ్రాసిందాంట్లో హింసపాదులు లేవు. సవరణలు లేవు. ఎంతకదా! విచిత్రం కదా!! ఆశ్చర్యం కదా!!**

**పిల్లలమర్రి పినవీరభద్రుడు "వాణి నారాణి" అన్నాడు. నేను అంతటి సాహసం చేయలేదు.**

**పలికెడిది భాగవతమట**
**పలికించు విభుండు రామ భద్రుండట నే**
**బలికిన భవహరమగునట**
**పలికెద వేరొండుగాథ బులకగనేలా?**
**అని నమస్కరిస్తున్నాను.**

వేదం అనగానేమి?

'వేదం' ఏకవచనం. వేదం పవిత్ర విద్య అని అథర్వ వేదం, శతపథ బ్రహ్మణం, తైత్తరీయ బ్రాహ్మణం చెపుతున్నాయి. అందువల్ల 'వేదం' 'పవిత్ర విద్య' అవుతున్నది.

'వేదాః ' వేదములు. ఇది బహువచనం.

"చత్వారో ఇమే వేదాః ఋగ్వేదో, యజుర్వేదో, సామవేదో, బ్రహ్మవేద ఇతి" అని గోపథ పూర్వం. వేదాలు నాలుగు అని ఋగ్వేద, యజుర్వేద, సామవేద, బ్రహ్మవేదములు. బ్రహ్మవేదానికి అథర్వణ వేదం అని పేరు.

"ఏవఁమే సర్వే వేదా నిర్మితాః , తే ససంకల్పాః సరహస్యాః , సోపనిషత్కాః , సేతిహాసాః సాన్వ్యాఖ్యాః సపురాణాః సస్వరాః సంస్కారాః సనిరుక్తాః సానుశాసనాః సామమార్జునాః , సవాకో వాక్యాః " అని గోపథ పుర్వం.

వేదాలన్న - సంకల్పం, రహస్యం, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, వ్యాఖ్యానాలు, పురాణాలు, స్వరాలు, సంస్కారాలు, నిరుక్తాలు, అనుశాసనాలు, అనుమార్జునాలు, వాక్కు, వాక్యం- సహితంగా నిర్మించబడినాయి.

"ప్రాజాపత్యోవేదా:" అన్నాడు. వేదాలు ప్రజాపతి సంబంధాలు.

"ప్రజాం సృష్ట్వా పాలయస్యేతి. తస్మాత్ప్రజాపతి రభవత్' అని గోపథ పూర్వం. ప్రజలను సృష్టించి పోషించుచున్నాడు. కావున ప్రజాపతి అయినాడు.

## ప్రజాపతి ఎవరు?

1. ప్రజాపతిరగ్నిః 2. ప్రజాపతి ర్వైమనః 3. ప్రజాపతిర్వై వాచస్పతిః 4. సంవత్సరోవై ప్రజాపతిః 5. యజ్ఞః ప్రజాపతిః 6. ప్రజాపతిర్వైసంఁతా 7. ప్రాణాహి ప్రజాపతిః 8. అన్నం వై ప్రజాపతిః 9. సతద్వైప్రజాపతిః 10. ప్రజాపతిర్వైభూతాః 11. ప్రజాపతిర్బన్ధుః 12. ప్రజాపతిర్వై హిరణ్యగర్భః 13. ప్రజాపతిర్వైచంద్రమా 14. ప్రజాపతిర్వై మహాన్దేవాః 15. ప్రజాపతిర్వై మనుః 16. ప్రజాపతిర్వై ఁశ్వ కర్మా 17. ప్రజాపతిర్వైసువర్ణో గరుత్మాన్ 18. ప్రజాపతిర్వై మూర్ధా 19. ప్రజాపతిర్వా ఓదనః 20. ప్రజాపతిః సర్వః 22. ప్రజాపత్యోవా అశ్వః 23. ప్రజాపతిః సదస్యః 24. ప్రజాపతిః ఉద్గాతా 25. ప్రజాపతిరుద్గీతః 26. ఆత్మార్వావై ప్రజాపతిః 27. సత్యం హి ప్రజాపతిః 28. ఘృతంచ మధుచ ప్రజాపతి రాసీత్ 29. ఆత్మాహ్యయం ప్రజాపతిః 30. పురుషో హి ప్రజాపతిః 31. పితరః ప్రజాపతిః 32. ప్రజాపతిర్ధాతా 33. ప్రజాపతిర్వై జమదగ్నిః 34. ప్రజాపతిర్వై ద్రోణకలశః 35. ఇమేలోకాః ప్రజాపతిః 36. ప్రజాపతిః సర్వే దేవతాః 37. ప్రజార్వా అమృతః 38. ప్రజాపతిర్హి స్వరాజ్యమ్ 39. అపరిఁతో వా ప్రజాపతిః

ప్రజాపతి సృష్టిస్తున్నాడు. పోషిస్తున్నాడు. ప్రజాపతి ఏ ఒక్కడూ కాడు. పైన చెప్పిన 39 సృష్టి, స్థితులకు కారణం అవుతున్నాయి. ఇది నిత్య సత్యం. దీనికి తిరుగులేదు.

సమస్తం ప్రజాపతి. సమస్తం సృష్టిస్థితి కారణం. అందుకే ప్రజాపతి అపరిఁతుడు అగుచున్నాడు. ప్రకృతికి పరమాత్మకు పరిఁతి లేదు. వారు అపరిఁతులు.

ప్రజాపతి సమస్తం. వేదం సమస్తం. అనంతం పరిఁతం.

**మానవునికి తెలియపరచింది వేదం. తెలియటమే జ్ఞానం, జ్ఞానం సాపేక్షం. ఒకసారి తెలిసిందాన్ని తిరిగి చెప్పడం జ్ఞానం కాదు. పునరుక్తి. పునరుక్తులు జీితంలో తప్పవు. అంతమాత్రం చేత పునరుక్తి జ్ఞానం కాబోదు.**

ఒకనాడు నరునికి అన్నం తెలియదు. అన్నాన్ని వేదం తెలియపరచింది. అప్పుడు అది జ్ఞానం అవుతుంది. అన్నం తెలిసిం తరువాత చెప్పడం జ్ఞానం కాదు.

అలాగే వస్త్రం, కుటుంబం, బంధుత్వమ, గ్రామం, రాజ్యం, ిటిని అన్నింటినీ వేదమే తెలిపింది. తెలియక ముందు అది జ్ఞానం అవుతుంది. వేదం అవుతుంది.

**సత్యం. సత్యస్వరూపుడగు పరమాత్మ మానవునికి ఏనాటికీ అందరు, కావున భగవంతుని గురించిందంతా జ్ఞానం అవుతుంది. సత్యస్వరూపాన్ని దర్శించడానికి నిత్యం జరిగే అన్వేషణ జ్ఞానం అవుతుంది. పరమాత్మ అనంతం, కావున జ్ఞానం అనంతం, అంతంగల నరుడు అనంత బ్రహ్మను దర్శించజాలడు. అందుకే అన్వేషణ- అన్వేషణ- అన్వేషణ, అన్వేషణయో జ్ఞానం! అదే వేదం!!!**

మానవునికి లౌకిక, పారలౌకిక, ఆధ్యాత్మిక ిషయాలన్నింటినీ వేదమే ప్రవచించింది.

**పరమాత్ముడు పరిపూర్ణంగా ఎవరికీ అవగతం కాడు, దర్శనం ఇవ్వడు. నిత్యాన్వేషణ వలన భగవానుడు అంశామాత్రం గోచరిస్తాడు. ఆిధంగా అంశామాత్ర లబ్ధులు వారి వారి దశలను బట్టి సాధువులు, యతులు, తపస్వులు, మహాత్ములు, అవతారాలు అవుతున్నారు. ిరే మునులు, ఋషులు, మహర్షులు అవుతున్నారు.**

అజ్ఞానులు వారినే పరమాత్మగా భాిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. అలాంటివారు అంశామాత్ర పరమాత్మను ఆరాధిస్తున్నారు!

**మహర్షులు మహాత్ములు నిస్వార్థులు, నిష్కల్మషులు, తేజోమూర్తులు, వారు వేదమంత్రాలను దర్శించారు. మానవ జీితాన్ని సమున్నతం చేయడానికి కృషి చేశారు. వారు అనేక సంస్థలను ఆచారాలను, సంప్రదాయాలను ఏర్పరచారు. వారు దివ్వెల వలె తమను కాల్చుకున్నారు. లోకాలకు నిత్యకాంతులను ప్రసాదించారు. వారు సూర్యచంద్రుల వంటివారు. పర్వతముల వంటివారు నదుల వంటి వారు, వృక్షముల వంటివారు!**

**ప్రకృతి ప్రాణులకు సర్వస్వం అందిస్తుంది. వారి నుంచి ఏదీ ఆశించదు. అది అందుకున్న దానికి వేల ఇంతలు తిరిగి ఇస్తుంది. అందుకే మనం జీిస్తున్నాం. ఒక్క గింజ నాటండి. నిరంతరం ఫలాలను ప్రసాదిస్తుంది!.**

**తమను కొట్టిన గొడ్డలికే పరిమళం ప్రసాదిస్తుంది చందన తరువు!**

మహాత్ములు, మహాపురుషులున్న సమాజంలోనే నీచులు, నికృష్టులు, స్వప్రయోజన

పరులూ ఉంటారు. **గాంధీ పుట్టిన సమాజంలోనే గోడ్సే సహితం పుట్టాడు!**

ఈ స్వప్రయోజనపరులు చెట్టుకు చీడలాంటివారు. సమాజం సొంతాన్ని తమకోసం

వాడుకుంటారు. వారి వేశాలు అనంతం. గుర్తించడం దుస్తరం! వారు తామే నిస్వార్థులం అని నమ్మిస్తారు. జనం వారినే నమ్ముతారు. గొర్రె కసాయివాణ్ణే! నమ్ముతుంది!

**ఈ నీచులు మహర్షులు, మహాత్ములు ఏర్పరచిన సంస్థలను, ఆచారాలను, సంప్రదాయాలను దిగమ్రింగుతారు. కనీసం త్రేన్చరు. వాటి స్థానంలో ఆత్మ కోల్పోయిన గాజు బొమ్మల్లాంటి ఆచార సంప్రదాయాలను కల్పిస్తారు. తమవే నిజమైనవి నమ్మిస్తారు. జనం ప్రాణం ఉన్న రూపాలను విడుస్తారు. నడిచే బొమ్మల వెంట పరుగులు పెడ్తారు.**

**ఈ స్వప్రయోజన పరులు గంగాజలాన్ని విషపూరితం చేయగలరు! విషమే అమృతం అని నమ్మించగలరు. నమ్మటం జనుల స్వభావం!!**

ఈ నీచులు అనాదిగా సమాజాన్ని మోసగిస్తున్నారు. మోసమే వారి తిండీ, గుడ్డా! మోసమే వారి గూడూ నీడ! మనకు తెలిసింది ఇసుమంత చరిత్ర. **ఈ కొలదిలో వీరు బౌద్ధం నుంచి గాంధీ వాదం వరకు దిగమింగారు. వివరణ అక్కరలేదు. నిజం చేదు. మొన్నటి మార్క్సిజానికి అదే గతి పట్టింది. ఇది మనకు తెలిసిన కథ. పదిల పరచడానికి అనేక సదుపాయాలున్న యుగం ఇది. కాలం ఇది!**

**వేదం ఏనాటిది? ఎన్నడు మొదలయింది? వేదం అనాగరిక మానవుని కాలం నుంచి నిర్మలంగా, నిష్కల్మంగా ప్రవహించింది. మనిషి మనసు మలినాన్ని దూరం చేసింది. మానవుని దైవతత్వపు అంచులకు కొనిపోయింది.**

స్వప్రయోజన పరులకు వేదం లెక్కలోనిది కాదు. వారు వేదాన్ని వేలం వేయగలరు! తాము చెప్పిందే వేదం అని నమ్మించగలరు. నమ్మించారు. దొంగ వేదాలు సృష్టించారు. అందుకే "విస్సన్న చెప్పింది వేదం" అనే సామెత.

వేదం అలాంటి గందర గోళంలో ఉన్నప్పుడు వ్యాసభగవానుడు అవతరించాడు. వేదానికి కలిగిన ఈ దుస్థితిని చూచాడు, దుఃఖించాడు. అంతటితో చాలించలేదు. వేదాన్ని పరిష్కరించడానికి ఉపక్రమించాడు. అంతటి దుస్థితి నుంచి నిజమైన వేదాన్ని వెలికితీయడం సామాన్యం కాదు. రాళ్ళలో వజ్రాన్ని వెదకడం!

వజ్రం రాతి నుండే ఏర్పడింది. కాని రాయి వజ్రం కాలేదు. రాయి రాయే. వజ్రం వజ్రమే! రాతిని చూపి వజ్రం అని నమ్మించవచ్చు కాని ఎన్నటికీ రాయి వజ్రం కాజాలదు. వజ్రం విలువ వజ్రపుదే. వజ్రం తలకెక్కుతుంది! రాయి కాళ్ళకింద పడి ఉంటుంది. రాళ్ళన్నీ ఒకటి కావు. అన్నీ కాళ్ళ కింద పడి ఉండవు.

**" జో నతర్షేతో పత్థర్ థే**

**జోతర్షేతొ ఖుదాబన్ బైఠే"**

చెక్కకున్న రాళ్ళు

చెక్కిన దేవుళ్ళు

అలా రాళ్ళూ వజ్రాలు కలిశాయి. స్వప్రయోజనపరులు రాళ్ళను వజ్రాలుగా చెలామణి

చేశారు!

అలాంటి ఁపత్సమయంలో అవతరించారు వేదవ్యాస భగవానుడు.

**అభ్రశ్యామం పింగజటా బద్ధకలాపః**

**ప్రాంశుర్దండీ కృష్ణమృగ త్వక్ పరీధానః ।**

**సాక్షాల్లోకాన్ పావయమానః కఁముఖ్యః**

**పారాశర్యః సర్వసురూపం ఁవృణోతు ॥**

వ్యాసభగవానుడు ఒక మహత్తర కార్యానికి పూనుకున్నాడు. మానవ కళ్యాణం కోసం మహా యజ్ఞాన్ని ప్రారంభించాడు. అప్పుడు ఆ మహర్షికి ఎన్ని సమస్యలు ఎదురైనాయో! ఎందరు వైరులైనారో? ఎందరిని ఎదిరించాల్సి వచ్చిందో! ఇదంతా ఎందుకు? వ్యాస భగవానునికి స్వార్థం లేదు. స్వప్రయోజనం లేదు. కేవలం మానవ కళ్యాణానికే వేదాలను పరిష్కరించ పూనుకున్నాడు.

వ్యాసమహర్షికి ఎన్ని వందల వేల ఁద్వత్ శిష్యులో! ఒక మహావటం కాదు- పంచవటి ఆ నీడన వ్యాసభవానుడు ఆసీనుడు. అతడు చంద్రుడు. అతని శిష్యులు నక్షత్రాలు వేనవేలు! ఒక్కొక్కరి ముందు తాళపత్ర రాశి! శిష్యుల వేదాధ్యయనం. తొలుతగా వారు పరిష్కరిస్తున్నారు. వారు వ్యాసునకు అందిస్తున్నారు. వ్యాస మహర్షి నిశితంగా పరిశీలిస్తున్నారు. వేదం కాని దాన్ని ఒకవైపు ఁసురుతున్నారు. వేదాన్ని తన వద్ద భద్ర పరుస్తున్నారు. వ్యాసుని పక్కన మునిశిష్యులు వారు వేదపు ప్రుతులు సిద్ధం చేస్తున్నారు! ఎంతటి నిమగ్నత! ఎంతటి ధ్యాసం! ఎంతటి మౌనం! ఎంత నిశ్శబ్దం!

ఇది నా ఊహా చిత్రం.

వ్యాసభవానుడు నిర్వహించిన మహత్కార్యాన్ని తలుచుకుంటే వళ్లు జలదరిస్తుంది. అందరు ఋషులు అందరు మునులు, అందరు కవులు, అందరు యోగులు తమ జీఁతాలను దివ్వెలను చేసినారు. తాము తిఁర బాధలు అనుభఁంచారు. లోకాలకు వెలుగు ప్రసాదించారు! మనిషి జీఁతాన్ని ఆదర్శం వైపు నడిపారు. మానవునిలో దైవత్వాన్ని వెలికి తీశారు!

ఎంత శ్రమ! ఎంత కృషి! ఎంత త్యాగం! ఎవడండీ ఇంత చేసే వాడు! వారి నిరంతర యజ్ఞం, యతనం, ప్రయత్నం వల్లనే మనం ఇంకా మనుషులుగా ఉన్నాం. మనం వారికి ఏం చేయగలం? నదీనదాలు, పర్వతాలు, వృక్షాలూ, మనకు ఎంతో ఉపకారం చేస్తున్నాయి. అది సరికాదు. వాటి వల్లనే మనం జీ ిస్తున్నాం. మనం వాటికి ఏం చేస్తున్నాం? ఏం చేయగలం? మన శక్తి ఎంత?

ఈ యంత్రయుగపు నరుడు రాక్షసుడు! తనను పెంచుతున్న ప్రకృతినే చెరుస్తున్నాడు! దోచేస్తున్నాడు! సర్వనాశనం చేస్తున్నాడు! కన్నతల్లిని నరికి పోగులు పెడ్తున్నాడు! తన ప్రాణం

తానే తీసుకుంటున్నాడు. తాను చేసుకుంటున్నది ఆత్మహత్య అని ఎరుగకున్నాడు! పుట్టు గ్రుడ్డి! ఏ ీ కానకున్నాడు! అజ్ఞాని! ిర ించుతున్నాడు! మూర్ఖుడు! తన సర్వనాశనం ఎరుగకున్నాడు!

నిప్పుతో చెలగాటలాడుతున్నాడు! ఎవడు చెపుతాడండీ వానికి? భర్తృహరి మూర్ఖపద్ధతి--

లభేత సికతాసు తైలమపియత్నతః పీడయ

న్పిబేచ్ఛ మృగతృష్ణికాసు సలిలంపిపాసార్దితః

కదాచిదపి పర్యటన్ శశి ిషాణ మాసాదయే

న్నతు ప్రతిని ిష్ట మూర్ఖజన చిత్తమారాధయేత్

తి ిరి ఇసుమున దైలంబు దీయవచ్చు

దం ిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు

దిరిగి కుందేటి కొమ్ము సాధించవచ్చు

జేరి మూర్ఖుల మనసు రంజింపగారాదు.

ఫ్హూల్‌కి పత్తీసె కట్ సక్తాహై హీరాకా జిగర్

మర్దె నాదాపర్ కలామె నర్మొనాజూక్ బే అసర్ -ఇక్బాల్ '

పూరేకుతో వజ్రపు గుండెను కోయవచ్చు మూర్ఖుని ిషయంలో సుతిమెత్తని మాట నిష్ఫలం.

నాటి వేద వ్యాసుని వేద పరిష్కార మహత్కార్యంలో ఈ ిషయాలు ఎదురైనాయని నా ఉద్దేశం.

1. వేదం మానవునికి సమస్తం నేర్పింది మానవుడు. కొన్నింటి నేర్చాడు. వాటిని అలవాటుగా ఆచారంగా చేసుకున్నాడు. దంతధావనం, స్నానం, ఇల్లు, వాకిలి, నిత్య జీ◌తం. ◌టిని ఇంకా వేదంలో ఉంచడం వల్ల ప్రయోజనం శూన్యం. వ్యాసమహర్షి వాటిని తొలగించాడు. ఇది అంత కష్టమైన పని కాదు. జనం అప్పటికే ఆ వేదాలను మరచి ఉంటారు.

2. వేదం పేర చలామణిలో ఉండిన నకిలీ వేదాలు-దొంగ వేదాలు. ఇ◌ స్వప్రయోజనపరుల సృష్టి వారు వాటితో లాభం పొందుతూంటారు.

దొంగ వేదాలను వెలికి తీయడం కష్టం. ఎందుచేతంటే అ◌ వేదంలాగే ఉంటాయి. స్వార్థపరులు జనులచే వాటిని అమోదింపచేశారు.

సమాజం స్వప్రయోజనపరుల పిడికిటనే ఉంటుంది. ఆ పిడికిలి తెరుచుకోదు. పిడికిలిని ◌రచాలి. ఇది అసాధారణ కార్యం. ఎంతో సాహసం, మనో బలం, నైతిక శక్తి, సత్యసంధత, దైవ బలం కావాలి. **దుష్టులను దూరం చేయగల శక్తి మహాత్ములకు ఉంటుంది. ఒకే రాముడు, ఒకే కృష్ణుడు, ఒకే బుద్ధుడు, ఒకే శంకరుడు, ఒకే రామానుజాడు, ఒకే గాంధీ దుష్టులను గెలిచారు.**

**వ్యాసుడు అందరిని ఎదిరించాడు. కలుపు వేదాన్ని, చీడ వేదాన్ని, నకిలీ వేదాన్ని దొంగ వేదాన్ని సాహసోపేతంగా తొలగించాడు. అందుకే అతడు వ్యాసభగవానుడు అయినాడు.**

**వ్యాసభగవానుడు దర్శనం ఇస్తే అతని పాదాలు చుంబించాలనేది నా తీరని కోరిక.**

3. అసలు, సిసలు వేద మంత్రాలను నిశ్చయించడం, వాటిని సార్వజననీనమూ, సార్వ కాలీనములుగా దర్శించడం, వాటిని దర్శించిన ఋషులను ఇతరములను నిశ్చయించడం,

అలా నిశ్చయించిన వాటిని పండిత పామరులచే అమోదింప చేయడం.

4. వేదాన్ని నిశ్చయించడం వేరు. అది మాత్రమే వేదం, అన్యం కాదని ప్రచారం చేయడం వేరు. వ్యాస భగవానుడు తన శిష్యులనంపి సమస్త మానవాళిచే 'ఇదే వేదం' అని వప్పించాడు. ఇది స్వల్ప కార్యంకాదు. సామాన్య మానవులు సాధించ జాలరు. అందుకే వ్యాసునిది అవతారం అతడు భగవానుడు. అతడు నారాయణుడు!

**ఆ మహాత్ముని పరిశ్రమ గురించి - వారు సాధించిన ఫలితాలను కనీసం అంచనా వేసే శక్తి లేదు. మనది అల్ప బుద్ధి, స్వల్ప బుద్ధి, మనం అల్పాయుష్కులం!**

వ్యాసుడు మానవజాతికి ఎన్ని ఉపకారాలు చేశారండి!

1. భారత వంశాన్ని అంతరించనీయ లేదు - రక్షించారండు.

2. పంచమ వేదం - మహాభారతాన్ని సృష్టించాడు.

3. అమృతతుల్యమగు భగవద్గీతను శ్రీ కృష్ణపరమాత్మచే పలికించాడు.

4. శాంతి ప్రాతిపదికమగు శ్రీమద్భాగవతమును ప్రవచించాడు.

5. పురాణ, ఉపపురాణ కర్త అయినాడు.

6. సంఘసంస్క ర్త అయినాడు

7. భాషేశ్వరుడు అయినాడు.

8. సామాజిక సారథి అయినాడు.

9. రాజకీయ వేత్త అయినాడు.

అతడు కానిది ఏది?

అతడు మనకు అక్షయ సంపద ప్రసాదించాడు. ఇవ్వండి, ఇవ్వండి, ఇవ్వండి, ఇంకా ిగులుతుంటుంది. కనీసం ఇవ్వలేదని అల్పులం అయినాం మనం!

వ్యాసుడు ఏ చెట్టు కిందనో, పర్ణశాలలోనో ఉన్నాడు, పిడికెడు మెతుకులు తిన్నాడు, ఇన్ని మహత్కార్యాలు సాధించాడు.

ఆ మహర్షికి మనం ఏం ఇవ్వగలం? నమస్కరింతాం.

వ్యాసం వశిష్టనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం

పారాశరాత్మజం వన్దే శుకాతాతం తపోనిధిం

వ్యాసుడు వశిష్టుని ముని మనుమడు. శక్తికి పౌత్రుడు, నిష్కల్మషుడు, పరాశరుని పుత్రుడు, శ్రీ శకుని తండ్రి, తపోధనుడు. అతనికి నమస్కరిస్తున్నాను.

## సంహిత - వేదం

మనకు ప్రస్తుతం లభిస్తున్న వేద సంహితలు. అవి నాలుగు.

1. ఋగ్వేదసంహిత

2. కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత

3. సామవేదసంహిత

4. అథర్వవేదసంహిత

**ఏవంచకార భగవాన్ వ్యాసః కృపణ వత్సలుః**

**వ్యవధాత్యజ్ఞ సంతత్యై వేద మేకం చతుర్విధం**

వ్యాసభగవానుడు కృపావాత్సల్యములు గలవాడు. తీరికలేని అజ్ఞాన సంతతి రానున్నదని గ్రహించినాడు. ఏక వేదాన్ని నాలుగుగా నిర్మించాడు.

**"సంహితం భవతి హ్యక్షరాణి ధనం ప్రతిష్ఠాయై"** అని తాండ్యము. తరగని సంపదను కలిగించునది సంహిత.

'సంహిత' వర్గ సంయోగము. వేదము నందలి కొంత భాగము శాస్త్రము. సంధించబడినది అని శబ్దరత్నాకరము.

'సంహితమ్' కూడు కొనునది అని సంస్కృతాంధ్ర నిఘంటువు.

ఒకదాన్ని ఏర్పరచడానికి, స్థాపించడానికి చేసే కూర్పు సంహిత అవుతుంది. దీన్ని మనం ఇప్పుడు సంకలనము అంటున్నాం.

వేదం రామాయణ, భారత, భాగవతాదుల వంటిది కాదు. అది ఒకే కంచే రచింపబడినది కాదు. కావ్య, ఇతిహాస, పురాణాల వలె నిరంతర కథాగమనం ఉండదు.

వేద సంహిత మంత్రాల, సూక్తాల కూర్పు మాత్రమే. వేదం అపౌరుషేయం. అంటే నరుడు చెప్పింది కాదు. ఋషులు మంత్రాలను సూక్తాలను దర్శించారు. వారు కర్తలు కారు.

ద్రష్టలు మాత్రమే - కనుగొని గుర్తుంచుకున్నవారు.

ఋషులు వేదాలను ఎన్ని యుగాలుగా దర్శిస్తున్నారో? ఎందరు దర్శిస్తున్నారో? ఇం చెప్పడు అసాధ్యం. ఎందుచేతనంటే భారతీయులకు కాలం అనంతం. కాలం బ్రహ్మ. కాలం పరమేశ్వరుడు ఇం మానవ కొలతలకు అందవు.

పాశ్చాత్యులది కాలం కాదు. చరిత్ర. వారి చరిత్ర. మూణ్ణాళ్ళది. కాబట్టి వారి చరిత్రను సంవత్సరాల్లో చెప్పుకోవచ్చు. మనకు యుగాలు ఉన్నాయి. వారికి శతాబ్దాలే! ఇంకా క్రీస్తు తరువాత 2000 సంవత్సరాలే! వారి కొంచెపు కొలతతో మన అనంత కాలాన్ని కొలవ పూనుకోవడం వెర్రి మాత్రమే!

అలా యుగాలుగా ఋషులు దర్శించిన వానిని వ్యాసుడు నాలుగుగా కూర్చాడు. వ్యాసుడు కూర్చిన తరువాత మంత్రద్రష్టలు లేరు. వ్యాసభవానుడు వేదానికి ఒక పాదం ఏర్పరచాడు. ఇదీ మాత్రమే వేదం. ఇందులో చేరనిది వేదం కాదు.

వ్యాసభవానుడు వేదసంహితులు చేశాడు. వాటిని నాలుగుగా ంభజించాడు. మనకు 'వేదం' అని తెలిసింది వేద సంహిత. ంటి కూర్పరి వేదవ్యాసమహర్షి.

నాలుగు ◌ిధాలుగా వేదాన్ని ◌ిభజించడం వేదచతుష్టయి, వేదచతుష్టయి వేదాల ◌ిషయం నిర్ణయం చేస్తుంది.

1. ఋగ్వేదసంహిత దేవతల గుణగుణాలను స్తుతిస్తుంది.

2. యజుర్వేదసంహిత ◌ి◌ిధ యజ్ఞాలను నిర్దేశిస్తుంది.

3. సామవేదసంహిత దేవతలను ప్రసన్నులను చేయు గాని◌ిధిని నిర్ణయిస్తుంది.

5. అథర్వవేదసంహిత బ్రహ్మ జ్ఞానం సహితంగా అనేకానేక లౌకిక ◌ిషయాలను ◌ివరిస్తుంది.

'వేదత్రయి' అని మరొక ◌ిభజన ఉంది. 1. పద్య, 2. గద్య 3. గేయ◌ిభజన. వేదాలు పద్యంలో దర్శించిన◌ి, 2. గద్యంలో దర్శించిన◌ి 3. గేయంలో దర్శించిన◌ి ఉన్నాయి. ఇది ఛందో ◌ిభజన.

ఈ వేదత్రయికి పాశ్చాత్యులు కువ్యాఖ్యానం చేశారు. వేదాలు మూడే నన్నారు. అథర్వం వేదం కాదన్నారు. తరువాత వచ్చి చేరిందన్నారు.

**వేదాన్ని దర్శించడానికి వేద దృష్టికావాలి. హ్రస్వదృష్టి - అన్య దృష్టి చాలవు. పరి◌ితదృష్టితో అపరి◌ిత వేదాన్ని దర్శించడం కువ్యాఖ్యానం అవుతుంది. భారత వేదాన్ని భారత కొలమానంతో కొలవాలి. పాశ్చాత్య కొలమానాలు అందుకు పర్యాప్తములు కావు.**

ఇవన్నీ తెలియకో - తెలిసి మనను కొంచెపు వారిని చేయటానికో 'వేదత్రయి' అంటే వేదాలు మూడేనని మనను న◌ి్మంచారు పాశ్చాత్యులు.

న◌ి్మంచేట్లు చేసేవాడు వంచకుడు

వంచకుడు చెప్పింది నమ్మేవాడు బానిస.

భాగవతంలో 'వేదమేకంచతుర్విధం' అని చెప్పబడింది.

**" చత్వారోహి ఇమే వేదా ఋగ్వేదో యజుర్వేదః**

**సామవేదో బ్రహ్మవేద ఇతి"** అని గోపథ పూర్వం. బ్రహ్మవేదమే అథర్వవేదం.

కావున మన ప్రమాణాలే ఆధారం. వేద సంహితలు నాలుగు 1. ఋగ్వేదసంహిత

2. యజుర్వేదసంహిత 3. సామవేదసంహిత 4. అథర్వవేదసంహిత.

యజుర్వేద సంహిత రెండు భాగాలు 1. శుక్ల యజుర్వేదసంహిత 2. కృష్ణ యజుర్వేద సంహిత.

వేదం మూడింటిని ప్రతిపాదిస్తుంది. అందుకు కూడ అది 'వేదత్రయి' అయింది.

“వేదా బ్రహ్మాత్మ ◌షయాస్త్రి కాండ ◌షయా ఇమే

పరోక్షవాదా ఋషయః పరోక్షం మమచ ప్రియం” అన్నాడు కృష్ణపరమాత్మ.

వేదం మూడు ◌షయాలను ప్రతిపాదిస్తుంది. అ◌. 1. బ్రహ్మ, 2. ఆత్మ, 3. బ్రహ్మ ఆత్మల

ఏకత్వం.

ఋషుల పరోక్షవాదులు. పరోక్షవాదం నాకు సహితం ప్రియం అని అర్థం.

“పరోక్షం” అంటే ఏ◌ు?

కంటికి కనిపిస్తున్నది ప్రత్యక్షం. కంటికి మాత్రమేకాక ఆలోచనకు దర్శనం ఇచ్చేది పరోక్షం.

మనముందే మనిషి ఉంటాడు. అతడు ప్రత్యక్షంగా కనిపిస్తుంటాడు. అంతే. అతడు మనకు అర్థం కాడు. అతని జ్ఞానం, సంస్కారం, మనసు అర్థం చేసికోవడానికి పరోక్షంగా పరిశీలించాలి. ఇంత చేసినా ఒక మనిషి వేరొకనికి ఇంతవరకు పరిపూర్ణంగా అర్థం కాలేదు. కాడు, అది ప్రకృతి రహస్యం. అది ఎన్నటికీ బయటపడదు.

**వేరొక వ్యక్తి కాదు. తనకు తాను ఎంతవరకు అర్థం అయినాడు?**

**నాకు ఇప్పుడు 71 సంవత్సరాలు. కాస్తో, కూస్తో జ్ఞానమూ, సంస్కారం ఉన్నాయి. నేను ఇంతవరకు నన్ను పరిపూర్ణంగా అర్థం చేసుకున్నాననుకోవడం లేదు.**

'లోకములన్నియున్ గడియలోన జయించిన వాడ ◌ంద్రియానీకముజిత్తము గెలువనేరవు' అంటాడు ప్రహ్లాదుడు తండ్రి హిరణ్యకశిపునితో.

వేదమూ అలాంటిదే. కంటికి కనిపించే అక్షరం మాత్రం వేదం కాదు.

వేదాన్ని అర్థం చేసుకోవడానికి మహర్షులు ఒక నిర్దిష్ట పద్ధతి ఏర్పరిచారు. అ◌ ఆరు వేదాంగాలు, నాలుగు ఉపవేదాలు.

### వేదాంగాలు

1. శిక్ష, 2. వ్యాకరణం, 3. నిఘంటు, 4. ఛందస్సు, 5. జ్యోతిషం, 6. శిల్పం.

### ఉపవేదాలు

1. గాంధర్వవేదం, 2. ఆయుర్వేదం, 3. ధనుర్వేదం, 4. అర్థవేదం.

వేదార్థాన్ని గ్రహించడానికి 1. ఉపనిషత్తులు, 2. కణాదుని వైశేషికం, 3. గౌతముని న్యాయం, 4. కపిలుని సాంఖ్యం, 5. పతంజలి యోగం, 6. జైమిని పూర్వమీమాంస, వబాదరాయణుని ఉత్తర మీమాంస ఉపకరిస్తాయి.

**పరోక్షంగా పరిశీలించినా వేదాత్మ సంపూర్ణంగా దర్శనం ఇవ్వడం దుర్లభం.**

మనిషి అర్థం కావడం లేదు. అయినా అతనితో వ్యవహరిస్తున్నాం. వేదం విషయమూ అంతే! ప్రత్యక్షదర్శనమే ధన్యత కలిగిస్తుంది.

వేదవాక్కుని అర్థం చేసుకోవడానికి 5దిశలున్నాయి. 1. అన్నమయం ఇది భౌతికం, 2. ప్రాణమయం ఇది దృష్టి గోచరం 3. మనోమయం ఇది మనసును గ్రహించడం 4. జ్ఞానమయం ఇది బుద్ధిని గ్రహించడం 5. ఆనందమయం ఇది వేదంలో లీనం కావడం.

జీవిత పరమావధి ఆనందమే. ఆనందోబ్రహ్మ.

**వేదం - శ్రుతి**

వేదానికి 'శ్రుతి' అని కూడా పేరుంది. 'శ్రుతి' అంటే చెవిన పడింది- విన్నది.

పాశ్చాత్యులు మన సాహిత్య, సంప్రదాయ, సంస్కృతులను కించపరచడానికి కొంచె పరచడానికి, హేళన చేయడానికి వారి స్వామిత్వాన్ని, మన బానిసత్వాన్ని బాగా వాడుకున్నాడు.

మనవారితోనే వాటిని వప్పించాలి. మనవాటిని నమ్మకుండా చేశారు.

శ్రుతి అంటే విన్నది కాబట్టి వేదకాలం నాటికి అక్షరం లేదని వ్యాఖ్యానించారు. తొలుత వేదం వల్లించబడింది. వ్రాయబడలేదు అన్నారు. అదే నిజం అని మనం నమ్ముతున్నాం.

**వేదం అపౌరుషేయం; అలా అంటే అది మానవుడు చెప్పింది కాదు. అంతేకాని భగవంతుడు చెప్పాడని వాచ్యంగా చెప్పబడలేదు. వేదం మానవుని కన్న అతీతం అయింది. వాస్తవంగా వేదం మానవ శక్తిని మించింది. అందుకోసం 'అపౌరుషేయం' అనే వాస్తవసత్యాన్ని వచించారు మహర్షులు.**

'అపౌరుషేయం' అనే స్ఫూర్తితోనే అన్య మతాల వారు తమ గ్రంథాలను భగవంతుడే వచించాడు అని చెప్పారు. భగవంతుడు పరాత్పరుడు. జగత్పిత. ఒక్కొక్క మతానికి ఒక్కొక్క ప్రవక్త కావచ్చు. కాని వేరు వేరు మతాలకు వేరు వేరు భగవంతులు లేరు. ఉండరు - ఉండకూడదు.

**మానవాళిది ఒకే అదితి భూ౧. ఒకే ఆకాశం. ఒకే భగవంతుడు, పరాత్పరుడు, ఈశ్వరుడు, మానవ జాతి సహితంగా సమస్త ప్రాణిజాలానికి అతడే సృష్టికర్త. తల్లి తండ్రీ అన్నీ.**

**అట్టి పరాత్పరుడు ఒక మతాన్ని న౧్మన వారి పాపాలు మాత్రమే దూరం చేయడు.**

**వారికి మాత్రమే మోక్షం ప్రసాదిస్తానని అనడు. అది సత్యానికి దూరం.**

అసత్యం అవుతుంది.

భగవంతుడు సత్యస్వరూపుడు. పరాత్పరునికి అసత్యం అనంత దూరవుది. అంటే ప్రవక్తులు చెప్పి భగవంతుడు చెప్పాడు అన్నారు!!

వేదం చెప్పిన అపౌరుషేయం మాత్రమే సత్యం. భగవంతుడు ఒక ంశ్వాసపు వారిని మాత్రమే ఉద్ధరిస్తాడనడం బూటకం.

'అపౌరుషేయం' సహేతుకం, ౧గతా౦ నిర్హేతుకములు!

వేదంలో ప్రతిసూక్తి ద్రష్ట పేరు ఋషిగా చెప్పబడింది. అతడు వేద సూక్తపు కర్త కాదు. ద్రష్ట స్మ ర్త మాత్రమే! అతడు ఆ సూక్తాన్ని ంన్నాడు. న్నది కాబట్టి 'శ్రుతి' ంని దాన్ని అక్షరబద్ధం చేశాడు.

వేదం పుట్టిన్నాడే అక్షరం ఉంది. అంతేకాదు శాస్త్రీయమూ పరిపుష్టమూ అయిన సంస్కృత బాష ఉంది. ఛందస్సు ఉంది.

ఎంతటి నాగరికత జాతి అవుతే సంస్కృతం వంటి భాష ఆ౦ర్భ౦ంచాలి? ఎంతటి సంస్కారం గల జాతి అవుతే 'సర్వేపిసుఖినస్సంతు' సకల ప్రాణులూ సుఖించాలని నినదించాలి?

"యూనాన్ - బ- ౧్ర్శ రోమా సబ్ ౧ట్గయె జహా౽ సె

అబ్తక్ మగర్హై బాఖీ నామొనిశా౽హమారా" అంటాడు ఇక్బాల్

గ్రీకు, రోం, ఈజిప్టులు మట్టిలో కలిసిపోయాయి.

నేటికీ మా ఊరూ, పేరూ నిలిచి ఉన్నాయి.

అన్ని పురాతన నాగరికతలూ మాసిపోయాయి. కాని భారత నాగరికత, సంస్కృతి, సంప్రదాయం ఇంకా నిత్య నూతనంగా వెలుగొందుతూంది. అదీ 1200 సంవత్సరాల పరాయి పాలన తరువాత!

ఎంత మహత్తమమండీ మన దేశం - మన జాతి - మన సభ్యత - మన సంస్కారం - మన సాహిత్యం - మన సంగీతం - మన కళలు!

ఒక్కసారి జయకొట్టండి భారత భూమికి!

వేదం - కాలం

భారత శాస్త్రం ప్రకారం కాలం అనంతం. కాలం ఎప్పుడు ప్రారంభం అయింది? కాలం ఎపుడు అంతం అవుతుంది? ఇది తెలిసిన వాడు లేడు, ప్రభువులు, ప్రభుత్వాలు, ఋషులు, ప్రవక్తలూ అందరినీ కాలం మింగేస్తుంది. యుగాలు అంతం అవుతాయి. ప్రళయం వస్తుంది. మళ్లీ సృష్టి ప్రారంభం అవుతుంది. కాలం నిరంతరం సాగుతూనే ఉంటుంది. కాలమే సృష్టిస్తుంది. కాలమే రక్షిస్తుంది. కాలమే కష్టాలు కలిగిస్తుంది. కాలమే సర్వాన్నీ అంతం చేస్తుంది.
కాలం మాత్రం సాగుతూనే ఉంటుంది.
కాలానికి నిలకడ లేదు.
కాలానికి కళ్ళూ నోరు ఉంటే ఎన్ని వాస్తవాలు వెల్లడించగలదో?
కాలాన్ని జయించినవాడు లేడు. కాలం అజేయం.
అందుకే 'కాలోయం బ్రహ్మ' అన్నారు.
ఈ కాలానికి నరుడు కొన్ని కొలతలు ఏర్పరచుకున్నాడు. అందుకు భూమి సూర్యుని చుట్టు తిరిగి వచ్చిన కాలాన్ని సంవత్సరం అన్నాం. అది అంత నిర్దిష్టం కాదు. సూర్యుని చుట్టూ భూమి తిరగడానికి 365 రోజుల 6 గంటలు పడుతుంది. ఆ ఆరుగంటలను సరిచేయడానికే నెల రోజుల వ్యత్యాసం- అధికమాసాలు- క్షయమాసాలు మొదలైనవి. అవి ఎప్పుడో కలుపుతాయి. ప్రతి ఏడాదీ జరగదు! మరి దీని నిర్దిష్టత ఏమి?
నరుని కొలమానం కాలానికి సరిపోవడం లేదు!
భారతీయులు పరమాణువు నుంచి ప్రళయం దాకా కాలానికి లెక్కలు కట్టారు. పరికించండి. సూర్యుడు పరమాణువును ఆక్రమించిన కాలం పరమాణువు. సృష్టిలో అతి సూక్ష్మ పదార్థం పరమాణువు 2. పరమాణువులు 1 అణువు 3 అణువులు ఒక త్రసరేణువు 3 త్రసరేణువులు ఒక తృటి 100 తృటులు 1 వేధ - 3 వేధలు ఒక లవం - 3 లవములు ఒక నిమేషం- ఇది మనం వాడుతున్న మినిట్ నిమిషం కాదు. ఇది సెకనులో 16175వ భాగం, 3 నిమేషములు ఒక క్షణం- 5 క్షణాలు 1 కాష్ట - 10 కాష్టలు ఒక లఘువు - 15 లఘువులు ఒక గడియ - 7 1/2గడియలు - 1జాము - 8 జాములు ఒక రోజు 15 రోజులు ఒక పక్షం, - 2 పక్షాలు ఒక నెల - 2 నెలలు ఒక ఋతువు 3 ఋతువులు ఒక అయనం 2 ఉత్తర, దక్షినాయనములు ఒక మానవ సంవత్సరము - 17,28,000 సంవత్సరాలు కృతయుగం. 12,96,000 సంవత్సరాలు కలియుగం.
4 యుగాలమొత్తం కాలం 43,20,000 సంవత్సరాలు.

సృష్టికాలం 1000 X 4 యుగాలు = 4 కోట్లు 32 లక్షల సంవత్సరాలు. 4000 యుగాల తరువాత ప్రళయం. 4000 యుగాల కాలం సృష్టి ఉండదు. తరువాత మళ్లీ సృష్టి మొదలు.

సృష్టి ఆది నుండి ప్రమాది అసంవత్సరమ- 1999-2000 వరకు 195,58,85,100 సంవత్సరాలు.
కలియుగంలో గడిచిన సంవత్సరాలు 5,100 పాశ్చాత్యుల కాలం సొంతం ఇప్పటికి 2000

సంవత్సరాలే!
వారు వ్రాసిన చరిత్ర  5000 సంవత్సరాలు దాటదు. వారికి కలియుగం మాత్రమే తెలుసు!

యూరపు చరిత్ర సొంతం వందల వేల సంవత్సరాలదే! ఆమెరికా, ఆస్ట్రేలియా, కెనడా వంటి దేశాల చరిత్ర వందల యేళ్ళదే! పాశ్చాత్యుల కొలతలతో వేదకాలాన్ని కొలవడం గజంబద్దతో ఆకాశాన్నీ, బకెటుతో సముద్రాన్ని కొలవడం లాంటిది.

మనం ఇంకా సాంస్కృతిక బానిసలం. అందువలనే వారి కొలతలను నమ్ముతున్నాం.  మన కొలతలను నమ్మలేకపోతున్నాం. ఆత్మ ిశ్వాసం లేని జాతికి అభ్యుదయం అంత సులభం కాదు. మనం రాజకీయ బానిసత్వం వదిలించుకున్నాం, కాని స్వతంత్రులం కాలేకున్నాం!

వేదం ఒక సారి పుట్టి ఒకనాటికి ముగిసిన కావ్యం లాంటిది కాదు. అదొక నది-ఒక స్రవంతి-ఒక ప్రవాహం. ఋషులు దర్శించిందాన్నల్లా అక్షరబద్ధం చేస్తూ పోయారు. అందుకే వేదం అనంతం 'అనంతావై వేదాః' ఈ అనంత స్రవంతులను వేద వ్యాసుడు సంహితలు చేశాడు. అప్పుడది సకల నదులు కలసిన సముద్రం అయింది. వేదం సముద్రమై సమస్త ప్రాణులకూ సాయపడుతున్నది.
పాశ్చాత్య ిద్వాంసుడు 'కీత్' ప్రకారం వేదం క్రీ. పూ. 1200 నాటిది. అంటే 1200 + 2000 = 3200 సంవత్సరాలనాటిది. వారు అంతకు పూర్వాన్ని ఆలోచించలేరు. ఇంకా క్రీస్తు పుట్టి 2000 సంవత్సరాలే!
వారికి సంవత్సరాలూ, శతాబ్దులు, సహస్రాబ్దులే తెలుసు, మనకుయుగాలు తెలుసు. మనది యుగాల లెక్క.
కీత్ చెప్పింది వేద సంహితలను గురించి - వేదాన్ని గురించి కాదని గమనించాలి.
కలియుగం ప్రారంభం అయి ఇప్పటికి 5,100 సంవత్సరాలు. భారతం ద్వాపరాంతం కలియుగారంభంలో రచించబడింది. ఆ తరువాత వ్యాసరచన భాగవతం, భాగవతంలో వేదసంహితల గురించి చెప్పబడింది. వేదం సంహితలుగా ఏర్పడి 5000 సంవత్సరాలైంది. వేదం ఏప్పుడు ప్రారంభం అయిందీ చెప్పడం దుస్తరం.
ఇంత కాలంగా ఒక నాగరికత, ఒక సభ్యత , ఒక సంస్కృతీ నిలిచి ఉండటం, ప్రపంచంలో కనీిని ఎరుగని ింత!!
'జీన్‌లోిు' ఇలా వ్య క్తపరిచారు.

"Precious or durable materials-gold, silver, bronze, marble, onyx or granite-have been used by most ancient peoples in an attempt to immortalize their achievements. Not so, however, with the ancient Aryas. They turned to what may seem the most volatile insubstantial material of all-the spoken word and out of this bubble of air fashioned a monument which more than thirty, perhaps forty, centuries later stands untouched by time or the elements. For the pyramids have been eroded by the desert wind, the marble broken by earth quakes, and the gold stolen by robbers, while the Veda remains recited daily by an unbroken chain of generations, travelling like a great wave through the living substance of mind."

"అత్యంత పురాతననరుల్లో " అనేకులు తను ిజయాలను శాశ్వత పరచడానికి ిలువైన మన్నిక గల బంగారం, వెండి, కంచు, పాలరాయి, నల్లరాతిని వాడారు. సనాతన ఆర్యులు మాత్రం భిన్నంగా వ్యవహిరించారు. వారు త్వరగా చెరిగే, అస్థిరరూపంగల అక్షరాన్ని, శబ్దాన్ని ఎన్నుకున్నారు. ఆర్యులు ఈ గాలి బుడగతో తీర్చిదిద్దిన నిర్మాణం ముప్పది, నలుబది శతాబ్దాల తరువాత కూడా, కాల, ప్రాకృతిక ప్రభావాలకు అతీతంగా చెక్కు చెదరక నిలిచి ఉంది. పిరిుడ్లు ఎడారి గాలులకు తరిగిపోయాయి. పాలరాతి కట్టడాలు భూకంపాలకు కూలిపోయాయి. బంగారం దొంగల పాలైంది. వేదగానం మాత్రం నిత్యం, నిరంతరం తరతరాలుగా ినిపిస్తున్నది. ఆ వేదస్వరం, మేధస్సు యొక్క సజీవ పదార్థంగా, అలలుగా, తరంగాలుగా పయనిస్తూనే ఉంది"

## వేదం - లిపి

పాశ్చాత్యులు - స్వప్రయోజనం కోసం - మనను వారి దోవ పట్టించడంలో నూటికి వేయిపాళ్లు ిజయంవంతులైనారు. నేను సామాన్యుల మాట చెప్పడం లేదు. అసాధారణులు, అసామాన్యులు, అఖండులు, ఉద్దండులు, ిద్వాంసులు, పండితులు సహితం దారి తప్పారు. పాలకుల దారి పట్టారు. 'స్వధర్మే నిధనం శ్రేయః' మరచారు. రాజ్యం ఆంగ్లేయులది. నాటి పాలకులు వారు, మనది 'రాజానుమతో ధర్మం'

**ఈ ిధంగా భరతజాతి సొంతం నేటికీ అభారతీయం, అప్రాచ్యాన్నే ిశ్వసిస్తున్నది. మనకు స్వాతంత్ర్యం అనేది వచ్చిం తరువాత మనం స్వచ్ఛందంగా పాశ్చాత్యుల సాంస్కృతిక దాస్యాన్ని కొని తెచ్చుకుంటున్నాం. ఒక జాతికి సంస్కృతి ప్రాణం. సంస్కృతిని మరచిన జాతికి భిష్యత్తు అంధకారం! వెలుగు లేదు. కనిపించదు. ఆ జాతి చీకటినే కాంతి అని భ్రిస్తుంది.**

భాషముందు ప్రభిస్తుంది. లిపి తరువాత అవతరించుతుంది. వ్యాకరణం తదనంతరం ఆిర్భిస్తుంది. లెక్కలేనన్ని భాషలకు నేటికీ లిపి లేదు. ిచిత్రం ఏమంటే ప్రపంచ నాగరికతలను శాసిస్తున్నామని భాించే ఇంగ్లీషుకు, ఇతర యూరోపియన్ భాషలకు లిపి లేదు. అి పరాయి లిపినే వాడుతున్నాయి. అంతెందుకు హిందీకి, మరాఠీకి లిపి లేదు. అి దేవనాగరిని లిపిగా వాడుతున్నాయి.

**లిపి గల తెలుగు ఎంత సంపన్నమో అర్థం చేసుకోండి.**

వేదం సంస్కృత భాషలో ఉంది. సంస్కృతానికి సంబంధించినంత వరకు తొలుత వ్యాకరణం ఆిర్భించింది. వ్యాకరణాన్ని అనుసరించి భాష ఏర్పడింది. అందుకే అది సంస్కృతం అయింది.

సంస్కృతానికే స్వంత లిపి లేదు. అందుకోసం దేవనాగరి లిపిని ఆిష్కరించారు మహర్షులు లిపిని వేరుగా ఆిష్కరించడానికి కారణం అది అన్ని భాషలకు ఉపయోగపడాలని.

దేవనాగరి లిపి పరిపూర్ణమూ, నిర్దిష్టమూ, దీని అక్షరమాలనే - లిపులు వేరైనా భారతీయ భాషలన్నీ అనుసరిస్తున్నాయి. అక్షరమాలలన్నీ 'అ' తోనే మొదలౌతాయి. జీ◌తం, భాష 'అమ్మ'తో మొదలవుతుంది. దేవనాగరి లిపితో ఏ ఉచ్చారణనైనా వ్రాయవచ్చు. అంతటి సుసంపన్నం అయిన లిపిని మన మహర్షులు మనకు అందించారు. వేల సంవత్సరాలుగా ఆ లిపి నిరంతరాయంగా మానవజాతికి అక్షరామృతం ప్రసాదిస్తున్నది!

ఆంగ్లభాషకు అరువు తెచ్చుకున్న లిపి అపర్యాప్తం అని జార్జి బెర్నార్డ్‌షా ◌లపించాడు.

లిపి లేని భాష వారు సంస్కృతాన్ని మృతభాష **DEAD LANGUAGE**అంటున్నారు. "◌ంగ మెతుకులేదు ◌ంసాలకు సంపెంగ నూనె' అనేది తెలుగు సామెత.

సంస్కృత వర్గానికి చెందినవని ఆంగ్లేయులు నిర్ణయించిన 1. ఇరానిక్ 2. హెల్లెనిక్ 3. ఇటలిక్ 4. సెల్లెటక్ 5. ట్యుటనిక్ 6. లెట్టొస్లొ◌క్ భాషలు జాడలేని◌ అయినాయి. అయినా ఇన్నివేల సంవత్సరాలుగా సంస్కృతం హిమవదున్నతమై, నిశ్చలంగా సూర్యకాంతి వలె

సజీవంగా నిలిచి ఉంది. ఇందుకు సాక్ష్యం అనంతమూ, అమరమూ అయిన సంస్కృత సాహిత్యం! వేదం, ఉపనిషత్తు, రామాయణ, భారత, భాగవతాలు కాలపు జరా జీర్ణాలను ఎదిరించి నిత్యనూతనంగా ◌రాజిల్లుతున్నాయి.

**ఇంత సంపద ఏ భాషకు ఉంది? ఏ జాతికి ఉంది? మనం ఇంతటి మహోన్నత సంస్కృతికి, సంప్రదాయానికీ వారసులం! అందుకు మనం గర్వించాలి. గంతులు వేయాలి దీన్ని సంరక్షించుకునే బాధ్యత స్వీకరించాలి.**

వేదం తొలినుంచే అక్షర బద్ధం అయింది. దీనికి భాష ఉంది. లిపి ఉంది. ప్రాణం ఉంది. వేదం భూ◌, ఆకాశం, వాయువు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాల వంటిది. ఇది శాశ్వతం. ఏ ఒక్క సమాజపు సొత్తు కాదు. ఇది సమస్త మానవాళికి చెందింది. సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. సమస్త ప్రాణి జలానికి వెలుగు ప్రసాదిస్తాడు. వేదం సూర్యుని లాంటిది. తూర్పున
ఆ◌ర్భ◌ంచింది. సకల ప్రాణి జాలానికి కాంతి ప్రసాదిస్తున్నది.

**నమో వేదమాతా**
**స్తుతామయా వేదమాతా ప్రచోదయన్తాం ద్విజానామ్**
**ఆయుః ప్రాణం ప్రజా పశుం కీర్తిం ద్ర◌ణం బ్రహ్మవర్చసమ్**
**మహ్యం దత్వా ప్రజత బ్రహ్మలోకం**

అథర్వ వేదం

వేదం-స్వరం

వేదాన్ని అర్థం చేసికోవడానికి 'స్వర' జ్ఞానం అవసరం. మన మహర్షులు వేదాన్ని భద్రపరచడానికి మహాయజ్ఞం సాగించారు. వారు వేదపు అక్షరాలకు 'స్వరం' కూర్చారు. స్వరానికి నిర్దిష్టత, శ్రావ్యత, మహిమ కలిగించారు.
వేదానికి నాలుగు స్వరాలున్నాయి. 1. ఉదాత్త 2. అనుదాత్త 3. స్వరిత 4. ఏకశ్రుతి.
అర్థాన్ని పరిరక్షించడానికి స్వరం ఉపకరిస్తుంది. స్వరాన్ని బట్టి అర్థం మారుతుంది.
"కృష్ణకంబలం ఆనయ" ఒక స్వరం ప్రకారం 'నల్లగొంగడి వాణ్ణి పిలువు' - కాగా రెండు స్వరంలో 'నల్లగొంగడి తెమ్ము' అవుతుంది.
వేదం శృతి. ిన్నది, ినసొంపైంది. స్వరయుక్తంగా చదిిన వేదం శ్రావ్యత్. మహిమాన్వితం.

**అక్షరాన్నీ, స్వరాన్నీ ఇంత కాలంగా భద్రపరచిన ఉదాహరణ సృష్టిలో మరొకటి లేదు.**

మా తండ్రి గారు ిద్వాన్ వేంకటాచార్యుల వారు 'తిరువాయ్‌మొళి'కి ఆంధ్రానువాదం చేశాడు. మరికొన్ని గ్రంథాలు రచించి, ప్రచురించారు. వారు 1979లో పరమపదించారు. వారి గ్రంథం ఒక్కటీ మాకు లభించలేదు.

మా అన్నయ్య 'దాశరథి కృష్ణమాచార్య' అనేక కిితా సంపుటాలు ప్రచురించారు. వారు 1987లో పరమపదించారు. వారి సమగ్ర రచనలు లభించడం లేదు.

తమ జీితంలోనే తను గ్రంథాలు లభించకపోవడం నేటి రచయితలకు సర్వ సాధారణ అనుభవం.

**ఇది అచ్చు యంత్రాలు, ప్రచురణ సంస్థలు, గ్రంధాలయాలు , కంప్యూటర్స్ వచ్చిన నాటి కథ.**

**తాళపత్ర, భూర్జర పత్రాల ీంద వ్రాసుకుని, వాటిని వల్లించి ఇన్ని వేల సంవత్సరాలు భద్ర పరచడం ప్రపంచ ింతల్లో సర్వ ప్రధమం కావాలి.**

**పిరిుడ్లు, చైనా మహాకుడ్యం, ఎల్లోరా అజంతా శిల్పాలు, తాజ్‌మహల్ వంటిి కాలదోషం**

**పట్టి ిరిగి పోవడమో, అరిగిపోవడమో జరిగింది. జరుగుతున్నది. అక్షరం, నాదయుక్తమైన వేదం జరాజీర్ణాలకు అతీతంగా నిత్య యవ్వనిలా నిలిచి ఉండడం ింత మాత్రం కాదు- మహత్తు.**

**అయితే మనం సాంస్కృతిక బానిసలం, చెప్పుకోం. పాలకులు పరాయి ిధానాలకు దాసానుదాసులు. భృత్యస్య భృత్యులు. వారి ఏలికలను నొప్పించనొల్లరు.**

వేదం శృతి ినడం ఏిుటి చదువు కొనరాదా? అని అడగవచ్చు. అడిగేవాడికి చెప్పేవాడు లోకువ!

ఇవ్వాళ సాంకేతిక, సాంకేతికేతర గ్రంథాలు, దృశ్య, శ్రవణ యంత్రాలు, వా।శి, ఇన్ని ఉన్నా ఉపాధ్యాయులు బోధిస్తున్నారు. **దీని తాత్విక సూత్రం ఏమంటే ◌న్నదే మనసుకెక్కుతుంది. వంటపడుతుంది.**

అర్ధశతాబ్దం క్రితం కూడా ఈ దేశంలో జనం, పురాణాలు, హరికథలు, బుర్రకథలు, జముకుల కథలు మున్నగు జానపద రూపాల ద్వారానే ◌ద్యావంతులు, నీతిమంతులు అయినారు.

**పుస్తకాల వ్యాపారం మొదలైన తరువాత అక్షరం నుండి ◌ద్య, ◌ద్య నుండి నీతి అదృశ్యం అయినాయి!**

శబ్దానికి నాదం ఉంది, అర్థం ఉంది, ఆ రెండూ మనసుకుపడ్తాయి. ఆనందాన్నిస్తాయి. వెంటాడ్తాయి. వదలవు.

అర్థం కాని నాదం ఏ◌? అని అడగవచ్చు. అడగడం తేలిక, ఆలోచన అక్కరలేదు!

త్యాగరాయ కృతులు తెలుగులో ఉన్నాయి. ఆ కృతులను త◌ళులే ఎక్కువ ఆరాధిస్తున్నారు. వారికి తెలుగు అర్థం కాదు. తెలుగు వ్రాసుకోవడానికి పర్యాప్తమైన లిపి సహితం త◌ళులకు లేదు. వారు అర్థాన్ని ◌ంచిన నాదాన్ని ఆస్వాదిస్తున్నారు! ఉపాసిస్తున్నారు. నాదం మనసును కదలిస్తుంది, కరిగిస్తుంది! నాదం పశువుకూ తెలుసు, శిశువుకూ తెలుసు, "శిశుర్వేత్తి పశుర్వేత్తి" శ్రీ కృష్ణుని వేణుగానానికి గోపికలే కాదు గోవులూ పులకించే◌!

ఈ కాలంలో అన్యభాషల సినిమాలు చూచే వారికీ పాటలు ◌నేవారికి భాష తెలియదు. అయినా చూస్తున్నారు. ◌ంటున్నారు. అందులో అర్థాన్ని ◌ంచిన ఆనందం ఏదో ఉంది!

**అలాగే స్వరబద్ధం అయిన వేదనాదం మనసును కదిలిస్తుంది, కరిగిస్తుంది, మంచి**

**కలిగిస్తుంది శాంతి ప్రసాదిస్తుంది.**

**'యోర్థజ్ఞ ఇత్ సకలం భద్రమశ్నుతే । నాకమేతి జ్ఞానం◌ధూతపాప్మా"**

యాస్కుడు

**వేదం అర్థసహితంగా తెలిసికొన్న వానికి సకల శుభాలు కలుగుతాయి. జ్ఞానం అతని పాపాలను కడిగేస్తుంది. అతడు స్వర్గానికి చేరుకుంటాడు.**

సామాన్యునికి వేదం అర్థం కావాలనే ఆశయంతో నేనువేదాలను తెనిగించాను. ఇంతవరకూ ఎవరూ తలపెట్టని రీతిగా 'వేదం- జీవనాదం' వ్రాస్తున్నాను. కాని మంత్రానికి ఉన్నప్రభావం అనువాదానికి లేదు. అనువాదం అర్థం చేసుకోవడానికి మాత్రమే! స్వరంతో ◌నిపించిన, ◌న్న మంత్రానికి మహాత్మ్యం ఉంది.

**అనువాదం అర్థానికి మాత్రమే!**

**మంత్రం ఆనందించడానికీ, ఆస్వాదించడానికీ!!**

**వేదం శృతి.**

**వేదం ఁనిపించడంలో ఆనందముంది. వేదం ఁనడంలో అమృతం అందుతుంది!!**

**ఋషి**

ఋషి సూక్తానికి కర్త మాత్రం కాదు. వేదం అపౌరుషేయం. ఋషి ఆ సూక్తానికి ద్రష్టస్మ ర్త మాత్రమే. అతడు ఆ సూక్తాన్ని అతీంద్రియంగా దర్శించాడు. దర్శించిందాన్ని గుర్తు పెట్టుకున్నాడు.

**వాస్తవానికి ఎవడూ, దేనికీ కర్తకాదు, అన్నింటి కర్త పరాత్పరుడే, అతడు చేయిస్తున్నాడు. మనం చేస్తున్నాం. పరమపిత పరమేశ్వరుడు ఈ జగన్నాటకకర్త-దర్శకుడు, మనమంతా అతడు ఆడించినట్లు ఆడేవాళ్ళమే! మనం కర్తలమే అనుకుంటే మనం అనుకున్నఁ అన్నీ కావాలి కదా! అలా కావడం లేదు! ఇది సర్వే సర్వత్ర అనుభవమే!! కాని కొందరు చెప్పనొల్లరు!! వాళ్ళు సత్యానికి తొడుగువేస్తున్నారు.**

నావరకు నాకు వేదాన్ని నాదం చేసే శక్తి గాని, వేదాన్ని గురించి ఇంత సులభంగా చెప్పే శక్తిగాని లేదు. భగవానుడు కర్తగా నాతో వ్రాయిస్తున్నాడు. ఇది నగ్నసత్యం, దీనికి నేను వ్రాయసగాణ్ణి మాత్రమే! అట్లని నేను మనస్పూర్తిగా ఁశ్వసిస్తున్నాను.

ఋషి అనగానే తెల్లని పొడవైన గడ్డం, నడినెత్తిన జడలముడి, చేత కమండలం గల నాటక లేక సినిమా ఋషి ప్రత్యక్షం అవుతాడు. **కాని ఋషికి వేషం, వయస్సు ప్రధానములు కావు. అతని జ్ఞానమే ప్రధానం.**

**న తేవృద్ధోభవతి యేనాన్యపలితం శరః**
**యో వా యువాన్యధీయానంస్తం దేవాః స్థఁరం ఁదుః**

మనస్మృతి

తలనెరిసినంత మాత్రాన పెద్దకాడు. యువకుడైనా జ్ఞాని అయినవాణ్ణి దేవతలు పెద్దగా భాఁస్తున్నారు.

వేదంలో ఒక్కొక్క చోట ఇంద్రుని గడ్డాలూ, ఁసాలు ఉన్నట్లు చెప్పబడింది. అది నాటి ఫేషను కావచ్చు. అలాగే ఋషులకు గడ్డం ఉంటే ఉండవచ్చు. కాని గడ్డం మాత్రం చేత ఋషి కాబోడు.

**" యోవైజ్ఞాతో అనూచానః సఋషీ రార్షేయః " శాత్యం**

అనాది జ్ఞానంగలవాడు ఆర్షేయ ఋషి

"ప్రాణావా ఋషయః " యజుర్వేదం

ప్రాణములే ఋషులగుచున్నారు.

సాయణాచార్యుడు ఋషిని అతీంద్రియ దర్శనుడు అన్నాడు. సాధారణ అవయవములకు అందని దానిని దర్శించువాడు అని అర్థం.

కవులు రచయితలు అతీంద్రీయ దర్శనులు కావాలి. అంటే వారు వ్రాసినవన్నీ వారు చూచినవి గాని, అనుభవించినవి గాని కావు. వారు అతీంద్రియ దృష్టితో చూసింది వాస్తవం అవుతుంది. వ్యాసుడు, వాల్మీకి వంటి వారిది అతీంద్రియ దృష్టి! బ్రహ్మ వాల్మీకికి **'నతేవాగనృతాభవిష్యతి'** నీ మాట అసత్యం కాదు అని వరం ఇచ్చాడు.

అందువల్లనే 'నా నృషిఃకురుతే కావ్యం' అన్న ఆర్యోక్తి. ఋషి కాని వాడు రచన చేయజాలడు. కాబట్టి నిజమైన కవి, రచయిత ఋషి కావాలి. సొంతం కాకున్న అంశామాత్రమైనా ఋషి కావాలి. రచయిత లోని ఋషి బట్టి అతని రచనాపటిమ, అతని రచన శక్తి ఆధారపడిఉంటుంది.

వేద ఋషు అందరూ అపౌరుషేయానికి ద్రష్టలు, స్మ ర్తలు కారు. ఒక్కొక్కచోట దేవతల, మానవుల కోరికను అనుసరించి సూక్తాలు రచించిన నిదర్శనాలు అరుదుగా కనిపిస్తాయి.

మొదటి మండలపు 64వ సూక్తంలో 'నోధః ' అను ఋషిని మరుద్గణములను గూర్చి సుందర సూక్తం రచించమనడం కనిపిస్తుంది.

**" వృష్ణే శర్ధాయ సుమఖాయ వేధిసే నోధః సువృక్తిం ప్రభరామరుద్భ్యః "**

"నోధా! మరుద్గణములు వర్షము కలిగించువారు యజ్ఞములనుండి శోభ కలిగించువారు. పుష్పఫల కర్తలు. వారిని గురించి సుందర స్తుతి రచించు."

10వ మండలం 107వ సూక్తపు 11వ మంత్రంలో భూతాంశుడనను నేను ఈ స్తోత్రము రచించి అశ్వినుల మనోరథం తీర్చానని చెపుకున్నాడు.

**"యశోనపక్వం మధురోస్తరా భూతాంశో అశ్వినోః కామమప్రాః"**

మరికొన్ని చోట్ల ఋషులు తామే సూక్తాలు రచించినట్లు చెప్పుకున్నారు. కొన్ని చోట్ల సంపన్నులను స్తుతించి ధనం పొందినట్లుగా ఉంది.

ఇవి ఎక్కడో ఒక చోట కనిపించేవి. అధిక భాగం ఋషులు దర్శించినవే!

అందుకే వేదం మానవ ప్రోక్తం కాదు. వేదం అపౌరుషేయం.

వేద ద్రష్టలైన ఋషులు పురాణ ఋషులూ సామ్య మాత్రాన ఒకటి కారు. వేదాలకూ పురాణాలకూ మధ్య అనంత కాల వ్యత్యాసం ఉంది. వేద ిశ్వాిత్రునికీ, రామాయణ, ిశ్వాిత్రునికి, మహాభారత ిశ్వాిత్రునికీ పేరులో తప్ప సామ్యం లేదు.

వేదంలో ఋషులకు కోప, తాప, శాపాలు కనిపించవు. వారు ద్రష్టలు, జ్ఞానులు, పురాణ ఋషులకు కోప, తాప, శాపాలు మెండు. కోపమే ప్రధానంగా గల పురాణ ఋషులున్నారు!

## దేవత

1. దివావైభూదితి తద్ దేవానం దేవత్వం 2. యథావై మనుష్యాః ఏదం దేవా అగ్ర ఆసన్

3. ప్రాచీన ప్రజననా వైదేవాః 4. ప్రాణాదేవాః 5. చక్షుదేవాః 6. మనోదేవాః 7. వాగేశదేవాః

8. పరోక్షం వై దేవాః 9. జాగ్రతి దేవాః 10. నవై దేవాః స్వపన్తి 11. సత్య సంహితావై దేవాః

12. సత్యమేవ దేవాః 13. ద్యోవై సర్వేషాం దేవానామాయతనం 14. పృథ్వివై సర్వేషాందేవానామాయతనం 15. దేవగృహావై నక్షత్రాః 16. సద్యావై దేవానాం గృహాః

దేవతలను అనేక ిధాలుగా చెప్పడం జరిగింది.

**"ప్రాచీన ప్రజననావై దేవాః ప్రాచీన ప్రజననా మనుష్యాః " "సత్యమేవ దేవాః అనృతం మనుష్యాః " "పృథ్వివై సర్వేషాం దేవానామాయతనం"**

ప్రాచీనులుగా పుట్టినవారు దేవతలు. ప్రాచీనంగా పుట్టిన వారు మనుష్యులు. సత్యమే దేవతలు. అసత్యం మనుష్యులు. దేవతలందరి స్థానం పృథ్వియే అగుచున్నది.

అట్లని వేదం దేవతలను మనుష్యులను సమానంగా భాిస్తున్నది. ఋభువులు, మున్నగు నరులు స్వయం కృషితో దేవతలైనారు. వాస్తవంగా వేదం మానవుని, మానవుని కృషిని, మానవుల ిశ్వాసాన్ని మానవుని మహత్తునూ ఎక్కువగా ిశ్వసిస్తున్నది.

**ఓం ఇషేత్వోర్జే త్వా వాయవస్థ దేవో వ: సంతా ప్రార్పయంతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వమఘ్న్యా ఇంద్రాయ భాగం ప్రజాపతీ రనంనా అయక్ష్మా మావస్తేన ఈశత మాఘశంసోధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత్ బహ్వీర్యజమానాయ పశూన్పాహి.**

**--శుక్ల యజుర్వేద తొలి మంత్రం**

నరుడా! సూర్యుడు నిన్ను అన్నము, శక్తి, కొరకు ప్రేరన కలిగించును గాత. నీవు ఆత్మవు, సూర్యుడు నీతో సత్కార్యాలు చేయించును గాత. వర్థిల్లుము. అవధ్యుడవగుము. ఇంద్రునకు భాగములు సమర్పించుము. సంతానవంతుడవగుము. ఆరోగ్యవంతుడవగుము.

మావస్తేన ఈశత, చోరులు నీకు శాసకులు కాకుందురు గాక అంటున్నది. శాసకులు నిష్పత్తి భేదంతో- చోరులే అవుతున్నారు. ప్రస్తుత భారతశాసకులకు- పాలకులకు ఎంతవరకు వర్తిస్తుందో గ్రహించండి - ఊహించడం కాదు. కాకూడదు అన్నది మానవ సంకల్పం-

ప్రార్థనకాదు.

దైవసహాయం, ఈశ్వరసంకల్పం అవసరం. ఈ అనంత ిశ్వసత్యాన్ని వేదం ఆిష్కరించింది. హేతువాదుల అనిపించుకునే కొందరు స్వశక్తి ీద ిజయాలు సాధించలేకున్నారు! సూర్యుడు అస్తిుంచని సామ్రాజ్యాన్ని బ్రిటిషు ప్రభుత్వం జయించింది. దక్కించుకోలేకపోయింది. ఇది ప్రయత్నలోపమా? బొత్తిగా కాదు. సామ్రాజ్యాన్ని స్వచ్ఛందంగా వదులుకున్నవారు అరుదు.

రాముడు స్వచ్ఛందంగా రాజ్యాన్ని వదులుకున్నాడు. అన్న రాముని కోసం లక్ష్మణుడు రాజ్యాన్ని త్యజించాడు. ధర్మం కోసం ధర్మ రాజు రాజ్యాన్ని వదిలాడు. కేవలం సత్యవాక్కు కోసం హరిశ్చంద్రుడు రాజ్యాన్ని వదులుకున్నాడు. ఇవన్నీ భారతీయ నిదర్శనాలు.

భారత ప్రజ, రాజ్యాధికారాన్ని కాదు, త్యాగాన్ని ఆరాధించింది. ఈ ధరిత్రిీద రాజకీయం కన్న జ్ఞానం, ధర్మం, ిశ్వాసం రాజ్యం చేశాయి.

బ్రిటిషువారు వేషధారణ తప్ప ధర్మానికి ఇంకా స్పెల్లింగు నేర్వనివారు. వారి రక్తంలో త్యాగంలేదు. అమెరికా స్వాతంత్ర్య సంగ్రామం నుంచి, దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య సమర ిజయం వరకు ప్రజలు బ్రిటిషు వారిని తరిిు కొట్టారు. బ్రిటిషువారి కుట్రలు, ిభజించి పాలించుటలు. అణగద్రొక్కడాలు, దోపిళ్లు ఏమైనాయి? వాటికి కాలం చెల్లింది. కాలం భగవత్ స్వరూపం కాలో యం బ్రహ్మ' బ్రిటిషు వారి ఓటిు హేతువాద పరాజయంగా భాిించడం తప్పగునా?

హేతువాదం పాశ్చాత్యులు కన్న బిడ్డకాదు. దాన్నివారు భారత దేశం నుంచే అపహరించారు. జాబాలి, చార్వాకుడు హేతువాదానికీ, భౌతికవాదానికీ ఆద్యులు. వారిని భారత రాజకీయంగాని, ధర్మం గాని శిక్షించలేదు. భారత భూిులో ఆధ్యాత్మికం, హేతువాదం సహజీవనం చేశాయి. పాశ్చాత్య రాక్షస రాజకీయం అనేకమంది హేతువాదులను, శిక్షించింది, ఉరితీసింది!

మానవ జీితానికి కేవల ఆధ్యాత్మికంగాని, కేవల హేతువాదం గాని సరిపడవు. మానవ జీితం ఏకాకి కాదు. అది అనేకపు సమాహారం. వేదం ఈ పరమ సత్యాన్ని గుర్తించింది. దీన్ని కాదనడం కేవలం వాదం మాత్రమే!

ఇది బ్రిటిషు సామ్రాజ్యానికి సంబంధించిన ిషయం. కారల్‌మార్క్స్ మహర్షి సామాన్య మానవుని కోసం, శ్రాిుకుని కోసం ఒక మహా సిద్ధాంతాన్ని ఆిష్కరించారు. మార్క్స్ అనుకున్నరీతిలో కాకున్నా అతని సిద్ధాంతాన్ని అనుసరించి లెనిన్ మహాశయుడు రష్యాలో శ్రాిుక ిజయానికి కారకుడైనాడు. సోషలిస్టు సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఇరవయ్యవ

శతాబ్దపు ముప్పావుభాగం సోషలిస్టు ప్రభావంగలదే! సోవియట్ రష్యాలో ప్రజలకు ఉండినన్ని సౌకర్యాలు ఏ ప్రజాస్వామ్య దేశంలో లేకుండినవి. ఆ రోజుల్లో మేము ప్రపంచమంతటా ఎర్రజండా ఎగురుతుందని ఆశించాం. రష్యాలో పండంటి సోషలిజం పతనానికీ, రష్యావిచ్ఛిత్తికీ కారణాలు ప్రస్తుతం కేవలం తార్కికాలు! మరి హేతువాదపు జాడ ఏది? **'కాలోయం దురతిక్రమః '** అన్న వాల్మీకి వాదం నిత్య సత్యం.

ప్రస్తుతం లోకాధిపత్యం వహిస్తున్నానన్న అమెరికా సామ్రాజ్యవాదం కడు చిన్న వియత్నాం చేత చావు దెబ్బ తిన్నది. రష్యా పతనంతో తానే మొనగాణ్ణని విర్రవీగి లోకాన్ని పాదాక్రాంతం చేయించడానికి డాలర్‌ను నమ్ముకున్న అమెరికా సామ్రాజ్య వాదానికి ఆయువు అంతగా లేదు. నేను చూడకపోవచ్చు. అమెరికా సామ్రాజ్య వాద పతనం తథ్యం. దీనిని ఏ హేతువాదము డాలరిజమూ రక్షించజాలవు. ఇది సత్యం, ఇది తథ్యం. సత్యం ఏది?

"కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే!

వారేరీ సిరి మూట గట్టుకొని పోవం జాలిరే భూమిపై

బేరైనం గలదే శిబిప్రముఖులు బ్రీతిన్ యశః కాములై

యీరే కోర్కులు వారలన్ మరచితే యిక్కాలమున్ భార్గవా!

ఇది పోతనామాత్యుని శ్రీమహాభాగవతపు 8వ స్కంధంలోని 589వ పద్యం. విచిత్రం ఏమంటే ఈ మాటలన్నది రాక్షసరాజు బలిచక్రవర్తి! ఇది నిత్య సత్యం! సత్యానికి ఆద్యంతములు లేవు.

సత్యం ఎవరినోట వెలువడినా శిరోధార్యమే!

"కమలనాభు నెరిగి కాలంబు దేశంబు

నెరిగి శుక్రమాటలెరిగి నాశ

మెరిగి పాత్రమనుచు నిచ్చెదానము బలి

మహి వదాన్యుడొకడు మరియుగలడె?

అని బలి చక్రవర్తిని వ్యాసమహర్షి కీర్తించాడు. బలిరాక్షసుడగును గాక! సత్కార్యం, మహాకార్యం చేశాడు! ఇది భారతీయత! భారతధర్మం! భారత సంస్కృతి! భారత నాగరికత!

**భారతం ఒక నేలకదు. ఒక దేశం కాదు. భారతం ఒక సంస్కృతి. ఒక విశ్వాసం. ఒక ధర్మం, ఒక న్యాయం, ఒక సత్యం, దానికి రాజకీయ హద్దులు లేవు. అదొక జీవన విధానం అది శాసనానికి లొంగదు. అది ఆకాశమంతటిది! భూగోళమంతటిది! సముద్రమంతటిది!**

**వసోః పవిత్రమసి ద్యౌరసి పృథివ్యసి**

**మాతరిశ్వానో ఘర్మోసి విశ్వధా అసి**

**పరమేణ ధామ్నా దృంహస్వ మాహ్వార్మాతే యజ్ఞపతిర్హ్వా ర్షీత్**

**శుక్ల యజుర్వేదం 2వ మంత్రం.**

మానవా! నీవు వసువులను పవిత్రీకరించువాడవు. నీవే ద్యులోకమవు. పృథ్వివి. నీవు ప్రాణపు ఉష్ణమవు. విశ్వమును ధరించువాడవు. పరమ ధామము నుండి ముందుకు సాగుము. నీవు కపటివి కాకుము. నీ యజ్ఞపతి కుటిలుడు కాకుండునుగాక.

ప్రాణపువేడి సహితంగా సమస్తం మానవుడే అనుచున్నాడు. మానవుడు కపటి, కుటిలుడు

**కానంతవరకే అన్నీ కాగలడు! మానవుడు మనసుగలవాడు - మంచివాడు. కాని వాడు కాడు.**

**వేదం** మానవునికి అంతటి అంతస్తు కలిగించింది.

వేదానికి మనిషిపైద అతని సంకల్పం పైద అనంత విశ్వాసం. నరుడు **"అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మను వరకు చేరుకోగలడు. ముందు అతడు మానవుడు కావాలి.**

**శతం జీవ శరదో వర్థమానః శతం హేమంతాచ్ఛతమువసంతాన్**

**ఋగ్వేదం 10-161-4**

నూరు శరత్తులు, సుఖంగా నూరు హేమంతాలు, నూరు వసంతాలు జీవించు.

ఇందులో ఎవరినీ అర్థించడం, ప్రార్థించడం లేదు. ఆశీర్వదించడమే! విశ్వాసం సంకల్పం పైదనే - దేవతల పైద కాదు.

**శంనో వాతః పవతాం శంనస్తపతు సూర్యః**

**శం నః కనిక్రదద్దేవః పర్జన్యో అభివర్షతు యజుర్వేదం 36-10**

మాకు వాయువు సుఖముగా వీచునుగాత. సూర్యుడు సుఖకరముగ ప్రకాశించునుగాత. ఉరుముల దేవత పర్జన్యుడు మా కొరకు సుఖకర వర్షము కురిపించును గాత.

**ఇది మానవ సంకల్పం, ఆశయం. ఇందులో అర్థించడం లేదు. ప్రార్థించడం లేదు. సంకల్పమే దేవత.**

**ద్యౌః శాన్తిరన్తరిక్షం శాన్తిః పృథివీ శాన్తి రాపః శాన్తిరోషధయః శాన్తిః వనస్పతయః శాంతిర్విశ్వే దేవాః శాన్తి ర్బ్రహ్మ శాన్తిః శాన్తిరేవ శాన్తిః సామా శాన్తిరేధ**

ద్యులోకం శాంతించాలి. భూలోకం శాంతించాలి. జలం శాంతించాలి. విశ్వేదేవతలు శాంతించాలి. బ్రహ్మ శాంతించాలి. సకలం శాంతించాలి. శాంతి కూడా శాంతించాలి. అలాంటి సమస్త శాంతి నన్ను వర్థిల్ల చేయునుగాత.

యుద్ధం లేనిది మాత్రమే శాంతి కాదు. సమస్తం శాంతించినపుడే శాంతి. శాంతికి సహితం శాన్తి కావాలంటున్నాడు. అన్ని శాంతంగా ఉన్నప్పుడే ప్రగతి సాధ్యం. ఇది శాంతికి సంపూర్ణ నిర్వచనం. ఇది మానవ జాతి ఆశ, ఆశయం, ఆకాంక్ష.

"తచ్చక్షుర్దేవ హితం పురస్తాచ్ఛు క్రముచ్చరత్ ।

పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతం శృణు

యామ శరదః శతమ్ ప్రబ్రవామ శరదః శతమదీనాః శ్యామ

శరదః శతమ్ భూయశ్చ శరదః శతాత్ ॥

దేవతలచే నిర్దేశింపబడిన వాడు సర్వనేత్రుడు సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు.

మేము నూరేళ్లు చూడాలి. నూరేళ్ళు జీవించాలి. నూరేళ్లు వినాలి, నూరేళ్లు చక్కగా మాట్లాడాలి. నూరేళ్లు దీనులం కాకుండాలి. మరో నూరేళ్లు జీవిస్తాం.

నూరేళ్లు బతకడం కాదు. అవయవాలన్నీ బాగుండి జీవించాలి. వేదం జీవిత రహస్యాలు కనిపెట్టింది. **"అదీనాః స్యామ శరదః శతమ్" దీనులు కాకుండా పరాధీనులు కాకుండా నూరేళ్లు జీవించాలి. అలాంటి జీవితమే అవుతే మరో నూరేళ్లు జీవించడం మానవజాతి ఆశయం. లక్ష్యం కోరిక.**

**"త్రయవైదేవాః వసవో, రుద్రా, ఆదిత్యాః " దేవతలు మూడు విధాలు 1. వసువులు 2. రుద్రులు, 3. ఆదిత్యులు అష్టావసవః + ఏకాదశ రుద్రాః + ద్వాదశాదిత్యాః వసువులు 8 మంది + రుద్రులు 11 మంది + ఆదిత్యులు 12 మంది 31 అవుతుంది.**

**దేవతావావ త్రియంస్త్రిణో అష్టావసవః + ఏకాదశి రుద్రాః + ద్వాదశాదిత్యాః + ద్యావా పృథివీ.** ఈవిధంగా పైన పేర్కొన్న 31టికి ద్యావా + పృథ్వులను చేర్చగా 33 అయినారు.

**మరొక పద్ధతిన 31 + ప్రజాపిత + వషట్కారం చేరగా 33 అయింది.**
"ప్రాణోవైవవషట్కారః" అని శతపథం.

దేవతల సంఖ్య 33గా నిర్ణయించడం జరిగింది. వేదంలోని 33 దేవతల వర్గీకరణ ఇది.

11మంది భూమి మీద వారు, వారు అగ్ని, జలము మున్నగువారు.

11 మంది అంతరిక్ష వాసులు నాకవాసులు, ఇంద్రాదులు

11 మంది ద్యులోక వాసులు సూర్య చంద్రాదులు.

వేదంలో ఈ సంఖ్య అంతటితో ఆగినట్లు కనిపించదు. రోలు, మండుకము, సోమము, ఋతువులు, దాతలు, రాజులు పెక్కురు దేవతలున్నారు.

"యస్య వాక్యం సఋషి! యతేనోచ్యతేసః దేవతా" అన్నాడు కాత్యాయనుడు ఋస్సిర్వానుక్రమణికలో చెప్పిన వాడు ఋషి. చెప్పబడినవాడు దేవత.

## దేవతలు ఎవరు?

మానవ సమాజానికి హితవు చేకూర్చిన వారిని దేవతలు అనవచ్చు. ప్రకృతి శక్తులయిన సూర్య, చంద్ర, అగ్ని మున్నగు వాటితోనే సకల చరాచర సృష్టి జీవిస్తున్నది. నశిస్తున్నది. కావున వీరు దేవతలు. 1. పృథివి, 2. ఆప్ జలము 3. తేజస్సు 4. వాయువు 5. ఆకాశం. ఇవి పంచభూతాల వంటి స్పష్ట నిర్వచనం లేదు. కాబట్టి దేవతల సంఖ్య స్పష్టంగా లేదు.

వృక్ష, లతా, గుల్మాదులు, మానవ జాతి మనుగడకు ఎంతగానో ఉపకరిస్తున్నాయి. ఒక చెట్టు కొందరు మనుష్యుల కన్నా ఉపకారం చేస్తున్నది. చెట్లన్నీ కొట్టిన తరువాత సైంటిస్టులు అనిపించుకునేవారికి ఇవ్వాళ వృక్ష ప్రాముఖ్యత అర్థం అయింది. వేదం వృక్షప్రాధాన్యతను గుర్తించింది. వృక్షలతా గుల్మాదులను దేవతల్లో చేర్చింది.

సూర్యచంద్రాదులు తమ కున్న శక్తుల వలనే దేవతలైనారు. ఇంద్రుడు, అశ్వినులు, ఋభువులు తమ కర్మల వలన దేవతలైనారు.

ఇంద్రుడు వృత్రుని వధించాడు. జలములను ప్రవహింపచేశాడు. అతడు శతక్రతువు. మూడు సత్కార్యములు చేసినవాడు. క్రతువు అంటే యజ్ఞం మాత్రమే కాదు. సత్కార్యం కానిది యజ్ఞం కాబోదు! ఇంద్రుడు సాధించిన విజయ పరంపరను గురించి ఋగ్వేదంలో చాలా చోట్ల చాలా సార్లు చెప్పబడింది.

భారత దేశం కర్మ భూమి. 'కర్మ' అనే పదాన్ని 'ఖర్మగా' వికృతం చేశారు. దానికి అరిష్టం అనే అనర్థం కల్పించారు. ఇప్పుడు అసలు అర్థం చెప్పినా నమ్మే స్థితిలో లేరు!

మేలిమి బంగారం కన్న నకిలీ బంగారం మెరుస్తుంది. కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా, అన్నాడు వేమన్న.

వాల్మీకి రామాయణంలో, అహల్య రాయి కాదు. లక్ష్మణ రేఖలు లేవు. శబరి ఎంగిలి పళ్లు పెట్టదు. కాని వాటినే జనం ఎక్కువ నమ్ముతున్నారు.

'కర్మ పదం కూడా అలాంటిదే. కర్మ అంటే పని, కార్మికుడు పనిచేసేవాడు. కర్మభూ◌ి, అంటే పని కృషి, నైపుణ్యానికి ◌ిలువ నిచ్చేదేశం అని అర్థం. ఇంద్రుడు, అశ్వినులు, ఋతువులు కేవలం తమ పరిశ్రమతోనే దేవతలైనారు. మానవుడు స్వశక్తితో దేవత కాగలడని నమ్మకం కలిగించింది కర్మ భూ◌ి- భారత భూ◌ి.

కర్మ, పని, పరిశ్రమ, నైపుణ్యం లాంటి వాటికి అంతటి గౌరవం, స్థాయి, అంతస్తు కలిగించింది భారతతాత్వికత!

మానవ ◌ికాసానికి తోడ్పడిన పనిముట్లు సహితం దేవతలైనాయి. రోజా, రోకలి, రుబ్బురాయి మానవ జీ◌ిత ◌ికాసానికి ఎంతగానో తోడ్పడినాయి. అందువల్లనే వాటిని శుభకార్యాల్లో పూజిస్తాం. ఒక చోట కప్పను దేవతను చేసి స్తుతించడం జరిగింది. ఆ సూక్తం అపహాస్యంగా తోస్తుంది. కాని కప్పలు అరుస్తే వాన వచ్చే సూచన! బొద్దింకల ◌ింత ప్రవర్తన రానున్న భూకంపాన్ని సూచిస్తుందని చైనాలో కనుగొన్నారు.

నేడు సైన్సు ఒక మూఢ నమ్మకం అయింది. పెరుగన్నం మంచిదనడానికి - తల్లిపాలను ప్రత్యామ్నాయం లేదనడానికీ, వేప, తులసి మున్నగు గుణాలు తెలుసుకోవడానికీ పరిశోధనలు చేయటం సైంటిస్టులవంతు అయింది. నాడు వాటిని కనుగొన్న శాస్త్రజ్ఞుల పరిశోధనలు ఎంతటి◌ి అయ్యుండునో తెలియలేకున్నారు!

ఈనాటి సైన్సు పారిశ్రా◌ిక సంపన్నుల చేతి కీలుబొమ్మ అయింది. వారు సైన్సును తమబొక్కసాలు నింపుకోవడానికి దోపిడి చేస్తున్నారు. ఇది ఖర్మను ◌ిించిన నల్లమందు మానవజాతిని అంతం చేయకమానదు. తస్మాత్ జాగ్రత- జాగృత!

అవతరించడం అంతరించడం ప్రకృతి ధర్మం. సృష్టిలో-పరాత్పరునకుతప్ప- శాశ్వతత్వం లేదు, అన్నీమారాలి, అన్నీ అంతరించాలి. కాలవ్యత్యాసం అంతే. సూర్య చంద్రాదులు అంతరించవలసినవారే!

ఋగ్వేదంలో ఒక మండలం సాంతం 'సోమము'నకే అంకితం అయింది. సోమము దేవత అయింది. దానికి అంతటి ప్రభావం ఉండిందేమో! ఇంద్రాదులకు అదే శక్తిని ప్రసాదించింది. అంతటి సోమము కాలగర్భములో కలిసిపోయింది!

అవతరించడం - అంతరించడం దేవతలకు వర్తిస్తుంది. వేద దేవతలు నేడులేరు. వారికి ఆరాధన లేదు. ఇవ్వాళ రామకృష్ణాద్యవతారాలు వారికి ఆలయాలూ ఆరాధనలు ఉన్నాయి.

వేదంలో అవతారాలు లేవు. ఒక్కచోట వామనుడు ప్రస్తావన వస్తుంది. అప్పటి వామనుడు అవతార పురుషుడు కాడు.

భారత తాత్వికత జడం కాదు. అది స్రవంతి. అవతారాల సిద్ధాంతానికి ఒక మహా ఇతిహాసం! ఎన్నని చెప్పడం?

నేను బుద్ధునికీ జైనతీర్థంకరులకూ, ఆది శక్తి, పరాశక్తులకు జానపద దేవతలకు ముత్యాలమ్మ గంగానమ్మ, మరిడమ్మ, పోశమ్మలకు ఆలయాలూ, ఆరాధనలు ఉన్నాయి.

ఈ మధ్య కొత్త దేవతలు అవతరిస్తున్నారు. సాయి, సత్యసాయి, రాఘవేంద్రస్వాఁ సంతోషిమాత లాంటివారు. కాలక్రమంలో మరికొందరు దేవతలు రావచ్చు. వ్రాతలో తప్ప సృష్టికి ఫుల్‌స్టాప్ లేదు. కామాలు మాత్రమే ఉంటాయి, దేవతలు పుట్టుకురావడం ప్రాకృతం.

నిరోధించడం ఁకృతం!

వేదంలో దేవతలు నిరాకారులుగానే స్తుతించబడినారు. ఆరాధించబడినారు. నాకు తెలిసినంతవరకు వేదాల్లో, ఉపనిషత్తుల్లో రామాయణ భారతాల్లో ఁగ్రహారాధన లేదు.

భారత తాత్వికత కాలప్రవాహం లాంటిది. మార్పులను చాలా సహజంగా తనలో ఇముడ్చుకుంటుంది. ఁగ్రహారాధనది ఒక అనంత గాథ, ఎన్నని చెప్పడం?

వేదయజ్ఞాలు, ఆరాధనలు, స్తుతులు అన్నీ కోరికలు తీర్చుకోవడానికి సుమారు వేదం నిండా కామ్య కర్మలే! ఋగ్వేదంలో ఒక చోట దీన్ని వర్తకం అన్నారు. హఁస్సులు అర్పించడం వరాలు కొనుక్కోవడానికే!

కామ్యకర్మలు యజమానులు స్వయంగా చేయరు. పురోహితులతో చేయిస్తారు.

కామ్యకర్మలు సాధారణంగా కాయికములు. మనసుతో అంత సంబంధం ఉండదు. అట్లని వేదానికి మనసు తెలియదని కాదు. వేదంలో మనసు ప్రస్తావన ఉంది.

కామ్యకర్మ ఁధానమే నేటికీ అన్ని మతాల ఆరాధనలో కనిపిస్తుంది. దేవతలు వేరు కావచ్చు.

హెచ్చుతగ్గుగా ప్రపంచమంతటా భారత ధర్మంలో వలెనే సాకార, నిరాకార, ఆరాధనలున్నాయి. క్రైస్తవంలో సాకార, నిరాకార ఆరాధన ఉంది, ఇస్లాంలో ఁగ్రహారాధన నిషేధించింది. మళ్లీ నిరాకార ఆరాధన భారతీయమే అవుతుంది!

ఈ దేవతలు - అవతారాలు, ప్రవక్తలుగా చెప్పుకున్నవారూ ఒక్కొక్కరు గాని అందరు కలిసిగాని, పరాత్పరుడు, ఈశ్వరుడు, ప్రభువు అల్లా కాజాలరు.

పరమాత్మ సత్యస్వరూపుడు, సత్య దర్శనానికి మానవ జాతి సాంతం - దేశకాల వ్యత్యాసం లేకుండా- నిరంతరం అన్వేషిస్తున్నది. ఇంతవరకు ఎంతటి మహర్షులకు, అవతార పురుషులకూ సత్యదర్శనమే కాలేదు. సృష్టి, స్థితి, లయకారకుడగు పరమాత్మ అగమ్య గోచరుడు. అనిర్వచనీయుడు. అతని ఆమె రూపగుణాలను దర్శించిన నాకు ఇంత వరకు లేదు. పరమాత్మ లభించడు. అందడు. ఆ పరాశక్తి పరాత్పరుడు మహోన్నతులు. అతడు నరునికి అందడు. మానవుని జ్ఞానము సర్వేశ్వరుని ఎరుగుటకు అపర్యాప్తం.

ఆ శక్తియే - ఆ పరాత్పరుడే సమస్తాన్ని సృష్టించాడు. ఆధారం లేకుండానే భూమిని, సూర్యచంద్రాది గ్రహనక్షత్రాదులను సృష్టించాడు. విశ్వం, భూమి, సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్రాదులకు, పరమేశ్వరుడే ఆధారభూతుడు.

మానవుడు, దుర్బలాతి దుర్బలుడు. వ్యాపారం కోసం ఎన్నో యంత్రతంత్రాలను కనుగొన్నాడు. ప్రకృతిని-మానవ ప్రకృతిని -వ్యక్తిగా తన ప్రకృతిని తెలియలేకపోయాడు! ఏం గెలుస్తాడు? ఇన్ని యుగాలకాలంలో ఏం గెలిచాడు? తనను గెలువలేదు. శ్రీ మహాభాగవత పురాణం ఈ సత్యం ప్రవచించింది.

'లోకములన్నియున్ గడియలోన జయించినవాడ ఇంద్రియానీకము జిత్తమున్ గెలువనేరవు"

మానవుని వద్ద ఒక మహత్తువున్నది. అది ఆలోచన-అన్వేషణ. అది ఆగదు. అది మానవుని నుంచి భగవంతుని కోసం అన్వేషిస్తూనే ఉన్నారు. అతనికి భగవంతుడు లభించలేదు. అంతటితో మనిషి ఇన్నకుండలేదు. భగవంతుని ప్రతిరూపాలను కల్పించాడు. సృష్టించాడు.

అలాంటి ఈశ్వరుని ప్రతిరూపాలే దేవతలు. మహాత్ములు, యోగులు, అవతారాలు, ప్రవక్తలు, వీరిలో ఎవరూ భగవంతుని సంపూర్ణ రూపాన్ని దర్శించలేదు. అందరూ భగవదంశను మాత్రము దర్శించగలిగారు. వీరిలో కొందరు భగవదంశ అయినాకావచ్చు. భగవంతుడు మాత్రము కాదు.

అయితే మహాత్ములు చూపిన దేవతాది ప్రతిరూపాలను ఆరాధించడం దోషం కాదు.

పరాత్పరుడు అందనివాడు. యోగులు ప్రవక్తలు వారికి అందిన వారిని మనకు చూపారు పరాత్పరుడు సత్యం, దేవాదులు విశ్వాసం.

సత్యం దర్శనం ఇవ్వనప్పుడు విశ్వాసమే మహత్తం

సముద్రం చూడనివానికి తటాకమే సముద్రం!

ప్రభుత్వం దేశమంతటా ఉంటుంది. గ్రామస్తునికి గ్రామాధికారియే ప్రభుత్వం. ఎవరికి కావలసిన శాఖ వానికి ప్రభుత్వం. ప్రభుత్వం సాంతం ఎవరికీ తెలియదు!

గ్రామస్తునికి గ్రామాధికారి వంటి వారే దేవతలు.

**యేప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః**

**తేపి మామేవ కౌంతేయ యజన్త్య విధిపూర్వకమ్**

అన్య దేవతలను శ్రద్ధగా పూజించేవారు. పరోక్షంగా నన్నే పూజిస్తున్నారు అన్నాడు గీతలో కృష్ణపరమాత్మ.

టాక్స్ కలెక్టరుకు ఇచ్చిన పన్ను ప్రభుత్వానికి చెందుతుందికదా!

**“ఏకం సద్విప్రాబహుధా వదంతి అంటుంది వేదం. వేదం సత్యం కాదు. సత్యాన్వేషణమే దర్శించని సత్యాన్ని పండితులు బహుధా ఎలా చెప్పగలరు?**

**“ఏకం సద్విప్రా బహుధా వదన్తి’** అంటే సూర్య, చంద్ర, అగ్ని, వాయువులు భగవంతులుకారు వారు భగవంతుని అంశామాత్రులే అని.

పరాత్పరుడు కర్త; సూర్యచంద్రాదులు అతని సృష్టి మాత్రమే. వారు అశాశ్వతులు వారికి అంతం ఉంది. భగవానుడు శాశ్వతుడు. అనంతుడు.

ఋగ్వేదం 10వ మండలం 7వ అధ్యాయం 121 సూక్తం 1-10 మంత్రాల్లో పరాత్పరుని గుణగణాలు వర్ణిస్తూ **“కస్మై దేవాయ హ◌ంషా ◌ధేమ?”** అంటుంది. “ఏ దేవతకు హ◌స్సులర్పింతుము? అనేది ఒక అర్థం అవుతే ‘అట్టి దేవతకు హ◌స్సులు అర్పింతుము’ అనేది రెండో అర్థం అవుతుంది.

**మానో హంసీజ్జనితాయః పృథివ్యాయోవాదివ సత్య ధర్మాజజాన ।**

**యశ్యాపశ్చిన్ద్రాః బ్రహతీర్జిజానకస్మై దేవాయ హ◌ంషా ◌ధేమ ॥**

ఎవరు భూ◌ని సృష్టించాడో, ఎవని బలము సత్యమగునో ఎవడు ఆకసమును, ఆనంద వర్ధకమగు జలరాశిని సృష్టించాడో అట్టి ఏ దేవతకు హ◌స్సులు అర్పింతుము. అట్టి దేవతకు హ◌స్సులు అర్పింతుము?

అతడెవరో తెలియలేదు. ఎవడు? ప్రశ్న మాత్రమే ◌గిలింది.

“ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండి లీనమై

యెవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూల కారణం

బెవ్వడనాదిమధ్యలయుడెవ్వడు సర్వము దానెయైన వా

డెవ్వడు వానినాత్మభవునీశ్వరునేశరణంబు వేడెదన్”

అన్నాడు శ్రీమదాంధ్రమహాభాగవతంలో పోతనామాత్యుడు.

ఒక ◌షయం స్పష్టం, ఒక్కొక్క మతానికీ, వర్గానికీ, సిద్ధాంతానికి ఒక్కొక్క పరమాత్మ పరాత్పరుడు, ఈశ్వరుడు ఉండరు. ఉన్నది ఒకే సర్వేశ్వరుడు. సృష్టి, స్థితి, లయకర్త.

భగవానుడు ఒక్కడే. ప్రవక్తలు పెక్కురు.

భూగోళం ఒక్కటే. దేశాలు అనేకం. ఆకాశం ఒక్కటే, గ్రహ నక్షత్రాదులు అనేకం. సముద్రం ఒక్కటే - నదులు అనేకం.

## "ఏకోవైబ్రహ్మ నాద్వితీయం"

అయిన ఇందరు దేవతలేల? అని వెక్కిరించవద్దు. "లోకోభిన్నరుచిః " ఎవని రుచిని బట్టి వాడు. ఒకే ప్రవక్తను నమ్మమనడం, పూజించమనడం, నియంతృత్వం, ప్రకృతి ిరుద్ధం కూడా. చరిత్రలో కలకాలం నిలవలేదు.

ఒక గ్రామానికి, ఒక స్థలానికి ఒకే మార్గం ఉండటం బూటకం. లక్ష్యం చేరుకోవడానికి అనేక మార్గాలుంటాయి. ఒకని అవసరాన్ని, అవకాశాన్ని బట్టి మార్గం ఎన్నుకుంటారు.

ఒకేదారి పట్టినవానికి ప్రమాదం తప్పదు. లక్ష్యం చేరడం. మార్గమే లక్ష్యం అవుతుంది.

భారతీయులు బహుదేవతారాధకులు. అట్లని సిగ్గు పడనక్కరలేదు. వారి లక్ష్యం పరాత్పరుడు, మార్గాలు దేవతలు.

వేదంలోని దేవతలు ప్రత్యక్షం కారు. మాయం కారు. తపస్సుకు మెచ్చి వరాలివ్వరు. వేదం వాస్తవం. అభూత కల్పనలు అరుదు.

వర్ణనలు, ఉపమానాలు, అతిసాధారణాలు. గ్రామ సంబంధులు వాస్తవాలు. అతి సుందరములు.

## వేదం-అర్థం-వ్యాఖ్య

కౌత్సఋషి వేదానికి అర్థం ఉండదనీ, వేదార్థం తెలిసికోరాదని సిద్ధాంతీకరించారు. ఇందుకు ఏదో బలమైన కారణం ఉండాలి. ఋషి స్వప్రయోజనం మాత్రం కాకపోవచ్చు.

వేదం చదువరాదని నిషేధించాలని సర్వే సర్వత్ర కొందరిలో ఆగ్రహం ఉంది. నాలుగు వేదాల్లోను ఎక్కడా వేదాధ్యయనాన్ని గురించి ిధి నిషేధాలున్నట్లు నాకు కనిపించలేదు. మహాభాగవతం, మనుస్మృతిలో ఈ నిషేధాలున్నమాట వాస్తవం. వ్యాసమహర్షియే వేదాల సంహితలు చేశాడు. ఇక్కడ నిషేదం ిధించనివాడు భాగవతంలో ఎందుకు నిషేధిస్తాడు? మహా భారతంలో కౌశికుని కథ ఉంది. అందులో వ్యాసమహర్షి కటికవానితో తపస్సంపన్నుడైన కౌశికునికి ఉపదేశం చేయిస్తాడు. మరొక చోట కుక్కమాంసం ిషయంలో చండాలుడు ిశ్వాిత్రునికి సహకరిస్తాడు. మహర్షులు మహాత్ములు, కులం, మతం లాంటి కొంచెం వాటికి లొంగరు. వారికి 'ఆత్మవత్సర్వ భూతాని' - తమ వంటివే సమస్త ప్రాణులు.

భారత, భాగవత, మనుస్మృత్యాదుల్లో వేద పఠనాన్ని గురించిన నిషేధాల ప్రక్షిప్తం అని నా అభిప్రాయం. వేదకర్మలే ఉపాధిగా జీించే కొందరు స్వప్రయోజనాపరులు చేర్చి ఉండవచ్చు.

అచ్చుయంత్రం వచ్చింది. వేదం సకల జనులకూ అందుబాటులోకి వచ్చింది. అన్య మతస్తులూ వేదాన్ని అధ్యయనం చేస్తున్నారు. అంతకు ముందు ◌ధి నిషేధాలు వాస్తవంగా ఉన్నా అ◌ ఆ◌రి అయిపోయాయి. ప్రస్తుతం వేదాధ్యయనానికి శ్రద్ధ మాత్రమే అవసరం!

వేదం సూర్యుని వంటిది. సూర్యకాంతి వంటిది. వేదం, కుల, మత, ప్రాంత, దేశాలకు అతీతం అయింది. అది సకల మానవాళికి చెందింది. వెలుగునూ, అగ్గిని మూటకట్టి దాయగల మొనగాడు లేడు. కులమతాలకు అతీతంగా అందరికీ వేదం అందాలనేది నా సంకల్పం పరాత్పరుడు నా సంకల్పాన్ని ఆశీర్వదించాడు. లేకుంటే నాలుగు వేదాల అనువాదం నావంటి సామాన్యునికి సాధ్యం అయ్యేదికాదు.

మేం వేద కవాటాలు తెరిచాం. శాంతి కవాటాలు తెరిచాం. వెలుగును వేదాన్ని ప్రజాయత్తం చేశాం. కుల, మత, ◌వక్ష లేకుండా వేదాన్ని సకల జనులూ తాకండి. నమస్కరించండి. అర్చించండి. పూజించండి. అధ్యయనం చేయండి. ఆలోచించండి. వ్యాఖ్యానించండి.

నాకు పరమానందంగా ఉంది. నా జీ◌తం ధన్యం అయింది. దశ పూర్వేషాం దశపరేషాం మా వంతూ ప◌త్రం అయింది. వేదం అందరికీ అందించగలిగాను. పరాత్పరుడు నాతో ఆ పనిచేయించాడు.

వేదం కన్న ప్రాచీన గ్రంథ ప్రపంచంలేదు. వేదాన్ని ఇంట్లో పెట్టుకొండి చాలు. ఉంటే చదువుతారు. అది ◌ు జీ◌తాల్లో వెలుగులు నింపుతుంది. **వేదం నుంచి కర్మ ఆశించవద్దు. జ్ఞానం ఆశించాలి.**

వేదం ◌షయంలో పాశ్చాత్యులు అనేక కువాఖ్యలు చేశారు. వాటినే మన మేధావులు ప్రమాణంగా భా◌స్తున్నారు. ఇది సాంస్కృతిక బానిసత్వం. మేధావులను ఈ బానిసత్వం నుంచి బయటపడేయడానికి ఇంతవరకు సరియైన ప్రయత్నం జరుగలేదు. ఇది అందుకు పర్యాప్తం కాదు. ఒక్క ◌షయం మాత్రం మన◌ చేస్తాను. **వేదాన్ని గౌతమ బుద్ధుని నుంచి రామానుజుని వరకు నిరసించారనే ఒక మూఢ నమ్మకం పాశ్చాత్యులు కలిగించారు.**

**వాస్తవం ఏమంటే బుద్ధుడు, ఆదిశంకరుడూ రామానుజుడు వేదాలను నిరసించలేదు. వారు నిరసించింది వేదం పేర జరిగే కర్మలను. స్వప్రయోజనపరులు వేదం అంతే యజ్ఞ, యాగాది క్రతువులు మాత్రమే అనే నమ్మకం కలిగించారు. ప్రజలను చీకట్లో ముంచారు. తమ పబ్బం గడుపుకున్నారు. ఇది ఈనాటికి జరుగుతున్నది. ధనార్జన కోసం ఈనాడు చేస్తున్న అన్ని యజ్ఞ యాగాది క్రతువులకు వేదంలో ప్రమాణం లేదు. ఈ కేవల ధనార్జననే అందరు ఆచార్యులూ నిరసించారు. మేము నిరసిస్తున్నాం, అయితే సమాన్యుల స్వభావం స్వప్రయోజనపరులకు నమ్మకమే? వాస్తవాన్ని ◌శ్వసించేవారు అరుదు!!!**

క్రీస్తుకు వేయి సంవత్సరాల పూర్వపు సంవత్సరాల పూర్వపు వాడు యాస్కుడు. అతడు వేదానికి అర్థం తెలుసుకోవాలని వాదించాడు. వేదార్థ భాష్యమను 'నిరుక్తం' రచించాడు.

'దైవం స్థాణోపరపరాధః యదేనం అంధో న పశ్యతి పురుషాపరాధః న భవతి'' ఒక పదార్థం ఉంది. దాన్ని అంధుడు చూడడు. అపరాధం పదార్థానిది కాదు. అంధునిది అవుతుంది.

వేదానికి అర్థం ఉంది. దాన్ని తెలుసుకోనివాడు అంధుడు అవుతున్నాడు. అంధునికి వేదకర్మ కనిపిస్తుంది. వేదార్థం కనిపించదు. వేదార్థం తెలియపరచే యాస్కుని ప్రయత్నం మూడు వేల సంవత్సరాల క్రితమే మొదలయింది!

''స్థాణురయం భారవాహః కిణభూత్ అధీత్య వేదాన్ నంజానాతియోంర్థం ।

యో ర్థజ్ఞఇత్ సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానంధూత పాప్మా ॥

''ఒకడు బరువు మోస్తాడు. మోసిందేంటో తెలియదు. అలాంటివాడే అర్థం తెలియకుండా వేదాన్ని వహించేవాడు.

వేదం చదిం అర్థం చేసుకున్నవాడికే సకల శుభాలు కలుగుతాయి. జ్ఞాన తేజస్సు పాపాల్ను కడిగేస్తుంది. అతనికి స్వర్గం ప్రాప్తిస్తుంది'' అన్నాడు యాస్కఋషి.

తదుపరి 1. స్కందస్వాం 2. ఉద్గీత 3. వేంకటస్వాం వేదానికి వ్యాఖ్యానం రచించారు. స్కందస్వాం 'వల్లభి' నివాసి. 'వల్లభి' గ్రామం ఖమ్మం జిల్లాలో ఉంది. పేరును బట్టి వేంకట మాధవులు తెలుగువాడేననిపిస్తున్నది. వారు ఆంధ్రులైనందుకు ఆంధ్రజాతిగా గర్విస్తామా?

ఆంధ్రులు వేద వ్యాఖ్యకు అపారం అయిన సేవలు చేశారు.

వేదాలకు అధికారపూర్వక వ్యాఖ్య చేసిన ఆంధ్రుడు సాయణాచార్యులు. ప్రాక్పశ్చిమ ంద్వాంసులు ఎవరైనా సాయణుని వ్యాఖ్య ఆధారంగానే వేదాన్ని అర్థం చేసుకుంటున్నారు.

సాయణాచార్యుడు క్రీ.శ. 1315లో జన్మించాడు. 72 సంవత్సరాలు జీంచాడు. 1387లో పరమపదించాడు.

ఆంధ్రుడు ఆచార్య సాయణుడు రాజనీతి ంశారుదుడు. అతడు కంపరాజుకు, బుక్కరాయహరిహర రాయలకు మంత్రిగా వ్యవహరించాడు.

దక్కన్ - దక్షిణా పథంలో అన్యమతస్తుల రాజ్యాలు స్థిరపడ్డాయి. ంస్తరిస్తున్నాయి అలాంటప్పుడు ంద్యారణ్యస్వాం హరిహర బుక్కరాయలచే ంజయనగర సామ్రాజ్యం స్థాపింప చేశాడు. మహారాష్ట్రులకు శివాజీ వంటివారు ఆంధ్రులకు హరిహర, బుక్కరాయలు. మహారాష్ట్రులు చాటుకుంటారు! ఆంధ్రుల నోరు మూసుకుంటారు!

బుక్కరాయలు వేద ధర్మాన్ని ఉద్ధరించదలిచాడు. సాయణాచార్యులను వేదాలకు వ్యాఖ్య చేయవలసిందని అర్థించాడు.

“ఇతి శ్రీమద్‌రాజాధిరాజ పరమేశ్వర వైదిక మార్గ ప్రవర్తక ీర బుక్క భూపాల సామ్రాజ్య ధురంధరేణ సాయణాచార్యేణ ిరచితే మాధీయ వేదార్థ ప్రకాశ ఋక్ సంహితా భాష్యే ప్రథమాష్టకేఙ్టమాధ్యాయః సమాప్తః” అని చెప్పుకున్నాడు సాయణాచార్యులు ఋగ్వేదపు ప్రథమాష్టక సమాప్తి గద్యలో.

సాయణాచార్యుడు ఆంధ్ర బ్రాహ్మణుడు. అతనిది భరద్వాజ గోత్రం. బోధాయన సూత్రం మాయన, శ్రీమతి అతని తలిదండ్రులు.

సాయణునికి ఒక రాజు రాజకీయ, ఆర్థిక బలం లభించింది. అతడు అనేకమంది పండిత ప్రకాండులను కూర్చుకున్నాడు. వేద వ్యాఖ్య రచించాడు.

నేటి స్థితి రాజకీయాలకు అర్థదాహం, అధికారతపన తప్ప అక్షరజ్ఞానం శూన్యం. భర్తృహరి కంత

బోద్ధారోమత్సరగ్రస్తాః ప్రభవః స్మయ దూషితాః ।

అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితమ్ ॥

పండితులు ఈర్ష్యాళువులు. ప్రభువులు గర్వాంధులు. ఇతురులు అజ్ఞానవంతులు. కావున నా నీతులు నాలోనే తరిగిపోయాయి.

సాయణుని వ్యాఖ్య మధ్యలోనే బుక్కరాయలు అస్తింంచాడు. రెండవ హరిహర రాయలు తండ్రివలెనే సాయణాచార్యుల వేదవాక్య బృహత్కార్యానికి సకలంధాల తోడ్పడ్డాడు. రెండవ హరిహరుని కాలంలోనే ఆచార్య సాయణుడు అథర్వ వేద భాష్యం పూర్తి చేశాడు.

“అభూద్ హరిహరో రాజా క్షీరాబ్ధేరివ చంద్రమాః

తన్మూలభూతం ఆలోచ్య వేదమాధర్వీణాంిదమ్

ఆదిశత్ సాయణాచార్యం తదర్థస్య ప్రకాశనే”

అన్నాడు సాయణుడు అథర్వ వేద వ్యాఖ్యలో.

సాయణాచార్యులు వేద సంహితలనే కాక మరి కొన్నింటికి వ్యాఖ్యలు రచించాడు. అని

1. తైత్తిరీయ బ్రాహ్మణం 2. తెత్తిరీయ అరణ్యకం 3. ఐతరేయ బ్రాహ్మణం 4. ఐతరేయ అరణ్యకం 5. శతపథ బ్రాహ్మణం 6. తాండ్య బ్రాహ్మణం 7. సద్వంశ బ్రాహ్మణం 8. సమంధాన బ్రాహ్మణం 9. ఆర్షేయ బ్రాహ్మణం 10. దేవతాధ్యాయ బ్రాహ్మణం 11. ఉపనిషద్ బ్రాహ్మణం 12. సంహితోపనిషద్ బ్రాహ్మణం 13. వంశ బ్రాహ్మణం.

ఆధునిక వ్యాఖ్యాతలు

**వేదాన్ని అధ్యయనం చేసి వాళ్ల పద్ధతిలో వ్యాఖ్యానించిన పాశ్చాత్య విద్వాంసులు.**

**1. మాక్సుమ్మల్లర్ 2. కీత్ 3. గ్రిఫిత్ 4. పిశల్ 5. గ్లేడ్నర్, 6. త్సరర్ 7. వేవర్ 8.ఓల్డన్ బర్గ్ 9. బ్లూంఫీల్డ్ మున్నగు వారు. వారంత సాయణుని వ్యాఖ్య ఆధారంగానే వేదాన్ని అర్థం చేసుకున్నారు. ఆ వ్యాఖ్య తమకు అనుకూలం కానపుడు సాయణుని దూషించారు. అన్నీ తమకు అనుగుణంగా ఉండాలనేది తెల్లదొంగల దురహంకారం!**

ఆధునిక భారతీయ వ్యాఖ్యాతల్లో మహర్షి దయానందుడు అగ్రగణ్యుడు. మహర్షివేదాన్ని వ్యాఖ్యానించి ున్నకుండలేదు. వేదాన్ని గురించి అంతకు ముందు ఎరుగనంతటి ప్రచారం చేశాడు. దయానందుడు గొప్ప సంఘ సంస్క ర్త. వర్ణ వ్యత్యాసం లేకుండా సకల జనులకూ వేదం ఉపదేశించారు. ఆర్య సమజం స్థాపించారు. ఆసేతు హిమనగరం అనేకులను బ్రాహ్మణులను చేశారు.

**దయానందుడు, తన జీవితకాలంలో అనుకున్నట్లే ఆర్యసమాజం ఒక కులం, ఒక మతంగా, ఒక మూర్ఖత్వంగా ఒక దురహంకారంగా మారిపోయింది. నేటి ఆర్య సమాజీయులకు వేదం ప్రమాణం కాదు. దయానందుడు ప్రమాణం!**

మహర్షి దయానందుని సిద్ధాంతం మీద ఇస్లాం, క్రైస్తవ ప్రభావం ఉందని నా అభిప్రాయం **అతడు ముస్లిములకు తలదన్ని విగ్రహారాధనను నిరసించాడు. వేదం అతనికి ప్రమాణం. వేదంలో విగ్రహారాధనకు ప్రాధాన్యత లేదు. మరి నిరసన లేల?**

ఇస్లాం, క్రైస్తవం వలె భారతీయులకు ఒకే గ్రంథం వేదం. ఒకే ఈశ్వరుడు ఉండాలని ప్రయత్నించారు దయానందులు. భారత ధర్మం అచ్చం గ్రంథం మీద ఆధారపడిలేదు. సదాచారాలుగా సంప్రదాయాలు దీనికి మూలాధారం. భిన్నత్వంలో ఏకత్వం భారతీయ సంప్రదాయం. ఆది శంకురుడు సహితం అద్వైతం ద్వారా ఏకేశ్వర ప్రతిపాదన చేసి సరిదిద్దుకున్నారు.

దయానందుడు వేదాన్ని కర్మమార్గంగా అంగీకరించారు. వేదం జ్ఞానమార్గమనీ, ఆధ్యాత్మిక ఔన్నత్యమనీ వాదిస్తారు.

**వేదాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు, పురాణాలు, కావ్యాలూ, ఇతిహాసాలూ, విభిన్న**

**తాత్వికతలనూ, సిద్ధాంతాలనూ ప్రతిపాదిస్తాయి. అయినా సహజీవనం చేస్తాయి. భారతీయుడు**

**ఇవన్నీ నాకేనని గర్విస్తాడు. సిగ్గుపడడు. నా సంపదలు ఏకం కాదు. అనేకం!!**

ఒక్కటి భారత సిద్ధాంతం కాదు. పెక్కులు మనతత్వం- ప్రకృతి తత్వం.

భిన్నత్వంలో ఏకత్వం మన జీవన విధానం.

వేదాలకు భిన్నములైన జైన, భౌద్ధ, చార్వాకాలతో మనం సహజీవనం చేశాం. ఇస్లాం క్రైస్తవంతో సహజీవనం చేస్తున్నాం.

అన్యమత ప్రవక్తలు, తామే భగవంతులమని ప్రకటించుకున్నారు. గతాన్ని ధ్వంసం చేశారు. తాము చెప్పిందే గతం అన్నారు. తమ తరువాత మహా ప్రవక్త ఉండరాదని నిర్కంకుశంగా శాసించారు.

భారత ధర్మం, సిద్ధాంతం, తాత్వికత గతాన్ని ధ్వంసం చేయదు. భవిష్యత్తును శాసించదు. సకల ఆలోచనా విధానాలతో నాటి - నేటి కాదు. గంగా ప్రవాహం వలె నిరంతరం పవిత్రంగా ప్రవహిస్తుంటుంది.

**భారతీయులంగా మనం బహు దేవతారాధకులం. ఇది నా మతం. నా జాతి స్వభావం నా నాగరికత. నా సంస్కృతి. వేరొకరిని సంతోషపెట్టడానికి నేను మార్చుకోను.**

నేను బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో పాటు పోచమ్మ, మరిడమ్మ, సంతోషిలను కూడా ఆరాధిస్తాను.

వేదాన్ని వ్యాఖ్యానించిన మరొకరు అరవిందులు, వారు పాశ్చాత్యుల కువ్యాఖ్యానాలకు భారత ప్రమాణాలతో సమాధానం చెప్పడానికి ప్రయత్నించారు. వేదానికి అంతరార్థాలు వెలికి తీసే ప్రయత్నం చేశారు.

## శుక్ల యజుర్వేద సంహిత

ఈ వేదపు పూర్తి పేరు శ్రీమద్వాజసనేయి మాధ్యందిన శుక్ల యజుర్వేద సంహిత. దీనికి ఈ పేరు రావడాన్ని గురించి మహీధర భాష్యం వివరించింది-

"తత్రాదౌ బ్రహ్మ పరంపరయా ప్రాప్తం వేదం వేదవ్యాసో మన్దమతీన్మనుష్యాన్విచింత్య తత్కృపయా చతుర్థావ్యస్య ఋగ్యజుః సామాధర్వాభ్యాం శ్చతురోవేదాన్ పైల, వైశంపాయన, జైమిని, సుమన్తుభ్యః క్రమాదుపదిదేశ తేచ స్వశిష్యేభ్యః । ఏవం పరంపరా సహస్ర శాఖో వేదో జాతః । తత్ర వ్యాస శిష్యో వైశంపాయనో యాజ్ఞ్య వల్క్యాధిభ్యః స్వశిష్యేభ్యో యజుర్వేద మధ్యాపయత్ । తత్రదైవాత్కేనాపి హేతునాకృద్ధో వైశంపాయానో యాజ్ఞ్యవల్క్యం ప్రత్యువాచ మదధీతం త్యజేతి । సంయోగసామార్థ్యామ్మా ర్తాం విద్యాం విధాయోద్వవామ । వాంతాని యజూంషి గృహ్ణోతీతి గురూక్తా అన్యే వైశంపాయన శిష్యాస్తిత్తరీయో భూత్వా యజూంష్యభక్షయన్ । తాని యజూంషి బుద్ధిమాలిన్యాత్కృష్ణాని జాతాని । తతో దుఃఖితో యాజ్ఞ్యవల్క్యః సూర్యమారాధ్య అన్యాని శుక్లాని యజూంషి ప్రాప్తవాన్ । తానిచ జాబాలి, బౌధేయ, కాణ్వ, మాధ్యందినాదిభ్యః పంచదశ శిష్యేభ్యః పాఠితవాన్ ।..... వాజసనిస్తదపత్యం వాజనసేయః । తత్రమాధ్యందినేన మహర్షిణా లబ్ధో యజుర్వేద శాఖా విశేషో మాధ్యందినః ।

తొలుత వేదం బ్రహ్మ నుంచి పరంపరగా లభించింది. వ్యాసమహర్షి మనుష్యుల మందమతిత్వాన్ని గురించి ఆలోచించాడు. వేదాన్ని నాలుగుగ ిభజించాడు. అ ఋగ్యజుస్సామాథర్వణ వేదాలు. ఆ వేదాలను వేద వ్యాసుడు క్రమంగా పైల, వైశంపాయణ, జైిని, సుమంతులకు ఉపదేశించాడు. వారు వారి శిష్యులకు ఉపదేశించారు. ఆ ిధంగా పరంపరగా వేదం సహస్రశాఖలు అయింది. తదుపరి వ్యాస శిష్యుడగు వైశంపాయనుడు యాజ్ఞ్యవల్క్యాదులగు తన శిష్యులకు యజుర్వేదం ఉపదేశించాడు. ఒకప్పుడు వైశంపాయనునికి దైికంగా - ఏదో కారణంగా- కోపం వచ్చింది. అప్పుడు యాజ్ఞ్యవల్క్యుని తన శిష్యత్వం నుంచి బహిష్కరించాడు. యాజ్ఞ్యవల్క్యుడు యోగబలం కలవాడు. అతడు తను నేర్చిన ిద్యను వాంతి చేశాడు - కక్కాడు. గురువు ఆజ్ఞాపించాడు. వైశంపాయనుని ఇతర శిష్యులు తిత్తిరి పక్షులు అయినారు. యాజ్ఞ్యవల్క్యుడు వాంతి చేసిన ిద్యను భుజించారు. ఆ యజుస్సులో బుద్ధిమలినములు. అందువలన కృష్ణ యుజస్సులు అయిన. అప్పుడు యాజ్ఞ్యవల్క్యుడు బాధ పడ్డాడు. అతడు సూర్యుని ఆరాధించాడు. సూర్యుని నుండి శుక్ల యజుస్సులను అందుకున్నాడు. ఆ యజుస్సులను జాబాలి, బౌధేయ, కాణ్వ, మాధ్యందినాది పదిహేను మంది శిష్యులకు బోధించాడు.

వాజసని పుత్రుడు యాజ్ఞ్యవల్క్యుడు. కావున వాజసనేయి అయింది. మాధ్యందిన మహర్షికి లభించినందున మాధ్యందిన అయింది.

ఆిధంగా ఈ వేదం శ్రీమద్వాజసనేయి మాధ్యందిన శుక్ల యజుర్వేద సంహిత అయింది.

### యజుర్వేదం-యజ్ఞయాగాదులు

దేవతలను స్తుతించేది ఋగ్వేదం. యజ్ఞ, యాగాది క్రతువులు -వాటి ిధి ిధానాన్ని నిర్దేశించి యజుర్వేదం. ఋగ్వేదంలోని మంత్రాలను 'ఋక్కులు' అంటారు. యజుర్వేదంలోని మంత్రాలను 'యజుస్సులు' అంటారు.

యజ్ఞం ఒక బృహత్కార్యం అవుతుంది. సత్కార్యం అవుతుంది. సమాజ కళ్యాణ కార్యం అవుతుంది.

యజ్ఞం ఒక బృహత్కార్యం. ఒక్కనికి సాధ్యం కానిది. పెక్కురు అవసరం అయింది. యజ్ఞం కోసం కొందరు జనులు ఏకం కావాలి. యజ్ఞం ఐకమత్యం నేర్పుతుంది. నలుగురు కలిసి చేసిన బృహత్కార్యం యజ్ఞం అవుతుంది.

యజ్ఞం ఒక బృహత్కార్యం. అందుకు ఎవరో పదిమంది కలుస్తే సరిపోదు. నిపుణులు

ప్రత్యేక ిద్యలో నైపుణ్యం కలవారు-కలవాలి. కలిసి పనిచేయాలి. అట్లాచేసింది యజ్ఞం అవుతుంది.

యజ్ఞం అనగానే అమాంతంగా స్ఫురించేది యజ్ఞం కుండం. యజ్ఞవాటిక మున్నగున.

యజ్ఞ కుండానికి గుంత త్రవ్వే వారు కావాలి. కుండ నిర్మాణానికి ఇటుకలు కావాలి. ఇటుకలు చేసేవారు, ఇటుకలు తెచ్చే బండి, బండికి కట్టిన పశువులు, బండి తోలే వాడు కావాలి. ఇటుకతో కుండ నిర్మించే వాస్తు శిల్పి కావాలి. ఇప్పటికి కుండం మాత్రమే సిద్ధం అయింది.

యజ్ఞానికి సమిధలు కావాలి. సమిధలు అంటే చెక్క పేళ్లు, అన్ని చెక్క పేళ్లు యజ్ఞానికి తగవు. యజ్ఞానికి తగిన సమిధలు నిర్ణయించే శాస్త్రజ్ఞులు రావాలి. ఎంచేతంటే అన్నికర్రల పొగ ఆరోగ్యవంతం కాదు. యజ్ఞం అనారోగ్యకారకం కారాదు. యజ్ఞం సామాజిక కార్యం. ఇది సమాజానికి ఉపకరించేది కావాలి. వేదం మోదుగు, రావి మున్నగు కొన్ని సమిధులు మాత్రమే యజ్ఞానికి నిర్ధరించింది. వాటి ధూమం వ్యక్తికి, సమూహానికీ, గ్రామానికీ ఆరోగ్యకరం, హితకరం అవుతుంది.

సమిధలు తేవడానికి అడవికి వెళ్లేవారు కావాలి. వారు చెట్లను గుర్తించేవారు కావాలి. వలసినంతే కొట్టాలి. కొట్టేటప్పుడు చెట్టును ప్రార్థించాలి. ఆ మంత్రాలు వేదంలో ఉన్నాయి. వృక్ష మహిమను వేదం గుర్తించింది. వృధాగా కొట్టరాదని శాసించింది.

**ఆధునికం - సైంటిఫిక్ - అని చెప్పుకుంటున్న నేటి నాగరకత ముందు అడవులను క్షవరం చేసింది. ఇప్పుడు చెట్లు పెంచమని ప్రజలను కోరుతున్నది. ఏనాడో వేదం గుర్తించిన వృక్ష, అరణ్య మహిమను ఇంకా రక్కసి నాగరకత గుర్తించలేదు. వట్టి కొంగ జపం చేస్తున్నది. వాతావరణాన్ని ధ్వంసం చేస్తున్నది. ప్రజలకు నీతులు బోధిస్తున్నది. అడవులను పచ్చి స్వార్థపరులు కొట్టారు. సంపదను కొల్లగొట్టారు. తిరిగి అడవులు నాటమని ప్రజలకు బోధిస్తున్నారు. ఏనాడో వేదం చెప్పింది సహితం ఈ సైంటిస్టులు అనిపించుకునే వారు గుర్తించలేకున్నారు! వీరు వినాశనానికి పనికి వస్తారు. వ్యాపారానికి పనికి వస్తారు. నిర్మాణానికి పనికిరారు!**

అలాకొట్టిన కట్టెనుయజ్ఞ వాటికకుచేర్చాలి. అందుకుబండి కావాలి. బండిచేసే దారు శిల్పి-వడ్రంగికావాలి. వాటికి కట్టేపశువులు, వాటిపోషణ, శిక్షణ నిచ్చేవారుకావాలి.

యజ్ఞకుండం,సమిధలకు ఇంత పరిశ్రమఅవసరం అయింది.

యజ్ఞకుండంలోఅగ్ని రగల్చాలి. ఆహుతులకునేయి కావాలి. నేయి అంటే-గోవు,వాటి పోషణ, పాలు,పెరుగు, పెరుగు చిలకడం,వెన్నతీయడం,వెన్న కరిగించడం-అప్పుడుకాని ఘృతం రాదు.

యజ్ఞంచేయడానికి హోతలుకావాలి. హోతలనుసిద్ధం చేయడానికిగురుకులాలు, వాటినిర్వహణ జరగాలి.వేదం తెలిసినగురువులు కావాలి. అసక్తిగానేర్చుకునే శిష్యులుకావాలి.

ఇదంతాఅగ్నికుండం వరకే. యజ్ఞానికిఇంకా అనేకం కావాలి. యజ్ఞంజరిగే చోట విద్వత్సభలుజరుగుతాయి. చర్చలు,గోష్ఠులు, మీమాంసలు,తర్కాలు పర్యవసానంగాశాస్త్రాలు! నేటిసెమినార్లు, కమిటీలుయజ్ఞసభలనుండినేర్చినవే!

ఇలాచెపుతూ పోతేఒక గ్రంథం అవుతుంది.కాని యజ్ఞం మానవజాతికి- భారతీయులకుమాత్రం కాదు - అనేకంనేర్పింది.

1. మానవుడువ్య క్తిగా జీ ంపలేడు.అతడు బతకడానికిసంఘం, సమాజం కావాలి.

2. మనిషిబతకాలంటేకలిసి ఉండాలి. అంతేకాదు,కలిసి పనిచేయాలి.

3. ఏఒక్కడూ అన్ని పనులూచేయలేడు.శ్రమ భజనజరగాలి.

4. సమాజానికి ద్య, నైపుణ్యం అవసరం.బోధన ఉత్పత్తిసాగాలి.

5. ప్రకృతిసంపదలను పరిరక్షించుకోవాలి.అవసరం అయినంతే వాడుకోవాలి.

6. వ్య క్తిక్షేమం మాత్రం కాదు,సమాజ క్షేమం, సంఘ సంక్షేమం, శ్వశ్రేయస్సు, మానవకళ్యాణం కొరకు పనిచేయాలి.

మనంతినే ఒక మెతుకు,త్రాగే నీటి బొట్టుకోసం ఎన్నో యజ్ఞాలుజరిగాయి. జరుగుతున్నాయి.జరుగుతుంటాయి. వేదంఇంత మంది శ్రమకుకర్త అయింది. గుర్తించింది.అందుకే అన్నం పరబ్రహ్మస్వరూపం అన్నది. ఎందుకంటేదాన్ని వృధా చేయరాదు.ప్రతి అన్నం ముద్దకు,గుటికెడు నీటికి,ఒక బట్ట పీలికకు ఎంతోకథ ఉంది!

**'యజ్ఞం'అంటే అగ్నికుండం, ఆహుతులు,హ స్సులు, హోతలుమాత్రమే కాదు.ఇ సంకేతాలు మాత్రమే!మానవ కళ్యాణంకోసం జరిగే ప్రతి బృహత్కార్యమూయజ్ఞం అవుతుంది.దానికి కుండం, స ధలు,అగ్ని, ఘృతం, హోతఅక్కర లేదు! మానవకళ్యాణం, శ్వశ్రేయస్సుముఖ్యం,**

**అహంకారంతోనూ,దర్పంతోనూ, దంభంతోనూ,ధనార్జన కోసం చేసేయజ్ఞం యజ్ఞంఅనిపించుకోదు.**

**యజ్ఞం- హింస**

యజ్ఞంయాగాదుల్లో పశుహింస ధించబడింది.హయమేధం,అజమేధం, ఇలాంటియజ్ఞాలు.

పాశ్చాత్య ద్వాంసులు, వేదంలోమహత్తమ షయాలను వదిలి- కేవలం యజ్ఞాల్లోనిపశుహింస ఆధారంగా 'వేదంఆర్యుల ఆట క జీవనం'అని నిశ్చయించారు. అంతేకాదు భారతీయమేధావులతో న్మ్మింపచేశారు.

పాశ్చాత్య ద్వాంసులు వేదాన్నిఅధ్యయనం చేశారు.కొంతవరకు వారి పరిధిలోఅర్థం చేసుకున్నారు. వారుచేసిన కువ్యాఖ్యలు,తెలియక చేసిన అవుతే అర్థం చేసికోవచ్చు.మన్నించనూ వచ్చు.కాని, వారు అలా చేయలేదు.**భారతీయులుబానిసలు, వారు ప్రభువులు,బానిసలు తమకన్నకొంచెపువారు కావాలి. అలాంటిభావం వారిలో**

కలగాలి.అందుకు వ్యూహాత్మకంగాభారత సంస్కృతిపైద దాడి చేశారు.భారత మేధావులనునమ్మించారు. యూనివర్సిటీవిద్యమాత్రం నేర్చినవారుఈనాటికీ పాశ్చాత్యవాదాన్నే ప్రగతి వాదంగానమ్ముతున్నారు.

భారతదేశానికిస్వాతంత్ర్యం అనేదివచ్చి అర్థ శతాబ్దందాటిపోయింది. అన్నిరాజకీయ

పార్టీలుఅధికారానికి వచ్చాయి.కాని ఏ ఒక్కరూ భారతీయసంస్కృతి గురించి కనీసంఆలోచించలేదు.ఎవరికి వారు తమ శక్తివంచన లేకుండాపాశ్చాత్య సంస్కృతికిదాసోహం అన్నారు.ఈ దేశంలో - ప్రస్తుతం- ఏది స్వదేశీ ంగల్లేదు.T.Vఆధారంగాపాశ్చాత్య

సాంస్కృతికదాడులు - **CULTURALINVASIONS** సాగుతున్నాయి.కనీసం అడ్డుకోవడానికిప్రయత్నాలు జరగడంలేదు. పిల్లలూ,యువత టీవీనిదేవుని వలెంశ్వసిస్తున్నారు. వారికి 'ఇండియా'అంటే తప్ప 'భారతం'అంటే అర్థం కావటంలేదు!

వేదంలోపాశ్చాత్యులు ఈనాటికీకనీ, ంనీ ఎరుగని అంశాలున్నాయి.ిటికి ండిచి కేవలంజంతు వధపైదనే ఆధారపడి వేదాన్నిఅపఖ్యాతి పాలు చేయడంఎందుకు? అంతర్గతప్రణాళిక ప్రకారం భారతధర్మాన్ని, భారతతాత్వికతను కించపరచడం ప్రధానఉద్దేశ్యం.

పాశ్చాత్యులఆహారమే - నేటికీ- గొడ్డు మాంసం **BEEF**.పందిమాంసం**PORK**అందుకువారు ప్రతి రోజు లక్షలాదిపశువులను వధిస్తున్నారు.పశువధ మాత్రమేఆటంకం అవుతే వారు

తమనునాగరకులం అని ప్రకటించుకోవడంబూటకం! వారు వాస్తంకంగానేటికీ ఆటంకులే!

కానిఅది సరియైన నిర్ణయంకాదు. ఆహారపు అలవాట్లుమాత్రం ఒక నాగరికతకాదు. అందుకు ఇంకా ఎన్నోకారణం అవుతాయి;

భారతీయులువేదకాలంలో మాంసాహారులు.అనంతర కాలంలోవారు శాకాహార ప్రాశస్త్యంగుర్తించారు. పాశ్చాత్యులుఇంకా గుర్తించాల్సి ఉంది.

## వధవేరు - బలి వేరు

యజ్ఞంలోజంతువును వధించడంకాదు, బలి ఇవ్వడంజరిగింది. బలి అంటేత్యాగం. దేవతలుమనకు అనేక ఉపకారాలుచేస్తున్నారు. వారికిప్రత్యుపకారం అసాధ్యం.లాంఛనంగా వారికిఏదైనా అర్పించాలి అనిపిస్తుంది.ఏఃు అర్పించగలం? లాంఛనంగాజంతువును అర్పిస్తాం.

తనఆహారానికి చంపడానికీ,దేవతకు అర్పించడానికి,బలి ఇవ్వడానికీ చాలాఅంతరం ఉంది. వధించడంతన కోసం. బలికృతజ్ఞతా పూర్వకం!

వేదంలో'స్వాహా' అనే పదం వస్తుంది.ఇది సుమారు 'అంకితం', 'అర్పణం'అనే అర్థంలో వస్తుంది.

"భూపతయేస్వాహా-భువనపతయే స్వాహాభూతానాం పతయేస్వాహా"

భూమిస్వామికి అర్పణ. లోకములస్వామికి అర్పణ. ప్రాణులస్వామికి అర్పణ.

ఏమిఅర్పించాలి?

'స్వాహా'అనే పదంలో స్వ+ఆ+హాఅనే అక్షరాలున్నాయి. 'స్వ' తనకున్న+ఆసొంతం +హాఅర్పిస్తున్నాను అని అర్థం.

తనకుఉన్నది సొంతం అంటేఆత్మ. దానిని అర్పించడంఆత్మార్పణం అవుతుంది.

అందరూఆత్మార్పణం చేయలేరు.అందరూ ఆత్మార్పణం చేస్తేసమాజం నిలువదు.కాబట్టి ఆత్మార్పణానికిప్రత్యామ్నాయంగా జంతుబలి.

**సకలప్రాణులతో మమేకంకావడం స్వాహా అవుతుంది.సకలమూ తానే అనుకోవడం-ఆత్మవత్సర్వ భూతానిస్వాహా అవుతుంది.సర్వంఖల్విదం బ్రహ్మ,తనలో భగవంతునిదర్శించడం 'అహంబ్రహ్మాస్మి'అనుకోవడం స్వాహాఅవుతుంది.**

**పాశ్చాత్యులు'స్వాహా' అంతస్తును- మరొక సహస్రాబ్దితరువాత సహితంఅందుకొనజాలరు.గురివింద తన క్రిందనలుపును గుర్తించజాలదు.**

'బలి'ఒక్క వేదానికీ, ఒక్క భారతధర్మానికి మాత్రంసీమితం కాదు. భారతజాతి జంతుబలికిబదులు - కొబ్బరికాయ సమర్పించుకునేఉన్నత దశకు వచ్చింది.నారికేళంలో హింసలేదు.రక్తం బదులు నీరుప్రవహిస్తుంది.

'బైబిల్'లోఅబ్రాహం;' - తనఏకైక పుత్రుడు - ఇసాక్నుబలి సమర్పించబోయేవృత్తాంతం ఉంది.

## Chapter22

9.And they came to the place which God had told him of; and Abraham built- an altar there, and laid the wood inorder, and bound issac his son, andlaid him on the altar upon the wood.

10.And Abraham stretched forth his hand, and took the knife to slay his son.

11.And the Angel of the Lord called unto him out of heaven, and said, Abraham,

Abraham:and he said Here am I.

12.And he said, lay not thine hand upon the lad, neither do thou anythingunto him.

13.And Abraham lifteup his eyes, and looked, and behold behind him a ram caughtin a thicket by his horns; and Abraham went and took the ram, and offeredhim up for a burnt offering in the stead of his son"

భగవంతుడుఅబ్రాహం కొడుకునుబలికోరాడు. అబ్రాహంకొడుకును బలి ఇవ్వదలచాడు,కత్తి ఎత్తాడు, ఇంతలోఆకాశవాణి పలికింది.

“ నీభక్తికి మెచ్చాం.కొడుకును బలి ఇవ్వొద్దు”

అప్పుడుఅబ్రాహంకు గొర్రెకనిపించింది. దాన్నిబలిఇచ్చారు. OldTestament నంతాఖురాను నమ్ముతుంది.ఈ సందర్భంగనే ముస్లిములు‘బక్రీదు’ పండుగ జరుపుకుంటారు.

ఇలాంటికథే శివభక్తులకుసంబంధించిందిఉన్నది. శ్రీయాళుడుతన పుత్రుని వధించిజంగమదేవరగాఉన్న శివునికి అర్పిస్తాడు.

క్రైస్తవులు,ముసల్మానులకునరబలి ఆచారంగా ఉండింది.అబ్రాహం నరబలిమాన్పించాడు. అజబలిని ప్రారంభించాడు.గొప్ప సంస్క ర్త. అందుకే అతనిపేరు బైబిలు, ఖుర్,ఆను లకు ఎక్కింది.

వాల్మీకిరామాయణలో ◌శ్వా◌ుత్రుడునరబలి మాన్పించినవృత్తాంతం ఉంది.

## శునశ్శేపునికథ

అంబరీషుడుఅయోధ్యను పాలించాడు.అతడు ఒక యజ్ఞంచేస్తున్నాడు. ఇంద్రుడుయజ్ఞ పశువునుదొంగిలించాడు. పురోహితులుదొంగిలించబడినపశువు బదులునరపశువు కావాలన్నారు.

అంబరీషుడునరపశువు కోసం వెదుకుతూసాగాడు. ఎన్నో లక్షలఆవులు ఇస్తానన్నాఎవడూ బాలుని అమ్మలేదు.రాజుకు ఎంత పరి◌ుతఅధికారం ఉండేదో ఇందువల్ల అర్థం అవుతుంది.భారత దేశ చరిత్రలోరాజుపరిపాలకుడు మాత్రమేశాసకుడు కాడు.

అంబరీషుడు'ఋచీకుడు' అని ఋషిదగ్గరకు వెళ్ళాడు.ఋచీకునికి ముగ్గురుపుత్రులు. పెద్దవాణ్ణిఇవ్వనన్నాడు తండ్రి.చిన్నవాణ్ణిఇవ్వనన్నది తల్లి.మధ్య వాడు శునశ్శేఫుడు.తాను తండ్రికీ, తల్లికీపనికిరాని వాడను అనుకున్నాడు.అంబరీషునికి అమ్ముడుపోయాడు!

సందేశంగ్రహించండి.పిల్లలు ఇద్దరేఉండాలి. అందరికీ ఇద్దరుపిల్లలే ఉన్నట్లున్నారు.అందుకే ఎవరూ అమ్మలేదు.ఇంత స్పష్టమైన సందేశాన్నిప్రభుత్వం కుటుంబనియంత్రణకు వాడుకొనవచ్చునుకదా! మన ప్రభుత్వాలకు'స్వాములు' పాశ్చాత్యులు.భారత ఇతిహాసాలనుిననొల్లరు!

అంబరీషుడుశునశ్శేఫుని తీసికొని బయల్దేరాడు.పుష్కరతీర్థం చేరాడు.అక్కడ

ిశ్వాిత్రునిఆశ్రమం ఉంది. ిశ్వాిత్రుడుశునశ్శేఫుని మేనమామ.శునశ్శేఫుని

ిశ్వాిత్రునివడిలో పడి ఏడ్చాడు.తన గోడు ినిపించాడు.తనను రక్షించమనికోరాడు. ిశ్వాిత్రుని హృదయంద్రించింది. ిశ్వాిత్రుడుతన కొడుకులనుపిలిచాడు. శునశ్శేఫునిస్థానంలో అంబరీషునివెంట వెళ్ళమన్నాడు.వారు ఎవరూ బలి కావడానికిఅంగీకరించలేదు.కుక్క మాంసం తినే చండాలురుకావాలని స్వంత పుత్రులనుశపించాడు! ఇది ిశ్వాిత్రునిస్పందన!! అబ్రాహంపుత్రుడు ఇసాక్, శ్రీయాళునిపుత్రుడు, ఋచీకునిపుత్రుడు శునశ్శేఫుడుతండ్రుల ఆజ్ఞనుపాలించారు. మానవస్వభావానికి యుగాలతోనిత్తం లేదనేదిసందేశం.

ిశ్వాిత్రుడుఅంబరీషుని యజ్ఞంసఫలం కావాలనుకున్నాడు.శునశ్శేఫుని రక్షించాలనీఅనుకున్నాడు. అందుకుతగినట్లు ఇంద్రునకుప్రీతి కలుగు రెండుగాథలు రచించాడు.అి శునశ్శేఫునికీ ఉపదేశించాడు.అంబరీషుడు శునశ్శేఫునితోఅయోధ్య చేరాడు.యజ్ఞం చేశాడు.యూపానికి శునశ్శేఫుని కట్టాడు.శునశ్శేఫుడు తనమామ ఉపదేశించిన-ఇంద్ర సంబంధ గాథలుచదివాడు.

ఇంద్రుడుగాథలకు ప్రసన్ను డైనాడు.

పశుబలిలేకుండానే అంబరీషునికీయజ్ఞఫలం కలిగించాడు.

శునశ్శేఫునిప్రాణం రక్షించబడింది.ిశ్వాిత్రుడు నర బలినిమాన్పించాడు. అతడునరుని బదులుపశువుని బలి ఇవ్వలేదు.పశు బలినే మాన్పించినట్లున్నాడు!

ఇదిఎంతటి మహత్కార్యం!!!

వేదంలోఅధ్వర యజ్ఞం గురించిచెప్పబడింది.అధ్వర యజ్ఞం అహింసాయజ్ఞం అవుతుంది.కొందరి వ్యాఖ్యలోయజ్ఞమే అధ్వరం.అంటే యజ్ఞాలన్నీఅహింసములే.వేదంలో కొన్ని పశువులపేర్లు - యజ్ఞ సంబంధంలో-చెప్పడం జరిగింది.వేదం పరోక్షవాది. దానిఅంతరర్థాలు వేరు ఈ పశువులపేర్లు సంకేతాలు మాత్రమే.అి వాస్తవంగా కామ,

క్రోధ,మోహ, లోభ,మద, మాత్సర్యాలు.ిటిని ఆత్మజ్ఞానంఅనే అగ్నిలో హవనంచేయాలని అర్థం.కర్మవాదులు ఈ అర్థాన్నిగ్రహించరు. గ్రహించినావెల్లడించరు.స్వప్రయోజనం కోసంయజ్ఞాలు చేస్తారు.ఇది ఈ కర్మకాండను, దంభాన్ని,స్వప్రయోజన పరాయణతోబుద్ధుని నుంచిరామానుజుని వరకుఆచార్యులు, మహాత్ములుఖండించారు. వారు వేదాలనునిరసించనూ లేదు,ఖండించనూ లేదు.పాశ్చాత్య పరిశోధకులువారంతా వేదాలనుఖండించారని మనభారతీయ మేధావులచేవప్పించారు. మన యూనివర్సిటీమేధావులు ఇంకా వాస్తవంగ్రహించినట్లుకనిపించదు. వారింకా సాంస్కృతికబానిసత్వం వదులుకోలేదు.కొన్ని తరాలను సాంస్కృతికబానిసలుగా సిద్ధంచేస్తున్నారు. మనమేధావులు భారతీయంగాఆలోచించడం నేర్వాలి.వారు తాము ఉంటున్న,తింటున్న దేశానికిద్రోహం చేయరాదు.ఆలోచనలు చంపటంనా ఉద్దేశ్యం కాదు. భారతీయతదినియంతృత్వ ధోరణికాదు. అయితే కువ్యాఖ్యానాలుమన జీవనంధానాన్ని ఆలోచనను,తాత్వికతను అపఖ్యాతిపాలు చేస్తాయి.

మనమేధవులు తొలుతమనం భారతీయులంఅని గుర్తించాలి. భారతీయంధానంలో

వ్యాఖ్యానించాలి.ఇది మనందరి కర్తవ్యం.ఈ దిశగా కొంత కృషి ప్రారంభంఅయింది. అది ఇంకా మూడుపూలు ఆరు కాయలుగా వర్ధిల్లాలి.

"హిరణ్మయేనపాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్"

బంగారుపాత్ర- అధికార ధనాలతో- సత్యపు ముఖాన్నికప్పేశారు, మసి పూశారు.

మరిఈ అంధకారాన్ని ఈ మసినీఎవరు తొలగించాలి?వేదానికి మనిషి ిదఅనంతమైన ిశ్వాసం.వేదం అంటున్నది.

యో%సావాదిత్యేపురుషః సో%సావహమ్

సూర్యునిలోఒకడున్నాడు. అట్టివాడను నేనే అంటేమానవుడే ఈ అర్థ,అధికార హిరణ్మయపాత్రను బద్దలుకొట్టాలి. అపిహితమైనసత్యాన్ని వెలికి తీయాలి.

వేదంమానవుడు నిష్కల్మష,పిత్ర జీవనంఏర్పరచుకోవాలని అనేకచోట్ల ఆదేశించింది.ఒక పిత్ర జీి, ఒక ఆత్మార్పణంచేసిన మహానుభావుడు,ఒక లోక కళ్యాణం సాధించినమహా పురుషుడుభగవానుడు అగుచున్నాడు.ఇందుకు ఉదాహరణలుకొల్లలు. ఉదాహరించడంఅప్రస్తుతం అవుతుందికాని ఇరవయ్యో శతాబ్దంలోనేమహాత్ముడు,ివేకానందుడు, రామకృష్ణపరమహంస, అరిందులు,రమణ మహర్షిఅవతరించారు.

"సిధాసిసూర్యస్త్వా పురస్తాత్ పాతుకస్యాశ్చిదభిశంస్తై! సింత్వర్భాహూస్థఊర్ణమ్మ్రి

దసంత్వాస్తృణాి స్వాసస్థం దేవేభ్యఆత్వా వసవోరుద్రా ఆదిత్యాఃసదన్తు II2-5

నీవుసంధవు. నీకు శాపం ఉంటేసూర్యుడు నిన్ను ఎదుటినుంచి రక్షించాలి. నీవుసూర్యుని భుజమవు.నిన్ను దేవతలకుఆసనం చేస్తాను.ఉన్ని వంటి నిన్నుపరుస్తాను. వసువులు,రుద్రులు, ఆదిత్యులునీ ఁద ఆసీనులు అగుదురుగాక.

వ్యాఖ్యసుదీర్ఘం అవుతుంది.వేదం మనిషిని 'సంధాసి'అన్నది. మనిషి సంధవంటి పంత్రుడు.సంధ తాను జ్వలిస్తుంది.అన్యులకు కాంతినీ,వేడినీ ప్రసాదిస్తుంది.మానవుడు అలాంటివాడు కావాలని వేదంఆశిస్తుంది.

"ఏషాతేఅగ్నే సంత్తయావర్ధస్వచాచప్యాయస్వ"

అగ్నీ!ఇతడు నీకు సంధఅవుతున్నాడు. అతనితోవర్థిల్లుము. మమ్ముర్థిల్లచేయుము.

ఇదిజ్ఞానాగ్ని, జ్ఞానాగ్నిలోతపించినవాడుజ్ఞానాన్ని వర్ధిల్లచేస్తున్నాడు.అలాంటి జ్ఞానంఅతనిని వర్ధిల్లచేస్తుంది.

ఆత్మసమర్పణయే యజ్ఞస్వరూపం. దానితోనే లోకకళ్యాణం. లోకహితం,లోకశాంతి, లోక కాంతి.

### హింస- అహింస

హింసఏది? అహింస ఏది?చంపడం హింసఅవుతుందా? పీడించడంహింస అవుతుందా?ఁటిని గురించి శ్రీమహాభారతంలోని ధర్మవ్యాధునివృత్తాంతం ంవరిస్తుందిలా.ధర్వవ్యాధుని కథఏం? అవధరించండి:-

కౌశికుడుబ్రాహ్మణుడు.అతనికి వేదం ఁదఆసక్తి ఎక్కువ. ఒకనాడు అతడుచెట్టు కింద కూర్చున్నాడు.వేదం గుణిస్తున్నాడు.అతని ఁద కొంగ రెట్టవేసింది. అతడు కొంగనుచూచాడు. కొంగ చచ్చింది.నేల ఁద పడింది.

ఆనాడుమధ్యాహ్నంఅయింది. భిక్షకు బయల్దేరాడు.ఒక ఇంటికి వెళ్లాడు.గృహిణి అతనినిఆదరించింది. ఆసీనునిచేసింది. భిక్షతెస్తానని లోనికివెళ్లింది. చాలాఆలస్యం చేసింది.కౌశికుడు ంసిగాడు, వేసారాడు,అప్పుడు గృహిణిభిక్షతో వచ్చింది.కౌశికుడు ఆమెను చూచాడు,మండి పడ్డాడు. శపించేంతపని చేశాడు.

గృహిణికోపగించలేదు. శాంతంగాఅన్నది ' నీ కోసం భిక్షతేవడానికి వెళ్లాను.నా భర్త ఆకలితోవచ్చాడు. అతనిఆకలి తీర్చడం నాతొలి ధర్మం. అతనికిఅన్నం పెట్టి వచ్చాను.అందుకు ఆలస్యం అయింది.నీవు వేద ందుడవు.కోపమే నీ శత్రువు.అది తెలియకున్నావు.నీవు కోపంతో ఒక కొంగను చంపావు.నేను కొంగను కాను.

కౌశికుడుఅదిరిపోయాడు. తనకుధర్మోపదేశం చేయమనిఅర్థించాడు.

కౌశికా!నీకు ధర్మం తెలుసు.ధర్మ సూక్ష్మం తెలియదు.నీకు తెలియ చెప్పడానికినాకు సమయం చాలదు.'ిథిల'లో 'ధర్మవ్యాధుడు'అనే కటికవాడున్నాడు.అతడుసత్యవాది,

జితేంద్రియుడు,మాతాపితృ భక్తియుతుడు.అతని దగ్గరకు వెళ్లు.అతడు ధర్మసూక్ష్మంివరించ సమర్థుడు"

ఈ చిన్నవృత్తాంతంలో వ్యాసమహర్షిఎన్నోమహత్తరిషయాలను వెల్లడించాడు.

1. కేవలంవేద పఠనం చాలదు.వేద జ్ఞానం -ఆచరణ అతిముఖ్యం.

2. ప్రతివారికి ప్రథమ కర్తవ్యాలుంటాయి.ముందు వాటినినిర్వ ర్తించాలి. 'స్వధర్మేనిధనం శ్రేయః" అన్నాడు గీతలో, 'ధర్మం'అంటే మతంకాదు.ధర్మం అంతే కర్తవ్యం.

3. వేదాధ్యయనంకన్న లోక జ్ఞానంిన్న. 'చదువదిఎంత గల్గిన రసజ్ఞతఇంచుక చాలకున్నా చదువు నిరర్థకమ్ము.అన్నాడు భాస్కర శతకకారుడు.ఆధునికం అనిపించుకునేనేటి చదువులన్నీఆర్జనకే గాని లోకజ్ఞానానికినిష్ప్రయోజనాలు.

4. భారతసమాజం స్త్రీని నికృష్టంగాచూచిందనీ, ఆమెనుబానిసను చేసిందనీపాశ్చాత్యులు బోధించారు.మూలాలు యూరోపు,అమెరికాలో గల మనమేధావులు ఆ బోధనలనుత్రికరణ శుద్ధిగానమ్ముతున్నారు.స్త్రీ ిమోచన ఉద్యమాలునడిపే నాయకత్వంపాశ్చాత్యాన్ని ప్రతిబింబిస్తుంది.వారు భారత సాహిత్య,సంప్రదాయాలనుఅధ్యయనం చేయడంశ్రేయస్కరం.

ఈ కథలోఒక సామాన్య స్త్రీ ధర్మసూక్ష్మాన్ని గురించి వేదాధ్యాయునికిఉపదేశించింది.

వేదాధ్యాయినితన లోపం గ్రహించేట్లుచేసింది. భారతఋషులకు, కవులకు,ిద్వాంసులకు స్త్రీ స్థానంసమున్నతం. రామాయణంసీత కథ. మహాభారతం ద్రౌపదికథ, కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం శకుంతలంకథ.

5. కౌశికుడువేదవేత్తయో.జ్ఞానియే కాడు. జ్ఞానంకర్మను ింంచింది. గృహిణిఅతనికి జ్ఞానోదయంచేయించింది. అతడుఅహంకారం త్యజించాడు.అతడు బ్రాహ్మణుడు.'ధర్మతపశ్శీలుడు.సంతతాధ్యాయనతత్పరుడు. అయినాజ్ఞానార్జన కోసం వ్యాధుడు,కటిక

వానిదగ్గరకు వెళ్లాడు.అహం నశించిన్నాడుసమస్తము సమంగానేకనిపించి అతడు సమదర్శనుడుఅవుతాడు.

"అటకేగిముందట నల్పమృగమాంసఖండంబులంగడి బచరించియమ్ముచున్నవాని ననవరతిక్రయాగత జనసమావృతు నక్కిరాతుంగనియతి జుగుప్సితంబయినసూనాపణంబు సేరనొల్లకతొలంగి యొక్క యెడనుండె"

కౌశికుడుమాంసం అమ్ముతున్నకిరాతుణ్ణి చూచాడు.అసహ్యం అనిపించింది.అంగడిలోనికి ప్రవేశించలేక పోయాడు. దూరంగానుంచున్నాడు.

ధర్మవ్యాధుడుతన పని ముగించుకున్నాడు.అంగడి మూసాడు. కౌశికుని దగ్గరకివచ్చాడు. నమస్కరించాడు.'' ఆ పతివ్రత నిన్నుపంపింది కదా అన్నాడు. బ్రాహ్మణుణ్ణితన

ఇంటికితీసికెళ్లాడు. ధర్మవ్యాధుడుకౌశికునికి అనేక ధర్మ సూక్ష్మాలు ివరించిన ిషయంఆంధ్రమహాభారతంపంచమాశ్వాసంలో 146 గద్యపద్యాల్లో చెప్పబడింది.అహింసను గురించి

మాత్రంప్రస్తాిస్తాం:-

నీవుహింసను గురించిమాట్లాడావు. హింసఇది అని నిశ్చయంగా చెప్పడంఅసాధ్యం.

''సకలభూతములుపూర్వ జన్మకర్మములవలన నశించుచున్ని.ఆ భూతములనుచంపువాడు. నిిత్తమాత్రుడగును.ఫలములు, ఓషధులు,కూరగాయలు, పశువులు,మృగములు ప్రాణులకుఆహారము అగునట్లుబ్రహ్మదేవుడుఏర్పరచినాడు. దీనినికాదనుటకు ఎవరికినిశక్యము కాదు.

''మరొకముఖ్య ిషయముఆలోచింపుము. మానవులుభూిి ిద తిరుగుదురు.అప్పుడు వాని పాదములక్రింద పడి నలిగిఅనేక ప్రాణులు చచ్చుచున్ని.అది హింసకాదా? భూిదున్ననపుడు నాగటిచాలున అనేక ప్రాణులునశించుచున్ని.అది హింసకాదా? మహాత్ములుమునులు అడువులందుఉండి చెట్టునునరుకుదురు. కాయగసరులుత్రవ్వుదురు. అదిహింసకాదా?

ఈ జగత్తునహింస చేయనివాడుఒక్కడును లేడు.అయినను సాధ్యమైనంతవరకు హింసకు దూరముగాప్రవర్తించుటధర్మము''

ధర్మంవేరు, ధర్మసూక్ష్మం వేరు.ఇది ివరించడం ఈవ్యాస పరిధి కాదు. వ్యాసమహర్షి లక్షశ్లోకాల శ్రీమహాభారతంరచించారు. అది పంచమవేదం అయింది. అంతటిమహా గ్రంథంలోనూఆ మహర్షి ''ధర్మం''అనే పదానికి నిర్దిష్ట నిర్వచనంచెప్పలేక పోయారు.అసత్యమే ఎరుగని ధర్మరాజుతోఅసత్యం పలికించాడు.'అసత్యం, కొద్దిదైఅందువలన సాధించేకార్యం ిలక్షణం, ిశిష్టం,ఉత్తమం, 'బహుజనహితాయ' అయినపుడుఅది ధర్మం అవుతుంది.ఇది సామాన్య నేత్రానికిగోచరం కాదు. దీని ిషయంచర్చోపచర్చలు,మానసిక మథనఅవసరం అవుతుంది.అందుకే దీన్ని 'ధర్మసూక్ష్మం'అన్నారు. సూక్ష్మాన్ని అందరూ గాంచలేరు.అందకు జ్ఞానం కావాలి.పరిజ్ఞానం కావాలి.

వాల్మీకిమహర్షి సహితం'ధర్మం' అనే పదానికినిర్వచనం నిర్దిష్టంగాచెప్పలేకపోయారు.ద్వంద్వ యుద్ధంచేస్తున్నవారు వాలి-సుగ్రీవులు

అన్నదమ్ములు.రాముడు చెట్టుచాటున దాగి బాణంవేశాడు. వాలిని వధించాడు.ఇది ధర్మమా?

తంద్రుష్ట్వారాఘవం వాలీ లక్ష్మంచమహాబలమ్

అబ్రవీత్ప్రశ్రితంవాక్యం **పురుషం ధర్మసంహితమ్.**

వాలికూలాడు, రామలక్ష్మణులుచూడ్డానికి వచ్చారు.వాలి వారిని చూచాడు,ఆ దశలోనూ వినయంగామాట్లాడాడు అంటున్నాడువాల్మీకి. అతని మాటలు'పరుషం' -కరకువి, 'ధర్మ సంహితం'ధర్మయుతములు.
వాలిరాముణ్ణి అడుగుతున్నాడు.

పరాఙ్ముఖవధంకృత్వా కోను ప్రాప్తస్త్వయాగుణం

యదహంయుద్ధ సంరబ్ధశ్శరేణోరసితాడితః

నీవునా ఎదుట లేవు.నన్ను చంపావు.ఏం సాధించావు? నేనుమరొకరితో యుద్ధం

చేస్తున్నాను.నా రొమ్ములో బాణంగ్రుచ్చావు?

వాల్మీకి,ధర్మ విగ్రహుడైనరాముడు -ఎన్ని చెప్పినా- సమర్థించుకోలేకపోయాడు!

**ఇందులోఒక ధర్మ సూక్ష్మం ఉంది.రావణుడు లోక కంటకుడు.వాణ్ణి సంహరించాలి.**ఇంతకన్న వివరించడానికిఇది సందర్భం కాదు.

"Equality""Humanrights" ఇంతవరకుఏ రాజ్యాంగమూ U.N.Oసహితంనిర్దిష్ట నిర్వచనంఇవ్వలేకపోయాయి.మరి మనం చాలాసాధించామనుకుంటున్నాం!చంద్రునిలాంటిగ్రహాలకి రహదారులువేస్తున్నాం! అప్పుడేఅక్కడి స్థలాలు అమ్ముతున్నాం!!హోటళ్లునిర్మించబోతున్నాం!!!ఇదంతా అచ్చం వ్యాపారం!!! ఇందులో మానవకళ్యాణం మచ్చుకుసహితంలేదు!

ఇంతాఎందుకు వివరించాల్సి వచ్చిందంటేవేదాన్ని వ్యాఖ్యానిస్తూపశ్చిమ వేదాంతులునా గుండెలో బాణంగ్రుచ్చారు. 'హింస''అహింస' వెనుకఉన్న ఇంత కథ వారికితెలియక కాదు.వారు మేధావులుకాదనలేం. వారి మేధస్సువిదనే ఈనాడు లోకంపాంతం నడుస్తున్నది.వారిది జాత్యహంకారం.ఇతరులను ఇతరనాగరకతలను నీచంగా,దాస్యంగా భావించడంవారి స్వాభావం.

పాశ్చాత్యమేధావులు అన్నీకాగలిగారు. మానవులుకాలేకపోయారు.

ఖ్వాజాహఫీజ్ అనే పారశీకకవి ఏమన్నాడో పరికించండి.

మైఖుద్మునహఫ్బసోజ్ ఆతిష్ అందర్కాబజన్

సాకిన్బుత్ఖానా బాష్నమర్దుమ్ అజారీముకున్

సారాయిత్రాగు, ఖురానునుకాల్చేయి, మక్కానుకూల్చేయి, ్గ్రహాలనుఆరాధించు. (ఇవన్నీఇస్లాం నిషేధించినవి)

కానిమనిషిని మాత్రంహింసించకు!

**మనిషికిఎంత సమున్నతస్థానం కల్పించాడు!మతాలను ధిక్కరించు.బేపర్వా మనిషి మనసునుమాత్రం నొప్పించకుఅంటున్నాడండీ!**

వేదానికితొలి నుంచీ ఒక అపకారంజరిగిందని నా అభిప్రాయం.వేదం తొలుతసాహిత్యం. కర్మకాండతరువాత చేరింది.కర్మకాండ చేరడంతప్పుకాదు. బహుశఃకర్మకాండవల్లనేవేదం ఇంతకాలం నిలిచిందేమో!అయితే కర్మకాండ సాహిత్యానికిగ్రహణం పట్టించింది.కర్మకాండ స్వప్రయోజనపరులకుఉపయోగపడింది. వేదంవారి చేతి కీలుబొమ్మఅయింది. వేదానికిసాహిత్యంఉందని జనానికి తెలియకుండాపోయింది.

**గౌతమబుద్ధుని నుంచిరామానుజునిదాకాఅందరూ వేదపు శ్రేయోభిలాషులే.వారు నిరసించింది కర్మకాండనే!జగద్గురువు ఆదిశంకరుడుఁసిగిపోయాడు. 'అఁద్యద్విషయం**

**కర్మ'అని ఉపనిషత్తులనుఆశ్రయించాడు.**

వాల్మీకిరామాయణానికీ ఈ దుర్దశేపట్టింది! ఆ వాల్మీకాలేఎక్కువ ప్రచారంలో ఉన్నాయి.

మొదలువచ్చిన చెవులకన్న వెనుక వచ్చినకొమ్ములు వాడి.

కేవలంకర్మకాండను మాత్రందృష్టిలో ఉంచుకునిపాశ్చాత్య ్ద్వాంసులువేద సమాజాన్ని"Primitive andlargely barbaric society, crude in its moral and religious conceptions,rude in its out look upon the world that environed it'అన్నట్లువక్రీకరించారు.

ఈ దుస్థితికేవలం వేదానికి మాత్రమేపర్యాప్తం కాదు. ప్రస్తుతపుఅన్ని మత గ్రంథాలూ,కర్మకాండ వరకే సీఁతంఅయినాయి. ఏ ఒక్క క్రైస్తవ దేశంబైబిలు నీతులనూ,ఏ ఒక్క ఇస్లాం దేశం ఖురాన్నీతులనూ అనుసరించడంలేదు. ఆచరించడంలేదు!

వేదాన్నిగురించి పాశ్చాత్య ్ద్వాంసులువక్రభాష్యాలకుఆధునిక వేద వ్యాఖ్యాతలుస్పందించారు. వారు వేదంలోనిపదాలకు ఆజ్ఞాత్మికఅర్థాలు వెదకడానికికృషి చేస్తున్నారు. వేదంలోఏకేశ్వరోపాసనను నిరూపించడానికిప్రయత్నిస్తున్నారు!

## వేదం-మానవునిమహిమ

మానవునిమహిమను,అతని శక్తిని, అతని అప్రతిహితప్రభావాన్ని యజుర్వేదంగుర్తించింది. అంతగామరొక గ్రంథం గుర్తించిఉండదు. యజుర్వేదంలోనరుని వ్యక్తిత్వాన్నీ,అతని సామర్థ్యాన్నిఅనేక చోట్ల ప్రస్తావించింది.స్తుతించింది. మానవుడుపరిపూర్ణుడు కావాలి. అతనికిఆత్మ జ్ఞానం కలగాలి.అతడు సమర్థుడు,వాటిని సాధించగలడు.యజుర్వేదానికి ఆ విశ్వాసంఉంది. అందుకే మానవునిమహత్తునువరిస్తున్నది.

1. అమృతంఅసి -అమరుడవు 2. శర్మఅసి - సుఖవంతుడవు.3. శుక్రం అసి - శక్తిమంతుడవు- పవిత్రుడవు 4. తేజఃఅసి - తేజమవు5. ధామనామ అసి - యశస్సువుకీర్తివి 6. తేజః వేష్పఅసి - తేజస్సునకుఆలయమవు.

మానవుడుతాను అమరుడనుఅనుకోవాలి. నిత్యమృత్యుభయంఉన్నవాడు కార్యసాధకుడుకాజాలడు. అమరత్వంఅంటే మృత్యువులేకుండటం కాదు.శతశరత్తులు జీవించడం.నరుడు మృతి చెందుతాడు.తనపుత్రుని రూపంలోజీవిస్తాడు. 'పితావై పుత్రనామాసీత్'అవిచ్ఛిన్నంగా కొనసాగేసంతానమే అమరత్వం.సగరుడు ప్రారంభించినగంగావతరణ కార్యాన్నిభగీరథుడు సాధించాడు.నిరంతరత్వమే అమరత్వం.

నరుడుతన శక్తిని గ్రహించాలి.అతనికి ఆత్మవిశ్వాసం కలగాలి.శక్తి, ఆత్మవిశ్వాసం కలవాడుసాధించలేనిదిలేదు.

మనిషిదేన్ని సాధించాలి?తాను బాగుపడడంమాత్రం కాదు. లోకానికిసాయపడాలి

సమాజజీవితానికి తోడ్పడాలి.క్రమంగా జ్ఞానంపెంచుకోవాలి. ఈ ఊరు నాది,ఈ దేశం నాది నుంచివసుదైవ కుటుంబం,లోకమే నాకుటుంబంఅనేస్థితికి చేరాలి.

నరుడుతనను ప్రేమించాలి.తనను ప్రేమించినవాడుఇతరులను ప్రేమించలేడు.ప్రేమదైవ

స్వరూపంఅది హాని కలిగించదు.నష్ట పరచదు. మనసునువిశాల పరుస్తుంది. వర్ధిల్లచేస్తుంది. ప్రేమకుటుంబం, గ్రామం,ఎల్లలు దాటిసమస్తానికీ వ్యాపిస్తుంది.అప్పుడు అతనికి 'ఆత్మవత్సర్వభూతాని' సర్వ ప్రాణిజాలమూ తానేఅవుతాడు. తనకుతాను హాని కలిగించుకోలేడుకదా!

ఒకలిప్త ఆలోచించండి.ప్రతివాడూ **ఆత్మవత్సర్వభూతాని**అయినాడనుకొండి, ఎవనికీఎవడు హాని చేయడు.నష్టపరచడు, నరునినుంచి నరునికి హానిజరుగకుండడానికే ఇంతవిరాట్ ప్రభుత్వం,పోలీసు, న్యాయ వ్యవస్థ!

**'ఆత్మవత్సర్వభూతాని'** నాడుప్రభుత్వాలు ఉండవు.హింస ఉండదు.**TheState withers away**.వేదంసాధించ దలచిందిఈ మానవతా సమాజాన్ని!ఇది ఆదర్శం. ఆదర్శం ఇంతసమున్నతం అయినసమాజాన్ని పాశ్చాత్యపిండారీలు ఆటవికం అన్నారండీ!

వ్యక్తినీతి ీద ఆధార పడిందివేద సమాజం. రాజనీతిీద ఆధారపడింది పాశ్చాత్యసమాజం. అది వ్యక్తిఅంనీతిపరుడు అయ్యేసామాగ్రి సొంతం సమకూరుస్తుంది.నలుగురు చూడడానికి'న్యాయం' నటిస్తుంది.మనం ఇప్పుడు వారి అడుగులకేకదామడుగులుద్దుతున్నాం!ఆలోచించండి.

## యజ్ఞం- మానవ శరీరం

యజ్ఞానికిఅగ్ని, ఆజ్యం, సంధ అత్యవసరం.అగ్ని అంటే వేడి, వెలుగు.సమస్త ప్రపంచం, సమస్తప్రాణులు అగ్ని మూలంగానేజీంస్తున్నాయి. అగ్ని ఆరిపోయిన్నాడుఅంతరిస్తున్నాయి. ఈ సూత్రంగ్రహ నక్షత్రాదులకుసహితం వర్తిస్తుంది.సృష్టి సొంతం అశాశ్వతం. పరమాత్మకుతప్ప ఏ పదార్థానికి శాశ్వతంలేదు.

యజ్ఞానికివాడే అగ్ని మానవదేహంలో ఉంది.అది ఉన్నంతసేపే జీంతదీపం వెలుగుతుంది.ఒకరు నంృనా నమ్మకున్నా- ంశ్వాసంఉన్నా లేకున్నాఅర్థం అయినా, కాకున్నా మానవశరీరంలో నిత్య యజ్ఞాగ్నికాపురం ఉంటున్నది. జ్ఞానంకలవాడు ఈ ంషయం గుర్తిస్తాడు.యజ్ఞం స్వంతం కోసంమాత్రం కాదు. మానవకళ్యాణం - లోక కళ్యాణం- జీవకారుణ్యం కోసం.కావున జ్ఞాని తనజీంతాన్ని మానవకళ్యాణానికి అర్పిస్తాడు.అంకితం చేస్తాడు.

అగ్నినిరంతరం ప్రజ్వరిల్లుతుండాలి.ఇది ఆరడానికి ల్లేదు.మానవుని తొలికర్తవ్యం జీంచడం.అతని తొలి హక్కుజీంచడం. "శరీరమాద్యంఖలు ధర్మసాధనం"ధర్మంసాధించాలంటేతొలుత కావలసిందిదేహం.

అగ్నినిత్యం జ్వలించడానికిసంధ కావాలి. అన్నంనరుని దేహానికిసంధ అవుతుంది.అందుకే వేదం అన్నానికిఅధిక ప్రాధాన్యతఇచ్చింది.

**'అన్నం వైదేవా అర్క ఇతి వదన్తి''అన్నం వై వాజః ' 'అన్నం వైభూతానామాత్మా'అన్నం ప్రాణాః ' 'అన్నంప్రాణమన్న మపానమాహుః' 'రేతోవా అన్నం'**

మానవుడుఅన్నం జీంచడానికిమాత్రమే తినాలి.తినడానికి జీంచరాదు.ఈ అన్నం భగవత్ప్రసాదం. దీనిని భగవంతుడుప్రసాదించిన జీంతంనిలుపడానికి భుజించారు.అన్నార్తులకు అన్నంపెట్టడం యజ్ఞమేఅవుతుంది. మనంపెట్టిన అన్నంఅన్నార్తుడు తినడాన్నిచూడడంలో ఆనందంఉంది. ఆనందమే యజ్ఞఫలం.

అన్నంజీంచడానికి జీంతంమానవ కళ్యాణానికింజ్ఞాని అయినవాడుగుర్తిస్తాడు. ఆచరిస్తాడు.

అన్నంఅగ్నిని నిలుపడానికి మాత్రమేఅగ్నిని ప్రజ్వరిల్లచేయాలి.అందుకు ఆజ్యం అవసరం.జ్ఞానం ఆజ్యం అవుతుంది.జ్ఞానంతో అగ్ని జ్వలిస్తుంది.ప్రకాశిస్తుంది. కాంతివంతంఅవుతుంది. జ్ఞానాగ్నితోఆత్మదర్శనం కలుగుతుంది.తానెవరు?

**మానవదేహంలోనేసకల దేవతలూనివసిస్తున్నారు. ఈ దేహందేవతల సదనం.అవయవాల అధిష్ఠానదేవతలనుఉపనిషత్తులు ివరించాయి.తానెవరు? దేవతలకునివాస గృహం. ఇంద్రాదిసకల దేవతలుతనలోనే ఉన్నారు.అన్ని శక్తులు తనవే!తాను సర్వశక్తిమంతుడుసకలం సాధించగలడు.ఈ దేహంలోపరమాత్మ ఉన్నాడు.తన ఆత్మ పరమాత్మస్వరూపం ఇది ఆత్మదర్శనంఅవుతుంది.**

తానుఇంతటి శక్తిమంతుడు.అణు ిస్ఫోటనంఅంతటిశక్తి తనలోఉంది. ఈ శక్తిని దేనికిఉపయోగించాలి.**శక్తింనాశనానికీ , కళ్యాణానికీరెంటికీ ఉపకరిస్తుంది.ఈ శక్తి మానవ కళ్యాణానికి,సమాజిక కళ్యాణానికీ,జగత్ కళ్యాణానికీఅని గుర్తించడం ఆత్మజ్ఞానం అవుతుంది.ఆత్మ దర్శనం లేనిఆత్మజ్ఞానం అసాధ్యం.**

వృత్రాసురవధ ిషయంలోదేవతలు దధీచిదగ్గరికి వస్తారు. దధీచిదేహదానంఅర్థిస్తారు. అతని వెన్నెముకతోవజ్రాయుధంచేయాల్సివుంది.దేహాన్ని గురించిదధీచి అన్నమాటలు శ్రీ మహాభాగవతం నుండి:-

**"ఈ శరీరము నశించునది.ప్రాణికోటి యెడలదయ చూపుట ధర్మమగును.ప్రాణులు దుఃఖమునుచూచి దుఃఖించుటసుఖమును చూచిసుఖించుట అక్షయధర్మము. ప్రపంచమునధనము, పుత్రులు,జ్ఞాతులు, తుదకుశరీరము పనికి వచ్చునంకావు. ఈ శరీరము తుదకుకుక్కల పాలో, నక్కలపాలో అగుచున్నది.అట్టి శరీరము పరోపకారమునకుఉపయోగపడిన అంతకుఁంచి కావలిసినదియేుఁ?"**

అట్లనియోగ బలమునదధీచి తనఆత్మను పరమాత్మలోలీనం చేశాడు.దేహాన్ని దేవతలకుఇచ్చాడు.

అట్లనిఅంతా దధీచులు,శిబి చక్రవర్తులు,అలర్కులు కాలేరు.శక్తి ఉన్నంతలోభూతదయ,మానవ కళ్యాణానికిసహాయ పడడమేయజ్ఞం అవుతుంది.ఈ యజ్ఞం ఎవరికి సాధ్యమైనంతవారు చేయాలి. ఇదేమహా యజ్ఞం!

"శతవల్మఃిరోహ" అంటుందియజుర్వేదం. నూరేళ్ళువర్థిల్లు అని దానిఅర్థం. మానవుడునూరేళ్లు వర్ధిల్లాలి.నిండు పున్నఁ చంద్రునిలాజీఁంచాలి. చంద్రునివలె సమస్త ప్రాణిజాలానికీ ఉపయోగపడాలి.

"దిఁతేజన్మ పరమన్తరిక్షేతవనాభిః

పృథివ్యామధియోనిరత్"యజుర్వేదం 11-12

నీజన్మ దిఁలో- ిశిష్టమగు అంతరిక్షంలోనీ నాభి- నీ జన్మస్థానం పృథిఁ అగుచున్నది.

**గీతాయజ్ఞం**

శ్రీ కృష్ణపరమాత్మ శ్రీమద్భగవద్గీతలోఆరు యజ్ఞాలనుగురించి ప్రవచించారు.

ద్రవ్యయజ్ఞ తపో యజ్ఞయోగ యజ్ఞాస్థథాపరే।

స్వాధ్యాయయజ్ఞ జ్ఞానయజ్ఞశ్చ యతయఃసంశిత వ్రతాః ।

1. ద్రవ్యయజ్ఞం. ద్రవ్యంన్యాయంగా, ధర్మంగాఆర్జించాలి. అన్యాయార్జనమనస్తాపానికి కారణంఅవుతుంది. ఆర్జించినధనాన్ని ధర్మకార్యాలకు వెచ్చించాలి.

2. తాపయజ్ఞం. తాపం అంటేదేహాన్ని తపింపచేయడం కాదు.జ్ఞానాగ్నిలో ఆత్మనుతపింపచేయడం-తేజోవంతంచేయడం, దీపంవలె తననుతాను కాల్చుకోవడంలోకానికి కాంతి ప్రసాదించడం.

3. స్వాధ్యాయయజ్ఞం. ఇది కేవలంఅధ్యయనం చేయడంకాదు. స్వయంగా శ్రమించిఅర్థం చేసుకొన్న దానినిమానవ కళ్యాణానికిఆహుతి చేయడం,ఆహుతిలోకాంతి ఉంది. వెలుగుంది.ప్రకాశం ఉంది.

4. యోగయజ్ఞం, యమనియమాదుల ద్వారామనసు మీద అధికారంసాధించడం. **మనసునుకనిపెట్టనివాడు అవయవాలకుబానిస! ఇది తనకుతాను బానిస కావడం.తనను తానే నాశనంచేసుకోవడం. మనసుమీద అధికారం సాధించినవానికిఅవయాలు ఊడిగంచేస్తాయి.మానసిక శక్తి గలవాడుసకలం సాధించవచ్చు.**

5. జ్ఞానయజ్ఞం. ఇది తిమిరంతోసమరం. ఈలోకం అజ్ఞానాంధకారంలోఉంది. మానవుడుతానెవరు? ఎందుకు పుట్టాడు?ఏం చేయాలి? ఇవి తెలియకున్నాడు.వీటిని తెలిసికోవడం,తెలియపరచడంజ్ఞాన యజ్ఞంఅవుతుంది. జ్ఞానయజ్ఞం పరమాత్మనుదర్శింపచేస్తుంది.

6. సంశితయజ్ఞం. ఇది అంతర్గతకామక్రోధాది శత్రువులనుఅదుపులో ఉంచడం.వాటికి లొంగకుండడం.నియతవ్రతుడైకర్మలు ఆచరించడం.

అహంక్రతురహంయజ్ఞం స్వధాహమహమౌషధం

మంత్రో%హమహమేవాజ్యమహమగ్నిరహం హుతం- గీత 9-16

నేనేక్రతువును, నేనేయజ్ఞమును,నేనే స్వధను, నేనేఔషధిని, నేనే మంత్రమును,నేనే అజ్యమును,నేనే అగ్నిని, నేనేఆహుతిని
**పరమాత్మలోయజ్ఞాన్నీ - యజ్ఞంలోపరమాత్మను దర్శించడంపరమ యజ్ఞం అవుతుంది.**

**వేదం-చదవడం**

వేదంమానవ జాతికిపరమాత్మ ప్రసాదించినతొలి అక్షర గ్రంథం. వేదంవిషయంలో శ్రద్ధకావాలి. శ్రద్ధావాన్లభతే జ్ఞానం.శ్రద్ధ కలవానికిజ్ఞానం లభిస్తుంది.

వేదాధ్యయనానికి◌ధి నిషేధాలు లేవు.తిట్టడానికీ చదవచ్చు.అభ్యంతరం లేదు.అతడు బరువు మోసినవాడవుతాడు. అందులోనిపదార్థం అతనికి తెలియదు.అతడూ నేర్చుకుంటాడు-తిట్లు!

వేదంరామాయణ, భారతాదులవంటి కథా కావ్యంకాదు. వేదం కర్మసాహిత్యం.చదవడం కొద్దిగాకష్టం అనిపిస్తుంది. చది◌నవేమళ్లీ చదవాల్సిరావచ్చు. ఒక్కొక్కచోట◌సుగూ కలుగవచ్చు.ఇది జీ◌తం లాంటిది.జీ◌తంలో చేసినపనులే చేసేది,అప్పుడప్పుడు ◌సుగూ కలుగుతుంది.

## జీ◌తమేవేదం. వేదమేజీ◌తం

వ్యర్థజీ◌నరకం చూస్తాడు, సార్థకజీ◌కి అమృతం లభిస్తుంది.వేదం - జీ◌తం రెంటిలోనూ కష్టం తప్పక ఫలిస్తుంది.

వేదంవైరాగ్యం బోధిస్తుందిఅనేది కేవలం అపప్రథ.వేదం జీ◌త ◌రాట్స్వరూపాన్ని దర్శనం చేయిస్తుంది.జీ◌తం ◌శ్వరూపి . జీ◌తానిది◌రాట్ స్వరూపం. దాన్ని దర్శించకలగాలికష్టమే మరి! వేదందర్శనం చేయిస్తుంది.

**నాకుఅర్థం అయినంత వరకువేద, వేదాంతాలుసార్థక జీ◌తాన్ని ప్రబోధిస్తున్నాయిజీ◌త సుధనుఅందిస్తున్నాయి. వైరాగ్యంబోధించినా జీవనగమనానికే ఉపదేశిస్తున్నాయి.**

వేదవేదాంగాలనువయస్సు మళ్ళినవారూ,చావు దగ్గర పడ్డవారూచదవాలనడంపచ్చి పిచ్చిమాట.వాటి నిండా జీ◌తంపరచుకొని ఉంది. బతకాల్సినవాళ్లుచదవాలి. యువతీయువకులు చదవాలి.వాటిలో వారు నేర్చుకునే◌చాలా ఉన్నాయి. వయసుమళ్లినవారు నేర్చుకోవలసినదిఏముంటుంది? అయినా జ్ఞానతృష్ణతీరని వారికి భారతతాత్వికత కల్పతరువు.

పూవునుపట్టుకొని వాసన చూడపనిలేదు.ఇంట్లో ఉన్నా పరిమళంవ్యాపిస్తుంది. వేదంఒక పూదోట. ఇంట పెట్టుకోండిపరిమళిస్తుంది!

## అంకితం-పితరులు

మనకుపితరులు దేవతలు.మనుష్యావై జాగరితంపితరః సుప్తమ్ - మెళుకువతోఉన్నవారు మనుష్యులు,నిద్రిస్తున్నవారుపితరులు.

మనకుపితరుల వలననేరూప గుణాదులు, ◌ద్యాబుద్ధులులభిస్తున్నాయి.**ఏడుతరాల వారి గుణగణాలుముఖ్యంగా పైమూడుతరాల ప్రభావంమన ◌ద ఉంటుంది.వైద్య శాస్త్రం దీన్నిగ్రహించాల్సిఉంది!**

పితరులుమనకు చాలా ఇచ్చారు.కృతజ్ఞతా పూర్వకంగా వారికిశ్రాద్ధాలు పెడ్తున్నాం.తీరని వాటిలోపితృ ఋణం ఒకటి.అది తీర్చరానిది. ఋగ్వేదసంహితను

మాపితామహులకుఅంకితం సమర్పించాను.ఈ శుక్ల యజుర్వేదసంహితను మామతామహులుకీర్తిశేషులు శ్రీమాన్‌గోవర్ధనం భట్టరాచార్యులవారికి శ్రీమతి సీతమ్మకుశ్రద్ధాభక్తి సమన్వితంగాఅంకితం సమర్పిస్తున్నాను.

**అంకితం-ప్రచురణ**

“వాగర్థావిసంపృక్తౌ”అన్నాడుకవికుల గురువు కాళిదాసు.జగత్పితరులనుగురించి. ఇది సరిగ్గా రచయితలకూప్రచురణకర్తలకూవర్తిస్తుంది. రచయితదివాక్కు. ప్రచురణకర్తదిఅర్థం.

కేవలంభగవదనుగ్రహంవలన నాలుగువేదాల అనువాదంచేయగలిగాను.తొలుతనే విన్నవించాను.అచ్చుకు ఆర్థిక సాయం చేయడానికికొందరు ముందుకు వచ్చారు.నాకు కావలసింది అచ్చుమాత్రంకాదు. పుస్తకం సాధారణజనానికి అందడం. అందుకుసమర్థుడైన ప్రచురణకర్తఅవసర్త. నాకు అర్థించడంరాదు. నిరీక్షించాను.

**దైవికంగావిచిత్రం జరిగింది.విచిత్రాలు దైవికంగానేజరుగుతాయి!**

ఆ రోజుప్రమాది కార్తీక కృష్ణసప్తమి 28-11-99 ఆదివారం సాయంత్రం,వర్జ్యం లేని 5.00గంటల ప్రాంతం. ఒకయువకుడు పండ్లసంచితో మా ఇంటికివచ్చారు. టేబుల్‌మీద ఫలాల సంచీపెట్టారు. “ **నా పేరు దూపాటివిజయకుమార్. నేనుఎమెస్కో ప్రచురణలతరపున వచ్చాను”అన్నారు.**

వారునన్ను ఒక సమావేశానికిఆహ్వానించడానికివచ్చారు. ఆ తేదీనాకు అనుకూలంగా లేదుఅన్నాను. అంతటితోవారు వచ్చిన పనితీరిపోయింది. ముచ్చటపుస్తకాలమీదికి మళ్ళింది.ఇద్దరిదీ ఒకేలోకం - కాలంగడిచిపోతున్నది.

కావాలనికాదు -వేదం ప్రస్తావనవచ్చింది. ఆరుబైండ్లుగాఉన్న వ్రాత ప్రతుల్నివారికి చూపించాను. దైవికంగావారికి వేదం విషయంలోశ్రద్ధాసక్తులు ఏర్పడ్డాయి.

“మేంవేదం ప్రచురిస్తున్నాం”అన్నారు.

ఎమెస్కోవారు1969లో నా తొలి నవల“చిల్లరదేవుళ్ళు”ప్రచురించారు. వారు సమర్థులు.వేదం జనానికి అందించగలరు.నా గుండె గంతులువేసింది. ఇది భగవత్ప్రసాదం. అంగీకరించాను.

కార్తీకకృష్ణ దశమి గురువారం ఉదయం8.00 గంటలకు విజయకుమార్‌వచ్చారు. శుక్ల యజుర్వేదంవ్రాతప్రతి అందుకున్నారు.అచ్చుకిస్తున్నానన్నారు.‘ఎమెస్కో ఆర్షభారతి’పక్షాన ప్రచురిస్తామన్నారు.ప్రమాది మార్గశీర్షత్రయోదశి 04-01-2000మంగళవారం విజయవాడలోస్వామి అమృతానంద ఆవిష్కరిస్తారన్నారు.

అదినాకు అమృతవార్త.

ఆ ముహూర్తానికేఆవిష్కరణ జరుగుతున్నది.అది భగవదనుగ్రహం.

**వాంఙ్లవారి నుంచి ప్రమాధివరకు ఎవరు తలపెట్టని ఆంధ్రవచనవేదాలను ప్రచురిస్తున్నందుకునేనూ, ఆంధ్ర ప్రజానికం'ఎమెస్కో ఆర్షభారతి'కికృతజ్ఞతలుతెలుపుకుంటున్నాం.**

ఎమెస్కోఆర్ష భారతికి పరమపితపరాత్పరుడు ఆయురారోగ్యఐశ్వర్యాలను కలిగించాలనిప్రార్థిస్తున్నాను.

ఈ గ్రంథంశుద్ధప్రతి తయారుకావటంలో ఎంతో శ్రమకోర్చినచిరంజీవులు దుర్గంపూడి చంద్రశేఖరరెడ్డి, (ఆంధ్రసారస్వతపరిషత్ - హైదరాబాద్)శిష్టి లక్ష్మీ సత్యనారాయణశర్మ ( సంస్కృత విభాగం,హిందూ ఉన్నతపాఠశాల, విజయవాడ)లకు నా శుభాశ్శీస్సులు,వారు వేద భాస్కరానుగ్రహపాత్రులగుదురుగాక.

సర్వేపిసుఖినస్సంతు -అంతా సుఖించాలి.

సర్వేసంతునిరామయా - అంతావ్యాధిరహితులుకావాలి.

సర్వేభద్రాణి పశ్యంతు-అంతా శుభాలు చూడాలి.

మాకశ్చిద్దుఃఖభాగ్భవేత్-ఏ ఒక్కడూ దుఃఖ భాజనుడుకారాదు.

ప్రమాధిమార్గశీర్ష కృష్ణ పంచమిసోమవారం

27-12-1999

**డాక్టర్దాశరథి రంగాచార్య**

సికిందరాబాదు.

**శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణం చతుర్భుజం।**
**ప్రసన్నవదనంధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥**

## మొదటిఅధ్యాయము

జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతిం।

ఆధారంస్సర్వ విద్యానం హయగ్రీవముపాస్మహే ॥

**1.ఓం ఇషేత్వోర్జేత్వా వాయవస్థాదేవోవః**
**సంతా ప్రార్పయతు శ్రేష్ఠతమాయకర్మణ**
**ఆప్యాయధ్వమఘ్న్యాఇంద్రాయభాగంప్రజావతీరనమీవా**

**అయుక్ష్మా మా వస్తేనఈశత మాఘశ ◌సో ధృవా**
**అస్మిన్గోపతౌ స్యాతబహ్వీర్యజమానస్యపశూన్పాహి**

పలాశలేక శ◌ు శాఖా! వర్షముకొరకును, అన్నము, బలముకొరకును నిన్ను కొట్టుచున్నాను.

ఓ దూడా!నీవు వాయుదేవతాస్వరూపమవు. వెళ్లుము,మేయుము. స◌త నిన్నుమరల త్రిప్పి పంపును.సూర్యాస్తమయముఅయినంత తిరిగిరమ్ము.

అహింసనీయగోవులారా! ఇంద్రునిభాగపు పాలను చన్నులందుసురక్షితంగ ఉంచండి. పాలుపితుకునపుడుశ్రేష్ఠతమ కర్మమగుయజ్ఞము కొరకు సమృద్ధిగాపాలు ఇవ్వండి. ◌ురు సంతానవతులుకండి. రోగరహితులుకండి. ◌ుమ్ము దొంగలు,కసాయీలు, వ్యాధుడువశపరచుకొనరాదు.◌ురందరు గోపతి - యజమాని-వద్దనే స్థిరముగాఉండండి.

**ఆలోచనామృతము**

వేదమునపలాశమునకు ఎంతోప్రాధాన్యత ఇచ్చినాడు.పలాశమనగా మోదుగు.

1. సర్వేషంవా సహవనస్పతీనంయోనిర్యత్పలాశః

2. తేజోవైబ్రహ్మవర్చసంవనస్పతీనాం పలాశః

3 బ్రహ్మ వైపలాశస్య పలాసమ్- పత్రం

4 సోమోవైపలాశః

శ◌ుఅనగా జ◌్మ.

**1. శంవైప్రజాపతిఃప్రజాభ్యః శ◌ుపలాశైకురుత**

మోదుగుకొద్దికాలము క్రితముఊరుబయట ◌రి◌గా కనిపించెడిది.మోదుగు ఆకును బ్రహ్మస్వరూపముఅన్నారు. మా బాల్యమునుమేము మోదుగాకు ◌స్తళ్ళలోభోజనము చేసినాముఏవో ఔషధి ◌లువలుఉన్నట్లున్నది.

ఆకుపచ్చని◌స్తరి - తెల్లనిఅన్నము- పసుపు పచ్చనిపప్పు- ఎర్రని ఊరగాయ వడ్డించిన ◌స్తరిపంచరంగులతో కంటికిఇంపుగా ఉండునది.

పలాశముపుష్పించుట వసంతాగమనచిహ్నము.పుష్పించిన పలాశవృక్షమునఆకులుండవు చెట్టుపొంతము పూయును.మోదుగు పూవు నిప్పుకణికవలెఉండును.

పూసినమోదుగు జ్వాలలుదాల్చినట్లుండును.

నేను“మోదుగుపూలు” అనునవల వ్రాసినాను.

జమ్మిచింతవలెదట్టముగా ఉండువృక్షము. చెట్టుమీద ఉన్న వస్తువుకనిపించనంత గుబురు.అజ్ఞాతవాసమునపాండవులు జమ్మిచెట్టుమీదనే ఆయుధములుదాచినారు. శమీ వృక్షమునఅగ్ని దాగి ఉన్నది.

వృక్షములుమానవుని సంరక్షించును.ఈ విషయమును ఏనాడోవేదము గుర్తించినది.దీనిని గుర్తించక ఆధునికులుఅరణ్యములనుధ్వంసము చేసినారు.ఇప్పుడు విలపించుచున్నారు!

కొమ్మనుకొట్టుటకు గల కారణమునువృక్షమునకు చెప్పికొమ్మను కొట్టుటఈ మంత్రము నందుచెప్పబడినది.వృక్షమును 'యజమానస్యపశూన్పాహి' అని ప్రార్థించుచున్నాడు.వృక్షమునకు దేవతఅంతటి గౌరవముఇచ్చి రక్షించుకున్నదివేదము.

**"యద్యప్యచేతనాశాఖా తథాపితదభిమానినీందేవతాముద్దిశ్యైవముక్తమ్"**మహీధరవ్యాఖ్య.

మోదుగు, జమ్మి చెట్లఓషధీవిలువలనుతెలిసికొనవలసిఉన్నది. నిమ్మ, వేప,తులసి వృక్షములనువలె మీటివిలువలనుకూడా ఆమెరికన్లు తెలిసికొందురేమో!

పాలిచ్చుగోవులు యక్ష్మాదిరోగములు లేకుండవలెనుఅన్నాడు. అని దొంగలు,కసాయీలు, వేటగాళ్ళపాలుకారాదన్నాడు.

గోవుతన స్తనమునందలిపాలు దేవకార్యమునకుభద్రపరచవలెనట!పితుకునప్పుడు పాలుసమృద్ధిగా ఇవ్వవలెనట!!!ఎందు కొరకు?

"శ్రేష్ఠతమాయకర్మణ" అని శ్రేష్ఠతమమగు యజ్ఞమునకు- మానవ కళ్యాణమునకుఉపయోగపడవలెనట!!!

ఎంతటిఉదాత్త - ఉన్నతఆలోచన!

చంద్రునిమీద అడుగు పెట్టినామనిగర్వించు నాగరికత ఆలోచించగలదా?

ఈ మంత్రపుఅర్థము ఇట్లుకూడచెప్పుకొనవచ్చును:-

మానవుడుఅన్నము ఆర్జించుటకుశ్రమించవలెను.అతడు అన్నమువలన బలవంతుడుకావలెను. రోగములులేనివాడు కావలెను.

బలవంతుడుఆరోగ్యవంతుడై శ్రేష్ఠతమమగుమానవ కళ్యాణముచేయవలెను.పాలించువారు పాపిష్ఠులు,దొంగలు కాకుండా మానవుడుఅప్రమత్తుడు కావలెను.

2. పవిత్రమా!నీవు యజ్ఞ సాధనములగుదుగ్ధములనుపవిత్రము చేయుదానవు.

ఓ పెళ్లెరమా!నీవు ద్యులోకమవు.భూలోకమవు.నీవు దివ్వెను ధరించుదానవు.

దీపమా!నీవు అందరును భరించుదానవు.నీవు ఉత్తమ తేజముగలఅగ్ని కన్న దృఢతరమవగుము. నీవు వంకరకాకుము.యజ్ఞస్వాఁు సహితమునిన్ను వంకర చేయజాలకుండవలెను.

**ఆలోచనామృతము**

*పఁత్రముఅనగా రెండు మూడు దర్భలతోచేసినది.*

*ఆరోగ్యవంతములగుపాలనుగురించి తొలిమంత్రమునచెప్పినవాడు. అట్లయ్యుపాలను పఁత్రము చేయుటకు దర్భలనువాడవలెననుచున్నాడు.*

*దర్భలుపఁత్రము చేయుటకుఉపయోగపడునఁ.*

*దీపమేకదా వెలుగు నిచ్చునది.నూనె దివ్వె అయినను,ఁద్యుద్దీపమైననుసరిగా వెలుగవలెను.వంకరగా వెలిగిన ప్రమాదముకలిగించును. ఎంతటివాడును దీపమును,అగ్నిని దురుపయోగము చేయకుండవలెను.*

***మరొకఅర్థము:-***

మానవుడేవసువు. ద్యులోకము.భూలోకము. పర్వముమానవుడే. మానవుడుమహిమాన్వితుడు.అతడు తన మహిమనుసంకరపనులకు- దుష్కార్యములకుఁనియోగించరాదు.

3. పఁత్రమా!శతధారల దుగ్ధములనుపఁత్రము చేయుదానవు.సహస్రధార దుగ్ధములనుపఁత్రము చేయుదానవు.

(అట్లనిపఁత్రమును పాలపాత్రలోవేయవలెను)

క్షీరమా!సఁత పఁత్రము చేయువాడు.అతడు శతధారపఁత్రముననిన్ను పావనముచేయును గాత.

పాలుపితికినవాడా! నీవుఏ ఆవు పాలు పితికినావు?

4. (ఆపాలనిచ్చిన) గోవుఁశ్వాయువు. ఁశ్వమునునిర్మించునది. ఁశ్వమునుపోషించునది.

తోడుకొనుటకుపాత్రలో ఉంచినక్షీరమా! నీవు ఇంద్రస్వరూపమవు.పెరుగు చేయుటకునీలో తోడువేయుచున్నాను.

ఁష్ణూ!హవనీయమగుదధిరూప దుగ్ధమునురక్షింపుము.

**ఆలోచనామృతము**

*పాలనుపంత్రముచే శుద్ధముచేయుట ఈ రోజులలోయాంత్రికముగా పాలనుపరిశుభ్రపరచుటవంటిది.*

*పెరుగుపాలకన్న బలప్రదము,ఆరోగ్యకరమని ఈ మధ్యఅమెరికాలో చేసినపరిశోధన వలనవెల్లెడి అయినది.వేదకాలమునఎన్ని పరిశోధనలుచేసి పెరుగును కనుగొనిఉందురు?*

*మనగొప్పతనమునమనము గుర్తించుటలేదు! బయటవాడుచెప్పిన చంకలుకొట్టుచున్నాము.*

*పెరుగుఎంతటి పంత్రమైనదనిన 'ంష్ణో హవ్యంరక్ష' అనుచున్నాడు.*

*పాలు, పెరుగు ంషయమున అంతటిజాగ్రత్త అవసరము.*

5. అగ్నీ!నీవు యజ్ఞపాలకుడవు.నేను వ్రతమునుపూర్తిచేయదలచినాను.నాలో వ్రతముపూర్తి చేయు సామర్థ్యముపెంపొందించుము. నీ కృపవలనవ్రతము పూర్తికానిఅసత్యము నుండియజ్ఞమునుపూర్తిచేసిన సత్యమునుచేరుకొందును.

**" ఇహమహమనృతాత్సత్యముపైం."**

**ఆలోచనామృతము**

*అగ్నిని "వ్రతపతే" అన్నాడు. వ్రతమునుపూర్తి చేయుటకుప్రాణము ముఖ్యము*

*"ప్రాణోవాఅగ్నిః"* అన్నాడు. దేహమునవేడి - జీవము- ఉన్నకదా వ్రతసమాప్తి!అందుకే అగ్నిని ప్రార్థించుట. *"శరీరమాద్యం ఖలుధర్మ సాధనం" దేహమేకదా అన్ని ధర్మములుసాధించునది!*

వ్రతముమాత్రమేకాదుఏదైనను చేయుదుననిచేయకుండుటఅనృతము అసత్యముఅగును. అందువలనఅనృతదోషము కలుగును.ఒక పనిని పూర్తిచేయుటఅచ్చపు మానవప్రయత్నమునసాధ్యము కాదు. దైవమునుఆశ్రయించిననే పనిపూర్తి అగును. సత్యముఫలించును.

6. (యజ్ఞముప్రారంభించునపుడుజలమునకు ప్రణంల్లి)

**జలపూర్ణపాత్రా!**నిన్నుఈ కర్మమున నియంంచినవారెవరు?నిన్ను ప్రజాపతియేనియంంచినాడు.

**పాత్రా!**ఎవరికొరకు నిన్ను ఆ ప్రజాపతినియంంచినాడు? అగ్నికొరకును యజ్ఞం కొరకునునిన్ను నియంంచినాడు.

శూర్ప- అగ్నిహోత్రహవణే!ఁ ఇరువురను యజ్ఞంకొరకు గాను అందుకొనుచున్నాను.**శూర్పము- చేట**

7.( ఆ రెంటిని నిప్పుకు కాపుచు)

రాక్షసులుదగ్ధము చేయబడినారు.దానము చేయనివారుఅదాతలు - దగ్ధముచేయబడినారు.ఇక నేను ిస్తృత అంతరిక్షమునప్రవేశింతును.

**"ఉర్వంతరిక్షమన్వేఁ"**

**8.**(హ౦స్సులు వహించుశకటము అగ్నితో అనుచున్నది)

నీవుహింసించువాడవు.హింసించు రాక్షసులనుహింసించుము.మమ్ము హింసించువారినిహింసించుము.మేము హింసించువారినిహింసించుము.

శకటమా!నీవు దేవతలవాహనమవు.భక్తుడవు. పాలకుడవు.ప్రియతముడవు.ఆహ్వానకర్తవు.

9. శకటమా!కుటిలుడవుకాకుము. సాధుస్వభావుడవగుము.దృఢతరమవగుము.వంగి పడకుము. యజ్ఞపతిసహితము నిన్నువంచకుండును గాత.

శకటమా!నీ ఁద ిష్ణువు ఎక్కవలెను.వాయువు ప్రవేశించునట్లుిస్తరింపుము. పిడికెడుయువలుమాకు ప్రయోగార్థముప్రదానము చేయుము.

10.నేను స౦త ఆజ్ఞప్రకారముప్రవర్తించు అధ్వర్యుడను.హ౦!
అశ్వినులబాహువులతోను,పూష హస్తములతోనునిన్ను పట్టుకొనుచున్నాను.నీవు అగ్నికి ప్రీతికరమవగుహ౦౦. నిన్ను పట్టుకొనుచున్నాను.నీవు అగ్ని సోములకుప్రీతికరమగు హ౦౦.నిన్ను పట్టుకొనుచున్నాను.

11.9వ మంత్రమునందలి పిడికెడుగింజల గురించి చెప్పుచున్నాడు:-

ఇ౦భూఁలో ిత్తిఎక్కువ చేయుటకుఉంచినాను. దానముతప్పించుకొనుటకుఁగల్చలేదు.

తూర్పునఆదిత్యుని దర్శింతును.భూఁఁద గృహములుస్థిరములుగా ఉండవలెను.

నేనుిశాల అంతరిక్షమునుఅందుకొందును.

10వమంత్రము నందలిహ౦ని గురించి చెప్పుచున్నాడు:-

అందుకున్నహ౦! నిన్ను పృథ్వినాభియందు - అదితివడిలో- ఉంచు చున్నాను।గ్ని!నీవు హవనయోగ్య యవలనురక్షింపుము.

**ఆలోచనామృతము**

గింజలు,సంపద ుగిలించుకొనుటకు- దానము ఎగగొట్టుటకు- దాయకూడదు. వాటినిపెంపొందించునట్లుసదుపయేగమగునట్లుఉపయోగించవలెను.

భూగర్భమునదాచిన - ోత్తనముచల్లిన - గింజమొలకెత్తి పెరుగుటకువేడి - అగ్ని - అవసరముఅందువలన అగ్నిప్రార్థన.

వ్యవసాయమునకుసూర్యుడు సహకరించవలెను.ఇండ్లను పెరికి వేయుతుఫానులు రాకుండవలెను.

అట్లయిఅందరు సహకరించిపంట చేతికి వచ్చినరైతు ఆకాశము అందుకున్నంతమురిసిపోవును."**ఉర్వన్త రిక్ష మన్వేు**"

12.కుశ పంత్రమా! నీవుపంత్రము చేయుదానవు.ష్ణు స్వరూపవు.

జనులారా!నేను సంత ఆజ్ఞప్రకారం వర్తించువాడను.అచ్ఛిద్ర పంత్రమునను- సూర్యరశ్మి యందునుపావనము చేయుదును.

జలమా!నీవు సంద్రము వైపుసాగువాడవు - సోమరసపానముచేయువాడవు.మేము చేయుచున్న'దర్శపూర్ణ మాస, యజ్ఞమునుసఫలము చేయుము.అట్లే బహుదక్షిణలిచ్చుయజ్ఞస్వాుని - దేవకాుయజమానిని-సఫలీకృతులనుచేయుము.

"**సయోహైవంంద్వానగ్ని హోత్రంచజుహోతి దర్శపూర్ణాభ్యాంచయజతే మాసిమాసి హైవాశ్చమేధేనేష్టంభవతి**"అనిశపథము.

అగ్నిహోత్రమును.ంద్వాంసులు పూజించుట- నెల నెల యజించుటఅశ్వమేధమందలిఇష్టి అగును. అదియేదర్శపూర్ణమాస యజ్ఞం.

అమావాస్యనుండి అమావాస్య వరకుగల కాలమును మాసముగాపరిగణించుట జరిగినది.

13.జలమా! వృత్రవధసమయమున ఇంద్రుడునిన్ను వరించువాడు.ఇప్పుడు నీవు శత్రువధకొరకుఇంద్రుని వరింపుము.నీవు ప్రోక్షితువైనావు.

హం!నిన్ను అగ్నికి ప్రీతికరముచేసినాను. ప్రోక్షించినాను.అగ్నిసోములకు ప్రీతికరమగునిన్ను కుశలచేమార్జితము చేసినాను.దేవతలనుగూర్చి చేయు యజ్ఞముకొరకు నీవు పరిశుద్ధడవగుము.

తండులములారా!నిన్ను దాసాదులుపట్టునప్పుడు అపరిశుద్ధమైనంతభాగము పరిశుద్ధమగుటకు దర్భలతోజలము చల్లిపరిశుద్ధము చేయుదును.

దర్భలతోనీళ్లు చల్లుటప్రోక్షించుట అగును.

ఏ ఆయుధముననుచావని వృత్రునిఇంద్రుడు నీటినురగతో వధించాడనివృత్తాంతము.

14.చర్మమా! నిన్నుండిచిన రాక్షసులనుపారద్రోలి నట్లగును.దాతలు కానివారిని దూరప్రాంతములకుతరిునట్లగును.

కృష్ణాజినమా!నీవు అదితి త్వచ- భూుకి అంటి ఉన్నావు.కావున నేల నిన్నుతనదానినిగా భాంచవలెను.

(నేలఁదకృష్ణాజినము పరచవలెను.దాని ఁద రోలు, రోకలినిపెట్టవలెను.)

రోలూ!నీవు రాతితో చేయబడినావు.నీకు కర్రతో చేసినరోకలితో సాంగత్యము.నీ అడుగు వెడల్పుది.పృథ్వి చర్మము వంటికృష్ణాజినము నిన్నుతనవానిగా భాంచవలెను.

ఈ తోలుతిత్తి - దేహమే-రక్కసి కోరికలను లోభిత్వమునకుకారణము.

జింకచర్మము కృష్ణాజినమగును

15.బియ్యపు హిః!నీవు ఆ హవనీయఅగ్ని శరీరమవు. మంత్రపుసర్జమవు (మంత్రపుచివరన తండులములనుఅగ్నికి అర్పించబడును.అందువలన తండులముమంత్రపు సర్జనయగును.)

(రోకలినిచేతపట్టుకొని)

రోకలీ!నీవు కర్రతో పొడుగుగా చేయబడినావు.నీ అడుగు భాగము రాతికన్న కఠినమైనది.నీవు దేవతలకొరకు గాను ఈ తండులహని పిండి చేయుము.చక్కగా పిండి చేయుము.

హచేయువారలారా! రండి.రండి హ చేయువారలారా!“
*హంష్కృదేహిహంష్కృదేహి.”*

16.కుక్కుటమా! నీవు మధురజిహ్వవు.నేడు నీవు మాకువర్షము, అన్నపు కథనిపించుము నీ వలనప్రవృద్ధులమైనమేము రాక్షసులనుగుంపులు గుంపులుగా ఓడింతుముగాక.

చేటా!నీవు వర్షమునవర్ధిల్లినదానవు.(చేటలు చేయువెదురు వర్షమునపెరుగును.) వర్షమునపెరిగిన తండులములునిన్ను తనవానిగాభాంచవలెను.బియ్యమునుచెరగినపుడు

రాక్షసులుచెడినట్లనిపించును.అదాతలు కూడా దూరమైనారు.బియ్యము చెరుగుటవలన

రాక్షసులుచచ్చినట్లయినది.

పొట్టుతోటిబియ్యమా! చేటగాలిుమ్ము వేరు చేయవలెను.శుద్ధములైనతండులములనుస్వర్ణహస్తుడగుసత - సందులేని- చేతులచేగ్రహించునుగాక.

17.మోదుగు కొమ్మ! నిప్పులనుఇటునటు కదిలించుటయందు నీవు సర్వ సమర్థవు.

(నిప్పులనువేరు చేయవలెను.)

గార్హపత్యాగ్నీ!పచ్చి పదార్థములనుపచనము చేయుఅగ్నిని వేరు చేయుము.మృతదేహమును,మాంసాదులను కాల్చుక్రవ్యాద అగ్నిని వేరుచేయుము. కాని దేవతలనుమననము చేయుటకుఉపయుక్తమగు హవనీయఅగ్నిని తెమ్ము.

కపాలమా!నీవు ఎంతో గట్టిదానవు.భూంని గట్టిపరచుము.బ్రాహ్మణులుసంపాదించిన - క్షత్రియులుసంపాదించిన - యజమానిసజాతీయులు సంపాదించినకపాలమా! నా శత్రువధకొరకు నిన్ను అగ్నిఃదకప్పుదును.

కపాలమనగాఅగ్ని ఃద వేయు పేళ్ళుమున్నగు వాని కప్పు-మనిషి పుర్రె కాదు.

18.అగ్నీ! పురోడాశరూప అన్నమునుసంస్కరించు కపాలమునునీపైన ధరించుము.

కపాలమా!నీవు పురోడాశమునుధరించు దానవు.నీవు అంతరిక్షమునుగట్టిపరచుము.బ్రాహ్మణుడువరించిన, క్షత్రియుడువరించిన, యజమానికిసజాతీయుడు వరించినకపాలమును శత్రువధకొరకు అగ్నిఃద ఉంచుచున్నాను.

మరొకకపాలమా! నీవు పురోడాశమునుధరించుదానవు.ద్యులోకమునుదృఢము చేయుముబ్రాహ్మణుడువరించిన - క్షత్రియుడువరించిన - యజమానిసజాతీయుడు వరించిన-ద్వితీయ, తృతీయకపాలములను శత్రువధకొరకు అగ్ని ఃద ఉంచుచున్నాను.

నాలుగవకపాలవగు నిన్ను దిశలుగెలుచుటకు గానుఅగ్నిఃద ఉంచుచున్నాను.

కపాలములారా!ఁమ్ము ఒకదాని పిదప ఒకటిఅగ్నిఃద ఉంచినాను.అట్లు ఒకదాని పిదప మరొకటిగాఉంచబడిన ఃరుఉపచితులై భృగు,అంగిరసుల తపోరూప అనితాపమునకుప్రతప్తులు కండు.

30.బహురూపములుదాల్చి పితరుల'స్వధ'ను భక్షించిజీంచువారును - స్థూల,సూక్ష్మ రూపములు ధరించువారును అగు అందరు అసుర, రాక్షసాదులనుఅగ్ని ఈ యజ్ఞ ప్రదేశమునుండి తరిఁ కొట్టినాడు.

31.పితరులారా! రండి, ఈ పిండస్థలమున ఁనోదించండి.ఃరందరు - ఆబోతువలెఃఃభాగ పిండములనుభక్షించండి. పితరులుఆనందించినారు. ఆబోతువలె స్వేచ్ఛగా తమపిండములను ఆరగించినారు.

32.(ఆరు ఋతువులనుఆరుగురు పితరులుగా భాంచబడినది.యజమాని ఆరుమారులునమస్కరించవలెను)

పితరులారా!రసభూత వసంతమునకు నమస్కరింతును.పితరులారా! శోషింపచేయుగ్రీష్మమున కు నమస్కరింతును.పితరులారా! జీవనదాతయగు వర్షర్తువునకు నమస్కరింతును.పితరులారా! అన్న పాచనశరద్రుతువునకు నమస్కరింతును.పితరులారా! ఘోరస్వరూపయగు హేమంతమునకు నమస్కరింతును.పితరులారా! దాహకారకశిశిర ఋతువునకు నమస్కరింతును.

పితరులారా!కు నమస్కారం. నమస్కారము.పితరులారా! రు మాకుస్త్రీ, పుత్రాదులనుప్రసాదించండి. పితరులారా!ఇంట అన్నాదులు ఉన్నకదాకు పిండాదులు అర్పించకలుగునది!కావున మాకు అన్నాదులుప్రసాదించండి. పితరులారా!ఈ వస్త్రము ధరించండి.(దారము సమర్పించవలెను)

33.పితరులారా! కమలమాలికలుధరించిన అశ్వినులవంటి పుత్రులనునా గృహమునపురుష సంఖ్య పూరించునట్లునా భార్య గర్భమునప్రవేశపెట్టండి.

34.జలమా! అన్నము,అమృతము, ఘృతము,దుగ్ధము, రసము,సుర వహించిస్వధా స్వరూపమవగుము.మా పితరులనుతరింపచేయుము.(జలదానముచేయవలెను.)

దాశరథిరంగాచార్య రచిత
శ్రీమదాంధ్రవచన శుక్లయజుర్వేదసంహిత యందలి
రెండవఅధ్యాయము సమాప్తము.
సర్వేపిసుఖినస్సంతు.

జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతింI

ఆధారస్సర్వద్యానాం హయగ్రీవముపాస్మహేII

## మూడవఅధ్యాయము

1.సంధాగ్నిం దువస్యతఘృతైర్బోధయతాథిమ్।

అస్మిన్హవ్యాజుహోతన॥

ఋత్విజాదులారా!సంధ సమర్పించిఅగ్నికి పరిచర్య చేయండి.అగ్ని అతిథి సముడు

అతనికిఘృతపు ఆహుతులుఅర్పించండి. ప్రజ్వలితునుచేయండి. ప్రజ్వలితఅగ్నిలో చరుపురోడాశాదిహవ్యములనుహోమము చేయండి.

2. ఋత్విజులారా!అగ్ని సర్వ ిధ ప్రదీప్తుడు.జాతవేది. అతనికిఅతి రుచికర శుద్ధఘృతమును సమర్పించండి.

3. అగ్నీ!నిన్ను స ిధలు,ఘృతాదులచే ప్రవృద్ధునిచేయుదుము.నీవు నిత్య యవ్వనుడవుకావున చక్కగా వర్ధిల్లుము.ప్రదీప్తుడవగును.

4. అగ్నీ!ఘృతమున తడిసినహ ర్యు క్తమగుఈ స ిధ నిన్ను చేరవలెనునీవు తేజస్వి నేనుసమర్పించిన ఈ స ిధలునీకు ప్రీతి పూర్వకములుకావలెను. నిన్నుసే ంచవలెను.

5. అగ్నీ!భూ ు, అంతరిక్షము,దేవలోకమునుమూడులోకములందు వ్యాపించినవాడవు.పృథి ! నీవు దేవతలయజన యోగ్యమవు.శ్రేష్ఠ అన్నములులభించుటకుగాను నీ ిపు ంద అన్నభక్షకగార్హపత్యాది అగ్నులనుస్థాపింతును.

6. ఈఅగ్ని ప్రత్యక్షముగాదర్శన చ్చువాడు,యజ్ఞము కొరకు గానుఇతడు యజమానిఇంట జ్వాలారూపముధరించి నిలిచినాడు.సర్వ ప్రకారముల ఆహవనీయగార్హపత్య, దక్షిణాగ్నిస్థానములందుకాలు మోపినాడు. అట్లేపూర్వదిశన పృథ్విని చేరినాడు.ఆదిత్య రూపమునపితరులను చేరినాడు.

7. ఈఅగ్ని ప్రాణాపాన కార్యములునిర్వహించుచుశరీరపు మధ్య భాగమునవర్తిల్లును. ఇదిజఠరాగ్నియగును. శరీరమునజీవన రూపియగును.ఆ ిధముగా అగ్నివాయు,సూర్య రూపమున సమస్తలోకములను అనుగ్రహించును.అతడు యజ్ఞానుష్ఠానముకొరకు ప్రకాశితుడగును.

8. ముప్పదిముహూర్తరూపస్థానములందుశోభిల్లునట్టిపూజ్య వాక్కు అగ్ని కొరుకుఉచ్చరించవలెను.నిత్య ప్రియ స్తుతులఉచ్చరించయోగ్యమగువాణియే శ్రేష్ఠకర్మములందుఅగ్నిని స్తుతించును.(ఇ అగ్న్యాధేయ మంత్రములు)

9. అగ్నియేజ్యోతి జ్యోతియేఅగ్ని. అతని కొరకే ఈ ఆహుతి.సూర్యుడే జ్యోతి.జ్యోతియే సూర్యుడు.అతని కొరకే ఈ ఆహుతి.అగ్నియే బ్రహ్మవర్చస్సు. బ్రహ్మవర్చస్సే అగ్ని అతని కొరకేఈ ఆహుతి. సూర్యుడేబ్రహ్మ వర్చస్సు.బ్రహ్మ వర్చస్సేసూర్యుడు. అతని కొరకే ఈ ఆహుతి,జ్యోతియే సూర్యుడు.సూర్యుడే జ్యోతి.అతని కొరకే ఈ ఆహుతి.‘‘జ్యోతిః సూర్యః సూర్యోజ్యోతిఃస్వాహా’’

10.స తృ దేవునిసహితముగసమాన ప్రీతి గలవాడుఅగ్ని. ఇంద్రవతి రాత్రిసహితముగసమాన ప్రీతి గలవాడుఅగ్ని. అతనికి హ సమర్పించుచున్నాము.అతడు సే ంచవలెను.అగ్ని ఈ ఆహుతినిస్వీకరించవలెను.అగ్నికి స్వాహా.

స తృదేవుని సహితముగసమాన ప్రీతి కలవాడుసూర్యుడు. ఉషా సహితఇంద్ర సహితసమాన ప్రీతి గలవాడుసూర్యుడు. అతనికి హ సమర్పించుచున్నాము.అతడు సే ంచవలెను.

సూర్యుడుఈ ఆహుతిని స్వీకరించవలెనుసూర్యునకు స్వాహా.

11.యజ్ఞమునకుంచ్చేసిన వాడును- దూరమందున్ననుమా ంషయము ధ్యానమునందుంచుకొనువాడునగు అగ్ని కొరకు ఈ స్తుతినిఉచ్చరించు చున్నాము.దూరమందుండియుఅతడు ంనును. "అరేఅస్మే చ శృణ్వతే"

12.ఆహవనీయాదివేదస్థుడగు అగ్ని ద్యులోకపుశీర్షమంతటి ఉన్నతుడు.అతడు ఈ పృథ్వికి ప్రభువు.ఇతడు జలములందలిసారమునకు కర్త.

13.ఇంద్రాగ్నులారా! ం ఉభయులనుకలిపి ఆహ్వానించుచున్నాను.ఉభయులు కలసిప్రసన్నులు కావలెననివరించుచున్నాను.ంరిద్దరు అన్నముల,ధనముల దాతలు.అన్నలాభముకొరకు ం ఉభయులనుఆహ్వానించుచున్నాను.

14.ఆహవనీయఅగ్నీ! ఈ ముందు కనిపించుచున్నదిగార్హపత్యాగ్ని. ఇదియేనీకు ఉత్పత్తి స్థానము.ఇచట పుట్టినీవు దేదీప్యమానుడవగుచున్నావు.

అగ్నీ!నీ ఉత్పత్తి స్థానమునుతెలియుము.గార్హపత్య వేది ందవెలుగుము. మాకుధనాది అభివృద్ధినిప్రసాదించుము.

15.ఋత్విక్కులు అగ్నిమూలమున దేవతలనుఆహ్వానింతురు. అగ్నియజనీయతముడు,సర్వ యజ్ఞములందుస్తుత్యుడు. అట్టిఅగ్ని ముఖ్యునిగా స్థాపించబడినాడు.అతడు స్పృహణీయుడు.వ్యాపకుడు. యజమానిగృహమున ఆహవనీయాదిరూపముల ంరాజితుడు.అట్టి అగ్నిని అందుకొనుటకేభృగు గోత్రజులుసంధలు అర్పించిఅగ్నినిపూర్తిగా ప్రజ్వరిల్లచేసినారు.

16.అగ్ని పరిశుద్ధుడు. అతనిలోపురానిహిత దీప్తులున్నం.గోవులు అగ్ని స్వరూపలు.అం సహస్ర ధనములిచ్చును.దేవతలకు ప్రియములగుదుగ్ధములిచ్చును.ఆ గోవులను పాలుపితుకుఅహీరులు పితుకుచున్నారు.

17.అగ్నీ! నీవు దేహమునుపంత్రము చేయువాడవు.నా దేహమునుపంత్రము చేయుము.నీవు ఆయువునుఇచ్చు వాడవు. నాకుఆయువు ప్రసాదించుము.నీవు బ్రహ్మవర్చస్సును ఇచ్చువాడవు.నాకు వర్చస్సును ప్రసాదించుము.

అగ్నీ!నా శరీరమున లోపములున్నచోవానిని సరిచేయుము.

"అగ్నే యన్మే తన్వాఊనం తన్మ ఆపృణయ"

18.అగ్నీ! నీవు ద్యుతియుక్తుడవు.అన్నప్రదాతవు.శత్రుంజయుడవు.బలప్రదాతవు.శత్రువును అణచువాడవు.అహింస్యుడవు.

మేముహంరన్న యుక్తులము.శత్రువును జయించువారలము.బల సంపన్నులము.సదా అహింసనీయులము.

అగ్నీ!మేము నీకు సంధాదులుసమర్పింతుము. నూరేళ్ళవరకు నిన్ను ప్రజ్వరిల్లచేయుదుము.

స్పృహణీయరాత్రే!అంనాశ్యులమై మేమునీయొక్క ప్రాతః కాలపుఅందచందాలనుదర్శింతుముకాక.

19.అగ్నీ! నీవు సూర్యుని తేజముతోను,ఋషుల స్తవములతోనువర్థిల్లుచున్నావు.నీవు నీకు ప్రియమగుతేజస్సున అవతరించినావు.

అగ్నీ!నాకు ఆయువు, బ్రహ్మవర్చస్సు,సంతానము, ధనము,అభ్యుదయములచేసాంగత్యము కలిగించుము- డిపోకుండునట్లు!

సమహమాయుషాసం వర్చసా సం ప్రజయాసంరాయ స్పోషేణ గ్మిషీయ

20.గోవులారా! ీరు దుగ్ధాదిఅన్నములు గలవారు.నాకు ీ యొక్క దుగ్ధాదిఅన్నలాభముకలుగవలెను.ీరు పాలు, పెరుగు, నేయి వంటిదశతేజోవంతులు.నాకు ీ యొక్క పాలు, పెరుగు,నేయి వంటి దశతేజోలాభము కలుగవలెను.ీరు బలస్వరూపిణులు.నాకు ీ బలపు లాభముకలుగవలెను.ీరు ధనమునకుపృష్టిభూతులు.నాకు ధనపుష్టి లాభముకలుగవలెను.

21.గోవులారా! ీరు ధనవంతులు.ఈ యజ్ఞపు గోదూహనస్థానమున ఆనందించండి.గోశాలలో ఆనందించండి.నా దృష్టి పథమునఆనందించండి. నాఇంట ఆనందించండి.ఇచటనే ఉండండి.దూరము పోకండి.“ ఇహైవస్త మాపగాత ”

22.(గోవును తాకి) గోవూ! నీవుయజ్ఞకార్య నిమగ్నవు.ంధ రూపములు గలదానవు.నీవు బలము,గోపతిత్వ రూపముననాలో ప్రవేశింపుము- నన్ను బలవంతునిగోపతిని చేయుము.

రాత్రిపూట కాపురముండు అగ్నీ!మేము నిత్యమునిన్ను స్తుతులతోసంస్తుతింతుము. హంరన్నముఅర్పింతుము. నిన్నుమాలో చేర్చుకుందుము.

23.యజ్ఞములందుశోభిల్లువాడు,సత్య సంరక్షకుడు, దేదీప్యమానుడు,గార్హ పత్యాది యజ్ఞగృహములందుసదా వర్ధిల్లువాడగుఅగ్నిని ఆహ్వానించుచున్నాము.

24.అగ్నీ! తండ్రి కొడుకుంషయమునందువలె,నీవు మాకు శుభములుకలుగు ఉపాయవంతుడవుఅగుము. మాకు నాశనములేకుండునట్లుమాతో స్నేహముచేయుము.

25.అగ్నీ! నీవు మాకు దగ్గరిదేవతవు, రక్షకుడవు.మాకు శుభంకరుడవగుము.మాకు గృహపతివగుము.నీవు

30.(ఉపాంశు శిలను పట్టికొంత సేపు మౌనమువహించి)

నేనుసంతాదేవుని ఆజ్ఞానువర్తిని,అశ్వినుల బాహువులతోను- పూషహస్తములతోనూనిన్ను పట్టుకున్నాను.ఉపాంశు సవనశిలా! నీవుధనప్రదవు.ఈ యజ్ఞమునుగంభీరము చేయుము.ఇంద్రుని కొరకు బలప్రద,మధుర, దుగ్ధాదియుక్తసోమము ందనేఅభిషుతమైనది.వసతీ వరీ జలములారా!రు మాకు గ్రహంయోగ్యులు. మాటదేవతలు ందురు.జలమా! అభిషుతసోమమున కలవండి.మమ్ము సంతృప్తులనుచేయండి.

31.జలములారా! నామనసుకుతృప్తి కలిగించండి.వాక్కునకు తృప్తి కలిగించండి.చక్షుద్వయమునకుతృప్తి కలిగించండి.రెండు చెవులకుతృప్తి కలిగించండి.ఆత్మకు తృప్తి కలగించండి.నా సంతానమునకు తృప్తికలిగించండి. పశువులకుతృప్తి కలిగించండి.సహచరులకుతృప్తి కలిగించండి.

జలమా!నీకృపవలన నాత్రులునానుండి డిపోరాదు.

32.(ఉపాంశు సవన శిలలనుకృష్ణాజినము దఉంచి శిలలదఅయిదుసార్లు సోమమునువేయవలెను)

సోమమా!ప్రాతః సవనమునసోమరస అంశభాగ యుక్తుడగుఇంద్రుని కొరకును మధ్యాహ్నసవనమున సోమభోక్తరుద్రసహిత ఇంద్రునికొరకును - మూడవసవనమున సోమభోక్తఆదిత్య సహితఇంద్రుని కొరకును - శుత్రనాశకఇంద్రుని కొరకును నిన్నుఅభిషవము నిత్తముఈ శిలద ఉంచుచున్నాను.(మూడుసార్లు మూడుపిడికిళ్ల సోమముశిల ద వేయవలెను)సోమమా! నీవు ద్యులోకపుశ్యేన రూపవు. సోమమునుఅనుసరించిన గాయత్రికొరకు నిన్ను అభిషంచుచున్నాడు.( నాలుగవ పిడికెడుసోమము శిలదవేయవలెను)సోమమా! ధనము,అన్నము ప్రసాదించుఅగ్నికొరకు నిన్ను నేనుగ్రహించుచున్నాను.(అయిదవ పిడికెడు సోమముశిలలు ద వేయవలెను)

33.(ఉపాంశు సవనశిల దవేసిన అయిదు పిడికిళ్లసోమమును ముట్టుకొని)సోమమా! ద్యులోకముననీ జ్యోతిస్వరూపము- శాల అంతరిక్షమునసీ జ్యోతిస్వరూపమువెలుగుచున్నది.దానితో యజమానికిధనసంపన్నమును,శాలమును అగు స్థానమునుకల్పించుము.

34.గ్రహణీయజలములారా! రుక్షిప్రులు, వృత్రసంహారకులు. ధనదాతలుసోమామృత పాలకులు.

రుఈ యజ్ఞమునుదేవతలు అందుకొనునట్లుఅనుగ్రహించండి.అనుజ్ఞాతులైరు సహితముదేవభావమునసోమపానము చేయండి.

35.(ఉపాంశు సవన శిలచేసోమమును దించుచు)సోమమా! నీవు భయపడకుము.కంపించకుము. బలముకలుగుము. ద్యావాపృథ్వులారా!ీరు దృఢపడండి.ఈ శిలలు మున్నగువానిని దృఢపరచండి.ీరు ఉభయులు దీనినిధరించండి. ఈరాతితోదంచుట వలనయజమాని శత్రువుచచ్చినాడు - సోమముకాదు.

36.సోమమా! పూర్వ, పశ్చిమ,ఉత్తర, దక్షిణ సమస్తదిశలునీకు అనుకూలములుఅగును గాత. దూతా! నీభాగములతో సోమమునుపరిపూర్ణము చేయుము.ఈ ిషయము సమస్తజనులుఎరుంగుదురు గాత.

37.ఇంద్రా! నీవు ప్రీతికరుడవు.బలవంతుడవు.నీవు యజమానిని,గొప్ప గొప్పగా ప్రశంసింతువు.ధనవంత ఇంద్రా!నిన్ను ింఛి ఎవడునుయజమానికి ధనాదిసుఖములు ఇవ్వజాలడు.ఇంద్రా! ఇది సత్యవచనము- నీతో చెప్పు చున్నాను.

దాశరథిరంగాచార్య ిరచిత

శ్రీమదాంధ్రవచన శుక్లయజుర్వేదసంహితయందలి

అభ్యాదానాద్వాచనాన్తమనుఆరవ అధ్యాయముసమాప్తము

సర్వేపిసుఖినస్సంతు.

జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతిం।

అధారస్సర్విద్యానాం హయగ్రీవముపాస్మహే॥

## ఏడవఅధ్యాయము

1.వాచస్పతయేపవస్వ వృష్ణో అంశుభ్యాంగభస్తిపూతః

దేవోదేవేభ్యఃపవస్వ యేషాం భాగో% సి

సోమమా!నీవు అంగుళులతోఅభిషుతుడవు.నీ రసస్రావ అంశమునవాణియొక్క స్వాిు కొరకుఅభిషుతమగును.దశా పిత్రమునజల్లించబడుము.(ప్రథమ ఉపాంశు గ్రహమునుపట్టుకొని) సోమమా!నీవు ఏ దేవతలభాగమవో - ఆ దేవతలకొరకు నీవు దేవతవైజల్లించబడుము.( రెండవ ఉపాంశుగ్రహమునుఅందుకొనవలెను.)

2. సోమమా!మాకు కలుగు వర్షములనుమధురము చేయుము.( మూడవ ఉపాంశు గ్రహమునుఅందుకొని ) సోమమా! నిన్నుఅణచగలవారు లేరు.నీవు సదా

జాగృతుడవు.అందుకే నీకు సోమనామముకలిగినది. అట్టిసోమాయ స్వాహా( రెండవసారి స్వాహాఅని బయటికి రావలెను)నేను ంశాల అంతరిక్షమునుఅందుకొందును.
"అంతరిక్షమన్వేం"

3. ఉపాంశుగ్రహమా!సమస్త ఇంద్రియములకొరకును, దివ్య మరియుపార్థివ దేవతలకొరకును ఉత్పన్నమగుము.నిన్ను మనస్సు - ప్రజాపతి- వ్యాపింపచేయవలెను.స్వాహా(ఉపాంశు గ్రహముననిండియున్న సోమమునుఆహుతి ఇవ్వవలెను)

చక్కగాఉత్పన్న మైనఉపాంశు గ్రహమందలిసోమమా! నేను నిన్నుసూర్యునకు ఆహుతిఅర్పించుచున్నాను.లేపమా! మరీచులపాలకులయిన దేవతలకునిన్ను అర్పింతును.(చేతిలో ఉన్నసోమమును పశ్చిమపరిధికి పూయవలెను)

సోమాంశమా!నా శత్రువును వధించవలసినదనినిన్ను వేడుకున్నానే- ఆ శత్రువు

వాస్తవముగనేఉర్ధ్వగాం సోమాభిచారమునహతుడైనాడు.ఫట్ - అభిచార ఆహుతి.

ఉపాంశుగ్రహమా! ఇప్పుడునిన్ను యథాపూర్వముస్థాపించుచున్నాను.( ఉపాంశు గ్రహమునుచేతితో శుభ్రముచేసి యథా స్థానమునఉంచవలెను)నిన్ను ప్రాణముకొరకును - న్యాయముకొరకును ఇచట స్థాపించుచున్నాను.

ప్రాణోహవాఅస్య ( యజ్ఞస్య) ఉపాంశుః2. అథవా ఉపాంశుః ప్రాణ ఏవ3. యజ్ఞము

ఖంవా ఉపాంశుః 4. ఇయం ( పృథిం) మవఉపాంశుః 5. ఉపాంశు పాత్రోవా న్వజాఃప్రజాయన్తే.

ఉపాంశవుప్రాణము - యజ్ఞముఖము- పృథిం అగును. ఉపాంశు గ్రహముఉపాంశముగల పాత్ర.సోమమును ప్రాణముగభాంంచి పాత్రయందుంచినట్లున్నారు.

ప్రాణోహి సోమః అని తాడ్యము.

4. ఉపాంశుగ్రహమా! నిన్నుచేబూనినాము.ఇక నీవు నీలోన సోమమునుధరించుము. ధనవంతఇంద్రా! సోమరసమునుపానము చేయుము.రక్షించుము. మమ్ముvర్షముతో చేర్చుము.- మాకు వర్షము కలిగించుము.

5. ఇంద్రదేవా!నీ అనుగ్రహముననేను ద్యావాపృథ్వులనునాలో చేర్చుచున్నాను.అంతరిక్షమును నాలోచేర్చుచున్నాను.నీవు సాధారణ - ఉత్కృష్టదేవతలకు సమానుడవు.అంతర్యామ పాత్రయందున్నసోమమును సంతృప్తిగాఆస్వాదించుము.

మానవుడుమహిమాన్వితుడు.ద్యావాపృథ్వులు, అంతరిక్షముమానవుని యందేఉన్నం. మానవుడులేకున్న ఏమున్నది?తనతోటిదేలోకము. తాను లేకున్నలోకములు లేవు.

ఇంతటివాడుమానవుడు. అయిననితనను తాను తెలియజాలడు.ఇదియే అజ్ఞానముతనను తాను తెలియుటసామాన్యము కాదు.ఇది అందరకు సాధ్యపడునదికాదు.

శ్రీమదాంధ్రమహాభాగవతమునప్రహ్లాదుడుహిరణ్యకశిపునితోఅన్న ఈపద్యము దృష్టాంతము.

**లోకములన్నియున్గడియలోన జయించినవాడింద్రియా**

**నీకముజిత్తము గెలువనేరవు.నిన్ను నిబద్ధుచేయు నీ**

**భీకరశత్రులార్వుర ప్రభిన్నులజేసిన బ్రాణికోటిలో**

**నీకువిరోధి లేడొకడునేర్పున జూడుముదానవేశ్వరా!**

లోకములనుసులభముగా గెలువవచ్చునేమో!ఇంటిని గెలుచుటకష్టము, ఇంటిని సహితముగెలిచిన గెలువవచ్చునేమో తననుగెలుచుట దుర్లభము!

తననుగెలుచుట చాలదూరము. తననుతెలియుటయేఅసాధ్యము. తననుతనలో నున్నలోకములను గ్రహించుటజ్ఞానమగును.తనలోనున్నపరమాత్మను ఎరుంగుటపరమ జ్ఞానమగును.

తననుతాను భగవానునకుఅర్పించుట ప్రపత్తియగును.అదియే పరాకాష్ట!

**" అంతర్యామేమఘవన్మాదయస్వ"**అన్నాడుఈ మంత్రమున.

ఇంద్రా!నా ఆత్మను అనుభవించుము- ఆనందించుము అనుచున్నాడు.

6.ఇంద్రవాయుగ్రహమా!- సోమరసపానపాత్రా! సమస్తఇంద్రియములకొరకును -దివ్య మరియుపార్థివదేవతలకొరకును ఉత్పన్నమగుము.నిన్ను వనసు-ప్రజాపతి-అందుకొనవలెను.

చక్కగాఉత్పన్న మైనగ్రహమా! నిన్నునేను సూర్యుని కొరకు పట్టుకొనుచున్నాను.మరీచులు పాలకులయినదేవతల కొరకునిన్ను శుద్ధి చేయుచున్నాను.( గ్రహమును- పాత్రను- చేతితోశుభ్రము చేయవలెను)

గ్రహమా!దేహమునఉదాన వాయు పరిపుష్టికొరకు నిన్ను గ్రహించుచున్నాను.

7. పవిత్రసోమపాయి వాయువులారా!మీరు ఇటురండి. మావద్దకువచ్చినిలువండి.మిమ్ము సర్వులు వరింతురు.వేలసంఖ్యలోమీ వాహన మృగములువిరాజిల్లుచున్నవి.నేను మీ కొరకు మదకరసోమరసము అర్పించినాను.ఆ సోమపు ప్రథమపానమున మీరు వర్థిల్లుదురు.

సోమరసమా!నిన్ను వాయువు పానమునకుఅర్పించుటకు అందుకొనుచున్నాను.

8. ఇంద్రవాయువులారా!ఈ సోమము ీ ఉభయులకొరకు అభిషుతము చేయబడినది.ఈ ఆహ్లాదకరమగుసోమము ీ ఉభయులనుచేరుకొనవలెననుకొనుచున్నది.

ఉపయామగ్రహమా!వాయువునకు సోమరసపానముచేయించుటకు గానునిన్నిఅందుకొను చున్నాను- ఇంద్రునకు సోమరసపానముచేయించుటకు నిన్నుఅందుకొనుచున్నాను.

పాత్రా!ఇది నీవు స్థిరపడుస్థానము ( పాత్రనువేదిీద యథాస్థానమునఉంచవలెను).ఉపయామ గ్రహమా!పరస్పరము సమానప్రీతిగలఇంద్రాగ్నుల కొరకు ీలోసోమరసజు నింపుచున్నాను.

ఉపయామఇయం వా ఇదమన్నాద్యనుపయచ్చతి పశుభ్యోమనుష్యేభ్యో వనస్పతిభ్య:అని శతపథము. మానవులకు,పశువులకు, వనస్పతులకుఅన్నాదులను ఇచ్చునది.ఇది పాత్రపేరు కావచ్చును.

9. (ుత్రావరుణులకుసోమము అందించుపాత్రనుచేపట్టి) ుత్రావరుణులారా! ఈ సోమరసముసత్యమును - యజ్ఞమునువర్ధిల్లచేయునది.ఇది ీ కొరకు అభిషంపడినది.ీరు మా సోమపాత్రఆహ్వానమునుఆలకించండి.

ఉప్యాయామగ్రహమా!ుత్రావరుణుల కొరకునీలో సోమరసము నింపుచున్నాను.

10.(ుత్రా వరుణులకొరకు సోమరసము నింపినపాత్రలో రెండు దర్భలనుఉంచి సోమరసమునపాలు కలుపవలెను)దేవతలకు సోమహంసమర్పించు ఋత్విగ్యజమానులమగుమమ్ము గోవులు,అశ్వములు మున్నగుధనములచేసంపన్నులము చేయుము.దేవతలు సోమహంక్రిప్రసన్నులు కావలెను.గో, అశ్వాది ధనములచేఆనందించవలెను.

ుత్రావరుణులారా!మాకు మార్పు ఎరుగని గోవును- నిత్యము పాలిచ్చుదానిని- అనుగ్రహించుము.

పాత్రా!ఇది నీ స్థిర నివాసము.నేను నిన్ను ుత్రావరుణుల కొరకు ఇచట

ఉంచుచున్నాను.

11.(అశ్వినుల కొరకగు సోమపాత్రనుపట్టుకుని ) అశ్వినులారా!ీ మాట మధురము- సత్యము. ఆమాటతోీరు మాయజ్ఞమునుఆసించితము చేయండి.

ఉపయామగ్రహమా!నేను నిన్ను అశ్వినులకొరకు పట్టుచున్నాను.ఇది నీ స్థనము మధుంద్యావంతులగుఅశ్వినుల కొరకు నిన్నుఇక్కడ పెట్టుచున్నాను.

12.ఇంద్రుడు సర్వకాలములందుఋషిసమాన జ్యేష్ఠుడు- శ్రేష్ఠుడు. యజ్ఞమునదర్భాసనమునఆసీనుడగువాడు. స్వర్గమునుఇచ్చువాడు. శత్రువుేదకు దండెత్తువాడు.శత్రుంజయుడుబలశాలి. శత్రుధనమునుజయించువాడు.

సోమమా!యజ్ఞములందుయజమాని యజ్ఞక్రియలందుంత్రణాదులద్వారానీవు వర్ధిల్లుదువు.అందువలన ఆ యజమానికిసమస్తము సమకూర్చమనిఇంద్రుని ప్రార్థింతువు.

శుక్రగ్రహమా!నీవు ఉపయామముద్వారా శండుని పారద్రోలుటకుగ్రహించబడినావుఇది నీ స్థానము. నీవుయజమాని కొరకు ేరునివలెఆచరింపుము.

(అధ్వర్యు,ప్రతిస్థాత రెండుయూపఖండములనుప్రోక్షించవలెను.అధ్వర్యు శుక్రగ్రహమును- ప్రతిస్థాత మన్థీతగ్రహమునుశుద్ధిచేసి మూతపెట్టవలెను)శుక్రుని పుత్రుడు - అసురులపురోహితుడు- శండుడు బహిష్కరించబడినాడు.

(అధ్వర్యు,ప్రతిస్థాత హంర్భావమండపము నుంచిబయటకు రావలెను)

శుక్రగ్రహమా!శుభ్రసోమరసమునునీద్వారా పానము చేయుదేవతలు నిన్నుయజ్ఞస్థానమునకుకొనిపోవలెను.

(వేదిదక్షిణభాగమునఅధ్వర్యు శుక్రగ్రహమునుఉత్తర భాగమునప్రస్థాత మంధితగ్రహమునుస్థాపించవలెను)

ఉత్తరవేదిశ్రోతలారా! ేరు సర్వథాఅహింసితులగుడు.

శుక్రగ్రహముఅనగా శుక్రమను పాత్ర.గ్రహములందలిశుక్రుడుకాడు.

శుక్రుడనువానిపుత్రుడు శండుడు.అతడు అసుర పురోహితుడు.

పురాణశుక్రుడు- శుక్రాచార్యుడు అసురులగురువు. అతని కూతురుదేవయాని. కచదేవయానికథ, యయాతి దేవయానికథ ప్రసిద్ధములు.

13.(దక్షిణ భాగమునఉన్న శుక్రగ్రహమునుతాకి అధ్వర్యు) శుక్రగ్రహమా!నీవు ఎంతో ేరుడవు.యజమానికి ేరపుత్రులను- గోవులు అశ్వములుమున్నగు ధనములుప్రసాదించుచు అతనినిచేరుకొనుము. శుక్రగ్రహము- తన శుద్ధదీప్తిచే- ద్యావాపృథ్వులతోసంగతమై - సర్వమునుభరించి - శండునియజ్ఞమునుంచిబహిష్కరించినది.( అధ్వర్యు ప్రోక్షించినయూపఖండమునుబయటవేయవలెను)

యూపశకలమా!నీవు శుక్రగ్రహమునునిలుపుస్థానమవు( అధ్వర్యు ప్రోక్షితయూపశకలమునుఆహవనీయాగ్నిలోవేయవలెను)

14.సోమదేవా! మేముయజమానులము.నిన్ను అజస్రధారాయుక్తునిచేయగల వారలముకావలెను. దేవతలకుసోమరసము అందచేయువారలముకావలెను. దేవతలవలన ధనముఅన్నము పొందువారలముకావలెను.

(యూపపుఒకపక్కనిలిచిన అధ్వర్యుశుక్రగ్రహమునందలిసోమమును ఆహుతిఇవ్వవలెను. మరొకప్రక్క నిలిచినప్రతి ప్రస్థాత మంథనగ్రహమునందలిసోమమును ఆహుతిఇవ్వవలెను) ఇదిఅందరు కోరుకొను ప్రథమసోమక్రియ - శుద్ధిక్రియ.వరుణ, ిత్ర, అగ్నులుసోమమును రక్షించవలెను- పానము చేయవలెను.

15.బృహస్పతిఈ సోమరసమును అందరికన్నముందు తెలిసికొన్నవాడు.అధ్వర్యులారా! ఇంద్రునకుఅభిషుత సోమపుఆహుతి అర్పించండి.ఇది ఇంద్రునకు సోమరసఆహుతి. ఛందములనుఅభిమానించు దేవతలుతృప్తులు అగుదురుగాత. ఏఛందో దేవతలుసోమరస యాగమునుఅపేక్షించువారో - ఎవరు ఈ సోమరసయాగమందుప్రీతిగలవారో - వారిద్వారాఈఆహుతి దేవతలకుఅందుచున్నది.( అధ్వర్యు, హోతపక్కనపశ్చిమాభిముఖుడైనిలిచి) హోతా!అగ్ని సోమరసమునకుపరిచితుడైనాడు.(అనవలెను)

16.(మంథనగ్రహమునుపట్టి) ిద్యుజ్యోతిగర్భకాంతి పరివేష్టించినకమనీయ చంద్రరూపముసోమము. ఈ సోమముద్యులోక గర్భమందుిరాజిల్లుజలమునువర్షముగా మార్చుటకుప్రోత్సహించును.ఈ సోమము సూర్యునితోకలసినప్పుడు - అధ్వర్యు,ప్రతిప్రస్థాత - బాలునితోసమముగా సోమమునుస్తుతులతో అర్చింతురు.

సోమరసమా!ఉపయామ గ్రహముననింపి అందుకొనుచున్నాను.అసుర పురోహితుడగుమర్కుని, యజ్ఞంనుండిపారద్రోలుటకు నిన్నుగ్రహించుచున్నాను.

మర్కోసురః అని ఉవటుడు. మర్కఃశుక్రపుత్రో సుర పురోహితఃఅని మహీధరుడు.ఇంతకు ముందు శణ్ణుడుశుక్రపుత్ర అసుర పురోహితుడనిచెప్పినాడు. ఇతడుశుక్రుని మరొక పుత్రుడుకావచ్చును.

17.(మంథనగ్రహమునయవలు, సత్తుకలుపవలెను)యజ్ఞకార్యములందుఆరాటపడువాడు అధ్వర్యుప్రతిప్రస్థాతలు.వారికి సోమయోగముతెలియును. వారుస్వకర్మమున మనసువంటి ఉత్సాహముగల శుక్ర, మంథనగ్రహములనుతీసికొందురు. ప్రభూతదక్షిణ గల పాత్రలోఏ అధ్వర్యుడు సోమముమరియు సత్తునుసర్వదిశలందు కలుపునోఅతడు ప్రధానఋత్విక్కు.

మంథనగ్రహమా!ఇది నీ స్థానము. నీవుఇచట ఉండి యజమానిప్రజలను పాలింపుము.(ప్రతిప్రస్థాత మంథనగ్రహమునుప్రోక్షిత యూపశకలమునమూయవలెను.అప్రోక్షిత యూపశకలమునుశుద్ధిచేయవలెను)

మంథనగ్రహమా!సోమరసపానము చేయుదేవతలు యజ్ఞస్థానముననిన్ను గ్రహించవలెను.ఉత్తరవేదిశ్రోదే!నీవు సర్వథా అహింసితవగుము.

18.(ప్రతిప్రస్థాత ఉత్తరయూపస్థానమునకువెళ్ళవలెను)మంథగ్రహమా!నీవు

సుప్రజాయుక్తుడవు.నీవు ఉత్తమప్రజనుసృష్టించుము. ధనమును,అన్నము యజమానికిఅందించుము. ఈ మంథగ్రహముద్యావాపృథ్వులచేసంగతమగును. మంథజ్యోతి రూపమునయూపమున చేరును.( ప్రతిప్రస్థాత యూపశకలమునుబయటవేయవలెను)అసురపురోహిత మర్కుడుయజ్ఞమునుండిబహిష్కృతుడైనాడు.(ప్రతిప్రస్థాత యూపశకలమునుఆహవనీయమునవేయవలెను)

యూపశకలమా!నీవు మంథగ్రహపుఆధారమవు.

19.దేవతలు ద్యులోకమునపదకొండుమంది భూలోకమునపదకొండు మంది. అంతరిక్షమునస్వమహిమచేనిలిచినావారు పదకొండుమంది.ఆ దేవతలందరుఈ మా యజ్ఞమునుప్రీతిపూర్వకముగ గ్రహించవలెను.

20.(ఆగ్రాయణ గ్రహమునుతీసికొని) ఆగ్రాయణగ్రహమా! ఉపయామగ్రహము ద్వారానిన్ను అందుకున్నాను.నీవు ముందుకు నడిపించుదానవు.నీ శ్రేష్ఠత్వమునమమ్ము రక్షింపుము యజ్ఞదేవతఁష్ణువు. అతడు తనబలమున నిన్నురక్షింపవలెను. యజ్ఞమునుకాపాడుము. యజ్ఞస్వాఁు యజమానిని కాపాడుము.నీవు ఁష్ణువును కాపాడుము.మూడు సవనములనుకాపాడుము.

21.("హింకార త్రయంకృత్వా" 'హిం' కారమునుమూడుసార్లు జపించి)

సోమముదశాపఁత్రమునపావనమగును. అదిపాత్రయందు చేరును.ఇది బ్రహ్మణునికళ్యాణము కొరకు - క్షత్రియునికళ్యాణము కొరకు - అభిషఁంచుఈ యజమాని కొరకు పావనమగును.అది వర్షము కొరకును- కాంతి కొరకును పావనమగును- జలములు ఓషధులుకొరకు పావనమగును.ద్యావాపృథ్వుల కొరకు పావనమగును.ఇంతెందుకు సకలముచక్కగా ఉద్భఁంచుటకుపావనమగును.

ఆగ్రాయణగ్రాహమా! నిన్నునేను ఁశ్వేదేవతలకొరకు అందుకొనుచున్నాను.ఇదిగో ఇది

నీస్థానము.ఁశ్వేదేవతలప్రీతికొరకు నిన్ను నేనుఇచట స్థాపించుచున్నాను.

22.సోమమా! నిన్ను ఉపయామగ్రహమునగైకొన్నాను.ఉక్థ్యగ్రహమా!ఇంద్రుడు ఉక్థరక్షకుడు.బృహత్సామ,సోమాన్న యుక్తుడు.నిన్ను ఆ ఇంద్రుని కొరకుపట్టుకున్నాను.

ఇంద్రా!నీది మహత్సోమాన్నము. ఆ సోమపానముకొరకు నిన్ను ఆహ్వానించుచున్నాను.

సోమమా!యజ్ఞాదిదేవతఁష్ణువు కొరకు నిన్ను అందుకొనుచున్నాను.

సోమమా!ఇది నీ స్థానము. నిన్నుసర్వ ఉక్థముల కొరకు గ్రహించుచున్నాను.నీవు దేవతలకుఆనందము కలిగించుదానవు. సకలదేవతలఆనందము నిఋత్తమునిన్ను గ్రహించుచున్నాను.యజ్ఞపు దోషరహితసమాప్తి కొరకు గ్రహించుచున్నాను.

అగ్నిద్వాఉక్తిస్వాహుతయఏవధమ్ అని శతపథము.

అగ్నిఉక్త్యఆహుతులుథమ్ స్ఉక్థమ్.

23.సోమమా! నీవు దేవతలకుతృప్తినిచ్చుదానవు.ఋత్రావరుణుల కొరకును- దోషరహిత యజ్ఞసమాప్తి కొరకును నిన్నుఅందుకొనుచున్నాను.

సోమమా!నీవు దేవతలకుప్రీతులను చేయుదానవు.ఇంద్రుని కొరకును - దోషరహితయజ్ఞసమాప్తికినినిన్ను అందుకొనుచున్నాను.

సోమమా!నీవు దేవతలకుఆనందము కలిగించుదానవు.ఇంద్రాగ్నుల కొరకును- దోషము లేకుండయజ్ఞసమాప్తి కొరకునునిన్ను అందుకొనుచున్నాను.

సోమమా!నీవు దేవతలనుసంతోషపెట్టుదానవు,ఇంద్రావరుణుల కొరకును- దోషము లేకుండయజ్ఞసమాప్తి కొరకునునిన్ను అందుకొనుచున్నాను.

సోమమా!నీవు దేవతలనుతృప్తులను చేయుదానవు.ఇంద్రబృహస్పతులకొరకును - దోషరహితయజ్ఞసమాప్తి కొరకునునిన్ను అందుకొనుచున్నాను.

సోమమా!నీవు దేవతలకుముదము చేకూర్చుదానవు.ఇంద్ర ఋష్ణువులకొరకును - లోపములేకుండయజ్ఞసమాప్తి కొరకునునిన్ను అందుకొనుచున్నాను.

24.వైశ్వానరాగ్ని ద్యులోకమునసూర్యభూతుడు.శిరము వంటివాడు.భూఋని త్రిప్పువాడు.యజ్ఞపు అరణిస్థానమున ఉత్పన్నుడు.క్రాంత ద్రష్ట. సామ్రాట్టు.యజ్ఞాదులందుఅతిథిస్వరూపుడు. ముఖమందుసర్వదా నిలిచినవాడు.స్రువ స్వరూపఖాద్యపాత్రగలవాడు.

అట్టివైశ్వానరాగ్నిని దేవతలుసృజించినారు.

25.సోమమా! నీవు ఉపయానగ్రహమునతీసి కొనబడినావు.ధ్రువగ్రహమా!నీవు ధ్రువ సంకేతమవు.వైశ్వదేఁ శంసన ప్రస్థానమువరకు సదా ధ్రువభావమునస్థిరముగా ఉండుదానవు.నీవు అత్యంత స్థిరతగలదానవు. ధ్రువపాత్రమా!ఇది నీ స్థానము. వైశ్వానరాగ్నినిఋత్తము నిన్నుఇచట ఉంచుచున్నాను.(ధ్రువపాత్రమందలి సోమరసమునుహోతయొక్కచమసమున పోయవలెను)నేను స్థిఋతమనస్కుడనైధ్రువపాత్రమందున్నసోమమును హోతయొక్క చమసమునగుమ్మరించుచున్నాను.ఇక ఇంద్రుడే మనప్రజలను శత్రురహితులను- పరస్పరప్రేమగల వారినిచేయవలెను.

26.(తొనికిన సోమరసమునకుప్రాయశ్చిత్తమునకుగాను చేయు ఘృతహోమమునకుప్రుట్ హోమము,అని పేరు. ఆ హోమముచేయు అధ్వర్యు)

సోమమా!నీ బిందువు ద్రోణ,ఘటాదులనుండిరాలును. నీ లతాఖండములుఅభిషవ శిలలప్రక్కన పడిపోవును.అధ్వర్యుచేతినుండి జారిపడును.దశాపవిత్రమునజల్లించునపుడుక్రిందపడును. అట్లుపడిపోయినభాగముల పూర్తికొరకు ఘృతహోమముచేయుచున్నాడు.ఇది ఘృతాహుతిఅగును. ( అధ్వర్యు తెచ్చినరెండు గడ్డి పరకల నుండిఒకటి చాత్వాలమునవేసి) చాత్వాలమా! నీవుదేవతలు ఎక్కుస్వర్గమునకు సోపానభూతమవు.

27.ఉపాంశుగ్రహమా! నీవుబ్రహ్మవర్చస్సునుఇచ్చుదానవు. కావుననీవు నాకు బ్రహ్మవర్చస్సు- ప్రాణములను,ప్రసాదించుటకు స్వకర్మమునప్రవర్తితవగుము.

ఉపాంశుసవనమా! నీవుబ్రహ్మవర్చస్సుప్రదాతవు. నాకు బ్రహ్మవర్చస్సు- ధ్యానపుష్టి కలిగించుటకుస్వకర్మమున ప్రవర్తిల్లుము.

అంతర్యామగ్రహమా!నీవు బ్రహ్మవర్చస్సు ప్రదాతవు.నాకు బ్రహ్మవర్చస్సు- ఉదాన పుష్టి కొరకు స్వకర్మమునప్రవర్తిల్లుము.

ఐంద్రవాయగ్రహమా!నీవు బ్రహ్మవర్చస్సుప్రదాతవు.నాకు బ్రహ్మవర్చస్సు- వాక్కును పుష్టిచేయుటకుస్వకర్మమున ప్రవర్తిల్లుము.

మైత్రావరుణగ్రహమా! నీవుబ్రహ్మవర్చస్సుప్రదాతవు. నాకు యజ్ఞము- బలము బ్రహ్మవర్చస్సునుఇచ్చుటకు స్వకర్మమునప్రవృత్తమగుము.

అశ్వినిగ్రహమా!నీవు బ్రహ్మవర్చస్సునుఇచ్చుదానవు. నాకుబ్రహ్మవర్చస్సు- శ్రోత్రపుష్టిని కలిగించుటకుస్వకర్మమున ప్రవర్తిల్లుము.

శుక్రమంథనగ్రహమా!మీరు బ్రహ్మవర్చస్సుప్రదాతలు. నాకు బ్రహ్మవర్చస్సును- నేత్రములపుష్టిని ప్రసాదించుటకుస్వకర్మమున ప్రవర్తిల్లండి.

(ఇవియజమానితో అనిపించవలసినమంత్రములు)

28.ఆగ్రాయణగ్రహమా!నీవు బ్రహ్మవర్చస్సుప్రదాతవు. నాకు బ్రహ్మవర్చస్సు- భూతాత్మపుష్టికలిగించుటకు స్వకర్మమునప్రవర్తితవు అగుము.

ధ్రువగ్రహమా!నీవు బ్రహ్మవర్చస్సుప్రదాతవు. నాకు బ్రహ్మవర్చస్సు- ఓజోబల, ఆయుష్యపుష్టి కొరకు స్వకర్మమునప్రవర్తితవు అగుము.

పూతభృద- ఆహవనీయగ్రహములారా!మీరు బ్రహ్మవర్చస్సుప్రదాతలు. మీరు నాకుబ్రహ్మవర్చస్సు- అక్షయ ప్రజల పుష్టికొరకు స్వకర్మమున ప్రవర్తితలుకండి.

29.(యజమాని ద్రోణకలశమును ఉద్దేశించి)ద్రోణ కలశమా!నీవు ప్రజాపతిః.ప్రజాపతి తమవు.ప్రజాపతి సంబంధిః.ప్రజాపతి నామకవు.అట్టి ప్రజాపతిభూతుడగు ప్రజాపతినాథుని మేము తెలిసికొనవలెను.

ద్రోణకలశమా!ప్రజాపతి రూపవగునిన్ను సోమరసమునసంతుష్ట పరచుచున్నాము.భూర్భువస్వః - అగ్ని,వాయు, సూర్యులారా! మేముచక్కని సంతానవంతులముకావలెను. మంచిఃరులను కలిగి ఃర్యవంతులముకావలెను. సమృద్ధిఅన్నము గలవారమై- గొప్ప అన్నదాతలముకావలెను.

30.అధ్వర్యు మరియు ప్రతిప్రస్థాత12 ఋతువుల హోమముచేయవలెను.మొదటి ఋతువునుఅధ్వర్యు, రెండవ దానినిప్రతిప్రస్థాత వచించుచుపన్నెండింటినిహోమము చేయవలెను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామగ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను మధు- చైత్ర - మాసమునిఃత్తము గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను మధు- వైశాఖ - మాసము నిఃత్తముగ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను శుక్ర- జ్యేష్ఠ - మాసమునిఃత్తము గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను శుచి- ఆషాఢ - మాసము కొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను నభస్య- భాద్రపద - మాసముకొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను ఆశ్వయుజమాసము కొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్నుఊర్జ -కార్తీక - మాసము కొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను సహస- మార్గశీర్ష - మాసముకొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను సహస్య- పుష్య - మాసము కొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను తపస- మాఘ - మాసము కొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను తపహమ- ఫాల్గుణ - మాసముకొరకు గ్రహించుచున్నాను.

ఋతుగ్రహమా!నీవు ఉపయామ గ్రహమునగ్రహించబడినావు.నేను నిన్ను అంహసస్పతి- పదమూడవ - మాసముకొరకు గ్రహించుచున్నాను.

మొదటచెప్పినవి వేదినామములు.తరువాత ఇచ్చినవిప్రస్తుత వ్యవహారమాసనామములు.

అంహఃపాపం తస్య పతిః అహంసస్యపతి. దీనిని పదమూడవనెలఅధికమాసుముగా పేర్కొనుటజరిగినది. ప్రస్తుతపద్ధతిన అధికమాసమునకు వేరుపేరులేదు.

31.ఇంద్రాగ్నులారా! మీరు ఈ యజ్ఞమునకుసోమపానము చేయుటకువిచ్చేయండి. ఈ సోమముసూర్యసమము. వాంఛించదగినది. దీనినిమీరు స్వీకరించుటకు అభిషవించినాము.మేము మిమ్ము స్తుతించుచున్నాము.ప్రార్థించుచున్నాము.మీరు మేమిచ్చు సోమరసమునుఆస్వాదించండి.

సోమరసమా!నిన్ను ఇంద్రాగ్నులనిమిత్తము ఉపయామగ్రహమునస్వీకరించినాము. ఇది నీస్థానము. ఇంద్రాగ్నులనిమిత్తము నిన్నుఈ స్థానమున నిలుపుచున్నాము.

32.అగ్నిని ప్రజ్వలితముచేయువారును - యజ్ఞవేదిమీద దేవతలుఆసీనులు అగుటకు దర్భాసనములుపరచునట్టియజమానులు- నిత్య యవ్వనఇంద్రునకు మిత్రులుఅగుదురు.

సోమరసమా!నిన్ను ఉపయామగ్రహమునసేకరించినాము. ఇది నీస్థానము. ఇంద్రాగ్నులనిమిత్తము నిన్నుఈ స్థానమున నిలుపుచున్నాను.

(ఇంద్రాగ్నిసంబంధ గ్రహమునుతీసికొనవలెను)

33.విశ్వే దేవతలారా!మీరు రక్షకులు. ప్రజలనుభరించువారు. మీరుయజ్ఞమునకువిచ్చేయండి. మీకుసోమహవి సమర్పించుయజమానికి వివిధరత్నములు ప్రసాదించండి.ఇచట అభిషుతసోమము సిద్ధముగాఉన్నది. మీరు త్వరత్వరగావిచ్చేయండి.

సోమరసమా!నిన్ను విశ్వే దేవతలనిమిత్తము ఉపయామగ్రహమునసేకరించినాము. ఇది నీస్థానమగును. నిన్నువిశ్వేదేవతలకొరకు ఈ వేది మీద నిలుపుచున్నాను.

34.విశ్వేదేవతలారా!మీరు నా ఆహ్వానమునుఆలకించండి. ఇచటికివిచ్చేయండి. ఈ దర్భాసనముమీద ఆసీనులు కండి.

సోమమా!నేను నిన్ను ిశ్వేదేవతలకొరకు ఉపయామ గ్రహమున సేకరించినాను. ఇది నీవునిలుచుస్థానముఅగును. నిన్ను ిశ్వేదేవతలని ిత్తము ఈ వేది ిదస్థాపించుచున్నాను.

(ిశ్వేదేవగ్రహమునఅందుకొనవలెను)

ప్రాతఃకాల సవనమునగ్రహించదగినగ్రహములమంత్రములుముగిసిన ి.

35.మరుత్తుల సహితుడవగుఇంద్రా! నీవు ఇచటికిరమ్ము. శర్యాతి యజ్ఞమునఅభిషుత సోమరసమునుఎగబడి త్రాగినావే- అట్లే ఈ యజ్ఞమునసోమరసమును సే ింపుము.

శౌర్యోపేతఇంద్రా! క ిజనులు- సుయజ్ఞము చేయుయజమానులు- నీ అనుగ్రహముననేసుఖముగా కాలముగడుపుచున్నారు.

సోమమా!నిన్ను నేను మరద్యుక్తఇంద్రుని కొరకు ఉపయామగ్రహము స్వీకరించినాను.ఇది నీవు నిలుచుచోటుఅగును. మరద్యుక్తఇంద్రుని కొరకు నిన్నుఇచట నిలుపుచున్నాను.

శర్యాతివృత్తాంతము శతపథ,జై ినీయ బ్రాహ్మణములందున్నది.చ్యవనుడు శర్యాతిపైఅలిగినాడు. శర్యాతితన కూతురు సుకన్యనుచ్యవనునకుఇచ్చినాడు. అప్పుడుచ్యవనుడు ప్రసన్నుడైనాడు.అశ్వినులు చ్యవనునకుయవ్వనము ప్రసాదించినాడు.

చ్యవనప్రాశమనుఆయుర్వేద ఔషధముఈ చ్యవనుని పేరనేవెలసినది.

పురాణములందుసుకన్య కథ ిఖ్యాతము.

36.మరుద్యుక్త ఇంద్రా!నీవు జలవర్ధకుడవు.అభివర్ధన శీలుడవు.దివ్యుడవు. శాసకుడవు.సర్వజిత్తువు. మహాబలి.బలదాతవు.అట్టినిన్ను - ఈవేళ- ఈ న ిన యజ్ఞమునకుఆహ్వానించుచున్నాను.యజ్ఞమునురక్షింపుము.

సోమమా!నిన్ను మరుద్యుక్తఇంద్రుని కొరకు ఉపయామగ్రహమున సేకరించినాను. ఇది నీస్థానము. మరుద్యుక్తఇంద్రుని కొరకు నిన్నుఇచట నిలుపుచున్నాను.( మరుద్వతీ గ్రహమునుఅందుకొనవలెను)

మరుద్వతీగ్రహమా!నిన్ను ఉపయామగ్రహమునతెచ్చినాను.నిన్ను నేను మరుత్తులఓజస్సు కొరకు గ్రహించుచున్నాను.

(మూడవమరుద్వతీ గ్రహమునుతీసుకొనవలెను)

37.శూరఇంద్రా! నీవు మరుత్తుల ిషయమున ప్రీతిగలవాడవు. మరుద్గణయుక్తుడవు.ఇది మాధ్యందినసవనపు అభిషుతసోమము - స్వీకరించుము.శత్రువులనుబాధించుము.హింసక రాక్షస, అసురులనువధించుము.మాకు నలువైపులఅభయ ిమ్ము.

సోమమా!నేను నిన్ను మరుద్యు క్తఇంద్రుని కొరకు ఉపయామగ్రహమునవింపినాను. ఇది నీ స్థానమగును.ఇచట నిన్ను మరుద్యు క్తఇంద్రుని కొరకు స్థాపించినాను.

38.మరుద్యు క్త ఇంద్రా!నీవు అభీష్టవరదుడవు.యుద్ధమందును.ఉల్లాసమందునుపురోడాశాది యుక్తమగుఈ సోమరసమును సేంపుము.ఈ మధుర సోమరసతరంగములనుజఠరమున చేర్చుము.పాడ్యం మొదలుకొనిఅభిషంచిన ఈ సోమమునకునీవు ఏకమాత్రస్వాం.

సోమమా!నేను నిన్ను మరద్యు క్తఇంద్రుని కొరకు ఉపయామగ్రహమునపోసినాను. ఇది

నీస్థానమగును. ఇచటనిన్ను మరుద్యు క్తఇంద్రుని కొరకు స్థాపించినాను.

39.ఇంద్రుడు మహానుడు.యజమానులవాడు.ప్రజలను అన్నధనాదులతోనింపువాడు. ద్యులోకభూలోకములనుంచిన వాడు. శత్రుదమనుడు.బలశాలి. శత్రుంజయుడు.మాకు అభిముఖుడగువాడు.ఉదారుడు, స్తరించువాడు.అతడు వర్షరూప రకృత్యములకొరకు వర్ధిల్లినాడు.

సోమమా!నిన్ను నేను ఇంద్రునికొరకు ఉపయామ గ్రహమునవింపినాను. ఇది నీ స్థానము.ఇంద్రుని కొరకు ఇచటనిన్ను స్థాపించినాను.

40.ఇంద్రుడు మహానుడు.బలయుతుడైపెరుగువాడు. పర్జన్యుడుతన ఓజస్సుతో వర్షయుక్తుడైనట్లు- వత్సఋషి స్తోత్రములచేఇంద్రుడు అత్యంతఅభ్యుదయమునందినాడు.

సోమమా!నీవు ఉపయామ గ్రహమునస్వీకరించబడినావు.ఇంద్రుని కొరకు నిన్నునేను అందుకొనుచున్నాను.ఇది నీ స్థానము. ఇచటనిన్ను ఇంద్రుని కొరకుస్థాపించుచున్నాను.

41.సూర్యుడు జ్ఞాతవ్యుడుస్వప్రకాశమున సర్వముకనబరచువాడు.అగుపించు సూర్యుని ప్రజ్ఞాపకకిరణములు - అందరుదర్శించు కొనుటకుఊర్ధ్వాకాశమున నిలిచినం.అట్టి సూర్యునకు ఆహుతి- సూర్యాయ స్వాహా

(దక్షిణహోమమున ప్రథమఆహుతి ఇవ్వవలెను)

42.(బుట్టలో బంగారముకట్టి స్రువమునందుంచుకొనవలెను)

అగుపించుకిరణముల చిత్రపుంజమగు సూర్యుడుపైకి వచ్చినాడు. అతడుత్ర, వరుణ, అగ్నులకునేత్రరూపుడు. సూర్యుడుద్యావాపృథ్వులను- అంతరిక్షములనుపూరించినాడు. ఈ భానుమూర్తిచరాచరజగత్తుకుఆత్మ అగును. 'సూర్యాయస్వాహా' ( రెండవ ఆహుతిఅర్పించవలెను.)

43.అగ్నీ! నీవు సన్మార్గామునధనము పొందుమార్గమునమమ్ము నడిపించుము.నీకు సమస్త ధనధారలుతెలియును. కుటిలపాప - మార్గములనుండిమమ్ము తొలగింపుము.

అగ్నీ!మేము నీ యెడలఅత్యంత భక్తియుక్తులము.ంనమ్ర నమస్కారయుక్తస్తవములు పాడుచున్నాము.'అగ్నయేస్వాహా' ( అగ్నీధ్రమునఆహుతి అర్పించవలెను)

44.ఈ అగ్ని మేము కోరిన ధనములభించునట్లుచేయవలెను.అగ్ని - హింసక రాక్షసులను- అసురులను పరిమార్చుచు- మమ్ము రక్షించుటకుమాకు అగ్రగాంు కావలెను.ఎంతో ప్రసన్నుడైనఅగ్ని శత్రువులనుజయించవలెను.అగ్నయేస్వాహా (ఆహుతిఅర్పించవలెను)

45.( ఋత్విజులకుదక్షిణగా ఇచ్చు గోవులనుసంబోధించి)

గోవులారా!నేను నాస్వరూపసహితముగాంు స్వరూపమును పొందినాను.సర్వధనములకుప్రభువు పరబ్రహ్మ- ప్రజాపతి. అతడేఋత్విజులమగుమాకు ంమ్ము మా భాగముగాప్రసాదించినాడు. సువర్ణదక్షిణయుక్తలగుగోవులారా! ఈ యజ్ఞమార్గమునంురు మాతో చేరండి.నేను స్వర్గపథముపితృయానము, అంతరిక్షమునుదర్శించుచున్నాను.

(యజమానిఅనవలసినది)దక్షిణధనమగుగవాదులారా! ంమ్ముయజ్ఞసదస్యులగుఋత్విజులకుసమర్పించినాను. అయిననుంురు మరింత మరింతఆధిక్యత పొందండి.

46.(యజమాని అగ్నీధ్రమువద్దకుచేరి)

అగ్నీధ్రబ్రాహ్మణుడుఉత్తమ పిత, పితామహవంతుడు.మంత్రార్థకర్త. ఋషికులీనుడు.దక్షిణలందు సదాస్వర్ణముపొందువాడు. అట్టిబ్రాహ్మణునకుదక్షిణ సమర్పించుచున్నాను.దక్షిణ యందు ఇచ్చినధనమా! మేమునిన్ను దానము చేసినాము.దానము యొక్క పుణ్యముకొరకు నీవు దేవతలనుచేరుము. తిరిగి వచ్చిదాతయగు యజమానిని- అభివృద్ధి చెందిచేరుము.

( యజ్ఞఫలముసాధించి తిరిగి యజమానినిచేరునని అర్థము)

47.సువర్ణమా! వరుణదేవుడునిన్ను - అగ్ని స్వరూపుడగు- నాకు దానము చేసినాడు.నిన్ను అందుకొని నేనుఅమృతత్వమునందుకొందును.యజమానికి నీకు ఆయుష్యమగుము- ప్రతిఫలము కలుగచేయుము.అందుకున్న నాకు సుఖస్వరూపవైఫలించుము.

గోమాతా!వరుణ దేవుడునిన్ను - రుద్రస్వరూపుడవగు- నాకు దానము చేసినాడు.నిన్ను అందుకున్ననేను అమృతత్వమునుఅందుకొందును. నీవుదాతయగు యజమానికిప్రాణరూపునివై ప్రతిఫలముకలుగచేయుము.అందుకున్న నాకు పాలుపెరుగుమున్నగు ఖాద్యపదార్థములుఇచ్చి ఫలింపుము.

వస్త్రమా!వరుణదేవుడుస్వయముగా నిన్ను - బృహస్పతిరూపుడవగునాకు దానము చేసినాడు.నేను నిన్ను పొందినాను.అమృతత్వము పొందినాను.దాత యజమానికొరకు నీవు

అతని త్వచారూపమవై ప్రతిఫలము ప్రసాదించుము.అందుకున్న నాకు సుఖస్వరూపమువైఫలించుము.

అశ్వమా!నిన్ను వరుణదేవుడుస్వయముగా - యమస్వరూపుడవగు- నాకు దానము చేసినాడు.నేను నిన్ను అందుకున్నాను.అమృతత్వమునందుకున్నాను.దాత యజమానికొరకు నీవు మరల అశ్వ మై ప్రతిఫలమునందించుము.అందుకున్న నాకు సుఖరూపమవగుము.

(ఈ ిధముగాదేవతలనుతలచుకొని దానములుఇవ్వవలెను)

48.ఇచ్చువాడెవడు?ఎవరికి ఇచ్చును? కోరికయేఇచ్చును. కోరికకే ఇచ్చును.కోరికయే దాత. కోరికయేగ్రహీత.

కోరికా!అట్లుదాత - గ్రహీతలుఇరువురు నీ రూపమే అయినారు.ఇచ్చిపుచ్చుకొనుటవలన సర్వధనాదులునీవే అయిన ు కదా!

**కో ఽదాత్కస్మా అదాత్కామో ఽదాత్కామాయాదా**
**త్కామోదాతాకామః ప్రతిగ్రహీతాకామైతత్తే**

ఎంతచక్కగా చెప్పినాడు!కోరికలే కదా అన్నింటికికారణము!! ఈ లోకములుకోరికల వలననేనిలిచి ఉన్న !!!
మోక్షముసహితము కోరికయేగదా!

దాశరథిరంగాచార్య ిరచిత

శ్రీమదాంధ్రవచన శుక్లయజుర్వేదసంహితయందలి

ఉపాంశ్వాదిప్రదానాన్తమగు ఏడవఅధ్యాయము సమాప్తము.

జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతిం।

అధారంస్సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఎని ుదవఅధ్యాయము

**1.ఉపయామగృహీతోస్యాదిత్యేభ్యస్త్వా ష్ణో ।**

**ఉరుగాయైష తే సోమస్త్వంరక్షస్వమాత్వా దభన్॥**

( ఇదితృతీయ సవనంధానము ద్రోణకలశమునుండిఆదిత్యగ్రహమునసోమరసము నింపి -ప్రతిప్రస్థాత)
సోమమా!నీవు ఉపయామగ్రహముద్వారా గ్రహించబడినావు.( ద్విదేవత్యఆహుతులుఅగ్నికి అర్పించి - శేష సోమరసమును స్థాళిలోపోసి, ఆదిత్యస్థాలిమూతపెట్టి) సోమరసమా!ద్వాదశ ఆదిత్యులకొరకు నేను ఈ స్థాళిలోపోయుచున్నాను.
ఉరుక్రమంష్ణో!ఇది నీ సోమరసము.దీనిని రాక్షసాదుల నుంచిరక్షింపుము. సోమమా!ఇక నిన్ను రాక్షసాదులుహింసించజాలరు.

2. ఆదిత్యఇంద్రా! నీవు ఎన్నటికినిహింసకుడవుకావు.హంర్దాత.
యజమానిహంరన్నమునుసర్వదా చేరుకొందువు.
ధనవాన్ఇంద్రా! నీయొక్క అధికాధికదానము మాకు లభించుచునేఉండును.
సోమమా!నేను నిన్ను ఆదిత్యులకొరకే అందుకొందును.

3. (పూతభృతఘటమునుంచి సోమరసమునుఆదిత్యగ్రహముననింపవలెను)
ఆదిత్యా!నీవు ఎన్నటికినిప్రమాదము కలిగించవు.నీవు దేవతలను,మానవులనురక్షించెదవు.
ఇదితృతీయసవనము.దీనికి చెందినసోమము బలకరము.ఇది నీ కొరకు వేదిందవేచిఉన్నది.
నీయొక్క అమృతమయరూపము ద్యులోకమందున్నది.
సోమమా!నేను నిన్ను ఆదిత్యులకొరకు అందుకొనుచున్నాను.

4. (ఆదిత్యగ్రహమునింపిన సోమరసమునపెరుగు కలుపవలెను)
దేవతలకుసుఖము కొరకు యజ్ఞంజరుగును. ఆదిత్యులారా!ంరు మాకు సుఖములుకలిగించుచు ంచ్చేయండి.
దేవతలారా!ం బుద్ధి అనుగ్రహముగలది. అది మావైపుమరలవలెను.ం
అనుగ్రహాత్మకమగుబుద్ధి పాపులకు ధనముకలిగించరాదు.
సోమమా!ఆదిత్యుల కొరకు నిన్నుదధిచే కలుపుచున్నాను.

5. (ప్రతిప్రస్థాతరాతిచే సోమమునుదధితో కలుపవలెను)
అంధకారనాశకఆదిత్యా! ఇది దధింశ్రితసోమరసము. నీ పానముకొరకు అర్పించు చున్నాము.పానము చేయుము.పరిపూర్ణతృప్తుడవగుము.

(యజమానపత్ని పూతభృతఘటమునుదర్శించి ఋత్విజులతోఇట్లనును)
బ్రహ్మాదిఋత్విజులారా!ంరు ఆశీర్వదించగల సమర్థులు.మమ్ము ఆశీర్వదించుటయందుశ్రద్ధవహించండి.

( ఋత్విజులుఅనవలసినది)
ఈ యజమానపతిపత్నులు కోరినధనమున అనుభంంతురుగాక. ంరికి పురుషత్వోపేత పుత్రులుకలుగుదురు గాక. ఆ పుత్రులకుఅధిక ధనములభించునుగాక.వారు తమ ఇంటనేఉండి పుత్ర - ధనాదులచేవర్ధిల్లుదురుగాక.

6. (సాయంసవనసంబంధశేషకర్మనుపూర్తిచేసి - ఉపయామగ్రహమునసంత కొరకు సోమముగ్రహించవలెను)
సంతాదేవా!మాకు నేడు కోరిన ధనములభించవలెను.గుర్తుంచు కొనదగినఆ ధనము మాకురేపు కూడ లభించవలెను.మాకు నిత్యము వరణీయధనస్రోతస్సునుఅందించుము. మేముఅధికము - అధికమేు?అత్యధిక ధనపూర్ణగృహమునకుప్రభువులముకావలెను. దేవా!మేము ఈస్తుతిచేధనభాజనులముకావలెను.

7. సోమరసమా!నీచు ఉపయామ పాత్రలోగ్రహించబడినావు.నీవు సంతా దేవునిపానమవు. అన్నముప్రసాదించుదానవు.అన్నదాతా! మాకు అన్నముఅందించుము.
ఈయజ్ఞమునుదేవతల కృపాపాత్రము చేయుము.ఈ యజ్ఞస్వాు యజమానినిప్రసన్నుని చేయుము.
సోమరసమా!నిన్ను ఐశ్వర్యవంతుడవగుసంత కొరకు గ్రహించుచున్నాను.

8. (అధ్వర్యుపూతభృత ఘటమునుంచి మహావైశ్వదేవపాత్రలోనికి సోమరసముతీసికొనవలెను)
వైశ్వదేవగ్రహమందలిసోమమా! నిన్ను ఉపయామపాత్రలో తీసికున్నాము.నీవు చక్కని సుఖదాతవు.సుందర రూపఫేవమా! నిన్నుశ్వేదేవతలకొరకు అందుకొనుచున్నాను.ఇది నీ స్థానము. శ్వేదేవతలకొరకు నిన్ను ఈ వేది ిదస్థాపించుచున్నాను.

9. (ప్రతిప్రస్థాతపత్నీవద్గ్రహమునుఅందుకొనవలెను)
సోమరసమా!నిన్ను ఉపయామగ్రహమునతీసికొన్నాము. నీవుఆహ్లాదకమవు.యజ్ఞస్వాు యజమానినిన్ను ిర్యశాలిగా అభిషంచినాడు.నేను పత్నీవ్రతగ్రహములందుదానిని నింపినాను.

(ప్రచరణీస్రువమందలిశేషఘృతమును పత్నీవ్రతగ్రహమునందలిసోమమున ప్రతిప్రస్థాత కలుపవలెను.)
(మంత్రద్రష్టఋషి పలుకుచున్నాడు.)

పరలోకమునుఅందుకున్నవాడనునేనే. నేనే అధోలోకగతపృథివ్యాది స్వరుపడను.ఈ అంతరిక్షము నాకు తండ్రిఅయినాడు. నేను సూర్యునిఉభయదిశలనుండిదర్శించినాను. దేవతలునివసించు పరమ గుహ్యస్థానమును నేనుచూచినాను.

**అహంపరస్థాదహమవస్తాద్యదన్తరిక్షంతదుమే పితాభూత్।**
**అహంసూర్యముభయతోదదర్శాహం దేవానంపరమంగుహా యత్।**

10.(పత్నీ వ్రతగ్రహపుఅగ్నికి ఉత్తర భాగమునహోమము చేయవలెను)
పత్నీయుతఅగ్నీ! నీవు త్వష్ట సహితముగాప్రీతుడవగుము.ఈ సోమరసమును సేంచుము.అగ్నయేస్వాహా

(నేష్ట పేరుగల ఋత్విక్కు ఉత్తరద్వారము నుండియజమానపత్నినితెచ్చి 'ఉద్గాతఋత్విజుని' ఉత్తరదిశను కూర్చుండ పెట్టవలెను.యజమాన పత్నిఉద్గాతను చూచుచుఅనవలసినది)

ఉద్గాతా!నీవు సంతానములస్వా◌ి◌. ◌ీర్యము ధరింపచేయగలవాడవు.నీవు నాలో ◌ీర్యమునునిలుపుము. నీవు ప్రజాపతి◌. సేక్తవు. ◌ీర్యాధారమవు.నీ ◌ీర్యము వలన◌ీర్యధారి పుత్రుని కనగలను.

11.(ఆగ్రాయణ ఘటమునుంచి హరియోజనగ్రహమునుసోమరసమున నింపవలెను) సోమమా!నీవు ఉపయామ పాత్రమునగ్రహించబడినావు.నీవు హరితవర్ణవు.హర్యశ్వములనుతన రథమునకూర్చు ఇంద్రుని భాగమవు.నిన్ను నేను ఋక్,సామ మంత్రములకొరకు గ్రహించుచున్నాను.

యువలాజలారా!◌ీరు ఇంద్రుని హర్యశ్వములకుమేత అగుదురు. సోమసహితముగాఇంద్రునకు ఖాద్యముకండు.

12.( ఋత్విజులందరుయవల పేలాలనుఅందుకొని వాసన చూచి- ఉత్తరవేది ◌ీదచల్లుదురు)
యువయుక్తసోమరసమా! దేవతలుభక్షించు నీవుఅశ్వములు, గోవులుఇచ్చుదానవు. యజువులకుప్రీతికరమై - ఉద్గాతలుస్తుతించునదై- హోతలు ప్రశంసించునదై- అనుజ్ఞాత అనుజ్ఞాతమైననిన్ను నేను భక్షించుచున్నాను.

13.( ఋత్విజులందరుఆరేసి చొప్పున యూపఖండములనుఅగ్నిలోవేయవలెను) యూపఖండమా!యజ్ఞాదులుచేయక దేవతల◌ిషయమున చేసినపాపమును నశింపచేయగలదానవు. మానవుల◌ిషయమున నిందాదులవలన పాపములనునశింపచేయగలదానవు. పితృదేవతలకుపిండాదులు అర్పించనిపాపమును నశింపచేయగలదానవు. స్వయం నిందాశ్లాఘములపాపమును నశింపచేయగలదానవు. ఇతర పాపములన్నింటినినాశనము చేయగలదానవు.నేను తెలిసి చేసినపాపములను, తెలియకచేసిన పాపములనునశింపచేయగలదానవు.

14.(చాత్వాలమున ఉన్ననిండు కుండలనువాటివాటి చమసములచేతాకవలెను)

మేముబ్రహ్మవర్చస్సు- బలము- పుష్టిగలఅవయములు-నిర్మలమనస్సు గలవారముకావలెను. దాతత్వష్ట మాకు మహాధనములుఈయవలెను. మాయందున్నపాపమును - ◌ికారమునుదూరము చేయవలెను.

15.(**"సంుష్టయజు'**వనుఆహుతులచేహోమము చేయవలెను)

ఇంద్రా!నీవు మాకు మనసునునుంచి కోరికలను,గోవులను - ◌ిద్వాంసులస్వస్తి వచనములను- దేవతలని◌ుత్తముయజ్ఞమును- యజనీయదేవతలసద్బుద్ధిని కలిగించుము.ఇంద్రాయస్వాహా ( తొలిఆహుతి అర్పించవలెను)

16.మేము బ్రహ్మవర్చస్సు-జలము-పుష్టి కల అవయములునిర్మల మనస్సు గలవారలముకావలెను. దాతత్వష్టమాకు ధనములుప్రసాదించవలెను.మాయందున్న పాపములను- వైకల్యమునుదూరము చేయవలెను.(రెండవ ఆహుతిఅర్థించవలెను)

17.దానశీలధాతయు,సంతయు, ధనపాలప్రజాపతియు,ద్యోతమాన అగ్నియుఈ యజ్ఞమునుస్వీకరించవలెను.త్వష్టయు, దానములిచ్చిప్రజలను సమృద్ధులనుచేయు ంష్ణువునుయజమానికి ధనములుఅందించవలెను- స్వాహా (మూడవఆహుతి అర్పించవలెను)

18.ఈ యజ్ఞమునుప్రీతికరము చేయుటకువచ్చిన వారలారా!ంు అందరి కొరకు సులభముగాలభించి సుఖాసములుపరచినాను.

నివసింపచేయుదేవతలారా!
ంరుహవ్యవాహకులు.హంస్సులనుస్వముఖాదులందుధరించిపోవువారు.ంరు మాకు ధనములనుఅందించండి -స్వాహా( నాలుగవ ఆహుతినిఅర్పించవలెను)

19.ద్యోతమాన అగ్నీ!హంస్సులు కోరుదేవతలను- హంస్సులు అందుకొనుటకు- ఇచట తీసుకొని వచ్చినావు.ఇక నీవు వారందరిని తమతమస్థానములకు సాగనంపుము.వారు చరు, పురోడాశాదులనుఆరగించినారు. సోమరసపానముచేసినారు. వారు వాయు,ఆదిత్య ద్యులోకములందలివారి వారి స్థానములకుప్రస్థానము చేయవలెను- స్వాహా (అయిదవ ఆహుతినిఅర్పించవలెను.)

20.అగ్నీ! నిన్ను ఇచటికిమా యజ్ఞమునకు- ఆహ్వాత రూపమునంచ్చేయమనిప్రార్థించినాము. నీవుయజ్ఞమందుసమృద్ధి కలిగించుదేవతలనుయజించినావు.యజ్ఞమున జరిగినలోపములను ఉపశంంపచేసినావు.ఇక మా యజ్ఞం సంపూర్ణమైనట్లుగాభాంంచి స్వస్థానమునకుంచ్చేయుము. (ఆరవఆహుతి అర్పించవలెను)

21.యజ్ఞసమాప్తి తెలిసినదేవతలారా! ంరుంు ంు స్థానములకుప్రస్థానము చేయండి.మా మనసునందలియజ్ఞసంకల్పమునుపాలించు ప్రజాపతీ!ఈ యజ్ఞమునునేను నీకు అర్పించుచున్నాను.నీవు దీనిని వాయువునుధరించుము. స్వాహా(ఏడవ ఆహుతిఅర్పించవలెను)

22.యజ్ఞమా! నీవునీ స్వస్థానమగు యజ్ఞదేవతంష్ణువును చేరుకొనుము.నీ ఉత్పత్తికి నింత్తభూతము - క్రియాశక్తికిమూలభూతమగువాయువును చేరుకొనుము.( ఎనిందవ ఆహుతిఅర్పించవలెను)

స్తోత్రస్తవన- చరుపురోడాశ -వధ్యపశుయుక్తఈ యజ్ఞమునకుస్వాంయగు యజమానీ!ఈ యజ్ఞమునీది.దీనిని ప్రీతియుక్తముగసేంంపుము. స్వాహా ( తొంమ్మదవఆహుతి అర్పించవలెను)

23.(యజమాని తనచేతనున్నమృగశృంగమును, నడుముకుఉన్న మేఖలనుతీసి చాత్వాలమునపారవేయవలెను)
మేఖలా!నేను నిన్ను ిసరివేసినాను.నీవు సర్పము, అజగరముకాకుము.

(అధ్వర్యుచాత్వాలపు తూర్పు వైపుముఖము ఉండునట్లునిలిచి అవభృతస్నానమునకు సిద్ధపడినయజమానితో అనిపించవలసినది)

వరుణుడుిశాల అంతరిక్షమునసూర్యుని కొరకు మార్గమునిర్మించినాడు. అడుగుపెట్టరాని అంతరిక్షమునసూర్యుడు అడుగు పెట్టిసంచరించుటనుసంభవము చేసినాడు.అతడు సాధారణులకుదుఃఖము కలిగించుటను- చాడీలు చెప్పుటనుసహితము సహించడు.శిక్షించును.

(అవభృతస్నానమునకుయజమాని జలప్రవేశముచేసి అనవలసినది)
వరుణదేవునకునమస్కారము. వరుణదేవునిపాశము వెడలినది**"ధిష్ఠితోవరుణస్యపాశః "**

24.(వెలిగించిన సిధనునీళ్లలో వేసి దానిిద ఆజ్యము వేయవలెను)
అగ్నీ!నీవు అపాంనపాత నామముగలవాడవు. అసురులుకల్పించిన ిఘ్నములనుభంగము చేసినావు.జలమునందుప్రవేశించినావు. నీవుఇంటింట ిరాజిల్లుము.ఘృత ఆహుతులనుస్వయముగా స్వీకరింపుము.నీ జిహ్వ జ్వాలారూపమగును. ఘృతమునఉన్నతమై వెలుగొందుము.అగ్నయే స్వాహా.

25.(ఋజీషకుంభమునునీళ్లలో వేయవలెను)
సోమమా!నీ హృదయముజలములలోన- సముద్రమందుఉన్నది. అచటనీ లోనికి జలమును,ఓషధులును ప్రవేశించవలెను.యజ్ఞమునందుశుభవచనములుఉచ్చరించియు - నమస్కరించియు- నిన్ను ప్రతిష్ఠించుచున్నాను.సోమాయ స్వాహా.

26.(నీటిలో ఋజీషకుంభమునుముంచిన కొంత సేపటికి)
జలమా!ఈ ఋజీష కుంభమునీ గర్భ స్వరూపము రుచికరమును- చక్కనిదగు ఈ ఋజీషమునుస్వీకరించుము.

ఋజీషప్రాయమగుసోమమా! ఇక ఇదియేనీలోకము. ఇందులోఉండి మాకు సుఖశాంతులుకలిగించుము. మాఆపదలన్నింటిని- ఇచటినుండి- అచటికి చేర్చుము.

27.అవభృతయాగమా!నీవు మెల్లగా నడువుము.నీవు సదావేగగతి గలదానవు.అయినను మెల్లగాకదులుము.
యజ్ఞమా!దేవతల యెడలచేసిన పాపములనుప్రవహింపచేసితెచ్చినాను.మనుషుల చేత- మనుష్యుల ిషయమునచేసిన పాపములనునీటపారించి తెచ్చినాను.ిపరీత పరిణామములహింసలనుంచిమమ్ము రక్షింపుము.

(యజమానిస్నానము చేసి జలమునుండి బయటికివచ్చి, వస్త్రముధరించి, ఆహవనీయాగ్నికిసంధను సమర్పించవలెను.)
సంధా!నీవు దేవతలసంధవు. "దేవానాంసంధాసి"

28.(యజ్ఞార్థము వధించినగర్భిణిగోవు యొక్క పిండమును అగ్నిలోవేయవలెను) మాయచుట్టినపదినెలల పిండముకంపించవలెను.వాయువు వలెను,సముద్రతరంగములవలెను. దశమాసగర్భపిండము కంపించవలెను.

29.గర్భిణి గోవూ! నీగర్భముయజ్ఞయోగ్యమైనది.నీయోని స్వర్ణమయమైనదినీ పిండము కలముకాని అవయవములుకలది. ఈ గర్భమునుతల్లికి కలుపుచున్నాను.

(గర్భపురక్తముచే హోమముచేయవలెను)

30.బహుదర్శనీయము-అనేకరూపవంతము.గర్భరూప సోమము గర్భమందుమహిమనుపొందునుగాక. గర్భిణిగోవును ఒకటి, రెండు,మూడు, నాలుగు మరియుఎనిుది పాదములుగల దానిగా భాంచిసర్వభూతములందువ్యాపించును గాత-స్వాహా

31.మరుత్తులారా! ఏ యజమానిఇంట - ద్యులోక శిష్టప్రకాశముగల- రు సోమపానము చేయుదురోఆయజమానియేసురక్షితుడు అగుచున్నాడు.

32.ద్యావాపృథ్వులారా! కరుణించండి. కరుణారసమున ఈ యజ్ఞమునుతడపండి. మాకు జీవనయోగ్యధనములు ప్రసాదించండి.

33.వృత్రహంతా!చ్చేయుము. వేదస్వరూపులగునీ హర్యశ్వములనుఆహ్వానించినాము.వాటికి యజ్ఞకాలముతెలియును. అదిస్వయముగా రథమునతగులుకొనుము.సోమాభిషవ శిలలు- రథమునెక్కిన- నీమనసును మాయజ్ఞమువైపు మరలించవలెను.

సోమమా!సోమాభిషము నుండినీవు ఉపయామగ్రహమునగ్రహించబడినావు.

34.హర్యశ్వములుపొడుగు జూలు గల.హరిత వర్ణలు,వర్షములు కలిగించున.తరుణలు.

సోమపాయిఇంద్రా! సూర్యాశ్వములనురథమునకు కట్టుము.స్తుతిరూపవాణి నుము.మా గృహమునకుచ్చేయుము.

35.ఇంద్రా! నీవు అప్రతిహతబలశాలి. హర్యశ్వములునిన్ను మాత్రమేసహించును.అ నిన్ను వసిష్ఠాదిఋషుల వద్దకును- మానవుల యజ్ఞములవద్దకును కొనిపోవును.

36.ప్రజాపతి ఈ సమస్తలోక,లోకాంతరములందున్నాడు.అతడు సమస్త ప్రజలతోఆనందించును. అతడుసూర్యుడు, అగ్ని, ిద్యుత్అను మూడు జ్యోతులతోకూడి ఉండును. అట్టిప్రజాపతియే 'షోడశి'అగును. 'త్రీణిజ్యోతీంషిసచతే సషోడశీ''

37.(షోడశిగ్రహమునందలి సోమమును సేించవలెను)

షోడశిగ్రహమందలిసోమమా! ఇంద్రరాజు- వరుణ సామ్రాట్టు- వారిరువురు నిన్ను సర్వప్రథమముగాసేించినారు. వారి తరువాతనేనేను సేించినాను.నా ప్రాణములతోపాటు నాలో ఉన్న సరస్వతియు- ఈ సోమమున - సంతృప్తిచెందవలెను.స్వాహా.

(షోడశియాగముపూర్తి అయినది)

38.(ద్వాదశాహముప్రారంభము)
అగ్నీ!నీవు శుభకర్మలవాడవు.మాలో బ్రహ్మవర్చస్సు,సుిర్యమును నింపుము.మాకు అన్నము, అశ్వగోధనములనుప్రసాదించుము.

సోమరసమా!నీవు ఉపయామ గ్రహమునతీసికొనబడినావు.నిన్ను తేజస్విఅగ్ని కొరకు పరిగ్రహించుచున్నాను.ఇది నీ స్థానము. తేజస్విఅగ్ని కొరకు నిన్ను ఇచటస్థాపించుచున్నాను.

తేజస్విఅగ్నీ! దేవతలందునీవు పరమ తేజోవంతుడవు.నీ ప్రసాదమున నేనుమానవులందుబ్రహ్మతేజస్వినికావలెను.

39.ఇంద్రా! నీవు ఓజస్సుతోలేచినావు. అధిషవణచర్మము ిద అభిషించినసోమపానము చేసినావు.ఆనందమున తేలియాడుక్రింది పెదిని చప్పరించినావు.

సోమమా!నీవు ఉపయామగ్రహమునతీసుకొనబడినావు.నిన్ను ఓజస్వి ఇంద్రునికొరకు పరిగ్రహించినాను.ఇదిగో ఇది నీస్థానము.ఇచట నిన్ను ఓజస్విఇంద్రుని కొరకు స్థాపించినాను.

ఇంద్రా!దేవతలందుఅత్యంత ఓజస్విని.నీ అనుగ్రహముననేను మానవులందు

ఓజస్వినికావలెను. ( ద్వితీయఅతిగ్రాహ్య గ్రహమునుపట్టుకొని)

40.(మూడవ అతిగ్రాహ్యగ్రహమునుపట్టుకొని)
సూర్యకిరణములుమానవునకు అనుకూలములైప్రజ్ఞాపికలై కనిపించిని.అి అగ్నికిరణముతో సమానముగామెరయుచున్ని.

సోమమా!నీవు ఉపయామగ్రహమునతీసికొనబడినావు.నిన్ను తేజస్వియగుసూర్యుని కొరకు పరిగ్రహించినాను.ఇదిగో ఇది నీ స్థానము.ఇచట నిన్ను తేజస్విసూర్యునికొరకు స్థాపించినాను.

తేజస్వితముసూర్యా! నీవు ప్రకాశమానులందుఅత్యంత ప్రకాశమానుడవు.నీ అనుగ్రహముననేను మానవులందుప్రకాశమానుడనుకావలెను.

(ద్వాదశాహయజ్ఞం ముగిసినది)
41.(గవామయనామక సంవత్సరసత్రము యొక్క ిషువన్నామ మధ్యాహ్నమునసూర్యునకు పశువునుబలిఇచ్చి అతిగ్రాహ్యగ్రహమునుతీసికొనవలెను)

సూర్యుడు ిశ్వమును ీక్షించదలిచినాడు.అతని కిరణములుకాంతిమయములు.సర్వమును చూపగలవు.ఆ కిరణములు భానుమూర్తినిపై అంతరిక్షమునకు తెచ్చిన ి.

సోమమా!నీవు ఉపయామగ్రహమునతీసికొనబడినావు.నిన్ను తేజస్వియగుసూర్యుని కొరకు పరిగ్రహించినాను.ఇదిగో ఇది నీ స్థానము.ఇచట నిన్ను తేజస్విసూర్యుని కొరకు స్థాపించినాము.

42.(గార్గత్రిరాత్ర సవనమునవేయిగోవులను దక్షిణగాఇచ్చు ిధానముఉన్నది. ఆ వేయింటిలోచివరి ఆవుపేరు రోహిణి.దానిని హ ిర్ధానముమధ్యన నిలిపిద్రోణకలశమునువాసన చూపించవలెను)

మహిమగలరోహిణీ! ఈ ద్రోణకలశమునుమూర్కొనుము. ద్రోణకలశముననిండిన సోమమునీలో ప్రవేశించవలెను.దానిని నీవు ఓజస్వరూపినిచేసి మాకు తిరిగిఇమ్ము. మేము ిమ్ముపూజించి వేయిగోవులనుఇచ్చినాము. అందుకుప్రతిఫలముగా ఆ వేయిగోవులనుమాకు తిరిగి ఇమ్ము. ఆగోవులు దుగ్ధధారావంతములుకావలెను. నీ అనుగ్రహముననాకు మరింత గోఅశ్వధనములభించవలెను.

43.(రోహిణిగోవుకుడిచె ిలో యజమానిచెప్పవలసినది)
నీవుఅహంతవ్యవు.మనుపుత్రి ఇళవలెస్తుత్యవు.
ఆనందమునిచ్చుదానవు.ఆహవనీయవు.కోరదగిన
దానవు.ఆహ్లాదికవు.ద్యుతియుక్తవు.అదీనదేవమాతఅదితికి సాటివచ్చుదానవు.
క్షీరవతి ి.మహిమాన్వితవు. ిశేషఖ్యాతి గలదానవు.ఇంతటిదానవునీవు
దేవతలముందునన్నుసుకృతుడను - కృతవ్రతుడనుఅని ివరింపుము.

44.(గవామయన యాగపుచివరిరోజునపశువధ తరువాతఇంద్రసంబంధి
గ్రహమునుగ్రహించుటకుమూడుమంత్రములున్న ి)
ఇంద్రా!నీవు మా హింసకశత్రువును వధించుము.మా ీద సేనతో
దండెత్తదలచినవానినిమట్టి కరిపించుము.మాకుహాని తలపెట్టినదుష్టుని
రసాతలమునకంపుము.

సోమరసమా!నిన్ను ఉపయామ గ్రహమున- ిశిష్టయుద్ధకారి ఇంద్రునికొరకు - గ్రహించినాను.ఇది నీస్థానము. ిశిష్టయుద్ధకారి ఇంద్రునికొరకు నిన్ను స్థాపించినాను.

45.(రెండవ మంత్రము)
ఇంద్రుడువాక్పాలకుడు. సర్వకర్మ.మనోవేగముగలవాడు.మమ్ము నేటిఅన్నపు
యుద్ధమునరక్షించమని ఇంద్రునిఆహ్వానించుచున్నాను.సమస్తలోకములకుకళ్యాణకర్త,
సుకర్ముడగుఇంద్రుడు మా సకలఆహ్వానములనుమన్నించవలెను.

సోమరసమా!నిన్ను ఉపయామగ్రహమునసర్వకర్మ ఇంద్రుని కొరకు గ్రహించినాను.ఇది
నీస్థానము. ఇచటనిన్ను సర్వకర్మ ఇంద్రునికొరకు స్థాపించినాను.

47.(ఔదుంబర కలశమునసోమము నింపవలెను.హోత చమసమందున్న'నిగ్రామ్య'
జలమునుఅందులో కలుపవలెను.మూడు సోమలతలనుఅందులో
వేయవలెను.'అగ్నయేత్వా' మొదలగుమూడు మంత్రములుచది
'అదాభ్య'గ్రహమునుఅందుకొనవలెను.)

సోమరసమా!నిన్ను ఉపయామ గ్రహమునతీసుకున్నాను. గాయత్రీఛందోవంతవగునిన్ను
అగ్నికొరకు గ్రహించినాను.

సోమరసమా!నిన్ను ఉపయామ గ్రహమునతీసుకున్నాను. త్రిష్టుప్ఛందో వంతవగునిన్ను
ఇంద్రుని కొరకుగ్రహించినాను.

సోమరసమా!నిన్ను ఉపయామగ్రహమునతీసికున్నాను. జగతీఛందమవగునిన్ను
శ్వదేవతలకొరకు గ్రహించినాను.

సోమరసమా!ఈ అనుష్టుప్ ఛందముసాక్షాత్తు నీ స్తవమేఅగును.

48.(ఆహవనీయవేదివద్దకు వెళ్లుచు'అధాభ్య' జలమునుసోమవల్లి ఖండములంద
చల్లవలెను)
సోమమా!కదలాడు మేఘములగర్భమందు శయనించువర్ణజలమునురాల్చుటకు
నిన్నుకంపింప చేయుదును.

అత్యంతగర్జనకారి మేఘములఉదరములందు శయనించువర్షజలమునుదాల్చుటకు
దానినికరిగింతును. సుఖకరవర్షముకలిగించుటకు నేనునిన్ను ద్రంపచేయుదును.అత్యంత
ఆనందకరజలముల వర్షముకొరకు నిన్ను ద్రంపచేయుదును.శుద్ధమగునిన్నుశుద్ధ
'నిగ్రాభ్య'జలములందుకలుపుదును.

సోమమా!నిన్ను పగటియందును- సూర్యుని కిరణములందును- లీనము చేయుదును.

49.సోమమా! నీవు శ్రేష్ఠమవు.ఆదిత్యస్వరూపవు. ఎంతోశోభిల్లుదానవు.మహానుడును- శుద్ధ
ఆదిత్యుడునీకు పురోగా.
సోమఃసోమస్య పురోగాః - సోమమేసోమమునకు పురోగా

సోమమా!నీపేరే అహింసనీయము- జాగరణ శీలము- అందుకే నిన్ను నేనుపూజించుచున్నాను.సోమాయ స్వాహా.( అదాభ్యమునఉన్న సోమమునకుఆహుతి ఇవ్వవలెను.)

50.(రోటియందున్నసోమఖండములనుసోమమున వేయవలెను)
సోమమా!నీవు అభిలషణీయవుఅగ్నికి ప్రియభోజనమవగుము.అగ్నిలో ప్రవేశింపుము(మొదటి ముక్కనువేయవలెను.)

సోమమా!నీవు అందరిని వశమునందుఉంచుకొనుదానవు.ఇంద్రునకు ప్రియభోజనమవగుము.ఇంద్రునిలో ప్రవేశింపుము.(రెండవ ఖండమునువేయవలెను)
సోమమా!నీవు మాకు ిత్రుడవు.ిశ్వేదేవతలకుప్రియ భోజనమవగుము.ిశ్వేదేవతలందుప్రవేశింపుము. (మూడవఖండమును వేయవలెను)

51.(దీక్షగొను యజమానులచేఅధ్వర్యు గార్హ పత్యాగ్నిలోఘృతము అర్పింపచేయవలెను)
గోవులారా!ిరు ఈ యజమానులందేప్రసన్నులు కావలెను.ిరు ఇచటనే ఆనందించండి.ిరు ఈ యజమానులందేఆనందించవలెను.ి దూడలు మున్నగునిసహితము ఈయజమానులందేసంతోషించవలెను.స్వాహా (మూడవఆహుతి అర్పించవలెను)

52.( ఇది యజమానులఆత్మస్తుతి )
సోమమా!నీవు యజ్ఞపు సాక్షాత్సమృద్ధి. మేమునీవలన ఆదిత్యరూపజ్యోతిని చేరుకున్నాము.ఇప్పుడు ఆజన్మాంతముధర్మాచరణులముఅయినాము. మేము పృథ్వినుండిఎగిరినాము.
స్వర్గమునుఆరోహించినాము.దేవతలమనితెలిసికున్నాము.దివ్యజ్యోతినిదర్శించినాము.

53.(ఒకే యజ్ఞపు పెక్కురు యజమానులుహిర్ధాన శకటముక్రింద దూరి తూర్పుముఖముగా బయటికిరావలెను)
ఇంద్రావజ్రమా!ిరు శత్రువు ముందునిలిచిపోరాడగలవారు. మాిదసేనను నడిపించుశత్రువును వధించండి.వానిని వజ్రమునహతమార్చండి.మాకు శత్రువైనవాడుగహనాటినదాగినను- జలము లందుదాగినను - ఇంద్రా! వానినిపరిమర్చుము.

ఇంద్రా!మాకు నలుదిశలఉన్న శత్రువునునాశము చేయుము.

వజ్రమా!సర్వత్రసంచరించుశత్రువులనుహతమార్చుము.

భూిి,స్వర్గము, అంతరిక్షములందుఆనందమయుడవైఉన్న పరమాత్మా! మేముసుప్రజలము. మేముసుప్రజావంతులముకావలెను. అన్నాదులసమృద్ధికలిగి స్వప్రజనుపోషించువారలముకావలెను.

54.(సోమము దేవతాస్వరూపము. ఉపయోగముననుసరించి పేర్లు మారును)

1. యజమాని'సోమరసమున యజ్ఞంచేయుదును'అనిన సోమము 'పరమేష్ఠి'అగును.

2. 'ఇప్పుడునేను సోమరసమునయజ్ఞం చేయుచున్నాను'అని యజమాని
అన్నప్పుడు'ప్రజాపతి' అగును.

3. ఇంద్రాదిదేవతల నిమిత్తమైనసోమము 'అంధస్సు'అగును.

4. దానముచేయు సోమము'సవిత' అగును.

5. దీక్షనందుకున్నప్పటిసోమము 'విశ్వకర్మ' అగును.

6. గోవునుఇచ్చి ఖరీదు చేసినసోమము 'పూష' అనబడును.

(పరమేష్ఠి,ప్రజాపతి, అంధస-సవిత-విశ్వకర్మ-పూషలకుఆహుతులుఅర్పించవలెను)

55.7. కొనుటకు ఎత్తినసోమము'ఇంద్రమరుత్' అగును.

8. క్రయముచేయబడుచున్నసోమము 'అసురము' అగును.

9. ఖరీదుచేసిన సోమము'మిత్ర' అగును.

10.యజమాని తొడపైనిలిచిన సోమము'శిపివిష్ఠ' 'విష్ణువు' అగును.

11.బండిమీద కొనిపోబడుసోమము 'జగత్పాలక' 'విష్ణువు ' అగును.

(ఇంద్ర,మరుత-అసుర-మిత్ర-శిపివిష్ఠవిష్ణు-జగత్పాలక
విష్ణువులకుఆహుతులుఅర్పించవలెను)

56.12. బాణలి నుండిదింపిన సోమము'వరుణ' అనబడును.

13.అటక మీద ఉన్న సోమము'అగ్ని' అనబడును.

14.అగ్నీధ్రమునందలిసోమము 'ఇంద్ర' అనబడును.

15.'హృదయేత్వా,మనస్తేత్వా' అనుమంత్రమునముక్కలు చేసితెచ్చిన సోమము''అధర్వ''
అనబడును.

(వరుణ- అగ్ని - ఇంద్ర- అధర్వలకుఆహుతి అర్పించవలెను)

57.16. ముక్కలు ముక్కలుగాతరిగిన సోమము'విశ్వదేవ' నామకము.

17.వర్ధిల్లి తనభక్తులను పాలించుసోమము ' ిష్ణు ' నామకము.

18.అభిష ించబడుసోమము 'యమ'నామకము.

19.చక్కగా పోషించబడుసోమము , ' ిష్ణు ' నామకము.

20.దశాప ిత్రమునప ిత్రమును సోమము"వాయు" నామకము.

21.పావనము చేయబడినసోమము 'శుక్ర' నామకము.

22.పాలతో కలసిన సోమముకూడ 'శుక్ర' నామకము.

23.సత్తుచే కలసినసోమము 'మంథ'నామకము.

(ిశ్వదేవ- వర్ధన ిష్ణు -యమ- పోషక ిష్ణు - వాయు - పావనశుక్ర - దుగ్ధ శుక్ర - మంధిలకుఆహుతి అర్పించవలెను)

58.24. గృహపాత్రములందున్నసోమము 'ిశ్వేదేవ'సంజ్ఞకము.

25.హోమము కొరకగు సోమము'అసు' సంజ్ఞకము.

26.హోమము చేయునప్పటిసోమము 'రుద్ర' సంజ్ఞకము.

27.హుతశేషమై- భక్షణార్థము- సభామండపమునకుతెచ్చిన సోమము'వాత' సంజ్ఞకము.

28.ఆహ్వానాదులచే- ఆరగించుటకు అర్పించినసోమము 'నృచక్ష,సంజ్ఞకము.

29.పానము చేయుబడుచున్నసోమము 'భక్ష'సంజ్ఞకము.

30.పాపము చేసిన తరువాత'జఠర' మందున్నసోమము 'నరాశంస' సంజ్ఞకము.

(ిశ్వదేవ- అసు - రుద్ర - వాత - నృక్ష- భక్ష - నరాశంసములకుఆహుతులుఅర్పించవలెను)

59.31. అపభృత స్నానమునకుసిద్ధమైన సోమము'సింధు' సంజ్ఞకము.

32.జలాభిముఖముగాతెచ్చిన సోమము'సముద్ర' సంజ్ఞకము.

33.జలనిమగ్న సోమము'సలిల' సంజ్ఞకము.

(సింధు-సముద్ర-సలిలములకుఆహుతులుఅర్పించవలెను)

ిష్ణువుమరియు వరుణునిఓజోబలముననేఈ లోకములు - లోకాంతరములునిలిచిఉన్ని.
వారుతమ బలిర్యములచేఅందరిని ిించిన బలవంతులైనారు.వారిని శత్రువు
ఏనాడునుఓడించలేదు.తమ శక్తివలనవారు శత్రువు యొక్క సమస్త
సంపదలనుసాధించినారు.

ిష్ణు,వరుణులారా! యజ్ఞమునకుశీఘ్రముగా ిచ్చేయండి.ఇదే ిమ్ము
ఆహ్వానించుచున్నాము.

60.ఈ యజ్ఞం ద్యులోకమునదేవతల దయవలనయజ్ఞఫలమగుిశేషధనము
మాకుఅందవలెను.

అంతరిక్షమునకుచేరిన యజ్ఞంమానవులకు - వర్షరూపమున- అందినది.
అంతరిక్షమునుండినాకు వర్షధనములభించవలెను.

యజ్ఞముభూిినుండి సాగిపితరులనుచేరినది. ఆపృథ్వినుండినాకు
స్వర్ణాదిధనములులభించవలెను.

ఇంతఏల! యజ్ఞముఏ లోకమునకు చేరినఆ లోకపు శుభములుయజమానికి అందవలెను.

61.(యజ్ఞమునజరిగిన లోపములకుగాను 54 నుండి 60వ మంత్రమువరకు 34 దేవతలపేర
ప్రాయశ్చిత్తముచేసికొనుట జరిగినది.ఇది మహాిరఘటముపగిలినందుకు ప్రాయశ్చిత్తము)

ప్రాయశ్చిత్తశమనము జరిగినది.ముప్పది నలుగురుదేవతలు
ఫలదాయకతంతువులనుిస్తరింతురు. ఈ యజ్ఞమునందలి అన్నమునఆ దేవతలు
సంతృప్తులయినారు.మహాిరఘటముపగులుట వలనిచ్ఛిన్నమైనయజ్ఞమును- ఆ
దేవతలకుసమర్పించు ఈ ఘృతఆహుతివలన- సంధించుచున్నాను- స్వాహా. ఇక ఈ
మహాిరఘటము సూర్యస్వరూపమైదేవతలందుచేరవలెను.

62.(యజమానిచేఅనిపించవలసినది)
యజ్ఞమునందుఆహుతులుఇచ్చినాము. అట్టిఆహుతులశుభఫలము
ిిధరూపములవ్యాపించినది. అది- ఆ ఫలము - దిశాభేదమున- ఎనిిది
ప్రకారములుఅయినది.

యజ్ఞమా!నీవు నాప్రజలకుమహాధనమునుప్రసాదించుము. మేముధనమును -
పోషణసాధనములగుఅన్నాదులను - ఆయుష్యమునుఅందుకుందుముగాక. స్వాహా"
సయజ్ఞధుక్ష్వమహిమే ప్రజాయాంరాయసోప్షాం ిశ్వమాయురశీయస్వాహా ".

63. సోమమా!నీవు సువర్ణము -అశ్వములు - పుత్రులచేసమృద్ధవై మమ్ముచేరుము.
గోవులతోకూడిన అన్నమునుమా కొరకు తెమ్ము- స్వాహా.

ఆపవస్వహిరణ్యవదశ్వత్సోమంరవత్
వాజంగోమన్తమాభరస్వాహా.

## దాశరథిరంగాచార్య ంరచిత
## శ్రీమదాంధ్రవచన శుక్లయజుర్వేదసంహితయందలి
## గ్రహాగ్రహాన్నింత్తాంతమగుఎనిందవ అధ్యాయముముగిసినది.
## సర్వేపిసుఖినస్సంతు.

## జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతింl

## అధారంస్సర్వ ంద్యానాం హయగ్రీవముపాస్మహే ll

## తొంమ్మదవఅధ్యాయము

1.దేవసంతః ప్రసువయజ్ఞం ప్రసువయజ్ఞపతిం భగాయl
దివ్యోగంధర్వఃకేతపూః కేతం నః

పునాతువాచస్పతి ర్వాజంనః స్వదతు స్వాహాll

(ఈ అధ్యాయమున34వ మంత్రమువరకు వాజపేయ భాగముఈ
యజ్ఞాంగములకుఆహుతులుఅర్పించబడును)
సంతృదేవా!నీవు దయ ఉంచివాజపేయ యజ్ఞమునుఅనుమోదింపుము.
యజ్ఞస్వాంయజమానికి సంపదలుకలిగించుము.

సూర్యదేవా!నీవు ద్యులోకమునందుఉన్నవాడవు. కిరణములుగలవాడవు.
అన్నమునుపావనము చేయువాడవు.మా హంరన్నమునుపావనము చేయుము.ప్రజాపతి
మా హంరన్నమునుఆస్వాదించును గాతస్వాహా.

2. (ప్రాతస్సవనమునఆగ్రాయణ గ్రహమునుతీసికొన్న తరువాతమూడు
అతిగ్రహములనుతీసికొనవలెను.తదుపరి షోడశీగ్రహమునుతీసికొని
ఇంద్రదేవతాకగ్రహమునఅందుకొనవలెను)

సోమమా!నీవు ఇంద్రునకు ప్రియతమవు.నిన్ను ఇంద్రుని
కొరకుఉపయామగ్రహమునగ్రహించుచున్నాను.నీవు ధ్రువమగుపృథ్విలోకమున
ఉండుదానవు.మానవులందుఉండుదానవు. మనసులందుఉన్నదానవు.
అటువంటిసోమమవగు నిన్నునేను అందుకొనుచున్నాను.ఇది నీవు నిలుచుస్థానము.

సోమమా!నీవు ఇంద్రునకు ప్రియతమవు.నీవు జలములందుఉండుదానవు.
ఘృతమునందుఉండుదానవు. అంతరిక్షమందుఉండుదానవు. అట్టిసోమమవగు నిన్నునేను
అందుకొనుచున్నాను.నీవు ఉపయామ గ్రహమునందుఉన్నావు.

సోమమా!నీవు ఇంద్రునకు ప్రియతమవు.నిన్ను నేను
ఉపయామగ్రహమునగ్రహించుచున్నాను.నీవు పృథ్వియందు- అంతరిక్షమున -
ద్యులోకమున- దేవతలందు- స్వర్గమునందు ఉండుదానవు.ఇది నీ స్థానము.

సోమమా!నీవు ఇంద్రునకు ప్రియతమవు.నిన్ను నేను గ్రహించుచున్నాను.

3. వాయువుజలములకు సారభూతుడు.అన్నమును పచనముచేయువాడు. అతడుసూర్యుని
యందు ఉన్నాడు.జలములకు సారము- వాయువునకు సారముఅతిశ్రేష్ఠ
ప్రజాపతి.దేవతలారా! ీకొరకు ప్రజాపతి - రూప సోమమును-గ్రహించుచున్నాను.

సోమమా!నీవు ఇంద్రునకు ప్రియతమవు.ఇంద్రుని కొరకు
నిన్నుఉపయామగ్రహమునగ్రహించుచున్నాను.ఇది నీ స్థానము. ఇంద్రునకుఎంతో
ప్రియమైన నిన్నుగ్రహించుచున్నాను.

4. (నాలుగవఇంద్ర గ్రహమునుతీసికొనవలెను)
అన్న,బలములనుఆహ్వానించువాడుంప్రుడగు యజమాని.అతనికి బుద్ధి
ప్రసాదించువాడుఇంద్రుడు. ఇంద్రునిప్రియతమ గ్రహమునందలిఅన్నమును -
రసమునునేను స్వీకరించుచున్నాను.ఇంద్రునకు అత్యంతప్రీతికరమగు సోమమా!నిన్ను
ఇంద్రుని కొరకుఉపయామ గ్రహమునగ్రహించుచున్నాను.ఇది నీ స్థానము.
ఇంద్రునకుఅత్యంత ప్రీతికరమగుసోమమును నేనుగ్రహించుచున్నాను.

(సోమగ్రహమునుఅధ్వర్యు అక్షము ీద-నేష్ఠసురాగ్రహమునుఅక్షము క్రింద పెట్టవలెను)
సోమ,సురాగ్రహములారా ీరు ఒకే చోట కలసిపోయినారు.

(అధ్వర్యు,నేష్ఠ రెండు గ్రహములనుతమ వద్దకుతెచ్చుకొనవలెను.)
సోమ,సురాపాత్రలారా! ఇక ీరు ండిపోయినారు.ీరు నన్ను
పాపములనుండివేరుచేయండి.

5. (మహామరుద్వతీయపుచివరన మహేంద్రగ్రహమునుఅందుకొనుటకు ముందు-
రథమును తెచ్చినబండినుండి రథమునుదింపవలెను)
రథమా!నీవు ఇంద్రుని వజ్రమవు.నీవు జన్మనిచ్చుదానవు. నీవలనఈ యజమానికి
అన్నములభించవలెను.అన్నప్రాప్తి కొరకు మహామాతఅదితిని వేదమంత్రములచేప్రసన్నను
చేయుచున్నాను.ఈసమస్తలోకములుఅదితి ద్యావాపృథ్వి- యందు ఇండి ఉన్నం.ఈ
భూం ీద సూర్యభగవానుడునాకు నివాసము ప్రదానముచేయవలెను.

6. జలములందుఅమృతము ఉన్నది.జలములందుఓషధులు ఉన్నం.అశ్వములారా! ీరు జలపుప్రాశస్త్యమున చేరుడు.వేగవంతులు కండు.

జలమా!నీ తరంగములు వేగవంతములు.నీవు సమున్నతజలసముచ్చయయుక్తవు అన్నముకలుగచేయుదానవు.అన్నాదులను ఈ యజమానికిసమకూర్చుము.

(అశ్వములనుస్నానమాడించవలెను)

7. వాయువుమనస్సగును - ఇరువదియేడునక్షత్రములుగంధర్వలు. అంయేభూంని భరించునం.అంయే ముఖమునుముందు ఏర్పరచినం.అశ్వములందు వేగమునుకల్పించినం.

(అశ్వమునుకుడివైపు కట్టవలెను)

8. అశ్వములారా!ీరు రథమున చేర్చబడినారు.వాయు సమవేగముగలవారలు కండి. దక్షిణముననిలిచిన ీకు ఇంద్రునివంటి శోభకలుగును గాత. సర్వధనమరుద్గణములుంమ్ము పూన్చుదురుగాత. త్వష్ట ీ పాదములకువేగము కలిగించునుగాత. (రెండవ అశ్వమునుకట్టవలెను)

9. అశ్వములారా!ీ వేగము మనసునందున్నది.ీ వేగము శ్యేనయానమందున్నది.ీ వేగము వాయువునందు ఉన్నది.ఈ మూడు ంధములవేగములు కలుపుకొనిబలవంతులుకండి. మా అన్నములనుగెలుచువారలు కండి.

(బృహస్పతిచరును అశ్వమునకుఆఘ్రాణింప చేయవలెను)

అశ్వములారా!ీరు అన్నమంత్రములుఅందుకొనండి. బృహస్పతిచరును ఆఘ్రానించండి.

(రథపుదక్షిణ దిశన మూడవగుర్రమున కట్టవలెను.ఒకప్రక్క ఒక అశ్వమును మరొకప్రక్క రెండు అశ్వములనుకట్టినట్లున్నారు.' **తృతీయమశ్వంయునక్తి** 'అన్నాడు.

10.అనుల్లంఘనీయ -సత్యసవసో - ఆదేశములిచ్చుసంత అనుజ్ఞవలనబృహస్పతియొక్క ఉత్తమస్వర్గమును ఆరోహింతును.నేను సత్యాదేశసంతా దేవత అనుజ్ఞవలనఇంద్రుని ఉత్తమస్వర్గమును ఆరోహింతును.

(బ్రహ్మయనుఋత్విక్కు యజమానినిరథము ీద ఎక్కించవలెను.పదిహేడు ధనువులదూరమునకు ంసరినఔదుంబర శాఖను ప్రదక్షిణముచేసిన పదిహేడురథముల ీద ఉన్నయజమానులనుయజ్ఞస్థలమునబ్రహ్మ దించవలెను)

సత్యాదేశసంతృదేవతఅధీనమున ఉన్ననేను ఇంద్రుని ఉత్తమస్వర్గమునుఅధిరోహించినాను

11.(వేది పక్కన నాటిఉన్న స్తంభమునకు17 దుందుభులువ్రేలాడుచుండును.వానినుంచి ఒకదానినితీసి వాయించవలెను.)

బృహస్పతీ!నీవు అన్నములనుజయించుము. దుందుభులారా!ీరు బృహస్పతికొరకు ధ్వనించండి.( ఇది బ్రహ్మణవాజపేయికొరకైనది)

ఇంద్రా!నీవు అన్నములనుజయింపుము. దుంధుభులారా!ీరు ఇంద్రుని కొరకు మ్రోగండిఇంద్రుని అన్న ంజయునిచేయండి.

(ఇదిక్షత్రియ వాజపేయికొరకైనది)

12.దుంధుభులారా!ీ ధ్వని-వాణి. యథార్థమైనది.ీరు బృహస్పతినిఅన్న ంజేతనుచేసినారు. ఇక ీరు కట్లనుండిం ముక్తులు కండి.

దుందుభులారా!ీ ధ్వని-వాణి-యథార్థమైనది.ీరు ఇంద్రుని అన్న ంజేతనుచేసినారు. క్రతో చేసినదుందుభులారా!ీరు ఇంద్రుని అన్నంజేతనుచేసినారు. ీరు కట్లనుండిండిపోండి.

(స్తంభపుదుందుభులనుంప్పవలెను)

13.నేను సత్యశాసకుడగుసంత అధీనమునఉన్న యజమానిని.బృహస్పతిజయించిన అన్నములనుగెలిచినాను. అన్నమునుజయించు అశ్వములారా!ీరు కల్లోలము కలిగించుచు-యోజములు లెక్కవేయుచు - అంతిమసీమవరకు చేరండి.

(సిద్ధమైఉన్న రథము ీదయజమాని ఎక్కవలెను)

14.ఈ గుర్రపు మెడ, నడుము,ముఖమునకు పటకాలుకట్టి ఉన్నం. ఇదికొరడాచూపగానే వేగముగాపరిగెత్తును. నడుపువానిమనసెరిగి నడుచుగుర్రము గుర్తులనుబట్టి దానిీదసాగిపోవును. అశ్వమునకుఆహుతి.

15.గుర్రము దారిీద త్వరితగతినిసాగుచున్నది. లక్ష్యముచేరవలెననిఉరుకుచున్నది. అప్పుడుదానికి ఉన్న పక్షిరెక్కలఅలంకరణములకదలిక స్వచ్ఛముగాకనిపించుచున్నది.ఇది గద్దవలెఎగిరిపోవుచున్నది.బలము ప్రదర్శించుచుసాగుచున్నది. దానికిగల చామరాది అలంకారములకదలిక స్పష్టంగా అగుపించుచున్నది-స్వాహా.

16.అశ్వములు యజ్ఞపుఆహ్వానములందుపరింత వేగవంతములుసుందరవర్ణలు. పాములు,తోడేళ్లు, రాక్షసులనుతప్పుకొనిసాగునం. సర్వరోగములనువ్యధలనుదూరము చేయునం.అట్టి అశ్వములుమాకు శుభంకరములుకావలెను.

17.అశ్వములు మా ఆహ్వానమును విననీ. పరిమితగాములు.వేలధనములుఇచ్చునవి. యజ్ఞములందుబహుమూల్యరత్నాదులుఇచ్చునవి. అట్టిఅశ్వములన్నియు మాఆహ్వానములు వినవలెను.

18.అశ్వములారా! మీరు మెతుకు,మెతుకు అందించువారు.ధనము కలిగించువారు.విప్రులు అమృతములు.ఋతజ్ఞులు.మీరు మమ్ము రక్షించండి.ఈ నీవారచరును పానముచేయండి. ఆనందించండి.తృప్తులు కండి. దేవమార్గమునగమ్యము చేరుకొండి

19.(యజమాని రథముదిగి నీవారచరునుమూర్కొనవలెను)

అన్నపుఅపార ఉత్పత్తి మాకులభించవలెను.అనేక రూపముల ద్యావాపృథ్వులుమాకు లభించవలెను.మాతాపితరుల వాత్సల్యముమాకు లభించవలెను.సోమము అమృతమైమాకు లభించవలెను.

అన్నములను గెలుచు - పావనముచేయు - లభించునట్టిఅశ్వములారా! మీరు బృహస్పతిభాగమగు - ఈ నీవారచరునుఆఘ్రాణించండి.

(గుర్రములకునీవారచరువాసన చూపవలెను)

20.(ఇది సంవత్సరాభిమానిప్రజాపతి స్తుతి.ఆహుతులుఇవ్వవలెను)

అందరియందున్నప్రజాపతికి స్వాహా.అందరకు శుభములనిచ్చు ప్రజాపతికిస్వాహా. మరల పుట్టునట్టిప్రజాపతికి స్వాహా.యజ్ఞస్వరూప ప్రజాపతికిస్వాహా. నివాసకారణుడు- దినముల స్వామి -దినములందు,ముగ్ధపదార్థములందు- వినాశయ వస్తువులందుఉన్నవాడు -

అంత్యస్థానమునఉత్పన్నుడు - భువనములస్రష్ట- భువనస్వామి - జగములఅధిపతి ప్రజాపతిస్వాహా.

21.యజ్ఞమున ఆయువుకలుగవలెను.ప్రాణము కలుగవలెను.నేత్రములుకలుగవలెను.శ్రోత్రములు కలుగవలెను.వెన్ను కలుగవలెను.యజ్ఞమునుండియజ్ఞము కలుగవలెను.యజ్ఞమున యజ్ఞపతికలుగవలెను.

(యజమానియు,అతని పత్నియు మెట్లమీద నుంచి యూపముఎక్కవలెను)

మేముప్రజాపతి ప్రజలముఅయినాము.

(గోధుమపిండితో చేసిన అప్పమునుయజమాని తాకవలెను)

దేవతలారా!మేము స్వర్గమునకుచేరుకున్నాము. మేముఅమరులము అయినాము.

(యూపముమీది శిరమును తొలగించవలెను)

22.(యూపము ీద ఉన్నయజమానులుదిశలను చూచుచు)

దిశలారా!ీయందున్న బలీర్యములుమాకు కలుగవలెను.ీయందున్న ధనము,సంకల్పము, అనేక తేజస్సులుమాకు కలుగవలెను.( యూపమునుండి నేలనుచూచి) తల్లీభూి! నీకు నమస్కారము.వందనము. (చర్మముీద ఔదుంబర ఆసనమునుఉంచవలెను)ఆసనమా! ఇది నీ రాజ్యము.( ఆసనము ీద యజమానినిఆసీనుని చేయవలెను)యజమానీ! నీవుఅందరిని నియిుంచువాడవు.స్వయముగా నిన్ను నియిుంచుకొనువాడవు.నీవే ధ్రువమవుధారకుడవు. నీవుకృషి - వ్యవసాయము- చేయుటకు నిన్నుఈ ఆసనము ీద ఆసీనునిచేయుచున్నాను.పరిపాలనా లబ్ధికొరకు- ధనము కొరకు - పుత్ర,పశువుల కొరకు నిన్నుఈ ఆసనము ీద కూర్చుండపెట్టుచున్నాను.

23.(ఔదుంబర పాత్రలోనిపాలు, యవలు మున్నగువానినిస్రువముతో ఆహవనీయాగ్నిలోహోమము చేయవలెను)

అన్నములనుకల్పించిన వాడుప్రజాపతి. అతడుసృష్టి ఆదిన సోమమును-జలమునుండి,ఓషధులనుండి-సృజించినాడు. ఆ జలములు,ఓషధులు మాకు మధురములుకావలెను. మేముపురోహితులసహితులమైస్వరాజ్యమున అప్రమత్తులముకావలెను స్వాహా.

24.అన్నములనుకల్పించినవాడుప్రజాపతి. అతడుసమస్త భూతమాత్రలనుసృష్టించినాడు. అతడునిత్య సామ్రాట్టు.తన అధికారమునుఎరిగినవాడు. స్వేచ్ఛగాసర్వత్ర సంచరించువాడు.అతడు మాకు సంతానపుష్టి-ధనపుష్టికలిగించుచు సర్వత్రవ్యాపించవలెను- స్వాహా.

26.మమ్ము రక్షించమనిరాజగు సోమమును-ద్వాదశఆదిత్యులను- సూర్యుని-బ్రహ్మను-

బృహస్పతినిఆహ్వానించుచున్నాము.స్వాహా

27.అగ్నీ! ఇది మా యజ్ఞం.ఇందు మా హితముపలుకుము - శుభములుసంకల్పించుము. వేలధనముల ిజేతా!అగ్నీ! మాకు ధనాదులుప్రసాదించుము -స్వాహా.

27.ఆర్యమ, ఇంద్ర, బృహస్పతి,ఈశ్వరులారా! ీరు దానములనుప్రోత్సహించండి.వాగ్దేి

సరస్వతి,ిష్ణు, సిత, అన్నవంతప్రజాపతికి స్వాహా.

28.అగ్నీ! ఇది మా యజ్ఞం.ఇందు మహితముపలుకుము. మాకు శుభములుసంకల్పించుము. వేలధనముల ిజేతా!అగ్నీ! మాకు ధనాదులుప్రదానము చేయుము.నీవే కదా ధనస్వాిిి-స్వాహా.

29.ఆర్యమ, పూష, బృహస్పతి,వాగధిదేవతసరస్వతి మాకు ధనముప్రసాదించవలెను-స్వాహా.

30.(హుతశేషముయజమాని ిందచల్లవలెను)

నేనుసంత అధీనపు వాడిని,అశ్వినుల బాహువులతోను,పూషహస్తములతోను,వాక్కును నియంత్రించుసరస్వతి అనుగ్రహముతోను,యజమానివగునిన్ను ధనములందుప్రతిష్ఠించుచున్నాను.నిన్ను బృహస్పతిసామ్రాజ్యమునకుపట్టాభిషిక్తునిచేయుచున్నాను.

31.(ఇం 'ఉజ్జితి' మంత్రములుినిచే ఘృతాహుతిఇవ్వవలెను)

అగ్నిఏకాక్షర ఛందమునపంచప్రాణములనుగెలిచినాడు. యజమానినగునేను నా పంచప్రాణములనుగెలిచెదను.అశ్వినులు రెండక్షరములఛందమున రెండుకాళ్లుగల మానవులనుజయించినారు. నేనుకూడ ఆ మానవులనుగెలువవలెను.ిష్ణువు మూడక్షరములఛందమున ముల్లోకములనుగెలిచినాడు. నేనుకూడ ఆ మూడు లోకములనుగెలువవలెను.సోమము నాలుగక్షరములఛందమున చతుష్పాత్తపశువులను గెలిచినది.నేను సహితముచతుష్పాద జంతువులనుగెలువవలెను.

32.పూషదేవత అయిదక్షరములఛందములచే4 దిక్కులను ృ 1 అవాంతరదిశ్న అయిదింటిని గెలిచినాడు.నేను సహితముఆ అయిదింటిని గెలువవలెను.సంతా దేవత ఆరక్షరములఛందమున ఆరుఋతువులనుగెలిచినాడు. నేనుసహితము ఆరుఋతువులనుగెలువవలెను.మరత్తులు ఏడక్షరములఛందమున ఏడుగ్రామ్యజంతువులనుగెలిచినాడు. నేనుసహితము ఆఏడింటిని గెలువవలెను.బృహస్పతిఅష్టాక్షర ఛందమునగాయత్రిని గెలిచినాడు.నేను సహితముగాయత్రిని గెలువవలెను.

33.ిత్రుడు నవాక్షరఛందమున త్రివృత్తమునుగెలిచినాడు. నేనుకూడ దానిని గెలువవలెను.వరుణుడు దశాక్షరఛందమున'ిరాజము" ను గెలిచినాడు.నేను కూడ దానిని గెలువవలెను.ఇంద్రుడు ఏకదశాక్షర ఛందమున"త్రిష్టుప్" ను గెలిచినాడు.నేను కూడా దానిని గెలువవలెను.ిశ్వేదేవతలుద్వాదశాక్షర ఛందమున"జగతి"ని గెలిచినారు.నేను కూడా దానిని గెలువవలెను.

34.వసువులు పదమూడుఅక్షరముల ఛందమునత్రయోదశస్తోమమునుగెలిచినారు. నేనుసహితము వానినిగెలువవలెను.రుద్రులు పదునాలుగుఅక్షరముల ఛందమునచతుర్దశస్తోమమునుగెలిచినారు. నేనుసహితము వానినిగెలువవలెను.ఆదిత్యులు పదిహేనుఅక్షరముల ఛందమునపంచదశ స్తోమమునుగెలిచినారు. నేనుసహితము దానినిగెలువవలెను.అదితి పదహారుఅక్షరముల ఛందమునషోడశస్తోమమునుగెలిచినది. నేనుసహితము దానినిగెలువవలెను.ప్రజాపతి పదిహేడుఅక్షరముల ఛందమునసప్తదశస్తోమమునుగెలిచినాడు. నేనుసహితము దానినిగెలువవలెను.

వాజపేయయజ్ఞము సమాప్తము.

## ఆలోచనామృతము

వేదముసనాతనము. పురాతనము.మహత్తమము.పవిత్రము. విశాలము.గహనము. ఉపమానమునకుఅందనది.

వేదముఅను పదము ఒక్కటి.కాని వేదము అనంతము.ఈ అనంత వేదమునుఆరాధించిన ఆరాధించుచున్న- ఆరాధించునున్నవారు అనేకానేకులు. ఒకసూర్యుడేఒక్కొక్క పరిశోధకుని ఒక్కొక్కరీతిగా కనిపించును.ఒక్క వేదమనునదిలెక్కకు మించినపరిశోధకులకు లెక్కకుమించినరీతిగా అగుపించును.

వేదమునుపరిశీలించిన - వ్యాఖ్యానించినవిమర్శించినవారు అనేకులు.వీరిలో వేదమునుఅధ్యయనముచేసి సద్విమర్శలు- దుర్విమర్శలు చేసినవారున్నారు.అధ్యయనముచేసి దుర్విమర్శించినవారిని అధ్యయనముఖండించవచ్చును.

కానివేదమును అధ్యయనముచేయకయే వేదమునుగురించి ఒక అభిప్రాయమునుప్రచారము చేసినవారిని ఖండించుటఅసంభవము. ఏలననవారు ఎవరో తెలియదు.వారు ఏ ఆధారమున అపోహలుకలిగించినారో తెలియదు.

వేదమునగురించి అవ్యాఖ్య కువ్యాఖ్యచేసిన వ్రు రెండురకములు.ఒకరు సనాతనులముఅనిపించుకొనవలెననుకొనుస్వప్రయోజనపరులు.వీరు వాస్తవముగ సనాతనులుకారు. సనాతనపు ముసుగువేసుకున్నారు. వేదమువారిస్వంత ఆస్తి అని భావించువారు.వీరికి ఏమియు తెలియదు.సర్వము వేదములందేఉన్నది అనువారు రెండవరకము.పాశ్చాత్యుల మెప్పుపొందదలచి ఆధునికులముఅనిపించు కొనవలెననుఉబలాటము గలవారు.వీరిలో వామపక్షాల వారలమనిపించుకొనవలెననిజబ్బలు చరచువారు.వీరు వేదమును పనికిరానిదానిగను - అందులో ఏదోఒకవర్గానికి ఉపయోగపడేదిఉందని ఒకప్రమాదకరఅభిప్రాయాన్ని వారికితెలియకుండగనే- కనిపించినారు.

వేదముపాతకాలపు బొంతఅని చెప్పడం విప్లవముగాభావించుచున్నారు.

ఇదిఒక వస్తువును చూడకయేదానిని గురించి వ్యాఖ్యానించుట.వీరు తమను తాము[illegible]అనుకుంటారు! ఇదొక వింత!!

వేదమందంతటవైరాగ్యమున్నదని- ఈలోకమునకు సంబంధించినదిలేదని, సమస్తము

పరలోకముగురించియే ఉన్నదనిఒక భ్రమ భారతదేశమునబహుళప్రచారమున ఉన్నది.ఇది వట్టి భ్రమమాత్రమే! వైరాగ్యముమాత్రమే ఉపదేశించునదిభారత సాహిత్యమునలేదనునదినా దృఢ◌శ్వాసము.

భారతసాహిత్యము,తాత్త్వికము సొంతముమానవుని ఇహలోకజీ◌తమును సుఖశాంతులతోగడుపు ఉపాయములనేబోధించుచున్న◌.వేదమునందుఇహలోకము గురించియే◌వరించి ఉన్నది.ఇది వాస్తవసత్యము.

వేదముమానవుని మహిమాన్వితునిగదర్శించినది. మానవునిఒక్కొక్కసారి దేవతలను◌ంచిన వారిని చేసినది.వాస్తవమేమన్నదేవతలందరుమానవుని సుఖజీవనమునకుఉపయోగ పడువారే!

సత్రస్యఋుద్విరస్యగన్మన జ్యోతిరమృతాఅభూమ

దినంపృథివ్యా అధ్యారుహామా◌దామదేవాన్స్వర్జ్యోతిః8-52

సోమమా!నీవు సాక్షా త్తు యజ్ఞసమృద్ధి◌.నీ వలన మేముఆదిత్య రూపజ్యోతినిఅందుకున్నాము. ఇక మేముమరణాంతము ధర్మపరులముఅయినాము. మేము భూ◌నుంచి లేచినాము.స్వర్గమును ఆరోహించినాము.ఇంద్రాది దేవతలనుపరంజ్యోతిని తెలిసికున్నాము.

మానవుడుఇన్ని సాధించగలడు!అందుకు ఒకటే షరతు- అతడు లోకమునకుకళ్యాణమునుకూర్చుధర్మమునుఅజీవ పర్యంతముఅవలంబించవలెను.

ఇదిదైవత్వము సాధించుఉపాయము. దైవత్వముఆకాశమున కాదు, మానవునియందున్నది. దానినిగుర్తించవలసి ఉన్నది.అది దుస్సాధ్యముకావచ్చును. అసాధ్యముమాత్రముకాదు.

ఈ అధ్యాయమున31 నుంది 34 వరకుమంత్రములందుసమస్త దేవతలుగెలిచిన వాటినిమానవుడు తానుఒక్కడే గెలువవలెననిసంకల్పించుచున్నాడు.మానవుని ఇంతకన్నమహామహునిగాకల్పించుటసాధ్యమా!

35.(రాజసూయమంత్రములుప్రారంభము)

ఫాల్గుణశుక్లదశ◌నాడు - అనుమతికిగాను- ఎని◌ది పాత్రలందువండిన బియ్యపుహ◌స్సు అర్పించబడును.అందుకు బియ్యమునురాతి ◌ద నూరవలెను.పడిపోయిన బియ్యమునుస్రువమున నింపి దక్షిణాగ్నికిఆహుతి ఇవ్వవలెను.

పృథి◌!ఈ పిష్టచరు నీభాగపుది.దీనిని స్వీకరించుము- స్వాహా.

(పంచవతీయకర్మచేయుటకుదిశలందు ఆహవనీయాగ్నినిస్థాపించి ఆహుతులుఅర్పించవలెను)

పూర్వదిశనఆసీనులైన అగ్నినేత్రుకదేవతలకు స్వాహా.

దక్షిణాదిశనఆసీనులైన యమనేత్రుకదేవతలకు స్వాహా.

పశ్చిమదిశనఆసీనులైన ిశ్వేదేవతనేత్రుకదేవతలకు స్వాహా.

ఉత్తరదిశను ఆసీనులైనిుత్రావరుణ నేత్రుకదేవతలకు స్వాహా.

పైనఉండి, పరిచర్యలందుకొనుసోమనేత్రుక దేవతలకుస్వాహా.

36.(అయిదు చోట్ల ఏర్పరచినఆహవనీయాగ్నినిఒక చోట చేర్చి ఆహుతులుఇవ్వవలెను)

పూర్వదిశనఆసీనులైన అగ్నినేత్రుకదేవతలకు స్వాహా.

దక్షిణదిశనఆసీనులైన యమనేత్రుకదేవతలకు స్వాహా.

పశ్చిమదిశనఆసీనులైన ిశ్వేదేవనేత్రుకదేవతలకు స్వాహా.

ఉత్తరదిశన ఆసీనులైనిుత్రావరుణ నేత్రుకదేవతలకు స్వాహా.

37.(తండుల హోమముదక్షిణాగ్నిలో చేయవలెను)

అగ్ని!నీవు శత్రుసేననుపరాభించుట కాదు.దూరదూరములకుపారద్రోలుము.

శత్రువులనుదూరము చేసిననీవు యజ్ఞమునునిర్వహించు
యజమానికిబ్రహ్మవర్చస్సుప్రసాదించుము.

38.నేను సిత అనుశాసనమునఉన్నవాడను.
అశ్వినులబాహువలతోనూ,పూషహస్తముల్తోను-
తండులములారా!ఉపాంశగ్రహపుబలమునసోమముచే హోమముచేయుచున్నాను.స్వాహా.

( హోమముచేసిన దిశకు స్రువముత్రిప్పవలెను)

స్రువమా!నిన్ను రాక్షసుల వధకుత్రిప్పుచున్నాను.నేను ఈ
రాక్షసవర్గమునుహతమార్తునుఇప్పుడు సమస్త రాక్షస వర్గముహతమారినది.

39.(ఎనిిది దేవస్ హిస్సులుఇవ్వవలెను)

యజమానీ!సితా దేవత నిన్నుఅనుశాసనములకుఅధిపతిని చేయవలెను.అగ్ని నిన్ను
గృహస్థులకుఅధిపతిని చేయవలెను.సోమసామ్రాట్టునిన్ను వనవృక్షాదులకుఅధిపతిని
చేయవలెను.బృహస్పతినిన్ను వాణికి అధిపతినిచేయవలెను.ఇంద్రుడు
నిన్నుజ్యేష్ఠత్వమునకుఅధిపతిని చేయవలెను.రుద్రుడు నిన్నుపశువులకు

అధిపతినిచేయవలెను.సత్యానుశాసన ంఌత్రావరుణులు నిన్నుధర్మాధికారులఅధిపతిని చేయవలెను.

యజమానీ!ఈ అష్టదేవస్ హంస్సులదేవతలు నిన్నుసకల పదార్థములఅధిపతులునుచేయవలెను.

(యజమానివద్దకు వెళ్లి- స్రువమును కుడిచేత,యజమాని బాహువులను,ఎడమ చేతపట్టుకొనవలెను.మంత్రము చెప్పునపుడుయజమాని తల్లిదండ్రులు,దేశకాలములనుపేర్కొనవలెను.)

40.దేవసహంర్భాగదేవతలారా! ంరుఈ యజమానిని శత్రురహితునిచేయండి. మహారాజ్యకార్యమున నిలుపండి.మహాజనరాజ్యకార్యమున నిలుపండి.ఇంద్రుడు పరమోత్కృష్టబలమును ప్రసాదించునుగాత.యజమానిపుత్రుని దేశవాసులఆధిపత్యముననిలుపండి. కాని' **సోమో ంస్మాకం బ్రాహ్మణానాంరాజా** ' మా బ్రాహ్మణులకుమాత్రము సోమసామ్రాట్టేప్రభువు అగును.

**ఆలోచనామృతము**

ఈమంత్రమునరాజకీయశాస్త్రజ్ఞులుఆలోచించవలసినంఉన్నం.

1. మహతేక్షత్రాయ,మహతేజ్యేష్ఠ్యాయఅన్నది ఇప్పటిరాష్ట్రపతి-గవర్నరుపదవుల వంటివలె ఉన్నది.

2. "జనరాజ్యాయ"అనిన ప్రజారాజ్యమునకుఅని అర్థము. ఇదినేటిప్రజాస్వామ్యము వంటిదికావచ్చును.

3. రాజుకొడుకును రాజునుచేయుటకు దేశవాసులఅనుమతి అక్కర అయినట్లున్నది.ఇది నేటి ఎన్నికలవంటిది కాకున్ననుప్రజామోదముఅవసరమైనట్లున్నది.

రామాయణమునరాముని యౌవరాజ్యపట్టాభిషేకమునకుదశరథుడు ప్రజలఅనుమతి

కోరినాడు.ప్రజలు ఆమోదించినారు:--

" **రామమన్దీవరశ్యామంసర్వశత్రు నిబర్హణమ్।**

పశ్యామోయౌవరాజ్యస్థంతవ రాజోత్తమాత్మజమ్॥

రాజునిరంకుశుడు కాకుండుటకుఈ నియమములుంధించినట్లున్నారు.

4." **సోమో ంస్మాకం బ్రాహ్మణానాంరాజా** " అని మంత్రముఎవరికి ఎవడు రాజయిననుబ్రాహ్మణులకుమాత్రము రాజుకాడని అర్థము.

నేనుశ్రీ మహాభారతమురచించినపుడు బ్రాహ్మణుడనగామేధా౦ అని అర్థము చెప్పినాను.వేదవ్యాఖ్యా చేసినసాయణుడు సహితము౦ప్రునకు మేధా౦ అనిఅర్థము చెప్పినాడు.

మేధావులురాజకీయశాసనమునకులొ౦గక స్వతంత్రులైనపుడేతమ ఆలోచనలుఅన్వేషణల వలనసమాజమునకు మేలుచేయగలరు.

నేడుసహితము రాజ్యసభకుజరుగు నిష్ఠాతుల,మేధావుల ఎన్నికలందుప్రజలు పాల్గొనరు.

శ్రీమహాభారతమునపాండవులు లక్క ఇంటినుంచి తప్పించుకొనిఏకచక్రపురమను అగ్రహారమునకుచేరుకున్నారు. అక్కడదుర్యోధనుని రాజ్యముసాగదు. ఏలనన బ్రాహ్మణఅగ్రహారములురాజశాసనములోని౦కావు. ఈ ౦షయములుతెలిసియే పాండవులుభద్రతకొరకుఅగ్రహారమునకుచేరినారు.

రాజులకుజరుగు సంధులు మున్నగువాని నుండి దేవాలయభూములు,బ్రాహ్మణఅగ్రహారములకు౦నహాయింపు ఉండెడిది.

బ్రాహ్మణులనుఒకజాతిగా కాక మేధావులనుగాచెప్పుకున్నపుడువేదము మేధావులగువారికి ఎంతో స్వాతంత్ర్యముప్రసాదించినది.

"బ్రాహ్మణోవైసర్వే దేవతాః " మేధావులేకదా అందరు దేవతలు- అందరి దేవతలు.

## దాశరథిరంగాచార్య ౦రచిత

## శ్రీమదాంధ్రవచన శుక్లయజుర్వేదసంహితయందలి

## వాజపేయోరాజసూయారంభాన్తమను

## తొ౦్మదవఅధ్యాయము ముగిసినది.

జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతిం।

ఆధారంసర్వ ౦ద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## పదవఅధ్యాయము

1.అపోదేవా మధుమతీరగృభ్ణన్నూర్జస్వతీరాజస్వశ్చితానః ।

యాభిర్మిత్రావరుణా వభ్యషించిన్యాభిరింద్రమనయన్నత్యారాతీః॥

(అభిషేకమునకుగాను ఔదుంబర పాత్రలందుసరస్వతి మున్నగు నదులజలము తెచ్చిఉంచవలెను.గోసంబంధములనువేరు పాత్రలో ఉంచవలెను.వానిని యూపపు ఉత్తరభాగమునఉంచవలెను.)

దేవతలుమధురములు- శక్తిమంతములు- రాజస్వములు - చైతన్యవంతములగు జలములనుతెచ్చినారు. ిత్రావరుణులనుదేవతలకు రాజునుగాఅభిషేకించిన జలమునుతెచ్చినారు. ఇంద్రునిశత్రుంజయుని చేయుటకుఅభిషేకించిన జలమునుతెచ్చినారు.

2. (ఈమంత్రములకురెండు పాఠములు ఉన్నం.స్వాహాంతమునఆహుతినీయవలెను.మరొక పాఠమున జలమునుగ్రహించవలెను.మనుష్యులు లేకపశువులు నదిలోప్రవేశించినపుడుకలిగిన తరంగములజలమును స్వీకరించవలెను)

1. తరంగమా!నీవు సేచన సమర్థవు.రాజ్యమును ఇచ్చుదానవు.మాకు రాజ్యమునుప్రదానము చేయుము.స్వాహా. 2. తరంగమా!నీవు సేచన సమర్థవు.రాజ్యమును ఇచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

3. 1.జలమా! నీవుఅభిషేకార్థము యజ్ఞభూంకిచేరుకొనుదానవు.నీవు రాజ్యమునుఇచ్చుదానవు. మాకురాజ్యము ప్రసాదించుము- స్వాహా. 2. జలమానీవు అభిషేకార్థముయజ్ఞభూంకిచేరుకొనుదానవు.రాజ్యము ఇచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. జలమా!నీవు ఓజోయుక్తవు.రాజ్యము ఇచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుముస్వాహా. 2. జలమా!నీవు ఓజోయుక్తవు.రాజ్యమునిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. జలమా!నీవు సర్వత్ర గమనముగలదానవు. రాజ్యమునిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము- స్వాహా. 2. జలమా!నీవు సర్వగమనవు.రాజ్యము నిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. సముద్రజలమా!నీవు నదులు మున్నగుజలములకు స్వాం.రాజ్యము నిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము- స్వాహా. 2. సముద్రజలమా!నీవు నదులు మున్నగుజలములకు స్వాం.రాజ్యమునిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

4. 1.స్థిర ధర్మయుక్తజలమా!నీవు సూర్యుని తేజస్సుగలదానవు. రాజ్యమునిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము- స్వాహా. 2. స్థిర, ధర్మయుక్త జలమా!నీవు సూర్యుని తేజస్సుగలదానవు. రాజ్యమునిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

(యూపమునుంచివచ్చు జలమునుసేకరించి - యూపమునకుఉత్తరమున స్థాపించినజలములందుహోమము చేయుచు)

1. యూపమునుండికురిసిన జలమా!నీవు సూర్యతేజస్సుగలదానవు. రాజ్యమునిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము- స్వాహా. 2. యూపమునుండికురిసిన జలమా!నీవు సూర్యతేజస్సుగలదానవు. రాజ్యమునిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. తటాకజలమా!నీవు పశుపక్ష్యాదులకుఆనందము కలిగించుదానవు.రాజ్యము నిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము-స్వాహా. 2. తటాకజలమా!నీవు పశుపక్ష్యాదులకుఆనందము
కలిగించుదానవు.రాజ్యమునిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. కూపస్థజలమా! రాజ్యమునిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము.స్వాహా 2. కూపస్థజలమా!నీవు రాజ్యమునిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. అవశ్యాయజలమా!నిన్ను సర్వజనులుకోరుదురు. నీవు రాజ్యమునిచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము- స్వాహా 2. అవశ్యాయజలమా!నీవు సర్వకామ్యవు.రాజ్యము నిచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. మధురూపజలమా!నీవు బలమును,రాజ్యమును ఇచ్చుదానవు.మాకు రాజ్యము ప్రసాదించుము- స్వాహా 2. మధురూపజలమా!నీవు బలమును,రాజ్యమును ఇచ్చుదానవు.దేవదత్తాదులకురాజ్యము ప్రసాదించుము.

1. శక్వరజలమా! నీవు గోవుల వలన లభించినదానవు. నీవు రాజ్యమునిచ్చుదానవు. మాకు రాజ్యము ప్రసాదించుము. స్వాహా. 2. శక్వరజలమా! నీవు గోవుల వలన లభించినదానవు. రాజ్యము నిచ్చుదానవు. దేవదత్తాదులకు రాజ్యము ప్రసాదించుము.

(నదులు గోముఖము నుండి బయలుదేరినవని ిశ్వాసము)

(పాలలో హోమము చేయుచు)

1. దుగ్ధజలమా! నీవు ప్రజల పానాదులకు ఉపయుక్తవు. నీవు రాజ్యము నివ్వగలదానవు. మాకు రాజ్యము ప్రసాదించుము - స్వాహా 2. దుగ్ధలమా! నీవు ప్రజల పానాదులకు ఉపయుక్తవు. రాజ్యము నివ్వగలదానవు. దేవదత్తాదులకు రాజ్యము ప్రసాదించుము.

( ఘృతమున హోమము చేయుచు)

1. ఘృతరూపజలమా! నీవులోకములను పోషించు దానవు. రాజ్యము నిచ్చుదానవు. మాకు రాజ్యమును ప్రసాదించుము - స్వాహా 2. ఘృతరూపజలమా! నీవు లోకములను పోషించుదానవు. రాజ్యమునిచ్చుదానవు. దేవదత్తాదులకు రాజ్యము ప్రసాదించుము.

(ఈ పదహారు హోమజలములు. మరీచి - ఎండకు కాగిన మరియు సరస్వతీ జలముల వేరుగా హోమము ఉండదు. మరీచి జలమును దోసిలితో తీసి ◌ుగిలిన నీట కలుపవలెను)

మరీచిజలమా! నీవు స్వయంశోభితవు. రాజ్యము నిచ్చుదానవు. మాకు రాజ్యము ప్రసాదించుము - స్వాహా 2. మరీచిజలమా! నీవు స్వయంశోభితవు. రాజ్యమునిచ్చు దానవు. దేవదత్తాదులకు రాజ్యము ప్రసాదించుము.

(సరస్వతి మున్నగు నదుల జలమును ఔదుంబర పాత్రలో కలిపి)

మధురజలము మధురజలమున కలసినది. ఈ మహారాజ్యము క్షత్రియుని వరించవలెను.

(ఔదుంబరపాత్ర యందలి జలమును ◌ిత్రా వరుణ సంబంధి ధిష్ణ్య ముందుంచవలెను)

జలములారా! ఈక్షత్రియ యజమానికి రాక్షసులు పరాభ◌ించలేని బలమును కలుగజేసి, అతనికి రాజ్యము వప్పగించి ◌ీరు స్థిరపడండి.

జలములే◌ుటి? రాజ్యము లిచ్చుటే◌ుటి? అబ్బురమా ఇది!! ఏమాత్రముకాదు. రాజ్యములను నిర్మించున◌ు, రక్షించున◌ు, కూల్చున◌ు జలములే! జలములు 18 కలసి ఈ పనులు చేయగలవు. ఒక్కొక్కటి కాదు.

జలము అనుపదము ద్రవము అను అర్థమున వాడినట్లున్నది.

5. (◌ిత్రావరుణుల ధిష్ణ్యముందు స్థాపించిన పలాశాది నాలుగు పాత్రలకు తూర్పున పులిచర్మము పరచవలెను)

చర్మమా! నీవు సోమపు దీప్తి◌ు. నాకు నీవంటి కాంతి లభించవలెను.

(పన్నెండు ఆహుతులందు ఆరు అభిషేకమునకు ముందు ఆరు అభిషేకము తరువాత అర్పించవలెను)

అగ్నయేస్వాహా. సోమయస్వాహా. స◌ిత్రే స్వాహా. సరస్వత్యైస్వాహా. పూష్ణే స్వాహా

బృహస్పతయే స్వాహా.

ఇంద్రాయ స్వాహా , ఘోషాయస్వాహా, శ్లోకాయ స్వాహా, భగాయ స్వాహా, పూష్ణే స్వాహా, ఆర్యమ్ణే స్వాహా.

6. (దర్భలతో రెండు ప◌ిత్రములు చేసి వానిలో బంగారము పెట్టవలెను. ◌ిత్రావరుణ సంబంధ ధిష్ణ్యముందున్న పాత్రలలోని జలమును ప◌ిత్రములచే ప◌ిత్రము చేయవలెను)

పవిత్రములారా! మీరు ఇరువురు విష్ణుసంబంధులు. నేను సర్వప్రేరక సవిత అధీనపువాడను నేను మీతోను, ఛిద్రరహిత సూర్య కిరణములతోను అభిషేకజలమును పవిత్రము చేయు చున్నాను.

రాక్షసులచే బాధింపరాని జలమా! నీవు అగ్నియందు పుట్టినావు. సోమమునకు దానము చేసినావు. స్వాహా. అభిషేకమున రాజును చేయుదానవు.

7. (నాలుగు పాత్రలందలి అభిషేక జలమును తేవలెను)

ఈజలమును ఒక్కొక్క పాత్రలో హర్షించునది. యశోవంతము, అన్నవంతము. రాక్షసులు పరాభవించలేనిది. కర్మసమర్థము. పాత్రలందు పవిత్రము. గృహస్థ జలము పుత్రిక కాగా వానికి తల్లి అగునది. ఈ జలములందు వరుణుడు ప్రవేశించినాడు.

8. (వస్త్రము దాల్చుచు)

పట్టులేక నూలు వస్త్రమా! నీవు యజమానిని నీగర్భమున వలె దాల్చుము. కంబళమా! గర్భమందున్న యజమానిని కప్పునట్టి చర్మమవు. కంచుకమా! నీవు యజమానిని గర్భమునందు దాల్చుయోనివి. శిరోవేష్టమా! నీవు యజమాని శిరోరక్షవు.

(ధనస్సు రెండు కొనలను శుభ్రము చేయవలెను)

దక్షిణకోటీ! నీవు మిత్రసంబంధివి. ఉత్తరకోటీ! నీవు వరుణసంబంధివి.

(అధ్వర్యు యజమానికి ధనస్సును ప్రదానము చేయవలెను)

ధనువా! నీ వలన ఈ యజమాని తన శత్రువును వధించు శక్తి గలవాడు కావలెను.

(అధ్వర్యు మంత్రము ఉచ్చరించుచు మూడు బాణములను - శరములను - యజమానికి అందించవలెను)

బాణమా! నీవు శత్రువును విదీర్ణము చేయుదానవు. రెండవ బాణమా! నీవు శత్రుభేదనము చేయుదానవు. మూడవబాణమా! నీవు శత్రువును గడగడలాడించు దానవు.

బాణమా! నీవు యజమానిని తుర్పుదిక్కున రక్షించుము. బాణమా! నీవు యజమానిని పశ్చిమ దిశన రక్షించుదానవు. బాణమా! యజమాని ఉన్నచోటనల్ల రక్షింపుము. బాణమా! యజమానిని సకల దిశలందు రక్షింపుము.

9. మానవులారా! యజమాని అందరిముందు ప్రకటించబడినాడు. గృహస్వామి అగ్నిముందు ప్రకటించబడినాడు. యశోవంతుడగు ఇంద్రుని ముందు ప్రకటించబడినాడు. దేవశాసకులగు మిత్రావరుణుల ముందు ప్రకటించబడినాడు. విశ్వధనస్వామి పూషముందు

ప్రకటించబడినాడు. లోకకళ్యాణకారులగు ద్యావాపృథ్వుల ముందు ప్రకటించబడినాడు. అనేక సుఖముల అదితి ముందు ప్రకటించబడినాడు.

10. ( సోమమును అభిశంచుచు - యజమానిచే మంత్రములు చెప్పించుచు - ఒక్కొక్క దిక్కునకు తీసికొనివెళ్లవలెను)

యజమానీ! నీవు తూర్పుదిక్కున సంచరించుము. గాయత్రి నిన్ను రక్షించును గాత. ఋక్కు పైనిలిచిన రథంతరము నిన్ను రక్షించును గాత. త్రివృత్ సామము నిన్ను రక్షించును గాత. వసంతఋతువు నిన్ను రక్షించును గాత. ధనరూపబ్రాహ్మణము నిన్ను రక్షించును గాత.

11. యజమానీ! నీవు దక్షిణ దిశన సంచరించుము. త్రిష్టుప్ ఛందమున నిన్ను రక్షించును గాత. ఋక్కు పై నిలిచిన బృహత్సామము నిన్ను రక్షించును గాత. పంచదశస్తోమము నిన్ను రక్షించును గాత. గ్రీష్మ ఋతువు నిన్ను రక్షించును గాత. ధనురూప క్షా త్రము నిన్ను రక్షించును గాత.

12. యజమానీ! నీవు పశ్చిమ దిశన సంచరించుము. జగతీ ఛందమున నిన్ను రక్షించును గాత. ఋక్కు పైనిలిచిన వైరూపసామము నిన్ను రక్షించును గాత. సప్తదశస్తోమములు నిన్ను రక్షించును గాత. వర్ష ఋతువు నిన్ను రక్షించును గాత.

13. యజమానీ! నీవు ఉత్తరదిశన సంచరించుము. అనుష్టుప్ ఛందము నిన్ను రక్షించును గాత. ఋక్కు పై నిలిచిన వైరాజసామము నిన్ను రక్షించును గాత. ఏకంశతిస్తోమము నిన్ను రక్షించును గాత. శరదృతువు నిన్ను రక్షించును గాత. యజ్ఞఫలస్వరూప ధనము నిన్ను రక్షించునుగాత.

14. యజమానీ! నీవు ఊర్ధ్వదిశన సంచరించుము. పంక్తి ఛందము నిన్ను రక్షించవలెను. ఋక్కు పై నిలిచిన శాక్వర సామము నిన్ను రక్షించును గాత. హేమంత, శిశిర ఋతువులు నిన్ను రక్షించునుగాత. తేజోరూపమగు ధనము నిన్ను రక్షించును గాత.

(పులి చర్మము క్రింద ఉంచిన సీసమును కాలితో తొక్కి దూరమునకు పారవేయవలెను)

సీసపు రూపమున ఉన్న ' నముచి' శిరము దూరమునకు ంసరబడినది.

15. (స్నానము కొరకు యజమానిని పులిచర్మము ంద కూర్చుండపెట్టవలెను)

పులిచర్మమా! నీవు సోమపు కాంతిం. నీవంటి కాంతి నాకు లభించవలెను.

(యజమాని బంగారమును త్రొక్కవలెను)

స్వర్ణమా! నీవు నన్ను మృత్యువునుండి రక్షింపుము. నీవు ఉత్సాహరూప ఓజస్సువు. శారీరక బలమవు. 'అమృతమసి' అమృతమవు.

16. మిత్రావరుణులారా! ఉషః కాలము దాటును. అప్పుడు పరమైశ్వర్యవంతులగు మీరు ఉదయింతురు - సూర్యుడు కూడ ఉదయించును. మీరు బంగరు రంగువారు. మీరు రథమును ఎక్కండి. దేవమాత అదితిని, దైత్యమాత దితిని దర్శించండి. దక్షిణ బాహువా! నీవు మిత్రుడవు. వామ బాహువా! నీవు వరుణుడవు.

(యజమాని రెండు చేతులను పైకి ఎత్తవలెను)

17. (యజమాని తనచేత బంగారము పట్టుకొని పులిచర్మము మీద తూర్పు ముఖముగా కూర్చుండవలెను. అతని ముందు పలాశ, ఔదుంబర, న్యగ్రోధ, పిప్పలపాత్రలలో జలము ఉండవలెను. ఒక్కొక్క పాత్రతో ఒక్కొక్కరు యజమానిని మంత్ర యుక్తముగా స్నానము చేయించవలెను)

1. (పురోహితుడు పలాశ పాత్ర జలముతో స్నానము చేయించుచు) నిన్ను చంద్రుని కీర్తి కాంతులతో అభిషేకము చేయుచున్నాను. క్షత్రియుల ఏకమాత్ర క్షత్రపతివై వర్ధిల్లుము. రాజువై మమ్ములను శత్రువుల శస్త్రముల నుండి రక్షించుచు పాలింపుము. " **సోమస్యత్వాద్యుమ్నేనాభిషించామి . క్షత్రాణాం క్షత్రపతిరేధ్యతిదిద్యూన్పాహి"**

2. (రాజసోదరుడు ఔదుంబర పాత్రజలమున స్నానము చేయించవలెను) యజమానీ! నిన్ను నేను అగ్నియొక్క తేజమున అభిషేకించుచున్నాను. క్షత్రియులకు ఏకమాత్ర క్షత్రపతివై వర్ధిల్లుము శత్రువుల బాణాది అస్త్రమునుండి మమ్ము ప్రజలను పాలింపుము. " **అగ్నేర్భ్రాజసా త్వమభిషించామి. క్షత్రాణాంక్షత్రపతిరేధ్య తిదిద్యూన్పాహి"**

3. (రాజపుత్రుడు న్యగ్రోధపాత్ర జలమున అభిషేకము చేయించవలెను) యజమానీ! నిన్ను సూర్యవర్చస్సున అభిషేకించుచున్నాను. క్షత్రియులకు ఏకమాత్ర క్షత్రపతివై వర్ధిల్లుము. శత్రువుల బాణాది అస్త్రములనుండి మమ్ము రక్షించి ప్రజలను పాలింపుము. " **సూర్యస్యవర్చసాత్వాభిషించామి. క్షత్రాణాంక్షత్రపతిరేధ్యతి దిద్యూన్పాహి "**

4. (వైశ్యుడు రాగి పాత్రజలమున అభిషేకము చేయించవలెను) యజమానీ! నిన్ను నేను ఇంద్రుని విపుల శరీరబలమున అభిషేకించుచున్నాను. క్షత్రియులకు ఏకమాత్ర క్షత్రపతివై వర్ధిల్లుము. శత్రువుల బాణాది అస్త్రములనుండి మమ్ము రక్షించుచు ప్రజలను పాలింపుము.

18. (యజమానికి స్నానము చేయించునపుడు పురోహితుడు చదువవలసినది)

దేవతలారా! మీరు ఈ యజమానిని శత్రురహితుని చేయండి. మహారాజ్యమున, మహాజ్యేష్ఠమున నిలుపండి. మహాజనరాజ్యమున నిలుపండి. ఇంద్రుడు ఇతనికి పరమోత్కృష్ట బలమును ప్రసాదించును గాత. యజమాని పుత్రుని దేశవాసుల ఆధిపత్యమున నిలుపండి. కాని " **సోమో ఽస్మాకం బ్రాహ్మణానాం రాజా** " మా బ్రాహ్మణులకు మాత్రము సోముడే రాజగును.

19. సూర్యుడు స్తుత్యుడు. గమనశీలుడు, సేచనకారి. జలవర్షణశాలి. అతడు పర్వతపు చాటున జారుచున్నాడు. సూర్యుడు జలమును అంతరిక్ష మేఘమున చేర్చును. ఆ జలమే వర్షముగ మారి సూర్యుని దిగువకు చేరును.

(యజమానిని వ్యాఘ్రచర్మము ంద మూడడుగులు నడిపించవలెను)

ప్రథమ పాదక్షేపమా! సర్వవ్యాపి, యజ్ఞపురుష జగదీశ్వరుడు తొలిపాదము మోపిన భూంనీవు. ద్వితీయ పాదక్షేపమా! నీవు-యజ్ఞ పురుషుడు రెండవ కాలు మోపి గెలిచిన - అంతరిక్షమవు. తృతీయ పాదక్షేపమా! యజ్ఞపురుషుడగు ష్ణువు మూడవపాదము మోపి

గెలిచిన వైకుంఠమవు.

20. (సభాభవనము నుండి యజ్ఞశాలకు చేరి ద్యావాగ్నిలో హోమము చేయవలెను)

ప్రజాపతీ! నీవు కాక మరొక దేవత ఈ భూత- భష్యద్-వర్తమానములందలి ధ ప్రాణులను సృష్టింప, సంహరింపగలవాడు లేడు. ఏ ఏ పదార్థములను కోరి మేము హోమము చేయుచున్నామో అవన్నియు మాకు లభించవలెను. ఇతడు తండ్రి. ఇతని తండ్రి ఇంకొకడు. మేము మాత్రము ధనస్వాములము కావలెను. స్వాహా.

(పలాశఘటమున ంగిలిన జలముల ఆహుతులు అగ్నీధ్రవాదుల ఉత్తరమున అర్పించవలెను)

రుద్రాగ్నీ! నీవు సర్వభక్షకనామకుడవు, హం! ఆ సర్వభక్షక అగ్నికి ఆహుతిం అగుము. నీవు మా ఇంటి వైపు వెడలుము - స్వాహా.

21. (వాజపేయ యాగము వంటి రథమును వేదికి దక్షిణ భాగమున నిలిపి మంత్రయుక్తముగ అశ్వములను దూర్చవలెను)

రథమా! నీవు ఇంద్రుని వజ్రమవు. శాసించు త్రావరుణుల అనుమతిచే నీకు అశ్వములను పూన్చుచున్నాను. నేను హింసింపనలంకాని ఇంద్రతుల్యుడను. అన్నప్రాప్తి కొరకు నిన్ను అధిరోహించు చున్నాను.

(రథసారథి కుడివైపు గుర్రమును కొరడాతో కొట్టి నడుపవలెను)

అగ్రభాగపు అశ్వమా! నీవు మరత్తుల అనుజ్ఞచే మా శత్రువులను జయించుము. మేము మనసా ప్రారంభించిన కర్మఫలమును అందుకున్నాము.

(అంతకుముందే అచట ఉంచిన గోవును యజమాని ధనుస్సు యొక్క అల్లెత్రాటిలో తాకవలెను)

22. (రథమును వేదికి తూర్పున - గోవు ప్రక్కన - నిలుపవలెను)

వజ్రహస్త ఇంద్రా! నివు ఆసీనుడవగు రథమున్నది. దానికి జోడించు అశ్వములున్నా. అట్టి రథమును - అశ్వములును ఇక్కడ సిద్ధంగా ఉన్నా.

ఇంద్రా! నీవు శత్రువులను రౌద్రముగా పరాజితులను చేయుదువు. పరమైశ్వర్యయుక్తుడవు. మేము నీ భక్తులము. యజమానులము, మేము అయాచకములము కావలెను. నీ రథము నుండి ఁడిపోరాదు. శత్రువు బారిన పడిపోరాదు.

23. (రథఁమోచన ఆహుతులు ఇవ్వవలెను)

అగ్నయే గృహపతయో స్వాహా. సోమాయ వనస్పతయో స్వాహా. మరుతామోజసే స్వాహా. ఇంద్రస్యేంద్రాయ స్వాహా.

(రథమునందున్న యజమాని భూఁని చూడవలెను)

అమ్మాభూఁ! నీవు నన్ను నీ అన్నపానాదులు - లేనివానిని చేయకుము. తల్లీ! అనవసరమగు ఇంద్రస్యేంద్రాయ స్వాహా.

(రథమునందున్న యజమాని భూఁని చూడవలెను)

అమ్మా భూఁ! నీవు నన్ను- నీ అన్నపానాదులు - లేనివానిని చేయకుము. తల్లీ! అనవసరమగు త్రవ్వటలు మున్నగు వాని వలన నిన్ను నేను బాధించకుండవలెను.

24. అతడు అహంకారహంత. పఁత్రుడు. మానవ ప్రవర్తకుడు, వాయురూపమున అంతరిక్షమున ఉండువాడు. దేవతల ఆహ్వానకర్త. అగ్నిభాగమున వేదిపై ఉండువాడు. పూజ్యుడు. ఆహవనీయాది రూపమున యజ్ఞగృహమున నివసించువాడు. ప్రాణభావమున మానవు లందుండువాడు. ఉత్కృష్ట స్థానవాసి. యజ్ఞస్థితుడు. మండలాకారమున ఆకాశమున ఉండువాడు. మత్స్యాదిరూపమున జలములందు ఉద్భఁంచువాడు. స్వేదజ -అండజ-పిండజ-ఉద్బిజ్జ రూపమున పృథ్వి పై ఉత్పన్నుడగువాడు. సత్యమున పుట్టినవాడు. అద్రిన పుట్టినవాడు. అతడే మహాసత్యము **" ఋతమ్ బృహత్ ".**

25. (యజ్ఞశాల దక్షిణభాగమున రథమును వహించు శకటమును నిలుపవలెను. ఆ శకటపు కుడిచక్రమునకు నూరునూరు మాషముల బంగారము కట్టి ఉండవలెను. దానిని యజమాని స్పృశించి)

శతమాషసువర్ణమా! నీవు జీవన స్వరూపవు. నాకు వంద సంవత్సరముల ఆయువును ఇమ్ము. నీవు దక్షిణరూపమవు. కావున నీవే యజ్ఞమును నిర్వహించుదానవు. అందువలన తేజోరూపము గలదానవు. నాకు బ్రహ్మవర్చస్సు కలిగింపుము.

(యజమాని రెండు స్వర్ణములను బ్రహ్మయను ఋత్విజునకు ఇవ్వవలెను. రథ వాహనమున ఉన్న ఔదుంబర శాఖను యజమాని స్పృశించవలెను)

ఔదుంబరశాఖా! నీవు స్వయముగా అన్నమయమవు. నీవు నన్ను అన్నమున స్థాపించుము.

(వ్యాఘ్రచర్మము ీద ఉన్న ఔదుంబరపాత్రలో యజమాని తనరెండు చేతులను ఉంచవలెను)

యజమాని బాహువులారా! ీరు పరాక్రమవంతులు. పరమైశ్వర్యవంతులు. అధ్వర్యుడనగు నేను ిమ్ము ఈ పాత్రలో వంచుచున్నాను.

26. (చంద్రకర్రతో చేసిన ఆసందికి నులుక అల్లి వ్యాఘ్రచర్మము ీద ిత్రావరుణుల ధిష్ణ్యముందు ఉంచవలెను)

ఆసందీ! నీవు సుఖము నిచ్చుదానవు. సుఖాసీనయోగ్యవు. (ఆసందిీద బట్టపరచి) వస్త్రమా! నిన్ను యజమాని ధరించినందున దాని ఉత్పత్తికి కారణమవు (ఆసందిీద యజమానిని ఆసీనుని చేయవలెను) యజమానీ! నీవు ఈ సుఖకర ఆసనమున ఆసీనుడవగుము. క్ష త్రియయోని భూతమగు ఈ ఆసనమున కూర్చుండుము.

27. (ఆసంది ీద కూర్చున్న యజమాని హృదయమును అధ్వర్యు తాకవలెను)

యజమాని యజ్ఞరూప కర్మమును స్వీకరించువాడు. అనిష్టనివారకుడు. శుభ సంకల్పముల వాడు. ప్రజ్ఞావంతుడు. ఇతడు ఆసనమున కూర్చొని ప్రజలు వరించిన వాడయినాడు. ఈ ఆసనమున సార్వభౌమ సామ్రాజ్యమునందే ఆసీనుడయినాడు.

28. ('కృత' నామము గల నాలుగు 'కలి' నామముగల ఒకటి మొత్తము అయిదుపాచికలు అధ్వర్యు యజమాని చేత ఉంచవలెను)

సర్వంజయ 'కలి' అక్షముగల యజమానీ! నీవు సర్వత్ర వ్యాపింపుము. అయిదు పాచికల రూపముగల అయిదు దిశలు ీ సర్వకార్యములకు సిద్ధి కలిగించవలెను.

(ఇది యజమాని బ్రహ్మమధ్య సంభాషణ రూపము)

యజమాని:-- బ్రహ్మా! నీవు బ్రహ్మవు.

బ్రహ్మ :-- యజమానీ! నీవు సత్యపరమవు. నీ ఆజ్ఞ అనుల్లంఘనీయము.

యజమాని :- బ్రహ్మా! నీవు బ్రహ్మవు.

బ్రహ్మ :-- యజమానీ! నీవు సత్యపరాక్రమవరుణుడవు.

యజమాని :-- బ్రహ్మా! నీవు బ్రహ్మవు.

బ్రహ్మ :-- యజమానీ! నీవు ప్రజలలో వ్యాపించిన తేజమగు ఇంద్రుడవు.

యజమాని :-- బ్రహ్మా! నీవు బ్రహ్మవు.

బ్రహ్మ:-- యజమానీ! నీవు మంచి సేవలను అందుకొను రుద్రుడవు.

యజమాని :-- బ్రహ్మా! నీవు బ్రహ్మవు.

బ్రహ్మ :-- యజమానీ! త్వంబ్రహ్మాసి

యజమాని :-- బహు కార్యములు చేయు సజ్జనులారా!

(జూదభూమి సిద్ధము చేయుటకు అధ్వర్యు యజమానికి స్ఫ్య ఇవ్వవలెను)

స్ఫ్యా! నీవు ఇంద్రుని వజ్రాంశమవు. నా శత్రువులను నాకు వశపరచుము.

(యజమాని జూద భూమిని సమతలము చేయవలెను.)

29. (సిద్ధమైన జూద భూమి మీద సువర్ణము ఉంచి ఘృతాహుతులు ఇవ్వవలెను)

మహానుడు - ధర్మపాలకుడగు అగ్నికి స్వాహా

మహానుడు - ధర్మపాలకుడగు అగ్నికి స్వాహా

(అగ్నిని ఆదరించుటకు పునరుక్తి)

(యజమాని ద్యూత రంగమున అయిదు పాచికలు వేయవలెను.)

పాచికలారా! మీరు ఆహుతులచే పునీతులై సూర్య తేజము కలవారలయినారు. నాకు

మా జనుల మధ్యన ఉత్తమ స్థానము కల్పించుటకు ప్రయత్నించండి.

30. (భోజనమునకు బయలుదేరిన వందమంది బ్రాహ్మణులలో ఒకడు అనవలసినది)

ఆదేశకారు సూర్యుడు - వాగ్రూప సరస్వతి - రూపముల త్వష్ట - పశు సంపన్న పూష - ప్రత్యక్ష ద్రష్ట ఇంద్రుడు - దేవయాగ బ్రహ్మ బృహస్పతి- ఓజస్వి వరుణుడు - తేజస్వి అగ్ని - రాజాసోముడు - పదవ యజ్ఞ దేవత విష్ణువు ఆదేశములను అందుకొని సాగుచున్నాను.

31. (రాజసూయాంతమున చదువు ఈ నాలుగు మంత్రములు "చరక సౌత్రామణి" అనబడును పట్టు బట్టలో మొలకలు వచ్చినవి, రానివి ధాన్యము కట్టి ఉంచవలెను.)

మొలకలు వచ్చినవాటిని ఉడికించి రాని వాటిని పిండి చేసి అందులో కలుపవలెను.

సురా! నీవు అశ్వినుల కొరకు పచనమగుము. సరస్వతి కొరకు పచనమగుము. చక్కగా రక్షించు ఇంద్రుని కొరకు పచనమగుము. వాయువుచే పంిత్రము చేయబడినదియు కుశలచే వడగట్టబడి - కిందకు దిగినదియునగు సోమము ఇంద్రునకు యోగ్యమగు ుత్రమగును.

32. సోమమా! యజమానులు దర్భాసనముల ుద ఆసీనులై సమంత్రకముగా యజించుచున్నారు. యవల పొలమున కోత కోసి ధాన్యమును వేరు చేసినట్లు - నీవు ఇతర యజమానుల భోజనాది పదార్థములను - ఇచట ఆసీనులైన - యజమానులకు అందించుము.

సోమమా! నిన్ను ఉపయామ గ్రహమున గ్రహించినాను. నిన్ను అశ్వినుల కొరకు

గ్రహించినాను - అశ్విభ్యాం త్వాగృహ్ణాు నిన్ను సరస్వతి కొరకు గ్రహించినాను

- సరస్వత్యై త్వా గృహ్ణాు. చక్కని రక్షణలిచ్చు ఇంద్రుని కొరకు నిన్ను గ్రహించుచున్నాను - ఇంద్రాయత్వాసుత్రామ్ణే గృహ్ణాు.

33. అశ్వినులారా! ురు ంధ రూప సోమములను పరీక్షించి ఆస్వాదించువారు. శుభములగు యజ్ఞాది కర్మలను పంత్రము చేయువారు. అసుర నముచితో కలసి ురు సుష్ఠుగా సోపానము చేసినారు. అట్లు పానము చేసిన దానిని శుద్ధి చేసి ఇంద్రునకు ఇచ్చినారు. ఆ ంధముగా ఇంద్రుని స్వకర్మ క్షమ గలవానిని చేసినారు.

నముచి అసురుడు. అతడు ఇంద్రునకు శ్వాస పాత్రుడైనాడు. అతడు ఇంద్రుని కూడి సోమపానము చేయుచు ఇంద్రుని బలమును కూడ త్రాంనాడు. ఇంద్రుడు ుతుర్యుడు అయినాడు. అప్పుడు అశ్వినులును, సరస్వతియు ఇంద్రునకు ఫేన రూప వజ్రము నిచ్చినారు. దానిచే ఇంద్రుడు నముచి తల నరికినాడు. తలతెగిన నముచి ఉదరము నుంచి సోమము ప్రవహించినది. దానిని అశ్వినులు త్రాంనారు. ఆ సోమమును శుద్ధి చేసి ఇంద్రునకు ఇచ్చినారు. ఇది తైత్తరీయ వృత్తాంతము.

34. ఇంద్రా! అశ్వినులు ఋషుల మంత్రములచేతను - దర్శనీయ కార్యముల చేతను - పూర్వకాలమున - నిన్ను - తలిదండ్రులు ఆపదలందున్న బిడ్డలను వలె రక్షించినారు. అప్పుడే నీవు ఎంతో రమణీయమగు సోమమును అందించినావు. అందుకే సోమపాయివగు నిన్ను సరస్వతి సేంచును.

## శ్రీమాన్ దాశరథి లక్ష్మణాచార్య బుచ్చమాంబల పౌత్రుండును, ంద్వాన్ దాశరథి

## వేంకటాచార్య వేంకటాంబల పుత్రుండును - ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కం దాశరథి

కృష్ణమాచార్య అనుజుండును - కమలానాఌ్న ధర్మ పత్నీ సమేతుండును -

శ్రీమదాంధ్రవచన ఋగ్వేద సంహిత, శ్రీమద్రామాయణము, సీతాచరితము, శ్రీమహా

భారతము, హరివంశము, శ్రీమహాభాగవతము మున్నగు మహాగ్రంథ రచయితయునగు

దాశరథి రంగాచార్య ంరచిత శ్రీమదాంధ్ర వచన శుక్ల యజుర్వేద సంహితయందలి

రాజసూయాన్త వర్ణనమను పదవ అధ్యాయము సమాప్తము. సర్వేసి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్పటికాకృతిం ।

అధారం స్సర్వ ంద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

## పదకొండవ అధ్యాయము

(ఈ అధ్యాయము నుండి పద్దెనింుదవ అధ్యాయము వరకు వేది నిర్మాణ మంత్రములు)

1. యుఞ్జానః ప్రథమం మనస్తత్వాయ సంతాధియః ।

అగ్నే ర్జ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత్ ॥

సర్వ ఉత్పాదక సంత తనమనమున వేది చయనమున నిశ్చయించినాడు. వేది యొక్క

నిర్మాణ ప్రకారాదులను గురించి ఆలోచించినాడు. అగ్ని జ్యోతి యొక్క సర్వఫలసాధకమును గురించి ఆలోచించినాడు. అగ్ని జ్యోతి యొక్క సర్వఫలసాధకమును గురించి సహితము నిశ్చయించినాడు. అప్పుడు అతడు మట్టి వేది నిర్మాణపు - ఇటుకలు- మున్నగు వానిని సేకరించినాడు.

2. సంతృ దేవుని ఆజ్ఞానువర్తులమగు మేము - స్వర్గ గమనకాంక్షచే - యథాశక్తి వేది నిర్మాణము చేయుదుము.

3. సర్వప్రేరక స◌త అగ్ని కర్మమున సంయోజితుడు అయినాడు. అగ్ని స్వర్గగా◌. ద్యులోకచింతనుడు. సర్వ ఫలసాధకుడు. అతని జ్యోతిని యజ్ఞమున ప్రజ్వలింపచేయదలచినాడు స◌త. అందుకుగాను దేవతలను వేద చయనమునకు ఆహ్వానించినాడు.

4. యజమాని మహానుడు, ◌ద్వాంసుడు. అతని ఋత్విజులు వేదిచయన ◌ప్రులు. వారు ఏకాగ్రచిత్తులై వేదిచయన కర్మ, పరిమాణ నిర్మాణాదులందు సంలగ్నులగుదురు. యజ్ఞకర్మ◌షయక సర్వ ◌జ్ఞానములు తెలిసినవాడు స◌త మాత్రమే. ఆ స◌తయే ఈ యజమాన, ఋత్విజులందు ప్రవేశించును. స◌త ఒక్కడే ఋత్విగ్యజమానులను స్వా◌ సేవక సంబంధమున నియ◌ంచును. ఆ స◌తా దేవునకు ఇది పరమసుత్తి అగును.

5. యజమాన - యజమాన పత్నీ! ◌ ఉభయులకు శుభములు కలుగుటకు ◌ప్రశ్రేష్ఠుని సంతృప్తిపరతును. ఉభయలోకప్రాప్తి కలిగించు ఆహుతి వంటి ఋత్విజులను యజ్ఞమునందు నియ◌ంచిన యజమాని కీర్తి ఉభయ లోకములకు వ్యాపించవలెను. అమృతమూర్తి ప్రజాపతి యొక్క, దేవ పుత్రులందరు ఈ యజమాని కీర్తిని ◌నవలెను. వారు తాము అధిష్ఠించిన దివ్య స్థానములందుండి ఇతని కీర్తిని ఆకర్షించవలెను.

6. ఎవని గమనమును సకల దేవతలు అనుసరింతురో, ఎవని మహిమ వలన సకల దేవతలకు

ఓజో తేజములు కలుగునో - ఎవడు సకల పార్థివ పదార్థములను సృష్టించినాడో అతడే మహిమాన్వితుడగు స◌తృ దేవత - " స◌తా మహిత్వనా "

7. స◌తా! యజ్ఞమును కలిగించుము. యజ్ఞ కర్త యజమానికి సౌభాగ్యములు కలిగించుము నీవు దేవతల జ్ఞానమును పునీతము చేయువాడవు. వేదవాణిని ధరించు వాడవు. మా జ్ఞానమును పావనము చేయుము. వాచస్పతివగు నీవు మా స్తుతులను ఆలకింపుము.

8. స◌తా! నీవు దేవతలను సంప్రీతులను చేయువాడవు. యజమానిని ◌త్రునివలె ఎరుగువాడవు. సత్యజిత్తువు. ధనజిత్తువు. స్వర్గజిత్తువు. ప్రవర్తమానమగుచున్న ఈ యజ్ఞమును నిర్విఘ్నముగ పరిసమాప్తి చేయించుము. ఋచాదుల ద్వారా మా త్రివృదాది స్తోత్రములను సంపూర్ణముగ ◌కసింపచేయుము.

9. అభ్రీ! నేను స◌త అధీనపు వాడను. అశ్వినుల బాహువలతోను - పూషహస్తములతోను -

పూర్వజ అంగిరుల వలె - గాయత్రి ఛందము పఠించి నిన్ను పట్టుకొనుచున్నాను.

అభ్రీ! అంగిరుల కొరకు వలె నా కొరకును నేల దిగువన త్రిష్టుప్ ఛందమున జలయుక్త అగ్నిని అగపరచుము.

10. అభ్రీ! నీవు వెదురుతో చేయబడిన దానవు - స్త్రీలింగమవు. అంగిరులకు వలెనే మాకును జగతీ ఛందమున నేలదిగువన గల అగ్నిని త్రవ్వి తీయు శక్తిని ప్రసాదించుము.

(అభ్రి కర్రతో చేసిన త్రవ్వు కోల)

11. సంత తన స్వర్ణ హస్తములచే అభ్రిని పట్టినాడు. అతడు అంగిరుల వలెనే అనుష్టుప్ ఛందమున పృథ్వి క్రింద అగ్నిజ్యోతిని కనుగొనుటకు నిశ్చయించినాడు. అగ్నిని అచట నుండి వెలువరించినాడు.

12. (చేత అభ్రిని పట్టి) అశ్వమా! ఇది పాషాణాదులు లేని భూమి. త్రవ్వుటకు సులభ సాధ్యమైనది. దీని మీదికి నీవు వేగముగా విచ్చేయుము.

అశ్వమా! నీ జన్మము ద్యులోకమునందైనది. నీ నాభి ఉత్కృష్ట అంతరిక్షమున ఉన్నది. నీ

యోని ఈ పృథ్వి మీద ఉన్నది.

13. ధన వర్షక పత్నీ, యజమానులారా! ఈ కర్మ విశేషమున అగ్నిని ఆహరించునదియు - మీ హితము కోరునదియు అగు గార్ధభమును బంధించుడు. ( గార్ధభమును బంధించవలెను.)

14. ఆయా కర్మములందు దేవతలకు హవిరన్నము అర్పించుటకు అత్యంత ఉత్సాహము కనబరచు మేకను - ఋత్విజ యజమానులము హవిష అభావరూపము నుండి రక్షించుటకు ఆహ్వానించుచున్నాము.

15.(అశ్వ, గార్ధభములనుముట్టుకుండ)

అశ్వమా!మా శత్రువులుమాకు అపకీర్తులు కలిగించినారు.అట్టి శత్రువులనునీ పాదము చేత్రొక్కుచువారిని హింసించుచుముందడుగు వేయుము.నీవు మూడు సుఖములనుసంభవము చేయుము.రుద్రుని గణపతిత్వమునుఅందుకొను కోరికతో - ముందడుగువేయుము.

గార్ధభమా!నీ మార్గములు శుభంకరములు.నీవు మా భయములనుదూరము చేయుము.సహయోగిని పృథ్విసహితముగయజ్ఞశాల ఆకాశమున చేరుకొనుము.

16.అభ్రీ! భూమిలోనుండి జలసహితఅగ్నిని - అంగిరుల కొరకువలె- వెలువరింపుము.

(యజమానాదులుఅశ్వ, గార్ధభ, అజ సహితులైఅగ్నిత్రయమునుప్రజ్వరిల్లచేసినపిదప మట్టి ముద్దలవద్దకుచేరవలెను)

ఇప్పుడుమేము - అంగిరులవలె- పశువులకు హితకారియగుఅగ్నివద్దకు చేరినాము.అంగిరుల వలనేఈ పశుహితకారి అగ్నిని సేకరింతుము.

17.అగ్ని సకల సృష్టిని ఎరిగినవాడు. వేదిపై సర్వప్రథమముగానిలుచువాడు. అగ్నిఉషస్సుల అగ్ర భాగములను◌ీక్షించువాడు. సూర్యునితొలి కిరణములునానా ◌ిధములైప్రసరించుటను చూచువాడు.చివరకు అగ్ని స్వయముగా- ద్యావాపృథ్వులకు అనుకూలుడై◌ిస్తరించును.

18.(మట్టి కుప్ప వద్దనిలిచిన అశ్వ సంబోధన)

ఈ అశ్వముమార్గములు గడచివచ్చును.
ఇక్కడిబాధించువారినందరినిగడగడలాడించును.తదుపరి పృథ్వియందున్నఅగ్నిని తన కంటితోచూచును.

(వేదినిర్మాణమునకు అనుకూలమగుస్థలమునకు గుర్రమునుతీసికొని పోవలెను)

వేగవంతఅశ్వమా! యజ్ఞవేదిఅగ్ని స్థానమగును.అందుకు అనుకూలమగుభూ◌ిపై అడుగు పెట్టుము.దానిని నిశ్చయించుము.

(గుర్రపుకుడికాలు ఆ స్థలముపైపెట్టించవలెను)

అశ్వమా!ఈ నేలను తాకుము.ఆ మట్టిని మాకుసూచింపుము. మేముదానిని పరిశుద్ధమనిగ్రహింతుము.త్రవ్వుదుము.

20.(త్రవ్వుటకు అనుకూలమగునేల◌ీద నిలిచినఅశ్వపు ◌ీపు ◌ీద అధ్వర్యుచేతితో దువ్వవలెను)

అశ్వమా!ద్యులోకము నీ వెన్ను,పృథ్వి నీ సహస్థానము.అంతరిక్షము నీ ఆత్మ,సముద్రము నీ ఉత్పత్తిస్థానము. అట్లు స్తుతించబడుఅశ్వమా! నీ కంటి చూపునత్రవ్వతగిననేలను గుర్తింపుము.ఆ మట్టిలో ఉన్నశత్రు భావమును- రాక్షసాదులను నీ కాళ్ళతోత్రొక్కి వేయుము.

21.(అశ్వమును ఆ నేల నుంచితొలగించవలెను)

అశ్వమా!నీవు వేగవంతవు.శుభములు కలిగింపుము.ఈ మట్టి నుంచితొలగుము. మేము

అధ్వర్యుయజమానాదులము.ఈ మట్టిని త్రవ్వెదము.నేల తల్లి మమ్ము.అనుగ్రహ దృష్టితోచూడవలెను.

22.ఈ అశ్వము వేగవంతము,ధనమును ఇచ్చునది.మట్టి త్రవ్వవలసిన చోటునుంచి దిగినది.దానిని పుణ్యవంతముచేసినది. ఇక అచటనుండియే - సుముఖుండగుఅగ్ని యొక్క వేదికొరకు - మట్టిని త్రవ్వుదుము.పరమపదము చేరుకోరికగల వారమై త్రవ్వుదుము.

23.(మట్టి గడ్డ◌ీదకూర్చుని ఆహుతులుఇవ్వవలెను)

అగ్నీ!సర్వ భూతములునీయందే ఉన్న◌ి.నేను శ్రద్ధగలమనసుతో నీకు ఘృతాహుతిఅర్పింతును. నీ జ్యోతివంకరలు గలది.దానితో నీవు ఎంతో వ్యాపింతువు.ధూమముతో నింగినిచేరుదువు. ఘృతాదులఆహుతులచేఅత్యంత ప్రకాశవంతుడవుఅగుదువు. అట్టినీవేగదా ప్రత్యక్షదైవమవు! స్వాహా.

24.అగ్ని ప్రత్య గాత్మ.సర్వత్ర ప్రతీయమానుడు.అట్టి అగ్నికి ఘృతాహుతిఅర్పించుచున్నాను.అగ్ని దానిని - క్రోధములేని మనమునస్వీకరించవలెను.

అగ్నిమానవులకు ఆశ్రయనీయుడు.స్పృహణీయవర్ణుడు. జ్వాలామయదేహుడు.ఇటునటు తిరుగువాడు.ఎంతటివాడునుఅంతలేని వాడు- అగ్నయే స్వాహా.

25.అగ్ని అన్నపాలకుడు.క్రాంత ద్రష్ట. హ◌ిర్దాతయజమానికి ◌◌ధరమణీయ ధనములనుఇచ్చువాడు. అగ్ని హ◌ిభక్షణార్థము◌ి చ్చేయవలెను.

(అభ్రితోఆ ప్రదేశమును త్రవ్వవలెను)

26.అగ్ని బలమునమధించిన ఉత్పన్నమగువాడు.సర్వ రక్షక పురమునందున్నవాడు.◌ిప్రుడు, అసాధ్యుడు.నిత్యము రాక్షసాదులనువధించువాడు.అతనిని మేము నిశ్చలచిత్తమునఆరాధింతుము.

(మరికొంతదూరమున త్రవ్వవలెను)

27.అగ్నీ! నీవు ఘర్షమునరోజురోజు జన్మించువాడవు.జలమున ◌ిద్యుద్రూపమునజన్మించివాడవు.రాళ్ళ రాపిడికి జన్మించువాడవు.అరణులందు జన్మించువాడవు.మానవ పోషకుడవు.నీ వెలుగున తి◌ిరాదులనుధ్వంసము చేయువాడవు.ఓషధుల నుంచిజన్మించువాడవు.పావకుడవు.

(మరికొద్దిదూరమున త్రవ్వవలెను)

28.(అభ్రితో మట్టినిత్రవ్వ వలెను)

అభ్రీ!నేను అంగిరులతో సమానుడను.స◌ితా దేవుని అధీనపువాడను.అశ్వినుల బాహువులతోను,పూషహస్తములతోనునిన్ను పట్టినాను.నేలను త్రవ్వుచున్నాను.

అభ్రీ!నీవు జ్వాలాయుక్తుడవు.సుందరముఖి◌ి. సతతతేజోవంతవు.ప్రకాశమానవు. ప్రజలకునిరంతర కళ్యాణకారి◌ి.అహింసకవు. నిన్నుపశువుల హితకరఅగ్నికొరకు - అంగిరసములమైత్రవ్వుచున్నాము.

29.(మట్టిగడ్డప్రక్కన - ఉత్తర దిక్కున- కృష్ణా జినము పరచవలెను.దాని ◌ీద తామరాకునుఉంచవలెను)

కమలినీపత్రమా! నీవు జలములపృష్ఠమవు. ఈ నేలనుమేము అగ్ని కొరకు త్రవ్వుచున్నాము.ఆ మట్టికి నీవేకారణ భూతమవు.సమస్త దిశలందువృద్ధి చెందుసముద్రమునేవృద్ధి చేయునీవు మహానుడవు.ద్యులోకపు పరిమాణముననుసరించి ిస్తరించుము.

30.(కృష్ణాజినము, కిలినీపత్రము రెండింటినితాకవలెను.)

కృష్ణాజిన,కమలినీ పత్రములారా!ిరు ఉభయులు అగ్నికొరకు సుఖావహులుకండు. కవచ సమానరక్షకులు కండు. ిరు ఛిద్రరహిత ఆకాశములు.పశుహిత కారి అగ్నినిచక్కగా ఆచ్ఛాదించండి.ి యందు ఉంచుకొనండి.

31.స్వర్గమున తెలిసినవాడు- ఏక మనస్కుడు - జ్యోతిష్మంతుడు- అనుపేక్షనీయుడగు అగ్నినిిలో దాచుకొణండి- స్వదేహములచేఅగ్నిని చక్కగా ఆచ్ఛాదించండి.

32.అగ్నీ! నీవు పశుహితకరుడవు.సమస్త ిశ్వమును నిలుపువాడవు- పోషించువాడవు.మొట్ట మొదటనిన్ను అథర్వ ఋషిమథించి సృష్టించినాడు.

(యజమానిమట్టిని తామరాకుిద ఉంచవలెను)

అగ్నీ!మొట్ట మొదటఅథర్వర్షి నిన్ను జలమునుమథించి సృష్టించినాడు.నేడు లోకహితముకోరు ఋత్విజుడునిన్ను - అరణిని వథించి- కల్గించుచున్నాడు.

33.అగ్నీ! ఆ అథర్వుని పుత్రుడు- దధ్యంగుడనువాడు- వృత్రహంతవు,పురందారకుడవగు నిన్ను- ప్రజ్వలితుని చేయుచున్నాడు.

34.అగ్నీ! నీవు శత్రుహంతవు.యుద్ధములందుధన ిజేతవు.మేము సన్మార్గగాములము.సన్మనస్కులము.నిన్ను సందీప్తుని చేయుచున్నాము.

35.అగ్నీ! నీవు యజ్ఞములకుదేవతలనుఆహ్వానించు వాడవు.నీ అధికారము - కర్తవ్యములనుతెలిసినవాడవు.దీప్తి మంతుడవు.నీకు నిర్దిష్ట స్థానమగుకృష్ణాజినమునఆసీనుడవగుము. శుభకర్మలకుమూలస్థానమగుకృష్ణాజినముపై యజ్ఞమునుస్థాపించుము.

36.అగ్నీ! నీ యజ్ఞములహిని దేవతలకుచేర్చువాడవు.నీ అధికారమువు, ిధులనుతెలిసినవాడవు.దీప్తి శాలిి. హోతృధిష్ణ్యాదులందుచేరువాడవు. క్షి ప్రకారిి.అహింసత స్వకర్మవు.ప్రకృష్టమతిి. నీ స్థానముననిశ్చలముగా ఉండువాడవు.వేల ఋత్విక్కుల,యజమానులనుభరించి పోషించువాడవు.పావక జిహ్వవు.అగ్నియజ్ఞమునకుసంపన్న రూపమగు ఉత్తరవేదిన ప్రతిష్ఠించబడినావు.

37.అగ్నీ! నీవు ఉత్కృష్టుడవు.కమల పత్రముిద స్థిరముగా ఆసీనుడవగుము.నీవు అనేక యజ్ఞములకుకారణభూతుడవు.నిత్య మహామహుడవు.దేవతలనుకంపింపచేయగలనీవు

ప్రదీప్తుడవగుము.నీవు దర్శనీయుడవయ్యునిన్ను చూడనీయనిధూమమును వెలువరింపుము.

38.అధ్వర్యులారా! భూ౦త్రవ్వుచోటునఉన్న జనులురోగములు లేనిఆరోగ్యవంతులు

కావలెను.అందుకొరకు మధుర, ప్రశస్తజలములనుకలిగించండి. ఆ మధురజలములచేఈ నేల తడువవలెను.ఫలప్రదములగువృక్షములు మొలకలెత్తిఫలించవలెను.

39.నేలతల్లీ! నిన్నుత్రవ్వుచున్నాము.నీ హృదయముపగిలినట్లు ఇదికనిపించుచున్నది.దానిని అంతరిక్ష సంచారివాయువు,జలాదులు పూరించుదురుగాత.

వాయువా!నీవు దేవతలకుప్రాణసముడవు.ఉపకారి౦. సర్వత్ర సంచారి౦. నీవుప్రజాపతి రూపుడవు.నీకు స్వాహా.

40.(పరచి ఉన్న కృష్ణాజినము,తామరాకు కొనలనుఅధ్వర్యు ఎత్తవలెను.)

ఈ అగ్నిచక్కగా ఉత్పన్ను డైనవాడు.అతడు - తన తేజమున- సుఖముగా కృష్ణాజినభవనమునవసించవలెను.

అలంకారఅగ్నీ! ఇది కృష్ణాజినరూప వస్త్రము. దీనినినీవు - ఇష్టముగా - ధరించుము.

41.(మట్టి ముద్దనుచేత పట్టిఅధ్వర్యు లేచినిలబడవలెను.)

శుభయజ్ఞవంతఅగ్నీ! ప్రజ్వరిల్లుము.నీవు దయాపరుడవు.మమ్ము రక్షింపుము.ఋత్విక్కుల స్తుతులకుప్రసన్నుడవగుము.మా యజ్ఞమునకు౦చ్చేయుము. నీ౦శాల తేజమునఅందవరకు దర్శనముఇచ్చుటకు ప్రజ్వరిల్లుము.నీవు కిరణములచేవెలుగొందుచు ౦చ్చేయుము.

42.(అధ్వర్యు మట్టిపట్టిన తనచేతిని ఎత్తవలెను)

అగ్నీ!మమ్ము రక్షించుటకుగానునీవు ఆకాశమునకు చేరుము.సూర్యుని వలె నభముననిలిచిన నీవుమాకు అన్నము కలిగించువాడవు.నిన్ను అభివ్యక్తునిచేయువారు ఋత్విజులు.వారిద్వారా నిన్ను మేముఆహ్వానించుచున్నాము.

43.(అధ్వర్యు పైకి ఎత్తినమట్టి ముద్దఉన్న చేతినిదించి అతని నాభివద్ద నిలుపవలెను.అశ్వమును తెచ్చి- దానిని అగ్నిగా భా౦ంచి)

అగ్నీ!అశ్వమా! నీవు దర్శనీయుడవు.౦౦ధ ఓషధులు ధరించినవాడవు.అనేక వర్ణములవాడవు. ప్రశంసనీయుడవు.రాత్రి చీకట్లనుపారద్రోలువాడవు.ఇప్పుడు అంతరిక్షపు నాభియందునిలిచినావు. ఇక నీవునీ సకిలింపుల తుములనాదములచేఓషధులను సమార్జింపుము.

44.(అధ్వర్యు గార్ధభమునుతేవలెను)

గార్ధభమా!నీవు గమనశీలవు.స్థిరపడుము. ధృఢఅంగములు కలుగుము.శీఘ్రగాివగుము. మాకుఅన్నము కలిగించుదానవగుము.నీవు మృత్తిక సుఖముగాకూర్చుండు ఆసనమవు.మట్టి మోయుదానవు.

45.(అథ్వర్యు మేకను తేవలెను)

అగ్నిరూపఅజమా! నీవు మానవప్రజకు శుభంకరివగుము,ద్యావాపృథ్వులనుతపింప చేయకుము.అంతరిక్షమును - ఓషధులనుతపింపచేయకుము.

46.(అధ్వర్యు వరుసగా అశ్వము,గార్దభము,. అజముిదకుమట్టి ముద్దలనుఎత్తవలెను.)

సకిలించిశబ్దించు అశ్వమా! నీవుసంతసముగా ముందుకుసాగుము. తన ఓండ్రుతోసకల దిశలనుగర్జింపచేయుచుగార్దభము మెల్లగాసాగవలెను. పశుహితకారియగు అగ్ని రూప మృత్పిండమునుధరించిన నీవుయజ్ఞ సమాప్తి వరకుఆయుష్యము కలుగుము.ఫలాభివర్షణసమర్థ గార్దభముసహితము జీించవలెను.

(మట్టిముద్దను గార్దభముిది నుంచి దించిమేక ిద పెట్టవలెను.)

అగ్నీ!హిభక్షణకునీవు త్వరగా యజ్ఞమునకుిచ్చేయుము - **" అగ్న ఆయాహిితయే "**

47.అంగిరసములగు ఋత్విక్కులుఆదిత్యుని - పశు హితకారిఅగ్నిని ఆహ్వానించుచున్నారు.

(నీటితోతడిపి చేసినమట్టి ముద్దనుతూర్పు దిక్కున పెట్టవలెను.)

ఓషధులారా!ి ముందు మృద్రూపఅగ్నినిలిచిఉన్నది.దానిని ప్రసన్నునుచేయండి.

అగ్నీ!ఇట నిలిచిన నీవుమా దుర్బద్ధులను- ఈతి బాధలను- వ్యాధులను దూరముచేసి వానిని నష్టపరచుము.

48.ఓషధులారా! ిరు సుందరపుష్పవంతలు. స్వాదిష్టఫలవంతలు.ఈ అగ్నిని స్వీకరించండి. ిరుఋతువులనుబట్టి పుష్పించువారు- ఫలించువారు. ఈ అగ్ని రూపమృత్తిక గర్భమునుచేరండి.

49.(అధ్వర్యు మేకను, గాడిదను,గుర్రమును తూర్పుదిక్కున వదలవలెను.)

అగ్నీ!నీవు ిశాలుడవు.తేజో బలసంపన్నుడవు.దీప్తిమంతుడవు.మా శత్రువులను- రాక్షసులను - వ్యాధులనుదూరము చేయుము.నీవు శరణ్యుడవు.సుఖదుడవు.

ప్రౌడుడువుఆవాహ ంయుడవు.మేము నీకు పరిచర్యలుచేయుచున్నాము.మాకు సుఖములనుప్రసాదించుము.

50.(అధ్వర్యు ఈ మూడు మంత్రములుచదువుచు మోదుగుపుల్లలతో కాలినవీటిని మట్టిముద్దల ందపోయవలెను.)

జలమా!నీవు సుఖ సంపదలకలిగించు దానవు.మహామహుడు- అతి సుందరుడగు బ్రహ్మనుదర్శించుటకుగానుమాకు అన్నమును- బలమును ప్రసాదించుము.

51.జలమా! నీవుఎన్నో శుభములుకలిగించు రసభూతమవు.తల్లులు తమశిశువులకు వలె- మాకు నీ యొక్క రసమునుపంచి ఇమ్ము.

52.జలమా! ఇది యజ్ఞగృహము. ఇచటనీవు మా అందరనుసంప్రీతులను చేయుచున్నావు.ఈ యజమానికి స్వర్గమందునుసంపూర్ణముగ అనుగ్రహించుము.మమ్ము సహితముస్వర్గయోగ్యులనుచేయుము.

53.సూర్యుడు సర్వ ుత్రుడు.అతడు తన ప్రకాశమునద్యులోక భూలోకములకుసంబంధము కలిగించుచున్నాడు.

అజలోమ రూపాగ్నీ! నీవుచక్కగా ఉత్పన్న మైనవాడవు.జాతప్రజ్ఞుడవు.నీచే ఈ మృత్పిండమునకుసంతృప్తి కలిగించుచున్నాను.(మేకవెంట్రుకలనుమట్టి ముద్దలోకలుపవలెను)

54.(మట్టిముద్దలోఇనుపరజను - రాతిపొడికలుపవలెను)

రుద్రులుభూమండలమునుఖనిజములను- శిలలను సృష్టించినారు.అగ్నికి మహాజ్యోతినికలిగించినారు. ఆ రుద్రులఅజస్రశుభ్ర తేజమునేటికి దేవతలందుకనిపించుచున్నది.

మృత్పిండముభూగోళమునకుసంకేతము అందు ఖనిజాలుఉన్నవనుటకుఇనుపరజను - రాతిపొడిని కలుపుట. ంటినికలుపుట వలనమట్టికి గట్టితనముకలుగును. అసలు ఈ భూ ుఖనిజములు- శిలలవలననేనిలిచి ఉన్నదేమో!

55. ఈ మృత్పిండము వసురుద్ర రూపసైకతాదులచే కలుపబడినది. శుక్ల పాడ్య ు అభిమాన దేవత యగు సినీ వాలి స్వయముగా తన కోమల హస్తములచే మెత్తగా చేయవలెను.

56. శుక్లపాడ్య ు అభిమాన దేవత 'సినీవాలి' సుందరి - సుశోభిత - సర్వాభరణాలంకృత. ఆమె తన చేతుల్లో ఉఖ - కుండ - ను దేవమాత అదితికి అందించును గాత.

57. అదితి తన బుద్ధి, శక్తి సామర్థ్యములచే - తన హస్తములచే కుండను ఏర్పరచవలెను. అదితి నిర్మించిన ఉఖ - తల్లి తన బిడ్డను గర్భమందు వలె - అగ్నిని దాల్చవలెను.

(యజమాని - అతనిపత్ని తమ చేత మట్టి ముద్దగైకొని ఉఖను చేయవలెను.)

మృత్పిండమా! నీవు కీర్తి శిఖరమవగుము.

అగ్నిని దాల్చుట కుండను కాల్చుట కావచ్చును.

58. (కుండకు అడుగు చేయుటకుగాను మట్టిని అరచేతి వెడల్పు చేయవలెను)

ఉఖా! అంగిరుల వంటి వసుగణములు నిన్ను గాయత్రీ ఛందమున నిర్మించినారు. రుద్రులచే నిర్మించబడిన నీవు గట్టిదానవు - ిస్తారమవు - యజమానినగు నాయందు సంతానమును - ధన సమృద్ధిని - గోస్వాిత్వమును - ీరకృత్యములను చేర్చుము.

(ఉఖను నీటితో నున్నగా చేసి రెండవ ధాతువును ఉంచవలెను)

అంగిరుల వంటి ిశ్వే దేవతలు నిన్ను 'అనుష్టుప్' ఛందమున నిర్మించినారు. ిశ్వే దేవతలచే నిర్మించబడిన నీవు గట్టిదానవు - ిస్తారమవు - యజమానినగు నా యందు సంతానమున ధనసమృద్ధిని గోస్వాిత్వమును ీరత్వమును చేర్చుము. నా వారినందరిని నా వశమున ఉండునట్లు చేయుము.

59. (యజమాని ఉఖ మూతికి అంచును ఏర్పరచవలెను)

మేఖలా! నీవు ఉఖకు వడ్డాణము వంటిదానవు. ( యజమాని మూతిని తాకవలెను.)

ఉఖా! దేవమాత అదితి నీయొక్క మధ్య భాగమును స్వీకరించవలెను.

(కుండను నేల ీంద పెట్టవలెను.)

అదితి ఉఖను అందుకుని 'పుత్రులగు దేవతలారా! అగ్నిని యోనిని చేసి దీనిని కాల్చండి' అని అందించవలెను.

60. (ఎండిన గుర్రపు లద్దెచే ఉఖకు ఏడుసార్లు ధూపము వేయవలెను)

అంగిరుల వంటి వసుగణము నీకు గాయత్రీ ఛందపు ధూపము వేయవలెను. అంగిరుల వంటి రుద్ర గణము నీకు త్రిష్టుప్ ఛందపు ధూపము వేయవలెను. అంగిరుల వంటి ఆదిత్య గణము నీకు జగతీ ఛందపు ధూపము వేయవలెను. అంగిరుల వంటి - ిశ్వనేతలు - ిశ్వేదేవతలు నీకు అనుష్టుప్ ఛందపు ధూపము వేయవలెను. అంగిరుల వంటి ఇంద్ర, వరుణ యజ్ఞాధిదేవత ిష్ణువు - నీకు ధూపము వేయవలెను.

61. (కుండను కాల్చుటకు గాను అభ్రితో గొయ్యితీయవలెను)

గర్తా! ◌శ్వే దేవయుక్త అదితి, అంగిరుల సమానమగు నేల పైపొర నిన్ను త్రవ్వవలెను.

(గుంతలో కుండను బోర్లించవలెను.)

ఉఖా! దేవపత్నులు, ఓషధు లు, అంగిరసమగు పృథ్వీ పైపొర నిన్ను గుంతలో పెట్టవలెను.

(బోర్లించిన కుండ గోతిని మూసి - దక్షిణాగ్ని నుంచి తెచ్చిన అగ్నిచే అంటించవలెను.)

ఉఖా! ◌శ్వే దేవతల యుక్తవాణి - దేవపత్నులు - ధిష్ణలు - అంగిరస◌ం పృథ్వీ పై పొర నిన్ను పరిపక్వమగునట్లు చేయవలెను.

ఉఖా! ఛందస్సుల అభిమాన దేవేరులు - అంగిరసమ పృథ్వీ పై పొర - నక్షత్రముల అభిమాన దేవేరులు - నిన్ను గుంతలో చక్కగా కాలునట్లు చేయవలెను.

62. (కుండకాలిన తరువాత మూతను తీసివేయవలెను.)

◌ుత్రుడగు సూర్యుడు మానవ ప్రజను పోషించువాడు. దర్శనీయుడు. దేవతల సనాతన సంరక్షకుడు. అతనిని మేము ధనము, అన్నము యాచించుచున్నాము.

63. ఉఖా! సుందర హస్తములు, సుందర అంగుళులు, సుందర బాహువులు గల సూర్యుడు నిన్ను గర్తమునుండి బయటికి తీయునుగాత.

(ఉఖను తీసి ఊర్ధ్వ ముఖముగా నిలుపవలెను.)

ఉఖా! నీవు సూర్య దేవతచే తీయబడినావు. నీవు పృథ్వీ◌ంద అచలముగా నిలువుము. అన్ని దిశలు - ◌దిశలను ఆహుతులచే పూరింపుము.

64. ఉఖా! నీవు గుంత నుంచి బయటికి వచ్చినావు. మహిమగల దానవగుము. నీవు నీ కర్మమున నిమగ్నవగుము. నీవు స్వయముగనే గట్టిదానవు. పటుత్వము గల దానవు.

సర్వోపకారివగు స◌తృ దేవా! పగులకుండ చేయుటకు ఈ కుండను నీకు అర్పించుచున్నాను. దేవా! దీనిని పగులనీయకుము.

65. (ఉఖ ◌ంద మేకపాలు చల్లవలెను.)

ఉఖా! అంగిరుల వంటి వసుగణము గాయత్రీ ఛందమున నీపైరస సేచనము చేయవలెను. అంగిరసములగు రుద్ర గణములు త్రిష్టుప్ ఛందమున నీపై రస సేచనము చేయవలెను. అంగిరసములగు ఆదిత్య గణములు జగతీ ఛందమున నీపై రససేచనము చేయవలెను. అంగిరసములగు ◌శ్వే దేవతలు అనుష్టుప్ ఛందమున నీపై రససేచనము చేయవలెను.

66. (నాలుగవ అధ్యాయము యొక్క 7వ మంత్రమగు "ఆకూత్యే నుండి 5 ఔద్గ్రభణ ఆహుతులు ఇచ్చి ఈ ఏడు అగ్నిచయనసంబంధి ఔద్గ్రభణ ఆహుతులు ఇవ్వవలెను.)

అగ్నిచయన సంబంధి అనుష్టానమున మా సంకల్పమున ప్రయుక్తము చేయు అగ్నికి స్వాహా. మనసును, ధారణబుద్ధిని, స్వకర్మమున ప్రయుక్తము చేయు అగ్నికి స్వాహా. చిత్తమును , ఁజ్ఞానమునకు ప్రేరణ కలిగించు అగ్నికి స్వాహా. వాణి, ఁధృతికి ప్రేరణ కలిగించు అగ్నికి స్వాహా. ప్రజాపతి మరియు మనువునకు స్వాహా. ఁశ్వనేత అగ్నికి స్వాహా.

67. ఫలప్రదుడగు సఁతా దేవుని మైత్రిని అందరు కోరుదురు గాత. అందరు ధనమును

యాచింతురు. పోషకుడు. అన్నములు ప్రసాదించు సఁతకు స్వాహా.

68. (తూర్పునకు ముఖము చేసి నిలిచిన యజమాని ముంజి పరచిన ఆహవనీయ వేది ఁంద ఉఖను స్థాపించవలెను.)

ఉఖమాతా! నీవు పగిలి ముక్కలు, ముక్కలు కాకుము. నలిగిపోకుము, నీవు దృఢపడి అగ్నిధరణ రూపమగు ఁరకర్మము నివర్తించుము. మా అభీష్ట కర్మ ముగియు వరకు నీవు అగ్నిధారణ శక్తి కలిగి ఉండుము.

69. ఉఖా! నీవు మట్టిచే చేయబడినదానవు. మాకు శుభములు కల్గించుటకు నీవు గట్టి పడుము. అన్నమును ఆశించి, ప్రాణములు నిలుపు మాయచే నీవు నిర్మించబడినావు. నీలోన ఆహుతి అర్పించిన ద్రవ్యము దేవతలకు ప్రీతిపాత్రము కావలెను. నీవు ఈ యజ్ఞమున సర్వదా అక్షతవై నిలువుము.

70. (ఉఖలో అగ్ని ప్రజ్వలితమైనంత రచయిత సఁధలను వేయవలెను.)

వృక్షము అన్నముగా కలవాడును. ఘృతమున తృప్తి చెందువాడును - సనాతనుడు - దేవతల ఆహ్వాత - వరణీయుడు - బలపుత్రుడు - సర్వథా అద్భుతమగు అగ్ని ఈ సముధులను భస్మము చేయును గాత

71. (ఁకంకత వృక్ష సఁధలచే హోమము చేయవలెను.)

అగ్నీ! శత్రువుతో జరుగు యుద్ధమున మా ఁరులు నీరసించినపుడు వారికి జయము కల్గించుము. నేను స్వయముగా ఉన్న చోట వారిని రక్షింపుము.

72. (ఉఖలో ఔదుంబర సఁధలు వేయవలెను.)

అగ్నీ! నీవు రోహిత అశ్వములను ఎక్కుము. సుదూర స్వర్గాదుల నుండి శీఘ్రముగా మా యజ్ఞమునకు ఁచ్చేయుము. నీవు పశుహితకారిఁ. ఋత్విజ, యజమానాదులకు ప్రియుడవు.

ఇటకు వచ్చి మమ్ము రాక్షసాది హింసకుల బారి నుండి రక్షింపుము.

73. (ఎండికూలిన చెట్టు యొక్క సఁధలచే హోమము చేయవలెను.)

అగ్నీ! ఎండి కూలిన సమిధలను నీకు సమర్పించుచున్నాము. అవి నీకు ఘృతము వంటివి కావలెను. నిత్య తరుణ అగ్నీ! నీవు వానిని ఘృతమును వలెనే స్వీకరించుము.

74. (నేల మీద పడిన సమిధలు వేయవలెను.)

అగ్నీ! చీమల వంటి కీటకములు తిన్నవియు చెదలు పట్టినదియునగు సమిధలు నీకు ఘృత సమములు కావలెను. నిత్య తరుణ అగ్నీ! వాటిని ఘృతమును వలెనే స్వీకరింపుము.

75. (పలాశ సమిధలు వేయవలెను.)

అశ్వశాలలో కట్టిన అశ్వములకు నిత్యము - ఆలస్యము చేయక - గడ్డి, దాణా వేయబడును. అగ్నీ! అదే విధముగా నీకు సమిధలు సమర్పించుచున్నాము. మేము ధనపుష్టి - అన్న సమృద్ధి కలిగి - నీ ముందు కూర్చున్నాము. మేము ఎన్నటికి బాధించబడరాదు.

76. అగ్ని, పృథ్వి యొక్క నాభి యగు ఆహవనీయ వేది మీద నున్న ఉఖయందు సమిద్ధుడు.

హవిరన్నమున తృప్తి చెందువాడు. మహాస్తుతిమంతుడు. యజనీయుడు - యజనశీలుడు, యుద్ధములందు శత్రువులను పరాభవించువాడు.

అట్టి అగ్ని దేవుని - మాకు విస్తృత ధనలబ్ధికిగాను ఆహ్వానించుచున్నాము.

77. మా మీద దాడి చేయు శత్రుసేనలను - మా శరీరములను భేదించి బాధించు అస్త్ర శస్త్రములను - బలశాలి సేనా నాయకుల శత్రుసేనలను - దొంగలను - బందిపోట్లను అగ్నీ! నీ నోట పడ వేయుదుము.

78. మహాభాగ్యవంత అగ్నీ! దవడ పండ్లతో బందిపోట్లను - కోరలతో దొంగలను - మునిపండ్లతో తస్కరులను కొరికి ఉన్నప్పటికి చక్కగా నములుము.

79. గ్రామాదులందు ప్రవేశించి జనులను కొట్టి, నరికి, బంధించువారలను - అడవులందు దోపిడి దొంగలను - చెట్టు పుట్ట చాటున దాగి దాడి చేయు పాపాత్ములను అగ్నీ! నీ దవడలకు అందించెదను.

80. మా మీద శత్రుత్వము కలవారలున్నారు. మమ్ము ద్వేషించు వారలున్నారు. మమ్ము నిందించువారలున్నారు. వీరు కాక మమ్ము హింసించగోరు రాక్షసాదులున్నారు. అగ్నీ! అట్టివారిని అందరిని భస్మము చేయుము.

81. అగ్నీ! నేను పురోహితుడను. మంత్ర బలము కలవాడను. నీ దయ వలన నేను తీక్ష్ణుడను అయినాను. బల వీర్యములందు కూడ తీక్ష్ణుడను అయి సర్వదా విజయవంతుడైనాడు.

82. నేను నా మంత్రబలమున నా రాజు యొక్క సేనలందలి ీరుల బాహుబలమును ఎంతో పెంచినాను. వారి వర్చస్సును పెంచినాను. వారి బలమును పెంచినాను. అదికాక మంత్ర బలమున శత్రువును క్షీణింపచేసినాను. నేను నా వారిని ఉన్నతులను చేయువాడను.

(సింధామంత్రములు సమాప్తము)

83. అగ్నిదేవా! నీవు అన్నపాలకుడవు. అన్నదాతవు. రోగ రహితము, పుష్టికరమగు అన్నమునందలి నా భాగమున నాకు ప్రదానము చేయుము. అన్నదాతలున్నారే - వారిని ఆపదల నుండి దాటించుము. మానవులకు, పశ్వాదులకు అన్నాది ఖాద్య పానములను ఏర్పరచుము - బలవీర్యములను బుద్ధిని ప్రసాదించుము.

## దాశరథి రంగాచార్య విరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## ఉఖాది సింధాద్యంతమను పదకొండవ అధ్యాయము సమాప్తము.

## సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం స్సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## పన్నెండవ అధ్యాయము

1. దృశానో రుక్మా ఉర్వ్యా వ్యద్యౌ ద్దుర్మర్షమాయుః శ్రియే రుచానః ।

అగ్నిరమృతో అభవద్వయోభిర్యదేనం ద్యౌరజనయత్సురేతాః ॥

(యజమాని 'రుక్మము' అను బంగారు హారమును మెడలో వేసుకుని ఈశాన్య ముకుడై నిలుచును)

సూర్యుడు మహాజ్యోతి. ప్రకాశమానుడు. దృశ్యమానుడు. అదిగో సూర్యుడు తూర్పున ఉదయించినాడు. ఇతని దినాంత జీవనము సర్వదా దుర్ధర్షము. ఇతడు శోభించుటకు దీప్తిని దాల్చును. సువీర్య ద్యులోకము సూర్యుని ప్రకటించినపుడే అగ్ని అమృతుడైనాడు.

2. సమచిత్తము, సమభావమున తమతమ కాలయాత్రను జరుపువారును. తెలుపు, నలుపు పరస్పర విరుద్ధవర్ణముల వారును అగు రాత్రింబవళ్లు ఒక అగ్ని శిశువునకు తమస్తన్యమును ఇత్తురు. ఈ వెలుగులు ఎజగిమ్ము సూర్యుడు ద్యావాపృథ్వుల మధ్య వెలుగును. అప్పుడు ధనములను ఇచ్చు దేవగణములు ఈ అగ్నిని తమలో దాల్చెదరు.

అధిపతిఛందోరూపమునప్రజాపతి ఆ వయసువాడైఅధిపతి పశువునుమరల సాధించినారు.వయస్య ఇష్టకా! అధిపతిఛందోరూప ప్రజాపతిరూపమవగు నిన్నుద్వితీయకుండమునచేర్చుచున్నాను.

పరిమేష్ఠిస్వరూపమున ప్రజాపతిఆ వయసువాడై పరమేష్ఠిపశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! పరమేష్ఠిప్రజాపతి రూపవగునిన్ను ద్వితీయకుండమున చేర్చుచున్నాను.

ఏకపదఛందోరూపమునప్రజాపతి ఆ వయసుదాల్చి మేషపశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! మేషంశాల ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

ంశాలఛందోరూపమునప్రజాపతి ఆ వయసుదాల్చి మేషపశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! మేషంశాల ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునేచేర్చుచున్నాను.

తంద్రఛందోరూపమునప్రజాపతి ఆ వయసువాడైపురుషపశువును మరలసాధించినాడు. వయస్యఇష్టకా! పురుషతంద్ర ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

అనాధృష్టఛందోరూపమునప్రజాపతి ఆ వయసుదాల్చి వ్యాఘ్రుపశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! వ్యాఘ్రుఅనాధృష్ట ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

ఛదిఛందోరూపమునప్రజాపతి ఆ వయసుదాల్చి సింహ పశువునుమరల

సాధించినాడు.వయస్య ఇష్టకా! సింహఛదిఛందోరూపమునఉన్న నిన్ను రెండవకుండమున చేర్చుచున్నాను.

వయశ్ఛదిఛందోరూపమునప్రజాపతి ఆ వయసుదాల్చి నేపృష్ఠవాహపశువును మరలసాధించినాడు. వయస్యఇష్టకా! నేపృష్ఠ వాహవయశ్ఛది ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

కురుప్ఛందోరూపమునప్రజాపతి ఆ వయసువాడై సేచన సమర్థపశువులనుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! సేచనసమర్థ పశు, కకుప్ ఛందోరూపవగు నిన్ను ద్వితీయచితి యందు చేర్చుచున్నాను.

బృహతీఛందో రూపమునప్రజాపతి పూర్ణాయువైమరల ఆంర్భంంచినాడు.వయస్య ఇష్టకా! ప్రజాపతిస్వరూపమవగు నిన్నురెండవ కుండమునచేర్చుచున్నాను.

10.పంక్తి ఛందోరూపమునప్రజాపతి ఆ వయసువాడైఅనడ్వాహమునుమరల సాధించినాడు.

వయస్యఇష్టకా! పంక్తి ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

జగతీఛందోరూపమునప్రజాపతి ఆ వయసువాడై ధేనువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! జగతీఛందోరూపమవగునిన్ను రెండవ చితియందుచేర్చుచున్నాను.

త్రిష్టుప్ఛందోరూపమునప్రజాపతి తదాయువైత్ర్యఁపశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! త్రిష్టుప్ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

ఁరాటఛందోరూపమునప్రజాపతి రెండేళ్లవాడయిద్వివర్షీయ పశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! ఁరాటఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

గాయత్రీఛందోరూపమునప్రజాపతి రెండున్నరయేళ్లవాడైరెండున్నరయేళ్లపశువును మరలసాధించినాడు. వయస్యఇష్టకా! గాయత్రీ ఛందోరూపమవగునిన్ను రెండవకుండమునచేర్చుచున్నాను.

ఉష్ణిక్ఛందోరూపమునప్రజాపతి మూడేండ్లపశువును మరలసాధించినాడు. వయస్యఇష్టకా! ఉష్ణిక్ ఛందోరూపమవగునిన్ను రెండవ కుండమునచేర్చుచున్నాను.

అనుష్టుప్ఛందోరూపమునప్రజాపతి నాలుగేండ్లవాడైనాలుగేండ్ల పశువునుమరల సాధించినాడు.వయస్య ఇష్టకా! అనుష్టుప్ఛందోరూపమవగునిన్ను రెండవకుండమునచేర్చుచున్నాను.

## రెండవచితి- కుండము - సమాప్తము

11.(స్వయమాతృణ్ణనామక ఇటుకను అందుకొనవలెను)

ఇంద్రాగ్నులారా!అచలమగు ఈ ఇటుకనుమూడవకుండమునచేర్చండు,

స్వయమాతృణ్ణఇష్టకా! నీవు చితిలోచేర్చబడుదానవు.నీ ఁద గల ఇతర ఇటుకలనుభరించుదానవు.ద్యావాపృథ్వీ అంతరిక్షములనువహించు దానవగుదువు.

12.స్వయమాతృణ్ణఇష్టకా! నీవు అవకాశముగలదానవు. ఁస్తారమవు.స్వయముగా ప్రజాపతియేనిన్ను మూడవకుండమున స్థాపించునుగాత. నీవు ఈ మూడవచితికి నియంతవు.ఈ మూడవ కుండమునదృఢపరచుము.ఈ మూడవ కుండమునుముక్కలు కానీయకుము.సమస్త ప్రాణ, అపాన,వ్యాన, ఉదాన సమానములందును- గృహస్థిత, యజ్ఞాదికర్మములందునుప్రతిష్టించబడుదానవు.ఈ మూడవ చితియందు ప్రతిష్టించబడిననిన్ను అంతరిక్షదేవతయగువాయువు సర్వదా రక్షించునుగావుత. అతడు సకలయోగక్షేమయుక్తుడైశాంతితేజముననిన్ను రక్షించునుగావుత.

ఇష్టకే!నీవు వాయు దేవతచేరక్షించుబడుదానవు.పూర్వము అంగిరుల మూడవకుండమునదృఢముగా నిలిచినావు.అట్లే మా తృతీయచితియందు దృఢముగానిలుపుము.

13.(పంచ దిశ్యాసంజ్ఞకాఇష్టకా ఉపదధాతి, 'దిశ్య'యను పేరుగల అయిదుఇటుకలను పేర్చును)

దిశ్యఇష్టకే! నీవు ప్రాగ్దిశకు రాజ్ఞి.ఆ రూపమున నిన్ను మూడవకుండమున చేర్చుచున్నాను.నీవు దక్షిణ దిశకుసామ్రాజ్ఞి. ఆ రూపముననిన్ను మూడవకుండమున చేర్చుచున్నాను.పశ్చిమదిశకు స్వరాట్టువు,నిన్ను ఆ రూపమున మూడవకుండమున చేర్చుచున్నాను.పశ్చిమదిశకు దిగధిపత్ని.నిన్ను ఆరూపమున మూడవకుండమున చేర్చుచున్నాను.ఊర్ధ్వ దిశకు అధిపత్ని.నిన్ను ఆ రూపమున మూడవకుండమున చేర్చుచున్నాను.

14.(ప్రథమోపిహితాయాంశ్వజ్యోతిషఉపరి శ్వజ్యోతిషఇష్టకాముపదధాతి.మొదట పేర్చినశ్వజ్యోతిషమనుఇటుకపైద మరొక శ్వజ్యోతిషఇటుకను చేర్చవలెను)

మూడవకుండమున శ్వజ్యోతిషఇష్టకా! స్వయముగా ప్రజాపతియేనిన్ను శ్వజోతిషఇటుక పైపుపైద చేర్చునుగావుత.సమస్త ప్రాణ, అపాన,వ్యాన, ఉదాన, సమానములనుధృఢపరచుటకునీవు ఈ మూడవకుండమునగట్టి పడుము.దీనిని పూర్తిగా నియంత్రించుమువాయువు నీకు అధిదేవతయగును.ఆ వాయుదేవతచేఅనుజ్ఞాతవై పూర్వమునీవు అంగిరుల తృతీయకుండమున స్థిరపడినావు.అట్లే మా ఈ తృతీయకుండమున స్థిరపడుము.

15.శ్రావణ భాద్రపదములువర్షర్తువులు. ఇష్టకా!నీవు ఈ కుండమునుకూర్చుదానవు. గట్టిపరచుదానవు. ఈ కుండమునచేయు యజ్ఞములనుసఫలము చేయుము.ద్యావాపృథ్వులను- జలములను- ఓషధులను మాకుఅనుకూలము చేయుము.ఇందలి ఇటుకలన్నియుయజమానికి ఒకేరీతిగాశుభములు సమకూర్చవలెను.అం నా జ్యేష్ఠతకుఅనుకూలములు కావలెను.ద్యావాపృథ్వులందు- సమానప్రీతి గల- అగ్నులు ఉన్నం. అం యజమానియొక్క ఇటుకలనువర్షర్తు సమముగాభాంచవలెను.దేవతలు ఇంద్రునిశ్రేష్ఠునిగా భాంచిశరణువేడుదురు. అట్లేఆ ఇటుకలు యజమానినగునాలో ప్రవేశించవలెను.దేవతలచేఅనుజ్ఞాతవై ఇష్టకా!పూర్వము

నీవుఅంగిరుల కుండమునస్థిరపడినావు. అట్లేమా ఈ తృతీయ కుండమునస్థిరపడుము.

16.(అపరే ఋతవ్యే పూర్వయోపరిదధాతి - తదుపరిపూర్వపు వానిపైన ఋతవ్యఇటుకలను పేర్చుము)

అశ్వీయుజకార్తీకములు శరదృతువగును.ఋతవ్య ఇటుకలారా!పరు ఈ కుండమును కూర్చువారలు.శరదృతువు వలెద్యావాపృథ్వులనుమాకు అనుకూల

పరచుడు.జలములను,ఓషధులను అనుకూలపరచండి.ఇటుకలు సమానశుభకర్మ లై -నా జ్యేష్ఠతనుబలపరచవలెను.ఒకే ిధమగు ఇటుకలుప్రథమ, ద్వితీయకుండములందు ఉన్న ి.అ ి ఈ ఋతవ్య ఇటుకలనుశరదృతువు వలెఆశ్రయించవలెను.అదెట్లన సకలదేవతలు ఇంద్రునిఆశ్రయించినరీతి.

ఋతవ్యఇటుకలారా! శరదధిష్ఠాతదేవత వలనఅనుజ్ఞాతులై- అంగిరుల కుండమునస్థిరపడిన రీతి మాతృతీయ కుండమునస్థిరపడండి.

17.దశ ప్రాణభృతఇష్టకలారా! నా ఆయువునురక్షించండి. నా ప్రాణమునురక్షించండి. నా అపానమునురక్షించండి. నా వ్యానమునురక్షించండి. నా కన్నులనురక్షించండి. నా చెవులనురక్షించండి. నా వాక్కునుసఫలము చేయండి.నా మనసును ప్రసన్నముచేయండి. నా ఆత్మనురక్షించండి. నాకు జ్యోతినిప్రసాదించండి - "జ్యోతిర్మేయచ్ఛ"

18.(పక్ష, పృచ్ఛసంధులందుపన్నెండేసి ఛందస్యఇటుకలను పేర్చవలెను)

ఇష్టకా!ఈ భూలోకము ' మా'ఛందము. అంతరిక్షము'ప్రమా' ఛందముద్యులోకము 'ప్రతిమా'ఛందము. లోకత్రయమునుండిలభించు అన్నమే'అస్రీ వయ' ఛందము- ఉష్ణిక్ ఛందము- పంక్తి ఛందము- బృహతీ ఛందము- అనుష్టుప్ ఛందము- ిరాట్ - ఛందము- గాయత్రి ఛందము- త్రిష్టుప్ ఛందము- జగతీ ఛందము.నీవు మా, ప్రమా, ప్రతిమామున్నగు ఛందమవు.నిన్ను తృతీయకుండమున చేర్చుచున్నాను.

19.పృథి ి ఛందో న్తరిక్షంఛందో ద్యౌశ్ఛందఃసమాశ్ఛందో నక్షత్రాణిఛన్దో వాక్ ఛందోమనశ్ఛందో హిరణ్యంఛన్దో గౌశ్ఛన్దో ిజా ఛన్దో శ్వశ్ఛ ిన్దః

20.అగ్ని ర్దేవతా వాతోదేవతాసూర్యోదేవతా చన్ద్రమాదేవతావసవో దేవతారుద్రా దేవతా ఆదిత్యదేవతా మరుతోదేవతా ిశ్వేదేవా దేవతాబృహస్పతిర్దేవతేన్ద్రోదేవతా వరుణోదేవతా.

21.(వెంట్రుకంత ఎడముఉండుకుండునట్లుఏడు 'అపర' ఏడు 'పర' ఇష్టకములనుపేర్చును)

రెండుచేతులు , రెండుభుజములు,ఒకమెడ ,ఒకతల ,ఒకనాభి అను ఏడు ప్రాణములు'అపర' అగును. రెండు ఊరువులు, రెండు జంఘలు , రెండుజానువులు ,ఒకనాభికింది భాగమునఏడు ప్రాణములు'పర' అగును.

వాలఖిల్యఇష్టకా! నీవు మూర్ధవు.నీవు దృఢమవు.నీవు లోకములనుభరించుదానవు.భూ ిని ఆయుష్యముకొరకు - బ్రహ్మవర్చస్సుకొరకు - కృషి కొరకు - యోగక్షేమములకొరకు నిన్ను తృతీయకుండమున పేర్చుచున్నాను.

(వెంట్రుకంతసందులేకుండ చేయునదివాలఖిల్యము)

22.ఇష్టకా! నీవు నియమయుక్తముగా ిరాజమానవు. నియంత్రించబడిననీవు అన్యులనునియంత్రించు దానవు.స్థిరపడుము. అచలవగుము.అన్నము కొరకు -

బలముకొరకు- అశ్వగోధనము కొరకు- పోషణ కొరకు నిన్ను తృతీయకుండమున చేర్చుచున్నాను.

23. (నాలుగవ చితి చయనము ప్రారంభము. పద్ధెనిఁది యజుస్సులచే పద్ధెనిఁది ఇటుకలను చేర్చుదురు)

ఇష్టకా! నీవు వ్యాపనశీల త్రివృత్ స్తోమవు. ఆ రూపవగు నిన్ను చతుర్థ కుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! నీవు వజ్రరూపమగు పంచదశస్తోమవవు. ఆ రూపమగు నిన్ను చతుర్ధకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! సంవత్సరమే సప్తదశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్ధకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! ఆదిత్యుడే నవదశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్థచిత యందు చేర్చుచున్నాను.

ఇష్టకా! 12నెలలు + 5ఋతువులు + ఒక స్నయముతో కూడిన సంవత్సరమే అష్టాదశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్ధకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! పందొఁమ్మది అంగముల తపనశీల సంవత్సరమే నవదశస్తోమమగును ఆ రూపవగు నిన్ను చతుర్థచితి యందు చేర్చుచున్నాను.

ఇష్టకా! సర్వమును ఆవర్తనము చేయించు ఇరువది అవయవముల సంవత్సరమే సఁంశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్ధకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! అత్యంత బలశీలయై ఇరువది రెండు అవయవముల సంవత్సరమే ద్వాఁంశస్తోమమగును. ఆరూపవగు నిన్ను చతుర్థచితి యందు చేర్చుచున్నాను.

ఇష్టకా! అందరిని పోషించి పాలించి ఇరువది మూడు అవయవముల సంవత్సరమే త్రయోఁంశత్సోమమగును. ఆ రూపవగు నిన్ను చతుర్థ కుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! సకల ఉత్పత్తికి కారణ భూతమగు కాలమునకు ఆధార భూతమగు ఇరువది నాలుగు అవయవముల సంవత్సరమే చతుర్వింశ స్తోమమగును. ఆ రూపవగు నిన్ను చతుర్థ చితియందు పేర్చుచున్నాను.

ఇష్టకా! సోమమునకు గర్భ స్వరూపమై పదమూడవ మాసమై సకల ఋతువులకు గర్భ స్వరూపమగు సంవత్సరమే పంచ ఁంశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్థ కుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! అత్యంత తేజస్వి. వజ్ర స్వరూపమగు ఇరువది యేడు అవయవముల సంవత్సరమే త్రినవ స్తోమమగును. ఆ రూపవగు నిన్ను చతుర్థ చితి యందు చేర్చుచున్నాను.

ఇష్టకా! సర్వభూతకర్తయగు సంవత్సరమే యజ్ఞములందు అత్యంత ఉపయోగకారకమగు ఏకత్రింశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్థకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! అందరను తనయందు చేర్చుకొను ముప్పదిమూడు అవయవముల సంవత్సరమే త్రయస్త్రింశ స్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్థచితి యందు చేర్చుచున్నాను.

ఇష్టకా! సూర్యునకు స్వరాజ్యపట్టము కట్టునదియు ముప్పదినాలుగు అవయవములు గల సంవత్సరమే చతుస్త్రింశ స్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్థకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! దుఃఖము నెరుగని ముప్పదియారు అవయవముల సంవత్సరమే ప్రట్త్రింశస్తోమమగును. ఆ రూపవగు నిన్ను నాలుగవ చితియందు చేర్చుచున్నాను.

ఇష్టకా! భూతములను ఆవర్తన - ంవర్తనము చేయు నలుబదిఎనిఁది అవయవముల సంవత్సరమే అష్టాచత్వారింశస్తోమము. ఆ రూపవగు నిన్ను చతుర్థకుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! జగములకు ఆధారభూతమును - నాలుగుదిక్కులచే స్తుతించబడునట్టి త్రివృత్, పంచదశ, సప్తదశ, ఏకంింశతో్సమ సమూహమే చతుష్టోమమగును. ఆ రూపవగు నిన్ను నాలుగువ చితియందు చేర్చుచున్నాను.

25. ఇష్టకా! నీవు వసువుల భాగమవు. నీపై రుద్రుల ఆధిపత్యము కలదు. చతుర్వింశస్తోమమున నీవు గవాది చతుష్పాత్తులను రక్షించినావు. అటువంటి నిన్ను నాలుగవ కుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! నీవు ఆదిత్యుల భాగమవు. నీపై మరత్తుల ఆధిపత్యము కలదు. పంచంింశస్తోమమున నీవు సకల ప్రాణుల గర్భములను మృత్యువునుండి రక్షించినావు. అట్టి నిన్ను నాలుగవ చితియందు చేర్చుచున్నాను.

ఇష్టకా! నీవు అదితి - పృథ్వి - భాగమవు. నీపై పూష ఆధిపత్యము ఉన్నది. త్రిణవస్తోమమున నీవు ఓజోబలమును రక్షించినావు. అట్టి నిన్ను నాలుగవ కుండమున చేర్చుచున్నాను.

ఇష్టకా! నీవు సంత భాగమవు. నీపై బృహస్పతి ఆధిపత్యము ఉన్నది. నీవు చతుష్టోమ సోమమున సర్వసంచారయోగ్య దిశలను రక్షించినావు. అట్టి నిన్ను నాలుగవ చితియందు చేర్చుచున్నాను.

26. ఇష్టకా! నీవు పూర్వపక్షముల భాగమవు. నీపై అపరపక్షముల ఆధిపత్యము ఉన్నది. చతుశ్చత్వారింశ స్తోమమున నీవు ప్రజలను రక్షించినావు. అట్టి నిన్ను నాలుగవ కుండమున చేర్చుచున్నాను.

ఇంద్రుని నీవు ఋతువుల భాగమవు. నీపై ిశ్వేదేవతల ఆధిపత్యము ఉన్నది. త్రయస్త్రింశ స్తోమమున నీవు భూతజాతములను రక్షించినావు. అట్టి నిన్ను నాలుగవ చితియందు చేర్చుచున్నాను.

27. (రెండు ఋతవ్య ఇటుకలను పేర్చును)

మాఘపుష్యములు హేమంతపు అవయవములు. ఋతవ్య ఇష్టకా! నీవు చితిలోపలి భాగమును దృఢపరచుదానవు. ద్యావాపృథ్వులను, జలములను, ఓషధులను నాకు అనుకూలములను చేయుము. ుగత అన్ని ఇటుకలతో కలసి ప్రీతికరమవగుము. నాకు జ్యేష్ఠత్వమును సిద్ధింపచేయుము. మూడవ, నాలుగవ కుండములందున్న ఇటుకలన్నియు ఈ

రెండు ఋతవ్య ఇటుకలను హేమంత ఋతువుగా భాంచి ఇతర దేవతలు ఇంద్రునివలె - ినిని ఆశ్రయించవలెను. ఇష్టకలారా! ీరు హేమంతాభిమాన దేవతచే అనుజ్ఞాతలై - పూర్వము అంగిరుల చితియందు స్థిరపడిన రీతి ఈ నాలుగవ కుండమున స్థిరపడండి.

28. ('సృష్టి' యనుపేరుగల పద్దెనిుది ఇటుకలను పేర్చవలెను)

ప్రజాపతి ఒకేవాణిచే పరమాత్మను స్తుతించినాడు. అప్పుడు ప్రజలు పుట్టినారు. అప్పుడు ఆ ప్రజలకు ప్రజాపతి స్వాు అయినాడు.

ప్రజాపతి ప్రాణ, ఉదాన, వ్యానములచే స్తుతించినాడు. అప్పుడు బ్రాహ్మణులు పుట్టినారు బ్రాహ్మణుల అధిపతి బ్రహ్మణస్పతి అయినాడు.

ప్రజాపతి నాలుగు ప్రాణములచే ఒకమనస్సును స్తుతించినాడు. అప్పుడు ఇతర ప్రాణులు పుట్టినం. ఆ ప్రాణులకు అధిపతి భూతపతి అయినాడు.

ప్రజాపతి ఏడుతలల ప్రాణులచే స్తుతించినాడు. అప్పుడు సప్తర్షులు అవతరించినారు. వారి అధిపతి ధాత అయినాడు.

29. ప్రజాపతి ఏడుతలల - రెండు నిమ్నస్థప్రాణులచే స్తుతించినాడు. అప్పుడు పితరుల సృష్టిజరిగినది. వారి అధిపతి అదితి అయినది.

ప్రజాపతి పదకొండు ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు ఋతువులు ఉత్పన్నములు అయినం. వాని అధిపతి ఋతువుల అధిష్టాన దేవత అయినాడు.

ప్రజాపతి పదమూడు ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు పన్నెండుమాసములును, అధికమాసము ఉత్పన్నములైనవి. వానికి అధిపతి సంవత్సరము అయినది.

ప్రజాపతి పదిహేను ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు క్షత్రియులు పుట్టినారు. వారికి అధిపతి ఇంద్రుడు అయినాడు.

ప్రజాపతి పదిహేడు ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు గ్రామ్యపశువులు పుట్టినవి. వాటికి అధిపతి బృహస్పతి అయినాడు.

30. ప్రజాపతి పందొమ్మిది ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు శూద్రులు,వైశ్యులు పుట్టినారు. వారికి అధిపతి అహోరాత్రములు అయినవి.

ప్రజాపతి ఇరవదియొక్క ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు ఏకఖుర - ఒకేగిట్టగల - జంతువులు పుట్టినవి. వానికి అధిపతి వరుణుడు అయినాడు.

ప్రజాపతి ఇరువది మూడు ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు క్షుద్ర పశువులు పుటినవి. వానికి అధిపతి పూష అయినాడు.

ప్రజాపతి ఇరువది అయిదు ప్రాణములచే స్తుతించినాడు. అడవి జంతువులు పుట్టినవి. వానికి అధిపతి వాయువు అయినాడు.

ప్రజాపతి ఇరువది ఏడు ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు ద్యావాపృథ్వులు వేరైనవి. వసు, రుద్ర, ఆదిత్యులు వేరగుటకు తోడ్పడినారు. వారే ద్యావాపృథ్వులకు అధిపతులైనారు.

31. ప్రజాపతి ఇరువది తొమ్మిది ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు అశ్వత్థము మున్నగు వనస్పతులు పుట్టినవి. వానికి అధిపతి సోమము అయినది.

ప్రజాపతి ముప్పదియొక్క ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు ప్రజలు పుట్టినారు. వారికి అధిపతులు పూర్వ, అపరపక్షములు అయినవి.

ప్రజాపతి ముప్పదిమూడు ప్రాణములచే స్తుతించినాడు. అప్పుడు సకల భూతములు సుఖశాంతులు పొందినవి. పరమ స్థానమున నిలిచిన ప్రజాపతియే వానికి అధిపతి అయినాడు.

(తదుపరి మూడు లోకంపృణ ఇటుకలు పేర్చవలెను)

## వర్ణ్య ద్విత్రిశ్చతుశ్చితమను పదునాలుగవ అధ్యాయము సమాప్తము.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

అధారం స్సర్వ ిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

## పదిహేనవ అధ్యాయము

1. అగ్నే జాతా న్ప్రణుదా నః సపత్నా న్ప్రత్యాజాతాన్నుద జాతవేదః ।

అధి నో బ్రూహి సుమనా అహేడస్తవ స్యామశర్మం స్త్రివరూథ ఉద్భౌ ॥

(ఈ అధ్యాయము అయిదవ కుండమునకు సంబంధించినది. తొలుత అయిదు అసపత్న, ఇటుకలను పేర్చవలెను.)

అగ్నీ! ఇప్పటికే పుట్టిన మా శత్రువులను సప్రకర్షముగ నష్టపరచుము. జాతవేద అగ్నీ! పుట్టనున్న మా శత్రువులను సహితము నష్టపరచుము. క్రోధములేని ప్రసన్న మనమున మాకు యజ్ఞిద్యను ఉపదేశించుము. మేము నీ పరిచర్య చేయుచు సదః -హిర్ధాన - అగ్రీధ్రములను త్రిభాగయుక్తమగు, సుఖసమృద్ధులు కలిగించు - నీ యొక్క యజ్ఞగృహమున నిత్యనివాసము చేయుదుము గాక.

2. అగ్నీ! సాహససేనలు గల మా శత్రువును నష్టపరచుము. జాతవేదాగ్నీ! పుట్టనున్న మా శత్రువులను సహితము నష్టపరచుము. నీవు ప్రసన్నుడవగుము. మమ్ము నీ వారలమని వచింపుము. మేము సుమనస్కులము కావలెను. సుమనస్యమానో వయం. మా శత్రువులనందరును తపింపచేయు.

3. ఇష్టకా! నీవు పదహారు కళలపక్షమవు. బలధనస్వరూపవు. నిన్ను ఈ అయిదవ చితియందు చేర్చుచున్నాను.

ఇష్టకా! నీవు చతుశ్చత్వారింశస్తోమవవు. బ్రహ్మవర్చ రూపధనమవు. నిన్ను ఈ అయిదవ కుండమునందు చేర్చుచున్నాను.

ఇష్టకా! నీవు అభక్షక అగ్నిి. చంద్రునకు పదహారుకళలు కలిగించుదానవు. నిన్ను ఈ అయిదవ చితియందు చేర్చుచున్నాను.

ఇష్టకా! నిన్ను ిశ్వేదేవతలు సంస్తుతింతురు గాత. స్తోమములు, పృష్ఠములు, హోమములందు ఉపయుక్తమగు ఘృతయుక్తవై ఇచట స్థిరపడుము. మమ్ము పుత్రవంతులను, ధనవంతులను చేయుము.

4. (ప్రతిదిశల దశదశ ఁరాట సంజ్ఞా ఇష్టకా ఉపదధాతి. ప్రతివైపు పదిపది చొప్పున ఁరాటములను ఇటుకలను చేర్చును.)

ఇష్టకా! సకల ప్రాణుల రాకపోకల ఈ భూలోకమే ఏవ ఛందస్సు. నీవు ఏవ ఛందస్వరూపవు. నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! ప్రభామండలమున ఁరాజిల్లు అంతరిక్షలోకమే 'వరివ' ఛందము నీవు 'వరివ' ఛందస్వరుపవు. నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! సకలమునకు సుఖకారకమగు ద్యులోకమే 'శంభూ' ఛందము. నీవు ఆ ఛందస్వరూపవు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! పరితమున ఁరాజిల్లు దిశలే 'పరిభూ' ఛందము. నీవు ఆ ఛందస్వరుపవు. నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! తనరసమున శరీరమున నిలుపు అన్నమే 'అచ్ఛ' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! ప్రజాపతియే మనశ్ఛందము. ఆ 'ఛందో' రూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! సర్వజగములను వ్యాపించిన సూర్యుడే 'వ్యచ' ఛందము. ఆ ఛందోరూపమగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! శరీరమును నిలుపు ప్రాణమే 'సింధు' ఛందము. ఆ ఛందో రూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! మనసే 'సముద్ర' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! నాలుకనుండి వెలువడు 'వాక్కు' 'సరిర' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! ప్రాణమే 'కకుప్' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! త్రాగిన నీటిని మూడు ఁధములుగా ధరించు ఉదానమే 'త్రికతుప్' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! వేదత్రయియే 'కావ్య' ఛందస్సు. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము

చేయుచున్నాను.

ఇష్టకా! వంకర నడకల జలమే 'అంకుప్' ఛందము. ఆ ఛందో రూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! క్షయరహితమగు ద్యులోకమే 'అక్షరపంక్తి' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! ఈభూలోకమే 'పదపంక్తి' ఛందము. ఆ ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! వస్తువుల ◌స్తారయుక్త దిశలే '◌స్తారపంక్తి ' ఛందము. తచ్ఛందోరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! తీవ్రజ్వాలల సూర్యుడే 'క్షురోభ్రజ ' ఛందము. తచ్ఛందో రూపమగు నిన్ను చయనము చేయుచున్నాను.

5. అన్నమే ఆచ్ఛచ్ఛందము. అన్నమే ప్రచ్ఛచ్ఛందము. రాత్రియే సంమచ్ఛచ్ఛందము. పగలే ◌యచ్ఛందము. ద్యులోకము బృహచ్ఛందము. భూమండలమే రథన్తరచ్ఛందము. వాయువు నికాయచ్ఛందము. అంతరిక్షమే ◌◌ధచ్ఛందము. అన్నమే గిరశ్ఛందము. అగ్నియే భ్రజశ్ఛందము. వాక్కు సంస్తుప్ - అనుష్టుప్ ఛందము. పృథ్వియే ఏవశ్ఛందము. అంతరిక్షము బరివశ్ఛందము. అన్నమే వయశ్ఛందము. జఠరాగ్నియే వయస్కృచ్ఛందము. భూతలమే ◌శాలచ్ఛందము. అంతరిక్షము ఛదిశ్ఛందము. ఆదిత్యుడే దురోహణశ్ఛందము. పంక్తియే తంద్రచ్ఛందము. జలమే అంకాంకచ్ఛందము.

ఇష్టకా! తత్స్వరూపవగు నిన్ను చయనము చేయుచున్నాను.

6. (సర్వదిక్షు స్తోమభాగా సంజ్ఞాఇష్టకా ఉపదధాతి - నలుదిక్కులందు స్తోమభాగమను ఇటుకలను పేర్చును)

ఇష్టకా! తేజోవృద్ధిచేయు ద్వారా సత్యము కొరకని వేదియందు చేర్చబడినావు. సత్యమును కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా ధర్మము కొరకు చేర్చబడినావు. ధర్మమును కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా ద్యులోకము కొరకు చేర్చబడినావు. ద్యులోకమును కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా అంతరిక్షము కొరకు చేర్చబడినావు. అంతరిక్షమును కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా పృథ్వి కొరకు చేర్చబడినావు. పృథ్విని కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా సృష్టి కొరకు చేర్చబడినావు. సృష్టిని కాపాడుము.

ఇష్టకా! దినము కొరకు చేర్చబడినావు. దినమును కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా రాత్రి కొరకు చేర్చబడినావు. రాత్రిని కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా వసువుల కొరకు చేర్చబడినావు. వసువులను కాపాడుము.

ఇష్టకా! అన్నము ద్వారా ఆదిత్యుల కొరకు చేర్చబడినావు. ఆదిత్యులను కాపాడుము.

7. ఇష్టకా! అన్నము ద్వారా గో - అశ్వధనము కొరకు చేర్చబడినావు. గో- అశ్వధనమును వర్ధిల్లచేయుము.

ఇష్టకా! అన్నము ద్వారా శాస్త్రజ్ఞానము కొరకు చేర్చబడినావు. శాస్త్రజ్ఞానమును వర్ధిల్లచేయుము.

ఇష్టకా! అన్నము ద్వారా ఓషధుల కొరకు చేర్చబడినావు. ఓషధులను వర్ధిల్లచేయుము.

ఇష్టకా! అన్నము ద్వారా శరీరము కొరకు చేర్చబడినావు. శరీరమును వర్ధిల్లచేయుము.

ఇష్టకా! అన్నము ద్వారా అధ్యయనము కొరకు చేర్చబడినావు. అధ్యయనమును వర్ధిల్లచేయుము.

ఇష్టకా! అన్నము ద్వారా తేజస్సు కొరకు చేర్చబడినావు. తేజస్సును వర్ధిల్లచేయుము.

8. ఇష్టకా! నీవు అన్నస్వరూపవు. అన్నము కొరకు నిన్ను చయనము చేయుచున్నాను. నీవు

అనుపదస్వరూపవు. అనుపదము కొరకు నిన్ను చయనము చేయుచున్నాను. నీవు సంపత్

స్వరూపవు. సంపదకొరకు నిన్ను చయనము చేయుచున్నాను. నీవు తేజోస్వరూపవు. తేజస్సు కొరకు నిన్ను చయనము చేయుచున్నాను.

9. ఇష్టకా! నీవు 'త్రివృద్' స్వరూపవు. త్రివృద్ ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను. నీవు ప్రవృద్ స్వరూపవు. ప్రవృద్ కొరకు నిన్ను చయనము చేయుచున్నాను. నీవు ◌వృద్ స్వరూపవు. ◌వృద్ ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను. నీవు సువృద్ స్వరుపవు. సువృద్ ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను. నీవు 'అక్రమ్' స్వరూపవు. అక్రమ్ ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను. నీవు సంక్రమ్ స్వరూపవు. సంక్రమ్ ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను. నీవు ఉత్క్రమ స్వరూపవు. ఉత్క్రమము ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను. నీవు ఉత్క్రాన్తి స్వరూపవు. ఉత్క్రాన్తి ని◌ుత్తము నిన్ను చయనము చేయుచున్నాను.

ఇష్టకా! నీవు అధిపతివయ మాబల ీర్యములను వర్ధిల్లచేయుము.

10. (తూర్పును వదిలి ుగిలినమూడు దిశలందు 'నాకసద్' నామక ఇటుకలను కూర్చవలెను)

ఇటుకా! శోభనమనస్కవగు నీవు ప్రాచీదిశవు. నిన్ను పాలించు వారు వసువులు. శత్రువుచే ప్రయోగించబడిన శస్త్రాస్త్రముల నివారణ కర్త అగ్ని అగును. త్రివృత్సోమము నిన్ను పృథ్వీుద నిలుపును. రథన్తరసామము నిన్ను అంతరిక్షమున నిలుపుము. సప్తప్రాణములు - ద్యులోకమును ుస్తరించినరీతి - నిన్ను దేవతలందు నిలుపవలెను. ధారకవాక్కు - అధిపతి మనసు నిన్ను నిలుపవలెను. ీరందరు ఐకమత్యమున నిన్ను యజమానిని స్వర్గలోకమున నిలుపవలెను.

11. ఇష్టకా! శోభన మనస్కవగు నీవు దక్షిణదిశవు. నిన్ను పాలించువారు రుద్ర గణములు. శత్రువుచే ప్రయోగించబడిన శస్త్రాస్త్రముల నివారణకర్త ఇంద్రుడగును. పంచదశ స్తోమము నిన్ను పృథ్వీ ుద నిలుపును. నీ నిశ్చలత కొరకు 'వాయురగ్రేగా' ప్రఉగ ఉక్థము నిన్ను దృఢపరుచవలెను. బృహత్సామము నిన్ను అంతరిక్షమున నిలుపును. ప్రథమోత్పన్న ప్రాణము - ద్యులోకమును ుస్తరించిన రీతి - నిన్ను దేవతలందు నిలుపవలెను. ధారక వాక్కు - అధిపతి మనసు నిన్ను నిలుపవలెను. ీరందరు ఐకమత్యమున నిన్ను - యజమానిని స్వర్గ లోకమున నిలుపవలెను.

12. ఇష్టకా! శోభన మనస్కవగు నీవు పశ్చిమ దిశవు. నిన్ను పాలించువారు ఆదిత్యగణములు. శత్రువుచే ప్రయోగించబడిన శస్త్రాస్త్రములు నివారణ కర్త వరుణుడగును. సప్తదశస్తోమము నిన్ను పృథ్వీుద నిలుపును. నీ నిశ్చలత కొరకు 'త్వారథం యథోవయే' ఉక్థశస్త్రము నిన్ను దృఢపరచును గాత. వైరూపసామము నిన్ను అంతరిక్షమున నిలుపును. ప్రథమోత్పన్నప్రాణము ద్యులోకమును ుస్తరించిన రీతి - నిన్ను దేవతలందు నిలుపవలెను. ధారకవాక్కు - అధిపతి మనసు నిన్ను నిలుపవలెను. ీరందరు ఐకమత్యమున నిన్ను - యజమానిని స్వర్గలోకమున నిలుపుదురు గాత.

13. ఇష్టకా! స్వయం ప్రకాశమానవగు నీవు ఉత్తరదిశవు. నిన్ను పాలించు అధిష్టాన దేవతలు మరుద్గణములు. శత్రువుచే ప్రయోగించబడిన శస్త్రముల నివారణకర్త సోముడగును. ఏకంశస్తోమము నిన్ను పృథ్వీుద నిలుపును. నీ నిశ్చలత కొరకు "అభిత్వాశూరనోనుమః " నిష్కైవల్య శస్త్రము నిన్ను దృఢపరచవలెను. వైరాజ సామము నిన్ను అంతరిక్షమున నిలుపును. ప్రథమోత్పన్న ప్రాణము - అధిపతి మనస్సు నిన్ను నిలుపవలెను. ీరందరు ఐకమత్యమున నిన్ను - యజమానిని స్వర్గలోకమున నిలుపవలెను.

14. ఇష్టకా! నీవు స్వరపాలన కర్త్రి ఊర్ధ్వదిశవు. ుశ్వేదేవతలు నీకు అధిష్టాన దేవతలు. శత్రువుచే ప్రయోగించబడు శస్త్రాస్త్రముల నివారణ కర్త బృహస్పతి అగును. త్రిణవ - త్రయస్త్రింశత్సోమము నిన్ను పృథ్వీుద నిలుపును. 'తత్సుతుర్వృణీమహే' ుశ్వేదేవ శస్త్రము మరియు 'వైశ్వానరాయ పృథుపాజసా' అగ్ని మారుత శస్త్రము నిన్ను దృఢపరచవలెను. ప్రథమోత్పన్న ప్రాణము - ద్యులోకమును ుస్తరించిన రీతి - నిన్ను

దేవతలందు నిలుపవలెను. ధారక వాక్కు - అధిపతి మనసు నిన్ను నిలుపవలెను. ీరందరు ఐకమత్యమున నిన్ను - యజమానిని స్వర్గలోకమున నిలుపుదురు గాత.

15. (నాకసద ఇటుకల ీుద చత్వాలమృత్తువేసి ఆపై పంచచూడ ఇటుకలను యథాస్థానమున ఉంచవలెను.)

అగ్ని సమ్ముఖమున రగులునది. అగ్నియొక్క కేశములవంటి జ్వాలా కిరణములు సూర్యకిరణ సదృశములు. అగ్నియొక్క రథమును వహించుట యందు నిపుణుడగు రథగృత్సుడు, రథయుద్ధ కుశలుడు రథౌజుడు దేవసేనానియు గ్రామణియు అగుదురు. వారిరువురు వసంతఋతు సంబంధ ఫాల్గుణ - చైత్రములను రెండు మాసములు. దిక్, ఉపదిక్ రూపలగు పుంజికస్థల - క్రతుస్థల ఇరువురు అప్సరలు పరిచారికలు. దశనశీలలగు వ్యాఘ్రాది మృగములు అగ్నికి వజ్రాయుధములు. అగ్ని యొక్క పౌరుషేయ వధ - ఒకరినొకరు కొట్టుకొనుటయే - హననమగును.

ఇష్టకా! నీవు అంతటి అగ్ని స్వరూపవు. ఆ అగ్నికి - ఆ సేనాని, గ్రామణులకు - ఆ అప్సర పరిచారికలకు - ఆయుధాదులకు నిత్య నమస్కారములు. వారందరు మమ్ము సుఖవంతులను చేయవలెను. వారందరు మమ్ము రక్షించవలెను. మేము అహితము కోరు మానవులను మా అహితము కోరువారిని - ఈ అగ్ని మున్నగు వారినోటి కోరలందు ఇరికింతుము.

16. ఇయ్యది దక్షిణదిశలో అతిశయత్వమును ప్రాప్తించునట్టి వాయువు. అతని రథపు రథస్వనము వాయువునకు సేనాపతి యగును. రథము నందు ఆసీనుడై ిచిత్రరీతుల యుద్ధము చేయు రథ చిత్రుడు వాయువునకు గ్రామణియగును. మేనక, సహజన్యలు ఆ వాయువునకు అప్సరలు. యాతుధానుడు హేతి - రాక్షసుడు ప్రహేతి అగుదురు.

**నమో అస్తుతే నో ివన్తు తేనో మృడయన్తు తేయం ద్విష్మోయశ్చనో ద్వేష్టి తమేషాం జమ్భేదధ్మః** - వారందరకు నమస్కారము. వారు మమ్ము రక్షించవలెను. మేము అహితము కోరువారిని, మాకు అహితము కోరువారిని నోటికోరలందు నలుపుదుము.

17. సూర్యుడు పశ్చిమమునకు సాగువాడు. సర్వత్రవ్యాపనశీలుడు. ిశ్వవాక్కు, రథప్రోతము ఇతని సేనాని. అసమ రథము ఇతని గ్రామణి. అనుమ్లోచన్తి, ప్రమ్లోచన్తి ఇతని అప్సరలు. వ్యాఘ్రము ఇతని హేతి. సర్పము ఇతని ప్రహేతి.

**నమో అస్తుతే నో ివన్తు తేనో మృడయన్తు తేయం ద్విష్మోయశ్చనో ద్వేష్టి తమేషాం జమ్భేదధ్మః**

18. యజ్ఞం ఉత్తరదిశన ప్రసిద్ధినొందినది. ధనము కొరకు ఆశ్రయించదగినది. గరుడుడు ఇతని సేనాని. అరిష్టనేిు ఇతని గ్రాిుణి. ిశ్వాచి, ఘృతాచులు ఇతని అప్సరలు. నీరు ఇతని హేతి యగును. వాతము ఇతని ప్రహేతి అగును.

నమో అస్తుతే నో ంవన్తు తేనో మృడయన్తు తేయం ద్విష్మోయశ్చనో ద్వేష్టి తమేషాం జమ్భేదధ్మః

19. ఇతడు పర్జన్యుడు, పైన - పైన ఉండువాడు. అట్లయ్యు క్రిందకు వర్షము దింపువాడు. సేనజిత్తు ఇతని సేనాని. సుషేణుడు ఇతని గ్రామణి. ఊర్వశి, పూర్వచితి ఇతని అప్సరలు. వజ్రనిర్ఘోషము ఇతని హేతి. ంద్యుత్తు ఇతని ప్రహేతి.

నమో అస్తుతే నో ంవన్తు తేనో మృడయన్తు తేయం ద్విష్మోయశ్చనో ద్వేష్టి తమేషాం జమ్భేదధ్మః

20. ఇతడు అగ్ని. ద్యులోకమునకు శీర్షము వంటివాడు. ఎంతో మహత్తు కలవాడు. పృథ్వికి స్వాం. జలముల కారణముగా మేఘములను కలిగించువాడు.

21. ఇతడు అగ్ని. శత సహస్రమూల్యక అన్నములకు నాథుడు. ధనములకు శీర్షము. క్రాంతదర్శి.

22. అగ్నీ! అథర్వర్షి సకల ఋత్విజులందు శ్రేష్ఠుడు. అతడు నిన్ను సర్వప్రథమముగా కమలపత్రము ంద మథించినాడు.

23. (పూర్వదిశి రేతః సిగ్వేలాయాం త్రిష్టుప్ సంజ్ఞా ఇష్టకా ఉపదధాతి. తూర్పుదిక్కున రేతః సిగ్వేలయందు త్రిష్టుప్‌నామక ఇటుకలను పేర్చును)

అగ్నీ! నీవు హవ్యవాహన జ్వాలలను ప్రకటించినపుడు యజ్ఞములకు నేతవగుదువు. యజ్ఞఫలస్వరూప వర్షమునకు నేతవగుదువు. వాయువునకు శుభంకరములగు అశ్వములు నియతములు. నీవు వానితో కూడినపుడు వర్షమును ధరించివాడవగుదువు. ద్యులోకమున సూర్యుని నిలిపిన వాడవగుదువు.

24. ఉష ఉదయించిన రీతి సంధలతో కూడిన అగ్ని ప్రజ్వరిల్లుచున్నది. వత్సము గోవు కొరకు వలె జనులు నిరీక్షించుచున్నారు. సమర్థమగు పక్షి ఉదయమున రెక్కలుచాచి ఆహారము కొరకు ఆకాశమున వ్యాపించిన రీతి - ప్రజ్వలిత అగ్ని కిరణములు ఆకాశమునకు ఎగిరి వ్యాపించుచున్నం.

25. అగ్ని క్రాంతదర్శి. యజ్ఞయోగ్యుడు. శ్రేష్ఠుడు. ఉద్గాతలమగు మేము వందన వాక్యములు

పలుకుచున్నాము. బహుగమనశీల సూర్యకిరణములు ద్యులోకమున సంగతలైనట్లు - హోతలు పావన వచనములచే అన్నమును అగ్నికి సంగతము చేయుచున్నారు - హోమము

చేయుచున్నారు.

26. (జగతీచ్ఛందములను మూడు ఇటుకలను పేర్చవలెను)

అగ్నిదేవతల ఆహ్వాత. అత్యంత యజనశీలుడు. యజ్ఞములందు ఎంతో ప్రశంసనీయుడు. అట్టి ఆహవనీయాగ్నిని అగ్న్యాధానము చేయు ఋత్విజులు ప్రతిష్ఠించినారు. ఈ అగ్నినే భృగుగణములు పుత్ర పౌత్రాదులు సహితులై పూర్వము ప్రతిష్ఠించినారు.

27. అగ్ని భక్తులగు యజమానులను రక్షించువాడు. యజ్ఞములందు జాగరశీలుడు. బలశాలి. ఘృతములను జ్వాలారూపముఖమున ధరించువాడు. పావకుడు. అగ్ని యజ్ఞం నిఁత్తము వర్ధిల్లుచున్నాడు. ఋత్విజులకు శుభములు కలిగించుటకుగాను అగ్ని ద్యులోకమునంటు తన వెలుగుచే ప్రకాశించుచున్నాడు.

28. అగ్నీ! నీవు పారిపోయి గహన జలమున దాగినావు. అప్పుడు అంగిర ఋషులే నిన్ను అందుకున్నారు. నీవు మరల పారిపోయి కర్రలందు దాగినావు. అప్పుడు సహితము అంగిరులే

నిన్ను సాధించినారు. బలముగా మధించుట వలన సహితము నీవు అవతరింతువు. అందుకే అంగిరులు నిన్ను 'బలపుత్రుడు' అన్నారు.

29. **త్రిస్రో ఁనుష్టుప్ సంజ్ఞేష్టకాః ప్రాఙ్ముఖ ఉపదధాతి** - అనుష్టుప్ పేరుగల ఇటుకలను తుర్పున పేర్చవలెను.

అగ్ని మానవులకు పూజ్యుడు. జలములనేత బలయుతుడు. ఋత్విజఁత్రులారా! అగ్ని కొరకు హఁస్సులు - పంచదశ ప్రభృతి స్తోమములు - సమర్పించండి.

30. అగ్నీ! సేచన సమర్థా! స్వాఁ! నీవు యజమానికి సమస్త సత్ఫలితములను సమకూర్చుము. నీవు ఉత్తర వేది యందు ప్రజ్వలితుడగు వాడవు. మాకు బహుఁధ ధనములను అందించుము.

31. ఎంతో కీర్తి గల అగ్నీ! నీవు బహుజన ప్రియుడవు. జ్వాలా కేశిఁ. ఋత్విక్కులు, యజమానులు దేవతలకు హఁ అందించమని కోరుచు నిన్ను ఆహ్వానింతురు.

32. ఋత్విక్, యజమానులారా! నేను బ్రహ్మను ఁ హఁస్సులు అందుకున్నాను. జలములకు పౌత్రుడు, చైతన్యవంతుడు, ఁశ్రామరహితుడు, యజ్ఞవంతుడు, ఁశ్వదూత, అమృతస్వరూపుడగు అగ్నిని ఆహ్వానించుచున్నాను.

33. అగ్ని ఁశ్వస్యదూత. అమృతమయుడు. ఁశ్వస్యదూత మమృతం. అగ్ని లోకములన్నింటికి అన్నము సమకూర్చగల సమర్థుడు. అతడు రక్తవర్ణములగు తన రెండు అశ్వములను రథమున కూర్చును. ఆ రథమునధిరోహించిన అగ్ని ఆహుతులు అందుకొనుటకు గాను త్వరత్వరగా ఁచ్చేయును.

34. సమ్యగాహుత అగ్ని యజ్ఞస్థానమునకు ఉరుకులు పెట్టును. సదుద్రవత్స్వాహుతః ఎచట

బ్రహ్మాది ఋతువులు ఉందురో, ఎచట యజ్ఞం జరుగుచుండునో, ఎచట ంంధ యజ్ఞకర్మలు పూర్తి అగునో, ఎచట సంపన్న యజమానికి దేవధనమగు హంస్సుచేరునో, ఆ యజ్ఞస్థానమునకు

అగ్ని పరుగులిడును.

35. అగ్నిదేవా! నీవు జ్వాలాముఖిం. సంధలస్వాంం. ధనస్వరూపుడవు. క్రాంతదర్శిం. ప్రశంసనీయుడవు. మా ఆహుతులందుకొనుము. మాకు ధనములు ప్రసాదించుము.

37. అగ్నీ! నీవు శోభాయమానుడవు. వాడికోరల వాడవు. రాక్షసనాశకుడవు. రాత్రింబవళ్లు రాక్షసులనుదగ్ధము చేయుము.

38. కుండమునందలి అగ్నీ! ఆహ్వానించబడిన నీవు శుభంకరుడవగుము. నీవు అందించు ధనము శుభంకరము కావలెను. అగ్ని కొరకు చేయు యజ్ఞం శుభంకరము కావలెను. అగ్ని కొరకు మేము సముపార్జించు స్తుతులు, ప్రశస్తులు శుభంకరములు అగును గాత.

39. అగ్నీ! జనులు నిన్ను కీర్తించుటలు శుభంకరములు కావలెను. నీవు యుద్ధములందు శత్రువులను నాశనము చేయువాడవు. అట్టి దృఢమనస్కుడవై వృత్రనాశనముకు పూనుకొనుము.

40. అగ్నీ! నీవు శత్రుంజయ వ్రతుడవు. ఆ దీక్షతోనే మా ంద ఎక్కుపెట్టిన - బలశాలి - శత్రువు బాణములను పడగొట్టుము. మమ్ము సముచిత మార్గముల ధనమును ఆర్జించునట్లు చేయుము.

41. (దక్షిణ దిశన పంక్తినామక మూడు ఇటుకలను పేర్చవలెను)

ఎవడు ధనస్వరూపుడో, ఎవని హోమము కొరకు గోవులు పాలిచ్చుటకు ఇంటికి వచ్చునో, శీఘ్రగాం అశ్వములు ఇంటికి తిరిగి వచ్చునో, నిరంతరము సంచరించు అశ్వములు సహితము ఇంటికి తిరిగి వచ్చునో, అట్టివానిని మాత్రమే అగ్నిగా భాంంతుము. అగ్నీ! స్తోతలకు వర్షము, అన్నము కలిగించుము.

42. ఏ అగ్ని ధనస్వరూపుడగునో, ఎవని కొరకు గోవులు, వడిగల గుఱ్ఱములు గృహమునకు చేరునో, ఎవని కొరకు సత్కుల సంజాత ఋత్విక్కులు యజమాని ఇంటికి చేరుదురో, అట్టి అగ్నినే మేము సంస్తుతింతుము. అగ్నీ స్తోతలకు వర్షము అన్నము కలిగించుము.

43. ఆహ్లాదకారక అగ్నీ! నీ నోటికి ఘృతాహుతులు అందుకొనుటకు శిశువు మాతృ స్తనమును అందుకొనుటకు వలె - చేతుల వంటి రెండు జుహువులను ఆశ్రయింతువు.

బలముల స్వామీ! మా యజ్ఞములందు ప్రసన్నుడవగుము. మాకు ధనధాన్యములు సమకూర్చుము. అగ్నీ! స్తోతలకు వర్చము, అన్నము కలిగించుము.

44. (ఉత్తరదిశన పదపంక్తి పేరిటి మూడు ఇటుకలను పేర్చవలెను)

అశ్వమేధయజ్ఞమున అశ్వమును స్తుతులచే అధిక మేధ్యము చేసి మనసునందలి సంకల్పములను సమృద్ధము చేయుదురు. అగ్నీ! అట్లే మేము నిన్ను సంస్తుతించి ధనధాన్యములను మరింత వృద్ధిచెందించుకొందుము.

45. అగ్నీ! ప్రసన్నుడవగుము. రథసారథి కోరిన చోటునకు చేర్చినట్లు - ఫలమునిచ్చునదియు, స్వర్గాది సాధకమును అగు మహాయజ్ఞ నిర్వాహకుడవు అగుము.

46. హే అగ్నీ! మా స్తుతులను వినుము. ఒక్కిలి ప్రసన్నుడవగుము. ఉదయించుచున్న సూర్యుడు అందరకు అనుకూలుడు అయినట్లు - నీ యొక్క పరిపూర్ణ ముఖమున మాకు అనుకూలుడవు అగుము.

47. దేవతల ఆహ్వాత - దాత - వాసహేతువు - జలపుత్ర - జాతజ్ఞాన - బ్రాహ్మణసమ - జాతప్రజ్ఞుని మాత్రమే నేను అగ్నిగాభావింతును. అట్టి అగ్ని సుయజ్ఞుడు. ద్యోతమానుడు. ఊర్ధ్వముఖ జ్వాలలవాడు. హోమములందు దేవతల కందించు ఘృతమున అందుకొనువాడు

అగును.

48. (మూడు ద్విపద ఇటుకలను పేర్చవలెను)

అగ్నీ! నీవు నిత్యము మాకు దగ్గరి వాడవుగుము. రక్షకుడవు - శుభంకరుడవు - గృహస్వరూపుడవు అగుము. ధనమునందించుట వలన కీర్తిశాలి అగ్ని వాసహేతువగుచున్నాడు.

అగ్నీ! మాకు అనుకూలుడవు అగుము. మాకు అత్యంత దీప్యమాన ధనమున ప్రసాదించుము. పుత్రులకు ధనప్రాప్తి కలుగుటకుగాను దేదీప్యమానుడవగు నిన్ను సంస్తుతించుచున్నాము.

49. మునులు ఏకాగ్రచిత్తులైనారు. తపమాచరించినారు. అగ్నిని ప్రజ్వలితుని చేసినారు. యజనము చేసినారు. స్వర్గమునకు చేరినారు. యజ్ఞమును పరిపూర్ణము చేసినారు. ఆ విధముగనే నేను - యజమానిని ఏకాగ్రచిత్తుడనగుదును. ఏ అగ్నిని మేధావులు యజనీయము అన్నారో - అట్టి అగ్నిని స్వర్గము కొరకు ఆధానము చేయుదును.

50. పుణ్యముద్వారా లభించునదియు ప్రకాశమానమగు ద్యులోకమున కన్న మూడవ అంతరమున ఉన్నదియునగు స్వర్గమును స్వీకరించుచు, మేము మా సోదరులు, పుత్రులు, ధనము, భార్యా సహితులమై అగ్నికి పరిచర్యలు చేయుదుము.

51. అగ్ని ముల్లోకములను భరించువాడు. శ్రేష్ఠజనులకు స్వామి. తన ఉపాసకులను గుర్తించువాడు. అతని ఆ అగ్ని చయన స్థానమున ఆరూఢుడు అయినాడు. వేది మధ్యనున్న ఆ అగ్ని ప్రజ్వరిల్లుచున్నాడు. మా పై సేనాసహితులై దండెత్తికోరు శత్రువులను అగ్ని కాలి కిందవేసి నలిపివేయవలెను.

52. ిరతముడు - అన్నదాత - అనేకదాతయగు అగ్ని ప్రమాదరహితుడై వెలుంగును గాత. అగ్నీ! నీవు ముల్లోకములందు ప్రకాశించువాడవు. దివ్యస్థానములకు చేరుము.

53. యజమాన - ఋత్విక్కులారా! అగ్నిని సముపార్జించండి. అగ్నికి అనుకూలురై సాగండి.

అగ్నీ! నివు దేవతలను చేరుకొనవలసిన మార్గములను ఏర్పరచుము. మాట తడబడి, మనసు నిలకడ లేని తల్లి దండ్రులకు యౌవనము ప్రసాదించిన ఋషులు నిన్నే ఈ యజ్ఞసూత్రమున ిస్తారపరచినారు.

54. అగ్నిదేవా! నీవు ప్రజ్వలితుడవు అగుము. యజమానిని అప్రమత్తుని చేయుము. ఈ యజమానికి ఇష్టఫల ప్రాప్తి కలిగించుము.

ిశ్వదేవతలారా! ఈ యజమాని కల్మషములేని మనసువాడు. ద్యులోకరూప సమస్థానమున ఇతనిని చిరకాలము ఉండునట్లు చేయండి.

55. అగ్నీ! నీవు సర్వసమర్థుడవు. సహస్రదక్షిణ యజ్ఞమును పూర్తి చేయగలవాడవు. సర్వస్వదక్షిణ యజ్ఞమును పూర్తిచేయగలవాడవు. ఆ సామర్థ్యముననే స్వర్గమున దేవతల మధ్యకు చేరుటకు - ఈ యజ్ఞ భారమును వహింపుము.

56. అగ్నీ! ఇది నీ యొక్క ఋతుప్రాప్త జన్మభూమి. ఇచటనే నీవు అవతరింతువు.

ప్రకాశింతువు. నీ జన్మ భూమిని ఎరుగుము. ఈ వేది ింద స్థానము గ్రహించుము. గో-

అశ్వమయమగు మా సంపదను వర్ధిల్లచేయుము.

57. (ిశ్వజ్యోతి ఇటుకల ింద యజమాని చేసిన ిశ్వజ్యోతి ఇటుకలను పేర్చవలెను)

58. పరమేష్ఠి, ప్రజాపతి ఇష్టకా! నీవు జ్యోతిష్మతి ఇష్టకను సంపూర్ణ ప్రాణ, అపాన, వ్యానము నిిత్తము - ద్యులోకపు ఉత్తమ స్థానమున స్థాపించుము. నీవు మాకు ిశ్వజ్యోతిని ప్రసాదించుము ిశ్వంజ్యోతిం ప్రయచ్ఛ.

ఇష్టకా! సూర్యుడు నీకు అధిష్ఠాన దేవతయగును. అతనిచే అనుజ్ఞాతవై - పూర్వము అంగిరుల కుండమున ధ్రువపడిన రీతి ఈ యజ్ఞ కుండమున స్థిరపడుము.

59. (లోకమ్పృణ ఇటుకను మరల పేర్చవలెను)

లోకమ్ము ఇష్టకా! నీవు ఈ కుండమునందలి అవశిష్ట స్థానములు ఎచట ఉన్నను వానిని పూడ్చుము. రంధ్రాదులు ఎచట ఉన్నను వానిని పూడ్చుము. తదుపరి ఈకుండమునందు స్థిరముగా నిలువుము. ఇంద్ర అగ్ని బృహస్పతులు నిన్ను ఈవేదియందు స్థాపించినారు.

60. వార్షిక సోమయాగము దేవతల జన్మభూతము. ఈ యజమాని యజ్ఞము చేయుచున్నాడు. అందలి త్రిసవనసోమరసము జలయుక్తము, అన్నమిశ్రితము చేయబడుచున్నది.

61. ఇంద్రుడు రథికులందు అత్యంత వీరుడు. అన్నదాతలందు శ్రేష్ఠుడు. సముద్రమందటి గంభీర హృదయుడు. ఆ ఇంద్రునే సమస్తస్తుతులు వర్ధిల్లచేయును.

62. (స్వయమాతృణ్ణమును రెండు ఇటుకలను పేర్చి, వాని మధ్య జరిగిన ఇటుకను చేర్చవలెను)

ఈ అగ్ని కర్రయందు పుట్టినపుడు గుర్రము గ్రాసము నందుకొని సకిలించినట్లు, సుయి స్యి మని ధ్వనిచేయును. పిదప గాలి అనుకూలము కాగా జ్వాలసాగును.

అగ్నీ! అప్పుడు నీగమన మార్గము నల్లనిదగుట నిశ్చయము. పొగసాగుట నిశ్చయము.

63. (మరొక స్వయమాతృణ్ణ ఇటుకను పేర్చవలెను)

సూర్యుడు జగత్పాలకుడు , దేదీప్యమానుడు. ఇది సూర్యునకు ఆశ్రయభూతమగు నివాసస్థానము. రశ్మియుక్త భాసమానమగు ఇటుకను ఇచ్చట చేర్చుచున్నాను. ఇష్టకా! నీవు ద్యులోకమును, పృథ్విని, అంతరిక్షమును భాసింపచేయుదానవు.

64. ఇష్టకా! పరమేష్ఠి ప్రజాపతియే నిన్ను సావకాశమును, విస్తారశీలమునగు ద్యులోకపు ఉత్తమస్థానమున స్థాపించును గాత. నీవు మాకు ద్యులోక ప్రాప్తి కలిగించుము. ద్యులోకమును దృఢపరచుము. సమస్త ప్రాణ, అపాన, వ్యాన, ఉదానముల కొరకు ద్యులోకమును హింసించ కుండుము. మహా కళ్యాణపరంపరల ఛాయయందును - శాంతి సహితముగను సూర్యుడు నిన్ను రక్షించును గావుత. నీవు సూర్యునిచే అనుజ్ఞాతవై - పూర్వము అంగిరుల కుండమునందువలె - మా ఈ కుండమున ధ్రువపడుము.

65. (అగ్నిం ప్రోక్షతి - అగ్నిని ప్రోక్షించవలెను)

వేదికా! నీవు సహస్ర ఇష్టక యుక్తవు. సహస్ర ఇష్టక ప్రతినిధివి. సహస్ర తుల్యవు.

సహస్రమూల్యవు. సహస్ర ఫలప్రదాతవు. నేను నిన్ను ప్రోక్షించుచున్నాను.

సహస్రస్య ప్రమాసి సహస్రస్య ప్రతిమసి సహస్రస్యోన్మాసి సహస్రో సి సహస్రాయ త్వా

శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

పంచచితిని గూర్చిన పదిహేనవ అధ్యాయము సమాప్తము.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

అధారం స్సర్వ ద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

## పదహారవ అధ్యాయము

1. నమస్తే రుద్ర మన్యవ ఉతో త ఇషవే నమః ।

బాహుభ్యాముత తే నమః

(శతరుద్రీయ హోమమంత్రములు చెప్పుచున్నాడు)

రుద్రదేవా! నీ రౌద్రమునకు వందనము. ఎక్కుపెట్టిన నీ బాణమునకు వందనము. నీ బాహువులకు వందనము.

2. రుద్రదేవా! నీ దేహము శుభప్రదము. ఘోరపాపనాశని. అత్యంత శాంతిప్రదము. సర్వతనివాసివగు నీవు నీ శాంతదృక్కులచే మమ్ము కావుము.

3. గిరీశా! నీవు బాణము పట్టినావు. దానిని శాంతింపచేయుము. గిరిత్రాతా! ఆ బాణమున మానవునిగాని జంగమమును గాని హింసించకుము.

4. గిరీశా! మేము నీకు అభిముఖులమై శాంతి కారక స్తవములచే నిన్ను నుతించుచున్నాము. ఈ లోకములను రోగరహితములను చేయుము. ప్రసన్నలను చేయుము.

5. రుద్రుడు అందరకు ప్రధానుడు. దేవలోకమునకు ఏకమాత్ర భిషక్కు. అధివక్త. రుద్రదేవా! సకల సర్పములను స్తంభింపచేయుము. సకల రాక్షసులను జడీభూతులను చేయుము. వారిని అథోముఖముగ పారవేయుము.

6. ఈ శివుడు సూర్యరూప తామ్రవర్ణుడు. రక్తవర్ణుడు. బభ్రువర్ణుడు. ఈ రుద్రాంశమున వేల రుద్రచరులు సమస్త దిశలందున్నారు. వారి క్రోధము శమించవలెనని ప్రార్థించుచున్నాము.

7. రుద్రుడు నీలకంఠుడు. శిష్టరూపుడు. రక్తాభుడు. అతడు మెల్లమెల్లగా ముందుకు జరుగుచున్నాడు. అతనిని సాధారణ గోపాలురు చూచుచున్నారు. నీరు తెచ్చు దాసీజనులు చూచుచున్నారు. మాచే సహితము భయపూర్వకముగ చూడబడునట్టివాడు మమ్ము సుఖవంతులను చేయవలెను.

8. నీలకంఠునకు నమః. సహస్రాక్షునకు నమః. సేచన సమర్థునకు నమః. అతడు కాక

రుద్రగణములున్నవి. వానికి సహితము నమస్కరించుచున్నాను.

9. రుద్రదేవా! నీ ధనుస్సు ఉన్నదికదా! దానిరెండు కొనలకు కట్టిన నారిని విప్పివేయుము. నీ చేతికి తీసుకున్న బాణమున్నదే ! దానిని దూరముగ పారవేయుము.

10. కపర్దియొక్క ధనుస్సు జ్యారహితమైనది. అతడు శల్యరహిత ధనుర్ధారి అయినాడు. అతని శరములన్నియు నిష్ఫలములైనవి. అతని తూణీరము సహితము రిక్తమైనది.

11. అత్యంత సేచన సమర్థరుద్ర దేవా! నీ చేతులందు ధనుస్సున్నది. బాణములున్నవి. అవి మమ్ము రోగరహితులను చేయవలెను. నీవు మమ్ము పాలించవలెను.

12. రుద్రదేవా! నీవు ధరించిన ధనుర్బాణములు మమ్ము సర్వదిశలందు రక్షించును గాత. ఇప్పుడు నీ వద్ద నున్న శరీరములు నిండిన తుణీరమును, మాకు దూరముగా ఉండుచోట ఉంచుము.

13. సహస్రాక్ష, శతతూణీర రుద్రా! మాకు కృపాళుడవగుము. బిగించిన నీ ధనస్సును సడలించుము. శరముల మొనలను వదిలించుము.

14. ఎక్కుపెట్టని నీ ఆయుధమునకు నమస్కారము. నీ ఉభయ బాహువులకు నమస్కారము. నీ ధనురాయుధమునకు నమస్కారము.

15. రుద్రదేవా! మాకు సంబంధించిన మహామహులను హింసించకుము. ఏ శిశువునైనను. హింసించకుము. గర్భాదానము చేయు యువకులను హింసించకుము. గర్భమునందలి శిశువును హింసించకుము. మా తండ్రిని హింసించకుము. తల్లిని హింసించకుము. ప్రియములగు మా దేహములను హింసించకుము.

16. రుద్రదేవా! నీవు - మా పౌత్రుల, పుత్రుల, ఆయువు, గోవులు, అశ్వములు విషయమున మాటిమాటికి క్రోధము వహించకుము. క్రోధలగు మా వీరులను బాధించకుము. మేము హవిర్యుక్తులమై సదా నిన్ను ఆహ్వానించుచుందుము.

17. బంగారు బాహువుల సేనానిగల రుద్రునకు నమస్కారము. దిశలస్వామి రుద్రునకు నమస్కారము. పచ్చ పచ్చని ఆకులకేశములు గల వృక్షములకు నమస్కారము. పశుపాలకునకు నమస్కారము. లేతగరిక వంటి పీతవర్ణ తేజస్వి రుద్రునకు నమస్కారము. మార్గరక్షకుడగు రుద్రునకు నమస్కారము. నీలకేశి, జరారహిత, యజ్ఞోపవీతధారి, గుణవంతులగు మానవుల ప్రభువగు రుద్రునకు నమస్కారము.

18. బభ్రువర్ణ రుద్రునకు నమస్కారము. శత్రువును వధించు రుద్రునకు నమస్కారము. అన్నములస్వామికి నమస్కారము. భవుని ఆయుధమునకు నమస్కారము. సకల చరాచర ప్రాణుల అధిపతికి నమస్కారము. ఆతతాయి రుద్రునకు నమస్కారము. కేదార రక్షకునకు

నమస్కారము. అహంతయు, జీవనచాలకుడగు రుద్రునకు నమస్కారము. అరణ్యస్వామికి నమస్కారము.

19. లోహిత వర్ణునకు నమః. స్థపతికి నమః. వృక్షస్వామికి నమః. భూమండల విస్తారకునకు నమః . ధనకర్తకునమః. ఆ ఓషధస్వామికి నమః. మంత్రి, వణిక్కు, లతాగుల్మాది రక్షకునకు నమ . తుముల ధ్వనికారికి నమః . ఆక్రందనకారికి నమధనుస్సులు. పదాతి సేనానాయక రుద్రునకు మా నమస్సులు.

20. ఆకర్ణాంతము లాగిన ధనస్సుతో యుద్ధములకు పరుగులిడు రుద్రునకు వందనము. సాత్వికులను, శరణాగతులను పాలించు రుద్రునకు వందనము. శత్రువులను పరాభవించు రుద్రునకు వందనము. వేదనశీల, విదారిణీసేవల స్వామికి వందనము. విహంగధారికి వందనము. మహామహునకు వందనము. చోరపాలకునకు వందనము. దోపిడిదారి బందిపోట్లకు వందనము. అడవుల స్వామి రుద్రునకు మా వందనము.

21. వంచక, పరివంచక, చోరుల స్వామి రుద్రునకు వందనము. ఖడ్గదారి, బాణవంత రుద్రునకు వందనము. ఆయుధారి, బాణధారి, హింసేచ్ఛుక దొంగల, దోపిడి దారుల పాలక రుద్రునకు వందనము. ఆయుధధారుల, రాత్రించరుల, దేహకాముల స్వామి రుద్రునకు వందనము.

22. తలపాగలవారు, కొండలందు తిరుగువారు, క్షేత్ర గృహాదులు అపహరించు వారి ప్రభువు రుద్రునకు నమస్కారము. ధనుర్ధార, బాణధార రుద్రులకు నమస్కారము. ధనస్సునకు జ్యాను ఎక్కుపెట్టునట్టియు, బాణము సంధించునట్టియు రుద్రులకు నమస్కారము. ధనస్సులాగువారును, శరములను విడుచువారును అగు రుద్రులకు నమస్కారము.

23. శరముల సంధించునట్టి, బాణములు విడుచునట్టి రుద్రులకు నమః . నిద్రించువారును, మేల్కొనువారును అగు రుద్రులకు నమః . పడుకున్నట్టియు, కూర్చున్నట్టియు రుద్రునకునమః . నిలిచి నట్టియు, పరిగెత్తునట్టియు రుద్రునకు నమః .

24. సభలకు దండము. సభాపతులకు దండము. అశ్వములకు దండము. అశ్వస్వాములకు దండము. వీరులైపోరు సేనలకు దండము. వివిధ రూపముల వేధించు సేనలకు దండము. ఉత్కృష్ట సేవకల యుక్త బ్రాహ్మి మున్నగు మాతృకలకు దండము. బాధించుసామర్థ్యము గల దుర్గ మున్నగు మాతృకలకు దండము.

25. గణములకు నమోనమః . గణపతులకు నమోనమః . వివిధజాతుల సంఘములకు నమోనమః ఈ సంఘముల అధిపతులకు నమోనమః . లంపటులకు నమోనమః . లంపటుల అధిపతులకు నమోనమః . జడల, కొప్పుల విరూపులకు నమోనమః . హయవదన, హయగ్రీవ ప్రభృతి విశ్వరూపగణములకు నమోనమః .

26. సేనలకు నమస్సులు. సేనాపతులకు నమస్సులు. రథారూఢులకు నమస్సులు. రథహీనులకు నమస్సులు. రథ అధిష్ఠాతలకు నమస్సులు. రథపు అశ్వచాలకులకు నమస్సులు. మహాిరులకు నమస్సులు. ిరపుత్రులకు నమస్సులు

27. వడ్రంగులకు నమోవాకములు. రథములు చేయువారికి నమోవాకములు. కుమ్మరులకు

నమోవాకములు. కమ్మరులకు నమోవాకములు. నిషాదులకు నమోవాకములు. వ్యాధులకు నమోవాకములు. వేటకుక్కలకు నమోవాకములు. వేటకుక్కల యజమానులకు నమోవాకములు.

28. కుక్కలకు నమస్కారము. కుక్కలస్వాములగు కిరాతాదులకు నమస్కారము. రుద్రునకు నమస్కారము. శర్వునకు నమస్కారము. పశుపతికి నమస్కారము. నీలకంఠునకు నమస్కారము. శిత కంఠునకు నమస్కారము.

29. జటాజూటధారి శివునకు వందనము. బోడిగుండు రుద్రునకు నమస్కారము. సహస్రాక్షరుద్రునకు వందనము. బహుధనుర్ధారి శివునకు వందనము. గిరిశయన శివునకు వందనము. శిపి ిష్ఠ శివునకు వందనము. అత్యంత సేక్త, బాణయుక్త శివునకు వందనము.

30. అల్పశరీర రుద్రునకు దండము. వామనరుద్రునకు దండము. మహారుద్రునకు దండము. వృద్ధరుద్రునకు దండము. అనుభవ రుద్రునకు దండము. అగ్రునకు దండము. ప్రధాన పురుషునకు దండము.

31. జగద్వ్యాప్తునకు నమః. గతిశీలునకు నమః . క్షిప్రకారికి నమః. జలప్రవాహికి నమః. తరంగయుక్తునకు నమః స్థిరజల వంతునకు నమః. నదులందు పుట్టిన వారికి నమః . ద్వీపసంభవులకు నమః.

32. పెద్దలకు నమస్సు. చిన్నలకు నమస్సు. పూర్వజులకు నమస్సు. పుట్టనున్న వారికి నమస్సు. మధ్యములకు నమస్సు. అప్రగల్భులకు నమస్సు. జఘన్యులకు నిమ్నస్థులకు నమస్సు.

33. గంధర్వలోకమున పుట్టిన వారికి నమోనమః అభిచార ఉత్పన్నులకు నమోనమః . పాపులను శిక్షించు వానికి నమోనమః. కుశలోత్పన్నులకు నమోనమః . శ్లోకయోగ్యులకు నమోనమః వైరాగ్య సంబంధులకు నమోనమః. క్షేత్రములందు ఫలించు ధాన్యాదులకు నమః. కుప్పలందు పుట్టువానికి నమోనమః.

34. అరణ్య ఉత్పత్తులకు నమోవాకము. వృక్షగుల్మాదులందు పుట్టువానికి నమోవాకము. శబ్ద, ప్రతి శబ్దరూపమునకు నమోవాకము. శీఘ్రగతి సేనలవారికి నమోవాకము. శీఘ్రరథికి నమోవాకము. శూరునకు నమోనమః. శత్రుంభేదకునకు నమోనమః.

35. శిరస్త్రాణము గలవారికి నమస్కారము. కవచధారికి నమస్కారము. ఇనుప కచ్చడముల వారికి నమస్కారము. గజముపై వేయు ఇనుపకవచము వారికి నమస్కారము. ప్రసిద్ధవీరునకు నమస్కారము. ప్రసిద్ధసేనగల సేనాపతికి నమస్కారము. దుందుభి శబ్దమునకు నమస్కారము. వాదన దండమునకు నమస్కారము.

36. ధృష్టునకు నమస్తే. విమర్శక విద్వాంసునకు నమస్తే. ఖడ్గధారికి నమస్తే. బాణధారికి నమస్తే.

తీక్ష్ణ శరవంతునకు నమస్తే. ఆయుధము పట్టిన వీరునకు నమస్తే. శోభన ఆయుధవంతునకు నమస్తే. శోభన ధనుష్పాణికి నమస్తే.

37. క్షుద్రమార్గముల వారికి నమః. విశాల మార్గములవారికి నమః. కాలువలందు పుట్టువానికి నమః. పర్వతముల క్రింద మొలుచువానికి నమః. నదులందు మొలుచు వానికి నమః.

సరస్సులందు మొలుచువానికి నమః. తటాక ఉత్పన్నములకు నమః.

38. కూప ఉత్పన్నములకు వందనము. ఛాయ ఉత్పన్నములకు వందనము. ఎండలో పుట్టువానికి వందనము. మేఘ ఉత్పన్నములకు వందనము. విద్యుదుత్పన్నములకు వందనము. వర్షోత్పన్నములకు వందనము. వర్షరహిత ఉత్పన్నములకు వందనము.

39. వాయుచక్ర ఉత్పన్నములకు దండము. ప్రళయ నిలయ రుద్రునకు దండము. గృహభూమిలో పుట్టిన వానికి దండము. గృహభూమి పాలకునకు దండము. సోమమునకు దండము. రుద్రునకు దండము. తామ్రమునకు దండము. అరుణునకు దండము. "నమః సోమాయచ రుద్రాయచ నమస్తామ్రాయ చారుణాయచ"

40. సుఖములు కలిగించు వారికి నమోవాకము. పశుపతికి నమోవాకము. ఉగ్రునకు నమోవాకము. భీమస్వభావునకు నమోవాకము. ఎదుట వధించువానికి నమోవాకము. దూరము నుండి వధించువానికి నమోవాకము. హంతకు నమోవాకము. అత్యంత హంతకు నమోవాకము. హరిత వృక్షములకు నమోవాకము. తరింపచేయు రుద్రునకు నమోవాకము.

41. సుఖస్వరూపునకు నమస్కారము. కళ్యాణమయునకు నమస్కారము. సుఖకరునకు నమస్కారము. శుభంకరునకు నమస్కారము. శివస్వరూపునకు నమస్కారము. అత్యంత శివస్వరూపునకు నమస్కారము. "నమః శివాయ ఛందమున శివతరాయ చ"

42. లోకములకు ఆవల జీవన్ముక్త రూపమున అవతరించిన వారికి నమస్కారములు. లోకములందు సాధారణ మానవ రూపమున జన్మించిన వారికి నమస్కారము. మంత్ర జపాదులచే తరించువారికి నమస్కారము. ఉత్కృష్ట తత్వ జ్ఞానమున ముక్తి పొందువారికి నమస్కారము. తీర్థములకు నమస్కారము. నదులకు నమస్కారము. కుశలకు నమస్కారము. నురుగునకు నమస్కారము. **నమస్తీర్థాయచ కుల్యాయచ నమః శష్పాయచ ఫేన్యాయ.**

43. సైకిత ఉత్పన్నములకు నమస్కారము. స్రోతోత్పన్నములకు నమస్కారము. చిన్న చిన్న రాళ్ళలో మొలిచిన వానికి నమస్కారము. స్థిర జల ప్రదేశమునకు నమస్కారము. సర్వాన్తర్యాకి నమస్కారము. ఊసర ఉత్పన్నములకు నమస్కారము. ఉత్కృష్ట మార్గ సంభూతులకు నమస్కారము.

44. వ్రజ సంభవులకు నమస్కారము. గోష్ఠ సమ్భవులకు నమస్కారము. శయ్యా అసంభవులకు నమస్కారము. గృహ ఉత్పన్నములకు నమస్కారము. హృదయోత్పన్నములకు నమస్కారము. నీహార ఉత్పన్నములకు నమస్కారము. దుర్గమ ప్రదేశ ఉత్పన్నములకు నమస్కారము. గహ్వరోత్పన్నములకు నమస్కారము. 'నమః కాట్యాయచ గహ్వరేష్ఠాయ'

45. శుష్కోత్పన్నములకు నమస్కారము. హరిత ఉత్పన్నములకు నమస్కారము. దుమ్ములో పుట్టువానికి నమస్సులు. రజోకణ ఉత్పన్నములకు నమస్కారము. అగమ్య ప్రదేశములందు పుట్టువానికి నమస్కారము. తృణోత్పన్నములకు నమస్కారము. బడబానలమున పుట్టినవానికి నమస్కారము. కల్పానలమున పుట్టిన వారికి నమస్కారము. "నమ ఊర్వ్యాయ సూర్వ్యాయచ"

46. పత్రములకు నమస్కారము. పత్రములు రాల్చువారికి నమస్కారము. ఉద్యమవంతునకు నమస్కారము. కట్టెదుట వధించువారికి నమస్కారము. సర్వదుఃఖములు కలిగించువారికి నమస్కారము. ిక్కిలి దుఃఖములు కలిగించువానికి నమస్కారము. బాణములు చేయువారికి నమస్కారము. ధనుస్సులు చేయువారికి నమస్కారము. వర్షము మున్నగు వానిచే జగదుత్పత్తి కారకులకు నమస్కారము. దేవతల హృదయములకు నమస్కారము. పాపపుణ్యిచక్షణ గలవారికి నమస్కారము. పాపములను ిిధ రూపముల నష్టపరచువారికి నమస్కారము. స్వర్గాదిలోక నిర్గతులకు నమస్కారము.

47. పాపులకు దుర్గతి కలిగించువాడా! సోమపాలకా! మహా అకించినా! నీలకంఠా! ఈ ప్రజయందు - ఈ పశువులందు ఏ ఒక్కరిని భయభీతులు చేయకుము. ఏ ఒక్కరికిని వ్యాధి కలిగించకుము. మా పశువులలో ఏ ఒక్కదానికి ిశూచికాది వ్యాధులు కలుగనీయకుము.

48. రుద్రుడు బలవానుడు. జటాజూటధారి. శత్రుిర ినాశకుడు. అతని కొరకే మేము ఈ స్తుతులను సమార్జించినాము. ఇందువలన ద్విపద మానవులకు, చతుష్పద గవాది జంతువులకు శుభములు కలుగును గాత. ఈ గ్రామము పరిపుష్టమై కల్లోలము లేనిది అగును గాత.

49. శివస్వాి! నీ దేహము అతిశాంతము. సదా శాంతము. ఔషధ స్వరూపము. అదే సర్వ రోగములకు ఏకమాత్ర ఔషధము. నీ దేహమున మా జీవనమున ప్రసన్నము చేయుము. '**శివా రుతస్య భేషజీ తయానో మృడ జీవసే** '

50. మేము రుద్రుని ఆయుధమునకు దూరముగా ఉందుము గావుత. రుద్రుని రౌద్ర హింసక బుద్ధి మాకు దూరమగును గావుత.

రుద్రా! సేచనసమర్థా! సంపన్న యజమానుల ◌షయమున నీ ధనువును సడలింపుము. మా పుత్ర, పౌత్రాదులను కరుణించుము.

51. సేచనసమర్థ! కళ్యాణకర, శుభస్వరూప శివస్వా◌! మాకు ప్రసన్నుడవగుము. 'నః సుమనాభవ, నీవు నీ ధనురాయుధమును, ఒక ఉన్నత వృక్షమున ఉంచి ◌చ్చేయుము. చర్మము ధరించి ◌చ్చేయుము. పినాకమున దాల్చి మా వద్దకు ◌చ్చేయుము.

52. భగవన్! నీవు శరవర్షము కురిపించువాడవు. ◌లోహితుడవు. నీకు నమస్కారము. నీ వద్ద వేనవేల వ్యాధులు ఉన్న◌. వానిని మా శత్రువుల ◌ద ప్రయోగించుము.

53. రుద్రమూర్తీ! నీ చేత వేనవేల రోగములు ఉన్న◌. వానిపై నీ పెత్తనము ఉన్నది. కావున వాటిని ఇటుకాక వేరువైపు మళ్ళింపుము.

54. ఈ భూ◌ ◌ద వేల కొలది అసంఖ్యాక రుద్రులున్నారు. మా వద్ద ఉన్న మంత్రబలమున వారి ఆయుధములను అన్నింటి తల వంచుదుము.

55. ◌శాలమును, మేఘాధామగు అంతరిక్షమున అసంఖ్యాక రుద్రులు ఉన్నారు. మేము వారి ధనువులను వేల యోజనముల దూరమున వాల్చి వేయుదుము.

56. నీలగ్రీవ, శితికంఠ రుద్రుడు, ద్యులోకమున ఉన్నాడు. మేము అతని ధనువులను వేల

యోజనముల దూరమున వంచి వేయుదుము.

58. రుద్రులు వృక్షములందు ఉన్నారు. వారు లేత గరిక వంటి రంగువారు. నీలగ్రీవులు, రక్తలోచనులు. మేము వారి ధనువులను వేల యోజనముల దూరమున వంచివేయుదుము.

59. రుద్రుడు భూతస్వా◌. జటాజూటధారి. మేము అతని ధనువులను వేలయోజనముల దూరమున వంచివేయుదుము.

60. ఉరిత్రాడు చేతపట్టి, కరవాలము ధరించి రుద్ర తీర్థములందు భ్ర◌ంచు వారి ఆయుధములను వేల యోజనముల దూరమున తలలు వంచునట్లు చేయుదుము.

62. అన్నము తినుచున్నవారిని హతమార్చు రుద్రుల యొక్కయు, పాత్రలందుంచిన పాలు మున్నగున◌ త్రాగి పోవు రుద్రుల యొక్కయు ఆయుధములను వేల యొజనముల దూరముననే వాల్చివేయుదుము.

63. ఇంతటి వారును - ఇంతకు ◌ంచిన రుద్రులు ఈ భూమండలములు దిశ, ◌దిశలందు వ్యాపించి ఉన్నారు. వారందరి ఆయుధములను వేలయోజనముల రాల్చి వేయుదుము.

64. ఎవరు ద్యులోకమున ఉన్నవారో, ఎవరి బాణవర్షము బిందు రూపమగునో ఆ రుద్రులకు నమస్కారము. తూర్పున నిలిచి వారికి నా దశాంగుళులను జోడించుచున్నాను. దక్షిణమున

నిలిచి నా దశాంగుళులను జోడించు చున్నాను. పశ్చిమమున నిలిచి నా దశాంగుళులను జోడించు చున్నాను. ఉత్తరమున నిలిచి నా దశాంగుళులను జోడించుచున్నాను. ఊర్ధ్వ దిశకు నా దశాంగుళులు జోడించుచున్నాను. ఆ రుద్రులకు నమస్కారము. వారు మమ్ము రక్షించవలెను - మాకు సుఖములు కలిగించవలెను. మేము ద్వేషించువారిని మమ్ము ద్వేషించువారిని, మేము ఆ రుద్రుల నోట పడవేయుదుము.

65. ఎవరు అంతరిక్షమునందున్నారో - ఎవరి బాణము వాయువులగునో వారికి తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వ దిశలకు మా దశాంగుళులు జోడించి నమస్కరించుచున్నాము. వారు మమ్ము రక్షింతురు గాత. మాకు సుఖములు కలిగింతురు గాత. మేము ద్వేషించువారిని. మమ్ము ద్వేషించు వారిని, మేము రుద్రుల నోట పడవేయుదుము.

66. ఎవరు భూమండలమున ఉన్నారో, ఎవరి బాణములు అన్నమగునో అట్టి రుద్రులకు నమస్కారము. వారికి తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వ దిశలకు మా దశాంగుళులు జోడించుచున్నాము. వారు మమ్ము రక్షింతురు గాత. మమ్ము సుఖవంతులను చేయుదురుగాత. మేము ద్వేషించువారిని - మమ్ము ద్వేషించు వారిని రుద్రుల నోట పడవేయుదుము.

## దాశరథి రంగాచార్య ిరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## శతురుద్రియమను పదహారవ అధ్యాయము సమాప్తము.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ఒ

అధారం స్సర్వ ిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ఒఒ

## పదిహేడవ అధ్యాయము

1. అశ్మన్నూర్జం పర్వతే శిశ్రియాణామధ్భ్య ఓషధీభ్యో వనస్పతిభ్యో ిఅధి సంభృతం వయః ।

తాంన ఇషమూర్జం ధత్తమరుతః సం రరాణా ఆశ్మంస్తే క్షుణ్మయి త ిఊర్గ్యం

ద్విష్మస్తం తేశుగృచ్ఛతు ॥

( నిండు కుండలోని నీటిని వేదికి నలువైపుల చల్లవలెను.)

మరుత్తులారా! సారవంతమగు వృష్టి పర్వతములను ఆశ్రయించి ఉండును. వృష్టి వలన వనస్పతులు, ఓషధులు వర్ధిల్లును. వానిని గోవులు మేయుట వలన కలుగు దుగ్ధాదులను మాకు ప్రసాదించండి. ీరు ఉదారులగు దాతలు. మాకు వర్షమును, బల స్వరూపములగు ఘృతాదులను ప్రసాదించండి.

అగ్నీ! మా హ ి ఆరగించుటకు నీకు ఎంతో ఆకలి కావలెను. నీ తేజము నాలో ప్రవేశించవలెను. మమ్ము ద్వేషించువారికి నీ మంటలు తాకవలెను.

(కడవను బయట ఉంచవలెను)

2. అగ్నీ! ఈ ఇటుకలు మాకు కామధేనువులు అగును గాత. అ ి ఒకటికి పది - పదికి వంద - వందకు వేయి, వేయికి ఆయుతము, ఆయుతమునకు నియుతము, నియుతమునకు ప్రయత్నము, ప్రయుతమునకు అర్బుదము, అర్బుదము సముద్రము, మధ్యము, అంతము, పరార్థములై - నీ కృప వలన నాకు ఇహ పరలోకములందు కామధేనువులు అగును గాత.

3. ఇష్టకలారా! ీరు వసంతాది ఋతుస్వరూపలు. యజ్ఞమును వర్ధిల్లచేయువారు. ి శేష ఋతు యజ్ఞమున స్థిరపడువాడు. ఘృతమును కరిగించువారు. మధువును సే ించువారు. ిరాజ నామకములు - అక్షయ లోకమాతృణ్ణ ఇష్టకలగు ీరు సాక్షాత్తు కామధేనువులు.

4. (మండూకము - శేవల, వేంత శాఖలను వెదురు బొంగుకు కట్టి వేది ీద దక్షిణ దిశన ప్రారంభించి లాగవలెను.)

అగ్నీ! మేము నిన్ను నీటి శేవలమున చుట్టుదుము. నీవు మా ిషయమున ఉదారుడవు. శాంతుడవు. అగుము.

5. అగ్నీ! మేము మంచువంటి శేవలమున నిన్ను చుట్టుదుము. నీవు మా ిషయమున ఉదారుడవు. శాంతుడవు అగుము.

6. అగ్నీ! నీవు నేల ీద - వేంతశాఖ యందు - నదులందలి శీతల శేవలములకు దిగిరమ్ము. నీవు జలములకు వెలుగువుకదా!

మండూకమా! నీవు ఈ శేవల, వేంత సహితుడవై మాకు లభింపుము. నీవు మా

యజ్ఞమును అగ్నివంటి తేజస్విగను - శాంతమును చేయుము.

7. ఇది జలములు నిండిన స్థానము. సముద్రపు మహాస్థలము. అగ్నీ! ఇక నీ జ్వాలలు మమ్ము కాక ఇతరులను కాల్చవలెను. నీవు మా ిషయమున మాత్రము నిత్యము శాంతుడవగుము.

8. శోధక అగ్నీ! నీ యొక్క మందజ్వాలా జిహ్వలతో మమ్ము చేరుకొనుము. ఈ యజ్ఞమునకు దేవతలను ఆహ్వానించుము. వారిని పూజింపుము.

9. దేదీప్యమానశోధక అగ్నీ! నీవు దేవతలను ఇచటికి కొనిరమ్ము. వారికి మా హని అందించుము.

10. అగ్ని తన ప్రకాశవంత, చైతన్యకారక దీప్తిచే - ఉషః కాలము తనదీప్తిచే వలె శోభిల్లును. అగ్ని అశ్వయుద్ధమున శత్రువులను హింసించుచు మహాజ్వాలలచే అజరుడగును - నిత్యయౌవనుడగును. మేము అట్టి అగ్నిని మండూక, శేవల, వేంతసములచే ప్రశంపచేయుదుము.

11. హరించు అగ్నికి నమస్కారము. శోషింపచేయు అగ్నికి నమస్కారము. అర్చిష అగ్నికి నమస్కారము. నీ జ్వాలాతోరణములు మమ్ము కాక ఇతరులను తపింపచేయును గాత. మాకు మాత్రము కళ్యాణకారి అగుము.

(బంగారు ముక్క సహితముగా ఘృతము నిండిన స్రువము దధి, మధు, కుశముష్టి యుక్త పాత్రను పట్టుకొని అధ్వర్యుచితాగ్నిని చేరవలెను)

12. (స్వయమాతృణ్ణ ఇటుకల ద అయిదు ఆహుతులు అర్పించవలెను)

జఠరాగ్ని రూపమున మానవులందు ఉండునట్లు అగ్నికి ఇది పరోక్ష ఆహుతి. జలములందు ఔర్వాగ్ని రూపమున ఉన్న అగ్నికి ఇది పరోక్ష ఆహుతి. ఆహవనీయాది భావమున కుశల యందున్న అగ్నికి ఇది పరోక్ష ఆహుతి. వృక్షములందు దావాగ్ని రూపమున ఉన్న అగ్నికి ఇది పరోక్ష ఆహుతి స్వర్గమందు ఆదిత్యరూపమున రాజిల్లు అగ్నికి ఇది పరోక్ష ఆహుతి.

13. (పాత్రయందలి ఘృతబిందువులను కుశలచే తుడువవలెను)

దేవతలందు యజనయోగ్యులు ఉన్నారు. యజనయోగ్యులందు పరిపక్వ అన్నాది భాగములు అందుకొనువారున్నారు. అట్టి ప్రాణాది దేవతలు పత్యక్షరూపులై ఈ యజ్ఞమున ఘృతములు ఆరగించవలెను.

14. ఏ ప్రాణాది దేవతలు ఇంద్రాదుల శరీరములందు ప్రవేశించు దేవత్వమునొందినారో, ఎవరు జీతమునకు అగ్రగాములు అగుదురో, ఎవరు లేకున్న శరీరచలనము సాగదో, అట్టి ప్రాణాది దేవతలు ద్యులోకమున ఉండరు. భూలోకమున ఉండరు. వారు ముక్కు, కన్నులు మున్నగు అవయవములందు వసింతురు.

15. అగ్నీ! ప్రాణ, అపాన, వ్యాన, బ్రహ్మవర్చస్సులనిచ్చునీ జ్వాలలు మాకు శాంతములగును గాత. అ ఇతరులను కాల్చును గాత. శోధక అగ్నీ! మాకు నీవు శాంతమూర్తి అగుము.

16. (యజ్ఞశాల ద్వారమందున్న అగ్నికి ఆహుతులీయవలెను)

భక్షక రాక్షసులనందరను అగ్ని తన తీవ్రతేజమున పారద్రోలవలెను. అగ్ని మాకు ధనము నీయవలెను. **"అగ్నిర్నో వనతేరయిమ్"**

17. (పంచమందలి ఘృతముచే హోమము అయిన తర్వాత షోడశమందున్న ఘృతము నందలి అర్ధభాగముచే యజ్ఞశాల ద్వారమందలి అగ్నికి ఆహుతులు అర్పించవలెను)

ిశ్వకర్మ - ఆదిఋషి - సృష్టి యజ్ఞపు హోత - మా పితరులు ిరినందరిని ిలయము చేసిన వాడే ిశ్వసృష్టిరూప సంపదను కోరి సృష్టి రూపమున ఈ బ్రహ్మాండమును ఏర్పరచును. అతడు సృష్టిచేసి సృష్టి యందలి భూతజాతములందు ప్రవేశించును.

18. బ్రహ్మాండమును సృష్టించనపుడు ిశ్వకర్మ నిలిచిన స్థానమెయ్యది ? అతని క్రియ ఏిు? అతని ఉపకరణములేని? సర్వద్రష్ట ిశ్వకర్మ తన మహిమచే భూలోకమును సృష్టించి దానికి ద్యులోకపు ఆచ్ఛాదన ఏర్పరచినప్పటి స్థితిఏిు?

19. ిశ్వకర్మ ిశ్వచక్షువు. ిశ్వతోముఖుడు. ిశ్వతో బాహువు. ిశ్వపాత్తు. అతడు ఒక్కడే తనబాహువులచే భూలోక ద్యులోకములను సృష్టించినాడు. అతనికి బాహ్య ఉపకరణములతో పనిపడలేదు.

20. ిశ్వకర్మ ద్యావాపృథ్వులను నిర్మించుటకు ఉపయోగపడిన అరణ్యము ఏది? వృక్షము ఏది ? ిద్వాంసులారా! భువనములను సృష్టించినవాడు ఎచట నిలిచి సృష్టించినాడని మనసున ఆలోచించండి.

(జగదాధారునకు ఆధారము అవసరమా అని)

21. ిశ్వకర్మా! నీకు ఉత్తమ, మధ్యమ, అపర తేజస్సులున్ని. వానిని నీ ిుత్రుడగు యజమానికి ప్రసాదించుము. ఏలననగా ఆ యజమానులు సమర్పించిన హిస్సుల వలననే నీవు అన్నవంతుడవగు చున్నావు. నీవు ిశ్వకర్మవు. ిశ్వకర్మరూపవు. ఈ యజ్ఞమున నిన్ను వర్థిల్లచేసికొనుము. నీ యజనము నీవే చేసికొనుము.

22. ిశ్వకర్మా! హిస్సులచే వర్థిల్లుము. నీవు స్వయముగా ద్యులోక, భూలోక భూతముల యజనము చేయుము. నీవు ఆ ిధముగా చేయుటను చూచి మా శత్రువులు నివ్వెరపోవుదురు. ఈ యజ్ఞమున ఇంద్రుడే మాకు ఉపదేశకుడు అగును గాత.

23. ిశ్వకర్మ వేదవాణి పాలకుడు. ిశ్విధాత. మనో వేగవంతుడు. నేడు మేము మా రక్షణకు గాను ిశ్వకర్మను ఈ యజ్ఞమునకు ఆహ్వానించుచున్నాము. రక్షించుటలో అత్యంత నైపుణ్యము కలవాడును అందరకు శుభములు కలిగించువాడును అగు ిశ్వకర్మ మేము సమర్పించు సకల సామాగ్రిని ఆస్వాదించవలెను.

24. ◌శ్వకర్మ! హ◌ద్వారా వర్ధిల్లిన నీవు ఇంద్రుని అవధ్యుని చేసినావు. అందువలన సకల యుద్ధములకు ఇంద్రుడు ఆహ్వానించబడువాడు అయినాడు. ఆ ఇంద్రుని యందు పూర్వ ప్రజలందరు తలలు వంచినారు.

25. **◌శ్వకర్మ చక్షుషః పితా మనసాహిధీరో** - చక్షుపాలకుడు. మనోధీరుడు. చంచలములగు ద్యావాపృథ్వులను దృఢపరచుటకు అతడు జలమును సృష్టించినాడు.

పూర్వ ఋషులగు వసిష్ఠాదులు ద్యావాపృథ్వులను దృఢపరచగా ◌శ్వకర్మ వానిని ◌స్తరింపచేసినాడు.

26. ◌శ్వకర్మ ◌శిష్టమనస్కుడు. ధారనకర్త. పరమద్రష్ట. భక్తులను అనుగ్రహించువాడు. అతని భక్తుల కొరకు అభిమతపదార్థములు - సప్తర్షులు ◌శ్వకర్మతో ఏకత్వము పొందినచోట - అమృతరసమున రుచికరములగును.

27. అతడు మనపాలకుడు. ఉత్పాదకుడు. ◌ధాత. సమస్తలోకజ్ఞాత. అతడు ఒక్కడే సమస్తదేవతల పేర్లు గలవాడు. ప్రశ్నవ్యుడు. అంత్యకాలమున అన్ని భూతములు అతని యందే చేరుచున్న◌.

28. వసిష్ఠాదులు పదిహేడు అవయవముల లింగశరీరమున ప్రేరితులై, ◌స్తీర్ణ అంతరిక్షమున నిలిచి, ఈ సమస్త భూతములకు ఉత్పన్నము చేసినారు. పూర్వకాలమందు వసిష్టాది సప్తర్షులు ప్రథమస్తోతలు అయినారు. వారు ◌శ్వకర్మ సృష్టించిన బ్రహ్మాండరూపజలమును యజించినారు.

29. ది◌కి పరము, పృథ్వికి పరము, దేవాసురులకు పరమైనది ఏది? పూర్వము దేవగణములు దర్శించిన మహాజలమును గర్భమున దాల్చినది ఎవరు?

30. ఆ జలమే ◌శ్వకర్మను తొలిసారిగా గర్భమున దాల్చినది. అందునుండియే సమస్త దేవతలు అవతరించినారు. పుట్టుక లేని - అజస్య - అతని యందు అంత్యకాలమున సమస్త భూతములు చేరిన◌. అతని నాభినుండియే సకల దేవతలు, భూతములు వెడలిన◌.

31. జీవులు సమస్తము సృష్టించిన ◌శ్వకర్మను తెలిసికొనరు. తమలోనే ఉన్న అతనిని కానలేరు. వారిని మాయ మంచు వలె ఆవరించి ఉన్నది. అది అజ్ఞానము. అందువలన వారు తమను మాత్రము ఎరుగుచున్నారు. యజ్ఞయాగాదులు చేయుచు ఇహ, పర భోగములందు తృప్తి చెందుచున్నారు.

32. ◌శ్వమునందు సర్వప్రథమముగా ◌శ్వకర్మయే ఆ◌ర్భ◌ంచినాడు. రెండవవారుగా గంధర్వులు, మూడవ వారుగా ఓషధులు వానిని పోషించు పర్జన్యుడు అవతరించినారు. పర్జన్యుడు ◌◌ధ జలములను తన గర్భమున దాల్చినాడు.

**వైశ్వకర్మణహోమః సమాప్తః**

ిశ్వకర్మహోమము సమాప్తము.

33. (ఈ 12మంత్రములు జపించుచు బ్రహ్మ యజ్ఞశాల యొక్క దక్షిణదిశకు సాగవలెను)

ఇంద్రుడు శీఘ్రుగాిు. తన వజ్రమునకు పదును పెట్టుకొనువాడు. ఆబోతు వంటి భయంకరుడు. శత్రుఘాతకుడు. శత్రువులను అల్లకల్లోలము చేయువాడు. ినదించువాడు. రెప్పవాల్చనివాడు. ఎంతో ీరుడు. తాను ఒక్కడే నూరింతల శత్రుసేనలను గెలుచువాడు.

34. ఇంద్రుడు కేకవేయువాడు. అనిమేషుడు. జయశీలుడు. యుద్ధకారి. అజేయుడు. ప్రగల్భుడు. నిర్భయుడు. బాణహస్తుడు. వరదుడు. జనులారా! ఇంద్రుని ద్వారా ీ శత్రువుల తలలు వంచండి.

35. ఇంద్రుడు యుద్ధకారి. బాణహస్తుడు. కరవాలధారులగు మరుద్గణములతో కలసి శత్రుమాత్రులను వశపరచుకొనును. ఇంద్రుడు తుముల యుద్ధిజేత. సోమపాయి. తన బాహువులచే శత్రువును హింసించువాడు. ఉగ్రధన్వి. బాణవర్షము కురిపించువాడు.

36. బృహస్పతీ! నీవు రథమును అధిరోహించుము. సర్వత్ర సంచరించుము.

ఇంద్రా! నీవు రాక్షసనాశకుడవు. శత్రువధశాలిి. శత్రుసేనా భంగకుడవు. సంహారకుడవు. యుద్ధములందు శత్రుపరాజయకర్తవు. నీవు మా రథములను రక్షింపుము.

37. ఇంద్రా! నీవు శత్రుబల జ్ఞాతవు. చిరంతనుడవు. ప్రకృష్టీరుడవు. బలశాలిి. అన్నవంతుడవు. శత్రుసంహారకుడవు. ఉగ్రుడవు. ీరపరివేష్ఠుడవు. సేవకులు చుట్టున్నవాడవు. బలోత్పన్నుడవు. స్తుతివాణిజ్ఞాతవు.

ఇంద్రా! నీవు జయశీల రథమునధిరోహించుము.

38. ఇంద్రుడు పణుల కొట్టములను కొట్టినవాడు. స్తుతులను గ్రహించువాడు. వజ్రబాహువు. యుద్ధిద్యను ఎరిగిన వాడు. స్వబలమున పగతురను ిరుచువాడు.

ిత్రులారా! ఇంద్రుని స్తుతించండి. అతనిని ఉత్తేజితుని చేయండి. యుద్ధము కొరకు ఆరాటపడునట్లు చేయండి.

39. ఇంద్రుడు అసురులను అల్లకల్లోలము చేయువాడు. అదయుడు. ీరుడు. శతశః క్రోధి. అప్రచ్యావ్యుడు. సేనలను పరాభిించువాడు. ఎదురులేనివాడు.

ఇంద్రా! యుద్ధములందు మా సేనలను రక్షింపుము.

40. ఇంద్ర! బృహస్పతులు మా సేనలకు నేతలు. యజ్ఞ అధిష్టాత ిష్ణువు దక్షిణ పార్శ్వమున నిలుచును. సోముడు అగ్రేసరుడగును. మా సేన శత్రుసేనను

ఖండఖండములు చేయగలది. ిజయము సాధించగలది. ఈ దేవసేనకు అగ్రమున మరుత్తులు సాగుదురు.

41. కోరికలు తీర్చు ఇంద్రుడు - రాజావరుణుడు - ఆదిత్య మరుత్తుల మహాబలము - మహామనులు, లోకపాలకులు, జయప్రదులగు దేవతలు ీరందరు ఒకేమారు తుముల నాదము చేసినారు.

42. ధనవంత ఇంద్రా! ఉత్సాహము ఉడిగిన మా ీరుల మనోబలము పెంచుము. వారు మరల ఆయుధములు ఎత్తునట్లు చేయుము. వేగవంత అశ్వముల, జయశీల రథముల నాదములు పెల్లుబుకవలెను.

43. ఎగురుచున్న మాధ్వజములు శత్రువుల ధ్వజములతో తలపడినపుడు ఇంద్రుడు మాకు రక్షకుడు అగును గాత. ఇంద్రుని కృపవలన మా శరములు శత్రువును గెల్చును గాత. మా ీరులు శత్రువులకు భారమగుదురు గాత.

దేవతలారా! మా ఆహ్వానములందే మమ్ము రక్షించండి. **" దేవా అవతా హవేషు "**

44. అప్వదేవతా! నీవు శత్రువుల మనస్సులను కలచి వేయువాడవు. శత్రువుల మనసులను కల్లోలపరచి, వారి అవయవములు అందుకొని పారిపొమ్ము. మరల శత్రువుల అవయవములు కొనిపోవుటకే ఇచటికి రమ్ము. శత్రువుల హృదయములను పుత్రాది శోకములచే నింపుము. మా శత్రువులు గాఢాంధకారమున కలసి పోవుదురు గాత.

(వ్యాధిభయము, మనో దౌర్బల్యము కలిగించునది అప్వ)

45. మంత్రములచే తీక్ష్ణము చేయబడిన శరవృష్టీ! ఒనిన్ను ిడిచినంత శత్రువు ీదకు పొమ్ము. శత్రువును తాకుము. మా శత్రువులందు ఒక్కడు సహితము బ్రతికి పోకుండునట్లు చేయుము.

46. మా సేనలారా! శత్రువు ీద ిరుచకు పడండి. వారిని ఓడించండి. ఇంద్రుడు ీకు సుఖములను ఇచ్చునుగావుత. ీ భుజములందు ిమ్ము ఎంతటివాడును ఓడించరానంతటి బలముకూడును గావుత.

47. మరుత్తులారా! శత్రుబలములు పగబట్టి మా ీదకు దండెత్తినం. ఏదేని ఉపాయమున వారికి గాఢాంధకారము కలిగించండి. వారికి ఎటు తోచకుండ చేయండి. వారిలోనే ఒకరినొకరు గుర్తించకుండ చేయండి.

48. ఏయుద్ధమున బాలుర శిరోజముల వంటి చక్కని బాణములు వర్షించునో అచట ఇంద్రుడు, బృహస్పతి, అదితి మాకు శాంతిని, సుఖమును ప్రసాదింతురు గాత.

49. (యుద్ధమునకు ఉద్యిుంచిన రాజునకు అధ్వర్యు కవచము ప్రదానము చేయును)

ీరుడా! నీ మర్మస్థానములను కవచముచే కప్పుచున్నాను. రాజగు సోముడు నిన్ను అమృతమున నిలుపును గాత. వరుణరాజు నీ ఉరమును రాతికన్న గట్టిది చేయును గాత. దేవతలు నిన్ను ప్రోత్సహించుచు జయము కలిగింతురు గాత.

50. (ఔదుంబరపు మూడు సంధులను నేతిలో ముంచి యజ్ఞశాల ద్వారమందలి అగ్నికి ఆహుతులు సమర్పించవలెను)

ఘృతాహుత అగ్నీ! మా యజమానికి ఉత్కృష్టస్థితి కలిగింపుము. ధనసమృద్ధి కలిగింపుము. సంతానము ద్వారా ఇతనిని బహుసంఖ్యాకుని చేయుము. " సృజ ప్రజయాచబహుంకృధి "

51. ఇంద్రా! ఈ యజమానిని అత్యంత ప్రకృష్టుని చేయుము. ఇతని సజాతీయులు ఇతని వశమున మసలునట్లు చేయుము. ఇతనిని బ్రహ్మవర్చస్సు కలవానిని చేయుము. ఇతడు యజ్ఞములందు దేవతలకు వారి భాగములు ఇచ్చువాడు కావలెను.

52. అగ్నీ! ఏ యజమాని గృహమందు మేము దేవతలకు హవి అర్పించుచున్నామో అతనిని వర్ధిల్లచేయుము. దేవతలందరు ఇతడు మాకు ఇష్టుడు అందురు గాత. ఇతడు మంత్రములకు స్వామి అగును గాత.

53. అగ్నీ! విశ్వేదేవతలు నిన్ను సంజ్ఞానములచే పోషింతురుగాక. జ్వాలాముఖ, ప్రభాధన అగ్నీ! మాకు శుభంకరుడవగుము.

54. అయిదు దివ్యదిశలు అయిదుగురు దేవతల అధిష్ఠానమున ఉన్నవి. అవి మాకు బుద్ధులను, దుష్టాచారములను పోగొట్టి మమ్ము రక్షించవలెను. దిగ్దేవతలు యజమానికి ధన సమృద్ధిని కలిగించి మాయజ్ఞమున ధనపుష్టి కలిగించవలెను.

55. అగ్ని సంయుద్ధమైనంత మహత్తు కలిగించునదియు, శస్త్రములచే వహనీయమును, స్తుత్యము అగు యజ్ఞము అధ్వర్యు చయనము చేయుచున్నాను. పరిసమాప్తి నొందును. తప్త మహావీర ఘటమును పట్టుకొని ఋత్విజుడు యజ్ఞమును పూర్తిచేయును.

56. అగ్ని దేవతల హితకారి. యజ్ఞముద్వారా జగత్తును పాలించువాడు. హవ్యవాహనుడు. దేవతలను తృప్తిపరచువాడు. దేవతలు యజమానిని అనుగ్రహించుట వలన శతసంఖ్యాక హవిస్సుల యజ్ఞం కలుగును. ఇట్టి యజ్ఞమును దేవతలు పరిగ్రహింతురు. స్వయముగా ఋత్విజుడే దేవతల నిమిత్తము యజ్ఞకార్యమును నిర్వహించును.

57. దేవతలకు ప్రియమగు హవిని యజనము చేయుటకు ఋత్విజుడు సమంత్రకముగా చతుర్థ యజ్ఞ హవిని అర్పించును. అట్లుయజ్ఞము సమాప్తమైనంత మాకు ఆశీర్వచనములు లభించును.

( అధ్వర్యుః పురస్తాద్యజూంషిజపతి హోతా పశ్చాదృచో న్వాహ బ్రహ్మ దక్షిణ తో

**ప్రతిరథంజపత్యేష ఏవ తురీయోయజ్ఞః ఇతిశృతిః** తొలుత అధ్వర్యుయజుస్సులు జపించును. తదుపరి హోత ఋక్కులు వచించును. బ్రహ్మ దక్షిణముగా అప్రతిరథమును జపించును. అట్లు ఇది తురీయ నాలుగవ యజ్ఞమగును)

58. అగ్ని సూర్యుని వంటి కిరణములవాడు. బంగారు వంటి జ్వాలలవాడు. ప్రాణులను వారి వారి పనులను పురి కొల్పువాడు. జ్యోతిస్వరూపుడగు అగ్ని ప్రజ్వరిల్లుచున్నాడు. అగ్ని క్షయము ఎరుంగడు.

పూష దేవత ద్వాంసుడు. ధర్మ రక్షకుడు, అతడు జగములను క్షించును. అగ్ని అనుశాసనము నందుండును.

59. (అగ్నీధ్రగృహమునకు దక్షిణమున అధ్వర్యు ఒక శిలను ఉంచవలెను.)

భ్రంచునట్టి సూర్య రూపమున ఉన్న ఈ శిల ద్యులోక అంతరిక్ష మధ్యభాగమున సంచరించును. ఇది తన తేజమున ద్యావాపృథ్వులను నింపుచున్నది. ఈ శిల సర్వవ్యాపక వేదిని ఘృతసించిత స్రువమును క్షించుచున్నది. అది ద్యులోక భూలోకములను - అందలి జనులను - వారి చిత్తములను దర్శించును.

(అగ్నులందు ఆహవనీయము ద్యులోకము. గార్హపత్యము భూలోకము. అగ్నీధ్రము అంతరిక్షము అగును. శిల అగ్నీధ్రము ఉన్నందున మధ్యస్థానము అయినది.)

60. సూర్యుడు వర్షము నిచ్చి పంటలు పండించును. ఉదయమున తుహిన బిందువులచే లోకములను తడిచేయును. ఎరుపు రంగు కలిగి - శుభములనిచ్చు సూర్యుడు తూర్పున ఉదయించును. నానా కిరణ సంకులుడగు సూర్యుడు ద్యులోకపు మధ్యన రాజిల్లుచున్నాడు. ద్యులోకస్థుడగు సూర్యుడు లోకత్రయమును రక్షించును.

61. సాగర సమవ్యాపకుడు - రథికులందు శ్రేష్ఠరథికుడు - అన్నవంతులందు శ్రేష్ఠ అన్నపాలకుడగు ఇంద్రునే సమస్త స్తుతులు వర్ధిల్లచేయుచున్న.

62. దేవతలను ఆహ్వానించు యజ్ఞం దేవతలను యజ్ఞమున వహించునుగాక. సుఖములను ఇచ్చు యజ్ఞం దేవతలను యజ్ఞమున వహించును గాత. అగ్ని దేవతల యజనము చేయును గాత. యజ్ఞమునకు దేవతలను అగ్ని వహించి తెచ్చును గాత.

63. అన్నము దానము చేయునపుడు నా చేయి పైది అగును. ఆ ఊర్ధ్వహస్తము నన్ను ఉన్నతుని చేయవలెను. మా శత్రువులకు ఇంద్రుడిచ్చు ధనము క్రిందిచేయి భిక్షగా తీసికొనును. అది వారిని నీచపరుచవలెను.

64. నాది పై చేయి అగును. శత్రువుది క్రింది చేయి అగును. దేవ గణములు నన్ను,

వేదత్రయిని వర్ధిల్లచేయవలెను. మా శత్రువులను ఇంద్రాగ్నులు చిందర వందర చేసి పారగొట్టవలెను.

65. ఋత్విజులారా! ఉఖాగ్నిని చేత బూని స్వర్గమునకు సాగండి. ద్యులోకపు వెనుక భాగమున ఉన్న స్వర్గమునకు చేరండి. అక్కడ దేవతలతో కలసిమెలిసి స్థిరపడండి.

66. ిద్వాంసుడగు ఉఖాగ్నీ! తొలుత నీవు నీ ప్రభావమును గుర్తించుము. తూర్పునకు సాగుము. అచట చిత్యగ్ని ఉన్నది. నీవు దానికి ముఖ్యాగ్నిి అగుము. సమస్త దిశలను భాసింపచేయుచు ిశేషముగా దీపించుము. తదుపరి మా ద్విపాద మానవులకు అన్నము, చతుష్పాద గవాదులకు గడ్డి మున్నగునిి కలిగించుము.

67. నేను భూిినుండి పైకి లేచినాను. అంతరిక్షమునకు చేరినాను. అంతరిక్షము నుండి ద్యులోకమునకు ఆరోహించినాను. ద్యులోకపు ఉత్తుంగ శిఖరమునుండి ఎగిరినాను. ఆదిత్య జ్యోతిని చేరుకున్నాను.

68. ిశ్వమును భరించు యజ్ఞమును ిస్తార పరచు ిద్వాంసులు స్వర్గమునకు సాగునపుడు ఎటువంటి లౌకిక పదార్థములను అపేక్షించరు. వారు ద్యావాపృథ్వులను దాటి ఆదిత్య మండలమును ఆరోహింతురు.

69. అగ్నీ! నీవు దేవతలకు నేత్ర స్థానమవు. మానవులకు నీవే సాక్షాత్తు నేత్రమవు. భృగు బ్రాహ్మణుల ిషయమున ప్రీతి గలవారును - యజనశీలురగు యజమానులకు శుభములు కలిగి స్వర్గము ప్రాప్తించవలెను.

70. (ప్రతి ప్రస్థాత చేత స్వయమాతృణ్ణ ఇటుక వద్ద అగ్నిని స్థాపింప చేయవలెను. దాని ీద తెల్లని దూడగల నల్లని ఆవు పాలచే ఆహుతులు అర్పించవలెను.)

సమ మనస్కులై ిపరీత రూపములు కలిగి వెంత వెంట నడచునట్టి రాత్రి, ఉషలు ఒక అగ్ని రూప శిశువును ప్రజ్వలింపచేయుదురు. ద్యావాపృథ్వుల నడుమ నిలిచిన ఈ అగ్ని ిశేష రూపమున శోభిల్లును. ధనదాతలగు దేవతలు అగ్నిని ధరించినారు.

71. అగ్నీ! నీవు సహస్రాక్షుడవు. శత మూర్ధనుడవు. నీి నూరు ప్రాణములు. వేయి వ్యానములు. నీవు వేల సంఖ్యలో గో అశ్వధనములు దానము చేయగలవాడవు. అట్టి నిన్ను అన్నార్థినై యజనము చేయుచున్నాను - స్వాహా.

72. అగ్నీ! నీవు చక్కని రెక్కల గరుడుడవు. నీవు పృథ్వి యొక్క పృష్ఠ భాగమున ఉన్న వేది ీద స్థిరపడుము. నీ ప్రకాశమును అంతరిక్షమున నింపుము. నీ జ్యోతిచే ద్యులోకమును వెలిగించుము. నీ తేజస్సున దిశలను దృఢపరచుము.

73. అగ్నీ! నిన్ను ఆహ్వానించుచున్నాము. నీవు జ్వాలావంతుడవగుము. తూర్పున స్వస్థానమున స్థిరపడుము. ఇది ఉత్కృష్టమగు దేవతలతో కూర్చుండు స్థానము. ఇచట ిశ్వేదేవతలు యజమాని కూర్చుందురు గాత.

74. రిి వరణీయుడు. సర్వ ప్రేరకుడు. సుమతి. అతని తేజస్సు బహురూపకము.

సర్వోత్పాదకము. నేను ఆ సూర్యతేజమును భజింతును. సూర్యుడు - దుగ్ధపూర్ణము, సహస్ర ధారాయుక్తము. బహుదుగ్ధయగు - మహా గోరూపుడు. పూర్వము కణ్వుడు ఆ సూర్యుని తేజస్సును భజించినాడు.

75. అగ్నీ! ఉత్కృష్ట ద్యులోకమున ఆదిత్య రూపమున ఉన్న నిన్ను భజింతుము. అంతరిక్షపు దిగువన ిద్యుద్రూపమున ఉన్న నిన్ను భజింతుము. ఇటుకల కుండ రూప స్థానమున నీవు వాస్తవముగ స్థిరపడినావు. అట్టి నీ యొక్క యోని రూపమగు వేదిని సహితము భజింతును. సిుధలతో కూడిన నీ యందు ఋత్విక్కులు హిస్సులచే హోమము చేయుదురు.

76. యువతను అగ్నీ! నిరంతర సిుధాదానము వలన ఎంతో ప్రజ్వరిల్లువాడవు. నీవు మా యందు పరిపూర్ణముగ దేదీప్యమానుడవు అగుము. మా సమస్త హిరన్నములు సదా నిన్నే చేరుచుండును.

77. అశ్వమేధ అశ్వమును మంత్రములచే మరింత మేధ్యము చేయుదురు. అగ్నీ! అట్లే మేము నిన్ను హిస్సులతోను, స్తోత్రములతోను వర్ధిల్ల చేయుదుము.

78. అశ్వమేధ అశ్వమును మంత్రములచే మరింత మేధ్యము చేయుదురు. అగ్నీ! అట్లే మేము నిన్ను హిస్సులతోను, స్తోత్రములతోను వర్ధిల్ల చేయుదుము.

78. యజ్ఞమును కోరువారును యజ్ఞమును వర్ధిల్లచేయువారును అగు దేవతలు యజ్ఞమునకు ిచ్చేయుటకు గాను మనసా ఘృతమున ఋత్విగ్యజమానుల కుండమునందు అగ్నిని స్థాపించు చున్నాను. ఈ ిశాల ిశ్వపాలకుడగు ిశ్వకర్మ కొరకు సదా హోమము చేయుదును.

79. అగ్నీ! నీవు ఏడు సిుధలు - ప్రాణములు - కలవాడవు. నీకు ఏడు జ్వాలా జిహ్వాలు కలవు. ఏడుగురు ఋషులున్నారు. గాయత్రి మున్నగు ఏడు ఛందస్సులున్ని. ఏడుగురు ఋత్విజులు నిన్ను ఏడు అగ్నిష్టోమాది యజ్ఞ ిధులచే యజింతురు. ఏడు కుండములు కల వేదిని ఘృతముచే నింపుము. స్వాహా.

80. (వైశ్వానర పురోడాశమున యజ్ఞం చేసి మారుత పురోడాశమున హోమము చేయవలెను.)

శుక్రజ్యోతి, చిత్రజ్యోతి, సత్యజ్యోతి, జ్యోతిష్మంతులగు శుక్ర, ఋతపా మరియు పాపములకు అతీతులై ఉండు మరుత్తులు తమ తమ సప్త గణములతో మా యజ్ఞమునకు ిచ్చేయవలెను.

81. ఈదృజ్ -అనాదృజ్ - సదృజ్ - ప్రతి సదృజ్ - ిత - సిత- సభరములను మరుత్తులు మా యజ్ఞమునకు ిచ్చేయవలెను.

82. ఋత - సత్య, ధ్రువ-ధరుణ-ధర్త-ధర్త-ధారయములను మరుత్తులు మా యజ్ఞమునకు చ్చేయవలెను.

83. ఋతజిత్ - సత్యజిత్ - సేనజిత్ -సుషేణ -అన్తిుత్ర -దూరే అుత్ర - గణములను మరుత్తులు మా యజ్ఞమునకు చ్చేయవలెను.

84. ఈదృక్షాస - ఏతాదృక్షాస - ఊషుణ-సదృక్షాస-ప్రతిసదృక్షాస - ుతాస -

సమ్మ్రతాసులను మరుత్తులు మా యజ్ఞమునకు చ్చేయవలెను.

85. స్వతవాన్ - ప్రఘాసి - సాన్తపన -గృహమేధి - క్రీడి - శాకి - ఉజ్జేషి యను మరుత్తులు మా యజ్ఞమునకు చ్చేయవలెను.

86. ఉగ్రశ్చ భీమశ్చ ధ్వాన్తశ్చ ధునిశ్చ ।

సాసహ్వాశ్చాభియుగ్వాచ క్షిపః స్వాహా

దేవరూపప్రజ మరుత్తులు, ఇంద్రునకు అనుకూలముగా నడుచుకొనును. అట్లే ఈ యజమానికి దైం ప్రజ, మానవ ప్రజ అనుకూలురు కావలెను.

87. (రానున్న 13మంత్రములను అధ్వర్యు యజమానిచే అనిపించవలెను.)

అగ్నీ! ఇది స్రుక్ రూపస్తనము. ఇది శిష్టము. - రసవంతము - ఘృత యుక్తము. ఈ స్రుగ్రూపస్తనమును కుడువుము. లోకముల మధ్య ఈ మధుమయ స్తోత్రమున్నది. దానిని ఆస్వాదించుము. తృప్తుడవగుము. సముద్ర సంబంధమగు నీ గృహమున ప్రవేశింపుము.

88. అగ్ని జ్వాలాముఖుడు. నేను అతని ముఖమును ఘృతమున ఆసించితము చేయదలచినాను. ఘృతమేలయనిన ఘృతమే అగ్నికి ఉత్పత్తి స్థానము. అగ్ని ఘృతమునే ఆశ్రయించి ఉండును. అగ్ని యొక్క తేజస్సు ఘృతమే యగును.

అధ్వర్యులారా! హరన్నము సముపార్జించండి. అగ్నిని ఘృత భక్షణకు ఆహ్వానించండి. అగ్ని చ్చేసినంత అతనిని పూర్తిగా తృప్తిని చేయండి.

కోరికలు తీర్చు అగ్నీ! స్వాహా అని నీకు అర్పించిన హవ్యములను దేవతల కొరకు వహించుము. నీవు అందుకొనుము.

89. గోవు యొక్క స్తన రూప సముద్రము నుండి దుగ్ధ రూపము అగు మధుర తరంగములు లేచును. ఆ దుగ్ధములకు అగ్ని సంయోగము కలిగినంత వానికి అమృతత్వము కలుగును. (కాగిన పాలు, పాల ఉత్పత్తులు అమృతమని) దేవతల నోళ్లు ఊరుటకు ఘృతనామము మాత్రము చాలును. ఘృతము అమృతత్వ కారకము.

(ఆయుర్వై ఘృతమ్. ఘృతము వలన ఆయుర్వృద్ధి కలుగును. ఘృతముచే యజ్ఞము చేయుట వలన అమృతత్వము కలుగును.)

90. మేము ఘృతనామమును ఉచ్చరించుచున్నాము. ఈ యజ్ఞమున అన్న సహితముగా ఘృతము అర్పించుచున్నాము. మేము ఘృతమును ప్రశంసించుటను బ్రహ్మ ిినును గాత. ఈ యజ్ఞ రూప గౌర మృగమునకు ఋత్విజులను నాలుగు శృంగములున్ని. ఆ యజ్ఞ రూప గౌరము ధ్యానము చేయుచున్నది.

91. ఇది యజ్ఞ వృషభము. నలుగురు ఋత్విజులే దీని నాలుగు శృంగములు. (బ్రహ్మ, ఉద్గాత, హోత - అధ్వర్యులను నలుగురు ఋత్విజులు) మూడు వేదములు దీని మూడు పాదములు హిర్ధాన, ప్రావర్గ్యములను రెండు శిరస్సులు. ఏడు ఛందస్సులు ఏడు హస్తములగును. మూడు సవనములందు ప్రతి బద్ధమగు ఈ వృషభము తుముల వేదనాదము

చేయును. ఈ ిధముగా ఈ మహాయజ్ఞ దేవత మానవులందు ప్రవేశించినాడు. "మహో దేవో మర్త్యాం ఆివేశ"

92. ఘృతము యజ్ఞ పరిణామ భూతము. అది మూడు ిధములుగా ముల్లికములందు ఉన్నది. దానిని పణులు దాచినారు. అప్పుడు దేవతలు గోవు నుండియే ఘృతమును సముపార్జించి నారు. ఈ ఘృతము ఒక భాగమును ఇంద్రుడు రెండవ భాగమును సూర్యుడు ఉత్పత్తి చేసినారు. మూడవ భాగమును ద్విజన్ములు స్వధద్వారా యజ్ఞ సాధక అగ్ని సాయమున సముపార్జించినారు.

93. ఈ దుగ్ధధారలు గోవు హృదయ సముద్రము నుండి ఉప్పొంగును. శతవ్రజములగు ఈ దుగ్ధ ధారలను శత్రువు తిరస్కరించిన జాడకనరాదు.

నేను ఘృత ధారలను దర్శించుచున్నాను. ఈ ఘృత ధారల మధ్యనే కదా బంగారు రంగు అగ్ని వసించునది!

94. హృదయమునందలి మనసు వంటి పిత్రములు గోవులు. ఆ గోవులు నదుల జలధారలవలె ఘృత ధారలను స్రింపచేయుచున్ని. వేటగానికి భయభీతలై మృగములు ఉరుకులు పెట్టినట్లు - ఈ ఘృత తరంగములు గంతులు వేయుచున్ని.

95. పల్లపు ప్రదేశములందు మహానదుల జలతరంగములు ిరిగి దూకినట్లు - గుర్రపు పందెమునందు గుర్రములు హద్దు దాటి ఎరిగినట్లు ఈ ఘృతపు మహాధారలు తరంగములై ఉప్పొంగిపడుచున్ని.

96. శుభకాములు, మందస్మిత వదనలు, ప్రసన్నచిత్తలై యువతులు తమ ప్రియులను చేరినట్లు ఘృతధారలు అగ్నిని చేరుకొనుచున్ని. ఘృత ధారలు సిధలందు ఇముడును. జాత ప్రజ్ఞుడగు అగ్ని వానిని కలుసుకొని అత్యంత ప్రసన్న చిత్తుడగును.

97. భర్త ఇంటికి వెళ్ళు కన్యలు కాటుక మున్నగు వానిచే అలంకరించు కొన్నట్లు - నాకు ఘృతధారలు కనిపించుచున్నవి. " **యత్ర సోమః సూయతే యత్ర యజ్ఞోఘృతస్య ధారా అభితత్పవన్తే** " ఎచట సోమము స్రవించునో - ఎచట యజ్ఞము ప్రవర్తిల్లునో - అచట ఘృత ధారలు ప్రవహించును.

98. దేవతలారా! మా యొక్క సుమనస్క స్తుతులు ఆలకించండి. ఘృతమయ యజ్ఞమునకు ిచ్చేయండి. ిచ్చేసి మాకు ధనములను అందించండి. మా 'సౌత్రామణి' యాగమును దేవతలకు అందించండి. "ఘృతస్య ధారా మధుమత్పవంతే" ఘృతపు మధుర ధారలు ప్రవహించుచున్నవి. వానిని సహితము దేవతలకు అందించండి.

99. అగ్నీ! నీవు సమస్త బ్రహ్మాండమున వ్యాపించి ఉన్నావు. సముద్రమున వ్యాపించి ఉన్నావు. హృదయమందు వ్యాపించి ఉన్నావు. ఆయుష్యమందు వ్యాపించి ఉన్నావు. జలముల ముఖము నందును - యుద్ధమునందున తేజో రూపమున నిండియున్న - నీ మధుర తరంగ ఘృతమును మేము ఆస్వాదింతుము గాక.

ధామంతే ిశ్వం భువనమధిశ్రితమన్తః సముద్రే హృదయాన్తరాయుషు ।

అపామనీకే సంిథేయ ఆభృస్తమశ్యామ మధుమంతం త ఊర్మిం

## దాశరథి రంగాచార్య ిరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## సేకాది జపపర్యన్తమను పదిహేడవ అధ్యాయము సమాప్తము.

## సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

అధారం స్సర్వ ిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ।।

## పద్దెనిిదవ అధ్యాయము

1. వాజశ్చమే ప్రసవశ్చ మే ప్రయతిశ్చమే ప్రసితిశ్చమేధీతిశ్చమే క్రతుశ్చమే స్వరశ్చమే శ్లోకత్స మే శ్రవశ్చమే శ్రతిశ్చమే జ్యోతిశ్చమే స్వశ్చమే యజ్ఞేవ కల్పంతాం॥

యజ్ఞం వలన మాకు అన్నము కలుగును గాత. అన్నదానపు అనుజ్ఞ కలుగును గాత. శుద్ధి కలుగును గాత. ఉత్సాహము కలుగును గాత. ధ్యానము కలుగును గాత. సంకల్పము

కలుగును గాత. సాధు శబ్దము కలుగును గాత. శ్లోకము కలుగును గాత. యశస్సు కలుగును గాత. శృతి కలుగును గాత. జ్యోతి కలుగును గాత. స్వర్గము కలుగును గాత.

2. యజ్ఞం వలన మాకు ప్రాణము కలుగును గాత. అపానము కలుగును గాత. వ్యానము కలుగును గాత. వాయువు కలుగును గాత. చిత్తము కలుగును గాత. బాహ్య ిషయ జ్ఞానము కలుగును గాత. వాక్కు కలుగును గాత. మనసు కలుగును గాత. నేత్రములు కలుగును గాత. శ్రోత్రములు కలుగును గాత. జ్ఞానేంద్రియ కౌశలము కలుగును గాత. కర్మేంద్రియ కౌశలము కలుగును గాత.

3. యజ్ఞం వలన మాకు ఓజస్సు కలుగును గాత. బలము కలుగును గాత. ఆత్మ శక్తి కలుగును గాత. పుష్టి గల శరీరము కలుగును గాత. సుఖము కలుగును గాత. కవచము కలుగును గాత. అంగ ప్రత్యంగములు కలుగును గాత. అస్థులు కలుగును గాత. సర్వము కలుగును గాత. శరీరములు కలుగును గాత. ఆయువు కలుగును గాత. వార్ధక్యము కలుగును గాత.

4. యజ్ఞం వలన మాకు జ్యేష్ఠత్వము కలుగును గాత. ఆధిపత్యము కలుగును గాత. క్రోధము కలుగును గాత. తేజస్సు కలుగును గాత. బలము కలుగును గాత. జలము కలుగును గాత. జయము కలుగును గాత. మహిమ కలుగును గాత. ిశాలత్వము కలుగును గాత. గృహక్షేత్రాది ిస్తారము కలుగును గాత. దీర్ఘ జీవనము కలుగును గాత. అిచ్ఛిన్న వంశము కలుగును గాత. ప్రభూత అన్న ధనాదులు కలుగును గాత. ిద్యాది గుణోత్కర్ష కలుగును గాత.

5. యజ్ఞం వలన మాకు సత్యము కలుగును గాత. శ్రద్ధ కలుగును గాత. జగత్తు కలుగును గాత. ధనము కలుగును గాత. ిశ్వము కలుగును గాత. తేజస్సు కలుగును గాత. క్రీడ కలుగును గాత. మోదము కలుగును గాత. సంతానము కలుగును గాత. వంశ పరంపర కలుగును గాత. సూక్తము కలుగును గాత. పుణ్యము కలుగును గాత.

6. యజ్ఞం వలన మాకు ఋతము కలుగును గాత. అమృతము కలుగును గాత. అరోగత్వము కలుగును గాత. అనామయత్వము కలుగును గాత. జీవనము కలుగును గాత. దీర్ఘాయుష్యము కలుగును గాత. అశత్రుత్వము కలుగును గాత. అభయము కలుగును గాత. సుఖము కలుగును గాత. నిద్ర కలుగును గాత. శుభమార్గములు కలుగును గాత. సుదినము కలుగును గాత.

7. యజ్ఞం వలన మాకు అశ్వాదుల నియంత్రణ కర్త కలుగును గాత. పోషకుడు కలుగును గాత. క్షేమము కలుగును గాత. ధృతి కలుగును గాత. ిశ్వము కలుగును గాత. తేజము కలుగును గాత. సంిదము కలుగును గాత. ిజ్ఞాన సామర్థ్యము కలుగును గాత. ప్రేరణ సామర్థ్యము కలుగును గాత. జనన శక్తి కలుగును గాత. ధాన్యాదులయు, కృషి ప్రతిబంధకుల నివృత్తి కలుగును గాత.

8. యజ్ఞం వలన మాకు ఐహిక సుఖములు కలుగును గాత. పారలౌకిక సుఖములు కలుగును

గాత. ప్రియము కలుగును గాత. ప్రియ పదార్థము కలుగును గాత. ఁషయ సుఖము కలుగును గాత. ప్రేమ భావము కలుగును గాత. సౌభాగ్యము కలుగును గాత. ధనము కలుగును గాత. ఇహ శుభములు కలుగును గాత. పరశుభములు కలుగును గాత. గృహాదులు కలుగును గాత. యశస్సు కలుగును గాత.

9. యజ్ఞం వలన మాకు అన్నము కలుగును గాత. సత్యవాణి కలుగును గాత. దుగ్ధము కలుగును గాత. దధి కలుగును గాత. మధువు కలుగును గాత. సహ భోజనము కలుగును గాత. సహపానము కలుగును గాత. కృషి కలుగును గాత. వృష్టి కలుగును గాత. జయము కలుగును గాత. శత్రుభేదనీతి కలుగును గాత. ఉద్భిదము కలుగును గాత.

10. యజ్ఞం వలన మాకు గోఅశ్వ ధనము కలుగును గాత. ముక్తామణి కలుగును గాత. ధన సమృద్ధి కలుగును గాత. పుష్టి కలుగును గాత. ఁభుత్వము కలుగును గాత. ప్రభుత్వము కలుగును గాత. పూర్ణత కలుగును గాత. పరిపూర్ణత కలుగును గాత. క్షుద్ర ధాన్య సంపన్నత కలుగును గాత. అక్షయత కలుగును గాత. అన్నము కలుగును గాత. అన్నము లేని బాధకలుగకుండను గాత.

11. యజ్ఞం వలన మాకు ప్రాప్త ధనము కలుగును గాత. ప్రాప్తవ్య ధనము కలుగును గాత. పూర్వ సిద్ధ క్షేత్రాదులు కలుగును గాత. ప్రాప్తవ్య క్షేత్రాదులు కలుగును గాత. సుఖ గమ్య ప్రదేశము కలుగును గాత. సమృద్ధి యజ్ఞ ఫలము కలుగును గాత. యజ్ఞాది సమృద్ధి కలుగును గాత. ద్రవ్యాదులు కలుగును గాత. స్వకర్మ సామర్థ్యము కలుగును గాత. మతి కలుగును గాత. సుమతి కలుగును గాత.

12. యజ్ఞం వలన మాకు ధాన్యము కలుగును గాత. యవలు కలుగును గాత. ఁనుములు కలుగును గాత. తిలలు కలుగును గాత. పెసలు కలుగును గాత. శనగలు కలుగును గాత. కాకునులు కలుగును గాత. సాఁవలు కలుగును గాత. కోదలు కలుగును గాత. నీవారములు కలుగును గాత. గోధుమలు కలుగును గాత. మసూరములు కలుగును గాత.

13. యజ్ఞం వలన మాకు శిలలు కలుగును గాత. మృత్తిక కలుగును గాత. పర్వతములు కలుగును గాత. మహా పర్వతములు కలుగును గాత. సైకతము కలుగును గాత. వనస్పతులు కలుగును గాత. బంగారము కలుగును గాత. వెండి కలుగును గాత. రాగి కలుగును గాత. ఇనుము కలుగును గాత. సీసము కలుగును గాత. రంగము కలుగును గాత.

14. యజ్ఞం వలన మాకు అగ్ని కలుగును గాత. జలము కలుగును గాత. లతలు కలుగును గాత. ఓషధులు కలుగును గాత. వ్యవసాయ ఉత్పత్తులు కలుగును గాత. వ్యవసాయేతర ఉత్పత్తులు కలుగును గాత. గ్రాఁన పశువులు కలుగును గాత. అరణ్య పశువులు కలుగును గాత.

ిత్తము కలుగును గాత. భూిలాభము కలుగును గాత. పూర్వ లాభము కలుగును గాత. స్వార్జిత ఐశ్వర్యము కలుగును గాత.

15. యజ్ఞం వలన మాకు గోవులు మున్నగు ధనము కలుగును గాత. మంచి వసతి కలుగును

గాత. అగ్నిహోత్రాది కర్మలు కలుగును గాత. శక్తి కలుగును గాత. అర్థము కలుగును గాత. ప్రాప్తవ్య అర్థము కలుగును గాత. ఇష్ట ప్రాప్తికి ఉపాయము కలుగును గాత.

16. యజ్ఞం వలన మాకు అగ్ని కలుగును గాత. ఇంద్రుడు కలుగును గాత. సోమమే కలుగును గాత. సరస్వతి కలుగును గాత. పూష కలుగును గాత. బృహస్పతి ఇంద్ర యుగ్మము కలుగును గాత.

17. యజ్ఞం వలన మాకు ిుత్రుడు కలుగును గాత. వరుణుడు కలుగును గాత. ధాత కలుగును గాత. త్వష్ట కలుగును గాత. మరుత్తు కలుగును గాత. ిశ్వేదేవతలు కలుగును గాత. వారితో కూడిన ఇంద్ర యుగ్మము కలుగును గాత.

18. యజ్ఞం వలన మాకు పృథ్వి కలుగును గాత. అంతరిక్షము కలుగును గాత. ద్యులోకము కలుగును గాత. వర్షము కలుగును గాత. నక్షత్రములు కలుగును గాత. దిశలు కలుగును గాత.

19. యజ్ఞం వలన మాకు అంశుగ్రహము కలుగును గాత. రశ్మి కలుగును గాత. అదాభ్యము కలుగును గాత. అధిపతి కలుగును గాత. ఉపాంశువు కలుగును గాత. అంతర్యామము కలుగును గాత. ఐన్ద్ర వాయువు కలుగును గాత. మైత్రా వరుణము కలుగును గాత. అశ్వినము కలుగును గాత. ప్రతి ప్రస్థానము కలుగును గాత. శుక్రము కలుగును గాత.

20. యజ్ఞం వలన మాకు అగ్రయణము కలుగును గాత. వైశ్వ దేవము కలుగును గాత. ధ్రువము కలుగును గాత. వైశ్వానరము కలుగును గాత. ఐన్ద్రాగ్ని కలుగును గాత. మహావైశ్వదేవము కలుగును గాత. మరుత్వతీయము కలుగును గాత. నిష్కైవల్యము కలుగును గాత. సాిత్రము కలుగును గాత. సార్వస్వత్యము కలుగును గాత. పత్నీవ్రతము కలుగును గాత. హారియోజనము కలుగును గాత.

(19,20 మంత్రములందలిి గ్రహములు - అనగ యజ్ఞమునందు ఉపయోగపడు పాత్రలు)

21. యజ్ఞం వలన మాకు స్రువము కలుగును గాత. చమసము కలుగును గాత. వాయవ్యము కలుగును గాత. ద్రోణ కలశము కలుగును గాత. గ్రావణము కలుగును గాత. అధిషవణ ద్వయము

కలుగును గాత. పూతభృతపు కలుగును గాత. ఆహవనీయ సోమ కలశము కలుగును గాత. వేది కలుగును గాత. కుశలములు కలుగును గాత. అవభృథము కలుగును గాత. శమ్యువాకము కలుగును గాత.

(ఇం యజ్ఞపరికరములు)

22. యజ్ఞం వలన మాకు అగ్ని కలుగును గాత. ప్రవర్గ్యము కలుగును గాత. యజ్ఞంశేషము కలుగును గాత. సూర్యము కలుగును గాత. ప్రాణము కలుగును గాత. అశ్వమేధము కలుగును గాత. పృథ్వి కలుగును గాత. దితి కలుగును గాత. ద్యౌ కలుగును గాత. అంగుళి కలుగును గాత. శక్తులు కలుగును గాత. దిశలు కలుగును గాత.

23. యజ్ఞం వలన మాకు వ్రతము కలుగును గాత. ఋతువులు కలుగును గాత. తపము కలుగును గాత. సంవత్సరములు కలుగును గాత. అహోరాత్రులు కలుగును గాత. జంసము

కలుగును గాత. జానుని కలుగును గాత. బృహద్రథన్తర సామము కలుగును గాత.

(కండికాద్వయేన యజ్ఞక్రతు హోమాః 22, 23 మంత్రములందలి యజ్ఞక్రతు హోమములు)

24. యజ్ఞం వలన మాకు ఒకటి కలుగును గాత. మూడు మూడు కలుగును గాత. అయిదు అయిదు కలుగును గాత. ఏడు ఏడు కలుగును గాత. తొంఽమ్మది తొంఽమ్మది కలుగును గాత. పదకొండు పదకొండు కలుగును గాత. పదమూడు పదమూడు కలుగును గాత. పదిహేను పదిహేను కలుగును గాత. పదిహేడు పదిహేడు కలుగును గాత. పందొంఽమ్మది పందొంఽమ్మది కలుగును గాత. ఇరువది ఒక్కటి ఇరువది ఒక్కటి కలుగును గాత. ఇరువది మూడు ఇరువది మూడు కలుగును గాత. ఇరువది అయిదు ఇరువది అయిదు కలుగును గాత. ఇర్వది ఏడు ఇరువది ఏడు కలుగును గాత. ఇర్వది తొంఽమ్మది ఇరువది తొంఽమ్మది కలుగును గాత. ముప్పది ఒక్కటి ముప్పది ఒక్కటి కలుగును గాత. ముప్పది మూడు ముప్పది మూడు కలుగును గాత.

(అయుగ్మస్తోమ హోమార్థమన్త్రాః బేసి సంఖ్య గల స్తోమ హోమ మంత్రములు. ఆదరాతిశయ ద్యోతనార్థా సర్వత్ర పునరుక్తిః ఒక్కొక్క సంఖ్య రెండు మారులు చెప్పుట ఆదరాతి శయము వ్య క్త పరచుటకు)

25. చతుస్రశ్చ త్రిష్టుప్ మేష్టేచ ష్టౌ 8 మేద్వాదశచమే ద్వాదశచ12 మేషోడచే షోడశచ 16 మే ంశతిశ్చమే ంశతిశ్చ 20 మే చతుర్వింశతిశ్చ మే చతుర్వింశతిశ్చ ఆశ్చర్యంగా మే ష్టో ంశ్చతిశ్చమే ష్టాంశతిశ్చ 28 మేద్వాత్రింశచ్చ మేద్వాత్రింశచ్చ 32 మేషట్ త్రింశచ్చ మేషట్ త్రింశచ్చ 36 మే చత్వారింశచ్చ మే చత్వారింశచ్చ 40 మే చతుశ్చత్వారింశచ్చమే చతుశ్చత్వారింశచ్చ 44 మే అష్టాచత్వారింశచ్చ మే అష్టాచత్వారింశచ్చ 48. మే యజ్ఞేవ కల్పన్తామ్.

(మంత్రములు సంఖ్యా సూచకములు సంఖ్యలు సూచించినాను. ఇవన్నియు యజ్ఞం వలన కలుగవలసినం)

26. యజ్ఞం వలన మాకు సంవత్సరన్నర వత్సము కలుగును గాత. సంవత్సరన్నర దూడ కలుగును గాత. రెండు సంవత్సరములు దూడ కలుగును గాత. రెండున్నర సంవత్సరముల దూడ కలుగును గాత. మూడేళ్ళ ఆవు, ఎద్దు, ఆబోతు కలుగును గాత. మూడున్నర సంవత్సరముల ఆవు, ఎద్దు, ఆబోతు కలుగును గాత.

27. యజ్ఞం వలన మాకు నాలుగేళ్ళ ఆవు, ఎద్దు, కలుగును గాత. పరిపూర్ణ వృషభము కలుగును గాత. వంధ్య గోవు కలుగును గాత. యువ వృషభము కలుగును గాత. గర్భ పాతమైన గోవు కలుగును గాత. బండిలాగు ఎద్దు కలుగును గాత. నవ ప్రసూత గోవు కలుగును గాత.

28. అన్నప్రధాన చైత్ర మాసమునకు స్వాహా. ప్రేరక వైశాఖమునకు స్వాహా, జ్యేష్ఠమునకు స్వాహా, యాగప్రధాన ఆషాఢమునకు స్వాహా, యాత్రానిషేధక వాసకారి శ్రావణమునకు స్వాహా, సూర్యతాపక భాద్రపదమునకు స్వాహా, మూడవది అశ్వయుజమునకు స్వాహా, పొట్టి పగళ్ళ

కార్తీకమునకు స్వాహా, ష్ణు స్వరూప మార్గశీర్షమునకు స్వాహా, పుష్టి కలిగించు పుష్యమునకు స్వాహా, చివరిదగు ఫాల్గుణమునకు స్వాహా, భువనపతికి స్వాహా, అధిపతికి స్వాహా, ప్రజాపతికి

స్వాహా.

అగ్నీ! ఇది నీ రాజ్యమగును. నీవు నియంతవు. యజమానిని నియంచువాడవు. శిష్ట అన్నరసము నిత్తము నిన్ను అభిసించితము చేయిచున్నాను. మాకు వర్షము, ప్రజాధిపత్యము కలిగించుమని నిన్ను ఘృతధారలచే తడుపుచున్నాను.

29. యజ్ఞం వలన ఆయువు కలుగును గాత. యజ్ఞం వలన ప్రాణము కలుగును గాత. యజ్ఞం వలన నేత్రములు కలుగును గాత. యజ్ఞం వలన చెవులు కలుగును గాత. యజ్ఞం వలన మాట కలుగును గాత. యజ్ఞం వలన మనసు కలుగును గాత. యజ్ఞం వలన ఆత్మ కలుగును గాత. యజ్ఞం వలన బ్రహ్మ కలుగును గాత. యజ్ఞం వలన జ్యోతి కలుగును గాత. యజ్ఞం వలన స్వర్గము కలుగును గాత. యజ్ఞం వలన స్తోత్రము కలుగును గాత. యజ్ఞేన కల్పతాం యజ్ఞో - యజ్ఞం వలన యజ్ఞం కలుగును గాత. యజ్ఞం వలన స్తోమము కలుగును గాత. యజ్ఞం వలన ఋగ్యజుస్సామములు, బ్రహద్రథన్తర సామము కలుగును గాత.

దేవతలారా! మేము యజ్ఞం చేసి స్వర్గము చేరినాము. మేము అమరులము అయినాము. మేము ప్రజాపతికి ప్రజలమైనాము - స్వాహా.

వసోర్ధారాహోమ మంత్రములు సమాప్తము.

30. మేము అన్నపు అధీనమున ఉన్నవారము. జగన్నిర్మాత్రియు, మహనీయము, అఖండనీయము, సమస్త భూతములను నిలిపినదియు అగు భూమాతను మేము వేద వచనములచే అనుకూలను చేసికుందుము. ఆ భూ◌ి యందు ఉండునట్లు స◌ితా దేవత మమ్ము ప్రోత్సహించవలెను.

31. నేడు ◌ిశ్వమరుత్తులు మా యజ్ఞమునకు ◌ిచ్చేయుదురు గాత. హ◌ిరన్నమునకు ఆకర్షితులై ◌ిశ్వేదేవతలు ◌ిచ్చేయుదురు గాత. వారందరు మమ్ము రక్షింతురు గాత. ఆ దేవతల కృప వలన సమస్త అగ్నులు ప్రజ్వరిల్లును గాత. యజ్ఞపు ఫల స్వరూపముగ మాకు సకల ద్రవ్యములు లభించును గాత. '◌ిశ్వమస్తు ద్ర◌ిణం వాజో అస్మే'.

32. మాకు అన్నము, ఏడు లోకములు, నాలుగు దిశలు, దూరమున ఉన్న స్వర్గము లభించవలెను. ఈ యజ్ఞమందు ధన ప్రాప్తి కలుగుటకుగాను ◌ిశ్వేదేవతలు సహితముగా అన్నము సహితము మమ్ము కరుణించవలెను.

33. నేడు అన్నదానమునకు మాకు అనుమతి లభించును గాత. అన్నమే ఋతువులను కల్పించుచున్నది. అన్నమే దేవతలను కల్పించుచున్నది. అన్నమే నన్ను పుత్ర, పౌత్రాదులు కలుగువానిని చేయుచున్నది. నాకు సమృద్ధాన్నము కలిగినంత అన్నదానము చేసి సకల దిశలను జయించగలను.

34. అన్నము మాముందు ఉండును గాత. అన్నము మా వెనుక ఉండును గాత. అన్నము మాకు మధ్యన ఉండును గాత. అన్నమే హ◌ిద్వారా దేవతలను వర్ధిల్ల చేయుచున్నది. అన్నమే నన్ను ◌ీరపుత్ర, పౌత్ర వంతుని చేసినది. నేను అన్నపతినై సకల దిశలందు వ్యాపింతును.

(అన్నమున దిశలను జయించుట - దిశలకు వ్యాపించుట ఎంత ఉన్నత, ఉదాత్త ఆశయము! ఆయుధమున కాదు అన్నమున జయించుట!! పుచ్చుకొని కాదు ఇచ్చి జయించుట!!!)

35. అగ్నీ! నేను స్వయముగా పృథ్వీ సంబంధ రసమున సంయోజితుడనగుదును. నేను స్వయముగా ఓషధులు, జలములచే సంయోజితుడనగుదును. అటువంటి నాకు నీ దయవలన అన్న ప్రాప్తి కలుగవలెను.

36. అగ్నీ! నీవు ఈ భూ◌ి యందు రసమును ప్రవేశపెట్టుము. అంతరిక్ష, ద్యులోకములందు జలమును స్థాపించుము. నీ దయవలన నాకు సమస్త దిశలు రసపూర్ణములు కావలెను - 'పయస్వినః ప్రదిశః సన్తు మహ్యమ్"

37. అధ్వర్యునగు నేను స◌ితా దేవుని ఆజ్ఞానువర్తిని. అశ్వినుల బాహువులతోను - పూష హస్తములతోను - సరస్వతి వాక్కునను - ప్రజాపతి నియమమునను - అగ్ని యొక్క సామ్రాజ్య సహితముగ యజమానివగు నిన్ను అభిషించించుచున్నాను.

38. అగ్ని సత్య స్థానపువాడు - సత్యమును సహించగలవాడు. అగ్నియే గంధర్వుడు. ఓషధులు అతని అప్సరలు. ఆ అప్సరల పేరు 'ముద్' అగును. ఆ గంధర్వుడు బ్రాహ్మణ,

క్షత్రియులను పాలించును గాత. గంధర్వులకు స్వాహా, ఓషధులకు స్వాహా.

39. రాత్రింబవళ్ళు సంధ్యలను కల్పించువాడు సూర్యుడు. సూర్యుడే సంహిత అగును. సూర్యుడే సామమగును. సూర్యుని కిరణములే అతని అప్సరలు అగుదురు. వారి పేరు 'ఆయువ' అగును. సూర్య రూప గంధర్వుడు బ్రాహ్మణ, క్షత్రియులను పాలించును గాత. సూర్య గంధర్వునకు స్వాహా. సూర్య కిరణములకు స్వాహా.

40. చంద్రుడు ఆనందకరుడు. చంద్రుడు సూర్య కాంతి వలన ప్రకాశించువాడు. చంద్రుడే గంధర్వుడు, నక్షత్రములు అతని అప్సరలు. వారి పేరు 'భాకురి'. ఆ చంద్ర గంధర్వుడు బ్రాహ్మణ , క్షత్రియులను పాలించును గాత. చంద్రునకు స్వాహా. నక్షత్రములకు స్వాహా.

41. వేగవంతుడు - సర్వగాఁు వాయువే గంధర్వుడు. జలములు అతని అప్సరలు. వారి పేరు 'ఊర్జ'' అగును. వాయు రూప గంధర్వుడు. బ్రాహ్మణ, క్షత్రియులను పాలించును గాత. వాయువునకు స్వాహా, జలములకు స్వాహా.

42. సమస్త దేవతలకు మానవులకు అన్నము పెట్టువాడును - సర్వత్ర సంచరించువాడగు యజ్ఞమే గంధర్వుడు అగును. దక్షిణలు అతని అప్సరలు అగును. వారి పేరు 'స్తావ' అగును. యజ్ఞరూప గంధర్వుడు బ్రాహ్మణ, క్షత్రియులను పాలించును గాత. వాయువునకు స్వాహా. దక్షిణలకు స్వాహా.

43. ఇంద్రియ ప్రజకు ప్రభువు - సమస్త నిర్మాణ కారకమగు మనస్సే గంధర్వుడు. ఋక్కులు, సామ గానములు మనసునకు అప్సరలు. వారి పేరు 'ఏష్టయః ' మనో రూప గంధర్వుడు బ్రాహ్మణ, క్షత్రియులను పాలించును గాత. మనసునకు స్వాహా. ఏష్టియులకు స్వాహా.

44. భువనముల స్వాఁు! ప్రజాపాలకా! నీకు పైలోకమున గృహములున్నఁ. ఈ లోకమున గృహములు ఉన్నఁ. నీవు బ్రాహ్మణ, క్షత్రియులకును, నాకును మహా సుఖములు కల్గించుము. స్వాహా.

45. వాయుదేవా! నీవు తడి చేయు సముద్రమవు. నక్షత్రములను కూడిన నభస్వభావుడవు. వర్ష నీహారాదులచే సర్వమున ఆర్ధ్రము చేయు ఆర్ద్ర దానువు. ఐహిక సుఖములనిచ్చు శంభుడవు. పరలోక సుఖములనిచ్చు మయోభుడవు. అట్టి నీవు నన్ను అభివహించుము.

వాయువా! నీవు మరుత్సమూహముడవు. ఇహలోక, పరలోక, సుఖములను ఇచ్చువాడవు. నీవు నన్ను అభీష్టము కొరకు అభివహింపుము. మా సేవలు అందుకొను నీవు మాకు రక్షకుడవు. నీవు ఇహ పర సుఖములనిచ్చు వాడవు. నీవు నన్ను పాలింపుము స్వాహా.

46. అగ్నీ! నీ కిరణములు సూర్యుని చేరినవి. ఆ కిరణములు ద్యులోకమంతటికి పాకినవి. ఆ కిరణములతోనే మమ్ము ప్రతి వ్యక్తికి అనుకూలమగునట్లు చేయుము.

47. దేవతలారా! ఏ ప్రకాశము సూర్యుని యందున్నది. ఏ శోభ గోవులందును, అశ్వములందును ఉన్నది. ఇంద్రాగ్ని బృహస్పతులారా! ఆ శోభను, ఆ ప్రకాశమును మాలో ప్రవేశపెట్టండి.

48. అగ్నీ! బ్రాహ్మణులందు ప్రకాశము ప్రవేశపెట్టుము. క్షత్రియులందు -వైశ్యులందు - శూద్రులందు ప్రకాశమును ప్రవేశపెట్టుము. నా యందు ప్రకాశమును ప్రవేశపెట్టుము.

49. వరుణదేవా! యజమాని నీకు హవిస్సులు అర్పించినాడు. కొన్నింటిని కోరినాడు. నేను మంత్రములచే నిన్ను స్తుతించి యజమాని కోరిన వానినే యాచించుచున్నాను. యశోవంతవరుణా! నీవు వాటిని - కోపించక - యజమానికి ప్రసాదించుము. మా ఆయువునకు సమాప్తము చేయకుము.

50. (అర్క అశ్వ మేధ సంతతియను అయిదు ఆహుతులు అర్పించవలెను.)

స్వర్ణధర్మునకు స్వాహా. స్వర్ణార్కునకు స్వాహా. స్వర్ణ శుక్రునకు స్వాహా. స్వర్ణ జ్యోతికి స్వాహా. స్వర్ణ సూర్యునకు స్వాహా.

51. అగ్ని దివ్యుడు, సుగమనుడు, స్వధామడు. నేను అగ్నిని ఘృత, బలయుక్తిని చేయుచున్నాను. ఆ అగ్ని ద్వారమునే మేము ఆదిత్యుని ఉత్తమ లోకము చేరుకుందుము. అచటి నుంచి స్వర్గమునకు ఆరోహింతుము. అచటి నుండి 'అధి నాకముత్తమం' చేరుదుము.

52. అగ్నీ! నీకు ఉత్తర దక్షిణములను రెండు - జరారహిత - పక్షములున్నవి. వానితో నీవు రాక్షసులను హతమార్తువు. ఆ పక్షములతోనే మమ్ము - పూర్వ ఋషులు చేరి అమరులైనట్టి - పుణ్యలోకములకు చేర్చుము.

53. అగ్ని ఆహ్లాదకుడు. ఉత్సాహవంతుడు. శ్యేనము వంటి వాడు. సత్యవంతుడు. బంగరు రెక్కల పక్షి. అందరకు అన్నము కలిగించువాడు. మహామహుడు. స్థిరుడు. యజ్ఞశాలస్థితుడు. అట్టి అగ్నికి నమస్కరించుచున్నాను. అతడు మమ్ము బాధించకుండవలెను.

54. అగ్నీ! నీవు ద్యులోకమునకు తలవు - భూలోకమునకు నాభివి. జలములకు, ఓషధులకు బలమవు. ప్రాణులందరకు జీవనమవు. అందరకు ఏకమాత్ర శరణమవు. సర్వత్ర అవిచ్ఛిన్న ప్రభావుడవు. నీకు నమస్కారము.

55. అగ్నీ! నీవు విశ్వమునకు గల తలపైద ఉన్నావు. అంతరిక్షమున నీ హృదయము ఉన్నది జలములందు నీ జీవనము ఉన్నది. అగ్నీ! మాకు జలములను ఇమ్ము.

సాగరములను తెంపుము. ద్యులోక, అంతరిక్ష, భూలోకముల నుండి వర్షము తెమ్ము, మమ్ము పాలించుము.

56. ఏ యజమాని యజ్ఞం భృగువులు, వసువులచే సముపార్జించబడినదో - ఆ యజమాని ఇంటికి సకల పదార్థములు చేరును గాత. ఈ యజ్ఞం అభీష్టప్రదము.

57. చేసిన యాగమును - నిత్యము తర్పించిన అగ్నియు మాకు కోరిన స్వర్గాదులను ఇచ్చును గాత. ఈ స్వయంగమన శీల హం దేవతలను చేరును గాత.

58. ఋత్విజులారా! ఈ యజ్ఞకర్మ ప్రజాపతి ంధించినది. దీనిని ీరు స్థిర సంకల్పమునను - సహృదయముతోను - మనసు, చక్షురాది జ్ఞానేంద్రియములచే నిర్వహించండి. అందువలన పూర్వర్షులు చేరి అమరులైన పుణ్యలోకమునకు చేరుకొనండి.

59. సహస్థాన స్వర్గమా! నేను ఈ యజమానిని నీకు అందించుచున్నాను. అతనితో పాటు

అగ్ని పూర్తి చేసిన సుఖనిధి యగు యజ్ఞమును కూడా అర్పించుచున్నాను. ఇక ఈ యజ్ఞపతి నీ వద్దకు స్వర్గమునకు రానున్నాడు. అతడు అచటికి చేరినంత - ఆకాశమందు - ీు దేవతలందరు - సమ్మానించండి.

60. స్వర్గస్థ దేవతలారా! పరమాకాశమందలి స్వర్గమునకు చేరిన ఈ యజమానిని గుర్తించండి. ఈ యజమాని దేవ మార్గమున స్వర్గమునకు వచ్చినపుడు పరిచయము చేసికొనండి.

అతనికి సుఖము కలుగునట్లు అతని కర్మముల శుభ ఫలితములు ప్రకటించండి.

61. అగ్నీ! ప్రజ్వలితుడవగుము. జాగృతుడవగుము. నీవే కర్మలను సృష్టించినావు. యజ్ఞమును సృష్టించినావు - ఈ ఉత్తమమగు యజ్ఞ స్థానమున ిశ్వే దేవతలు, యజమాని కూర్చుండవలెను.

62. అగ్నీ! నీ సామర్థ్యమున నీవు సహస్ర దక్షిణ యజ్ఞమును నిర్వహింతువు. నీ సామర్థ్యముననే సర్వస్వ దక్షిణ యజ్ఞమును నిర్వహింతువు. ఆ సామర్థ్యముననే మేము దేవతల

స్వర్గమునకు చేరుటకు ీలు కలిగించు - ఈ యజ్ఞమును నిర్వహించుము.

63. అగ్నీ! శిల, పరిధి, స్వచ, వేదిని, మంత్రములతో మా యజ్ఞమును ఫలింపజేయుము. మమ్ము దేవతల వద్దకు స్వర్గమునకు చేర్చుము.

64. భార్యా పుత్రులకు ధనము ఇవ్వబడినది. పరోపకారార్థము కుంటి, గ్రుడ్డి, మున్నగు వారికి ధనము దానము చేయబడినది. బ్రాహ్మణ భోజనాదులకు దక్షిణలకు - యజ్ఞ

యాగాదులందు ధనము ఇవ్వబడినది. అగ్నీ! మేము స్వర్గము చేరుట కొరకు - వాటినన్నింటిని స్వర్గమున దేవతలకు అందించుము.

65. ిశ్వకర్మ అగ్నీ! ఘృత మధుధారలు నిరంతరము ప్రవహించు స్వర్గమందలి దేవతలకు మా యజ్ఞ యాగాది పుణ్యమును తెలియపరచుము.

66. నేను అగ్నిని. జన్మతోనే జ్ఞానిని. ఘృతము నా నేత్రము - ముఖము అమృతము - నేనే ఋగ్యజుస్సామత్రిధాతు యజ్ఞమునకు నేనే జలనిర్మాతను. అక్షయ ఆదిత్యుడను నేనే! నేనే హ ిస్సును.

67. ఋగ్వేదమును నేనే. యజుర్వేదమును నేనే. నేనే సామవేదమును.

అగ్నీ! పృథ్వి ీద ఉపకార అగ్నులందు నీవు ఉత్తముడవు. నీవు మమ్ము జీ ించు ప్రేరణ కలిగించుము.

68. ఇంద్రా! వృత్రవధ శత్రుసేన పరాభవమునకు గాను నిన్ను మేము యుద్ధములకు లాగుచున్నాము.

69. పురుహూత ఇంద్రా! దానవులతోటి వానిని - చేతులు లేని వానిని - కుశబ్దకారియగు దైత్యుని నీవు నలిపివేసినావు. వర్ధమానుడు, దేవఘాతకుడు అగు పాదరహిత వృత్రుని నీవు నీ స్వంత బలమున పరిమార్చినావు.

70. ఇంద్రా! మా శత్రువులను హింసించుము. మాపై దండెత్త దలచిన సేనను త్రుంచుము.

మమ్ము దాసులనుగా చేయదలచిన వారిని అడుగున అంధకారమున త్రోయుము.

71. ఇంద్రా! నీవు సింహము వంటి భయంకరుడవు. సంచారి ి. పర్వతములందు తావరము కలవాడవు. ఎంతో దూరము నుండి ద్యులోకము నుండి వచ్చినవాడవు. సృకమును, వజ్రమును పదును పెట్టుము. శత్రువులను కొట్టుము. హింసలకును తరి ికొట్టుము.

72. అగ్ని మా స్తుతులను ఆలకించవలెను. యజ్ఞమునకు ిచ్చేయవలెను. వైశ్వానరాగ్నీ! సుదూర అంతరిక్షమునుండి మమ్ము రక్షించుటకు ిచ్చేయుము.

73. ద్యులోకమున ఆదిత్య భావమున ఉన్నవాడెవడు? అగ్నియే. అంతరిక్షమున ిద్యుద్రూపమున ఉన్నవాడెవడు? అగ్నియే. ఓషధులందు రసభావమున ప్రవేశించువాడెవడు? అగ్నియే. బలమున మథంపగా ప్రకటించబడువాడెవడు? అగ్నియే. అట్టి వైశ్వానరాగ్ని మమ్ము రాత్రింబవళ్ళు రక్షించవలెను.

74. అగ్నీ! నీ రక్షణ యందు మేము మా అభీష్టములు అనుభ ింతుము గాత. ధనవంతులమగు మేము పుత్ర సహితులమై ధనమును అనుభ ింతుము గాత. దేవతలను

పూజించుచు మేము అన్నమును అనుభ్ంతుము గాత. నీ జరారహిత తేజమును సహితము అనుభ్ంతుము గాత.

75. అగ్నిదేవా! మేము నీకు చేతులెత్తి నమస్కరించుచు నీ వద్దకు వచ్చి నీకు హ్ సమర్పించుచున్నాము. నీ యజనీయ, మహనీమ, అహింసనీయ మనమున దేవతలను యజింపుము.

76. ధామచ్ఛదగ్నియు - ఇంద్రుడును - బ్రహ్మయు - బృహస్పతియు - జ్ఞానవంతులగు ్శ్వేదేవతలును నా యొక్క ఈ శుభ యజ్ఞమును రక్షించవలెను.

ధామచ్ఛదగ్నిరిన్ద్రో బ్రహ్మా దేవో బృహస్పతిః ।

సచేతసో ్శ్వేదేవా యజ్ఞం పావన్తు నః శుభే ॥

77. త్వం యంష్ఠ దాశుషో నౄః పాహి శృణుధీ గిరః ।

రక్షా తోకముత త్మనా ॥

యువతమ అగ్నీ! మా స్తుతులను ్నుము. హ్ర్దాత యజమాని మనుష్యులను రక్షింపుము.

## దాశరథి రంగాచార్య ్రచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## వసుర్ధారాదికమగు పద్ధెని్దవ అధ్యాయం సమాప్తము.

## సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం స్సర్వ ్ద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

## పందొ్మ్మదవ అధ్యాయము

1. స్వాద్వీం త్వా స్వాదునా తీవ్రాం తీవ్రేణామృతామమృతేన ।

మధుమతీం మధుమతా సృజా్ సంసోమేన ॥

సోమో ్స్యాశ్విభ్యాం పచ్యస్వ సరస్వత్యై పచ్యస్వేంద్రాయ

## సుత్రామ్ణే పచ్యస్వ

(ఇ౦ సౌత్రామణి యాగమంత్రములు. మూడు అధ్యాయముల వరకు సాగును.)

సురా! రుచిగల నిన్ను రుచిగల సోమమున కలుపుదును. తీవ్రమగు నిన్ను తీవ్ర సోమమున

కలుపుదును. అమృతమయమగు నిన్ను అమృత సోమమున కలుపుదును. మధుమతి వగు నిన్ను మధుమయ సోమమున కలుపుదును.

సోమ సంయోజితసురా! నీవు అశ్వినుల కొరకు పచనమగుము. సరస్వతి కొరకు పచనమగుము. సురక్షకుడగు ఇంద్రుని కొరకు పచనమగుము.

2. ఋత్విజులారా! ఏది యజమానిని ధరించినదగునో, ఏది మానవులకు హితకరమగునో - దేనిని అధ్వర్యులు జలమునందు రాళ్ళతో దంచి తీసినారో, అట్టి అభిషుత సోమమున ఆవుపాలను కలపండి. అది సర్వోత్తమ సోమహ౦ అగును.

3. ఉదరాంతర్వ ర్తియగు వాయువుచే దశాప౦త్రమున పావనము చేయబడిన సోమము ప్రవహించుచు దిగువకు చేరును. అది ఇంద్రునకు అనుకూల ౦త్రము అగును.

4. (అధ్వర్యు యజమానితో అనవలసినది)

యజమానీ! అభిషుతమైన నీ సోమమును గో అశ్వవాలమున - సూర్యపుత్రి శద్ధ - ప౦త్రము చేయును.

5. సోమమా! అభిషుతమగుము. బ్రాహ్మణ, క్షత్రియులందును, ఇంద్రియములందును తేజస్సు పుట్టించుము. సురతో కలసిన నీవు మదకారి౦ అగుదువు. నీ శుద్ధమగు బలమున అగ్ని మున్నగు దేవతల ప్రసన్నులను చేయుము. ఘృతాది సహిత యజమానికి అన్నము ప్రసాదించుము.

6. ౦త్రమా అగ్నీ! ౦త్తుటకు ముందు రైతు ధాన్యమును గడ్డి నుంచి వేరు చేయును. అట్లే ఈ లోకమందు కుశలు అందుకొని నీకు నమస్కరించు యజమానుల వేరు చేసి వారి కొరకు అన్నపానాదులు ఏర్పరుచుము.

(పయోగ్రహాన్ గృహతి, పాలపాత్రను అందుకొనును)

పయోగ్రహమా! నీవు ఉపయామ పాత్ర ద్వారా గ్రహించబడినావు. నేను నిన్ను అశ్వినులు సరస్వతి, సురక్షక ఇంద్రుని కొరకు గ్రహించుచున్నాను. ఇది నీ స్థానము. తేజము, బలము కొరకు

నిన్ను ఇచట స్థాపించుచున్నాను.

7. (సురాగ్రహాన్ గృహ్ణాతి - సురాపాత్రలను అందుకొనవలెను)

సురా సోమములారా! ◌ి ఇరువురి కొరకు వేరు వేరు స్థానములు ఏర్పరచబడిన◌ి. ఆ స్థానములు దేవతలకు హితకరములు. ఉత్తమ వేది స్థానములందు ◌ిరిరువురు కలసిపోకండి.

సురా! నీవు బలశాలిని సురవు. ఇది శుద్ధ సోమరసము. నీవు నీ స్థానమున నిలువుము. ఏనాడును సోమమును బాధించకుము.

8. ఉపయామగ్రహమున సేకరించబడినావు. నీవు అశ్వినులకు తేజస్సువు. సరస్వతికి బలమవు. ఇంద్రునకు శక్తి◌ి. ఇది నీ స్థానము. ప్రమోదము, ఆనందము, తేజస్సు కలుగవలెనని నిన్ను ఇచట స్థాపించుచున్నాను.

9. (దుగ్ధ పాత్రను అందుకొని అందు గోధుమ పిండి - గంగరేగు పొడి వేయవలెను)

దుగ్ధపాత్రా! నీవు తేజస్సువు. నాలో తేజస్సు నింపుము. నీవు ◌ిర్యమవు. నాలో ◌ిర్యము నింపుము. నీవు బలమవు. నాలో బలము నింపుము. నీవు ఓజస్సువు. నాలో ఓజస్సు నింపుము. నీవు కోపమవు. నాలో కోపము నింపుము. నీవు సాహసమవు. నాలో సాహసము నింపుము.

10. ◌ిషూచిక వ్యాఘ్రమునకు, వృకమును రక్షించును. ఎగురునట్టి శ్యేన పక్షి సింహమును రక్షింపును. ఆ ◌ిషూచిక యజమానిని పాపములనుండి రక్షించును గాత.

11. తల్లి పాలు తాగునప్పుడు బిడ్డ తల్లిని తన్నును. అగ్నీ! నేను ఆ ఋణము తీర్చుకున్నాను. నేను తల్లిదండ్రులను బాధించలేదు.

(యజమాని సోమపాత్రలను తాకవలెను)

సోమ పాత్రలారా! ◌ిరు కూర్చు స్వభావము కలవారు. నాకు శుభములు కూర్చండి.

(యజమాని సురాపాత్రలను తాకవలెను)

సురాపాత్రలారా! ◌ిరు వేరు చేయు వారు. నన్ను పాపముల నుండి వేరు చేయండి.

12. ఇంద్రుని కొరకు ఇంద్రియ బలము సముపార్జించునపుడు దేవతలు యజ్ఞమును ◌ిస్తారపరచినారు. అశ్వినులు యజ్ఞమున వైద్యము చేసినారు. వాణి ద్వారా సరస్వతియు వైద్య అయినది.

13. నవయవాంకురము దక్షిణీయ ఇష్టి స్వరూపము. లేచిగురు యవాంకురము ప్రాణీయ ఇష్టి స్వరూపము. లాజలు సోమక్రియ స్వరూపులు, సోమఖండము మధుర సోమరస స్వరూపము.

14. 'మాసరము' అతిథ్యేష్టి స్వరూపము, 'నగ్నహు' మహాీర ఘట స్వరూపము. మూడు రాత్రులు అభిషుతము చేసి మూడు రాత్రులు గుంతలో ఉంచిన సుర 'ఉపనద్' ఇష్టక స్వరూపమగును.

15. ఒకటి, రెండు, మూడు గోవుల పాలచే చిలికి పరిసించితము చేయబడిన సుర సోమక్రియా స్వరూపమగును. అశ్వినుల కొరకు ఒక ఆవు పాలచే మొదటి రోజు - సరస్వతి కొరకు రెండు ఆవుల పాలచే రెండవ రోజు - ఇంద్రుని కొరకు మూడు ఆవుల పాలచే మూడవ రోజు

ఆసించితము చేయబడును.

16. సోమమును ఉంచు పీఠము రాజు యొక్క సింహాసన స్వరూపము. సురను ఉంచు కుంభము 'సౌంకి వేది ' స్వరూపము. రెండు వేదిల మధ్య భాగము ఉత్తర వేది స్వరూపము. సురను శుభ్రముగా చేయుజల్లెడును ఇంద్రుడు మరియు యజమాని వైద్యముగా తెలియవలెను.

17. వర్తమాన వేది వలన 'సౌంకీ' వేది లభించును బర్హి నుండి కుశరూప బలము ప్రాప్తించును.

యూపము అగ్నివలన అగ్ని లభించును.

18. ఈ సౌంత్రాణి యాగమందు అశ్వినులు సద్భావమున హంర్థానము సరస్వతి ఉపస్థితి వలన అగ్నీధ్రము ఇంద్రునకు అర్పించు హం గార్హపత్యము, పత్నీ శాలమని భాంచవలెను.

19. ప్రేషణమున ప్రేషణము - అప్రియజ్ఞము వలన అప్రియజ్ఞము - ప్రయాజముల వలన ప్రయాజము అను యాజముల వలన అనుయాజము వషట్కారము వలన వషట్కారము - ఆహుతుల వల ఆహుతులు సంప్రాప్తించును.

20. పశువులవలన పశువులు, పురోడాశము వలన పురోడాశము, హంస్సులవలన అన్యహంస్సులు, ఛందముల వలన ఛందములు, సాంధాని ఋక్కుల వలన సాంధాని ఋక్కులు, యాజ్యల వలన యాజ్యలు, వషట్కారముల వలన వషట్కారములు లభించును.

21. వేసినధాన్యము, కరంభము, సత్తు, హంష్పంక్తి, పాలు, పెరుగు, ంనిని సోమమునకు ప్రతినిధులుగా తెలియవలెను. దుగ్ధ సంబంధములు, మధు సంబంధములు హం రూపములగును.

22. పెద్దరేగు ధాన్య ప్రతీక. గోధుమలు హంష్పంతి ప్రతీకలు. రేగు సత్తు ప్రతీక. యవలు జలమంథ ప్రతీకలని తెలియవలెను.

23. యవలు దుగ్ధ రూపలు. రేగు దధి రూపము. కర్కంధము సోమరూపము - మధువు సౌభ్య చరు రూపములగును.

24. ' ఆశ్రవాయ ' స్తోత్రియము. ' అస్తువౌషడ ' ప్రత్యాశ్రావము, ' యజ ', ధాయ్యా - ' యేయజామహే ' ప్రగాథ ప్రతినిధులని ఎరుంగవలెను.

25. అర్థర్చల నుండి ఉక్థలు - పదములనుండి నిందలు - ఓం నుండి శస్త్రములు - పాల నుండి సోమము -కలుగునని గ్రహించవలెను.

26. అశ్వినుల సధ్భావమున ప్రాతః సవనము - ఇంద్రుని సద్భావమున మధ్యాహ్న సవనము - సరస్వతి సద్భావమున సాయం సవనము సిద్ధించును.

27. సోమ పాత్రల వలన సకల సోమ పాత్రలను, వైతస పాత్రల వలన ద్రోణ కలశమును, సురను చేర్చుకొను కుంభము వలన అభిషుత సోమము కొరకు పూతభూత -ఆహవనీయ ఘటములు - పళ్ళెముల వలన పళ్ళెములు ప్రాప్తించును.

28. యజావుల నుండి యజుస్సులు, గ్రహముల నుండి గ్రహములు, స్తోమముల నుండి స్తోమములు, స్తుతులనుండి స్తుతులు, ఛందముల నుండి ఛందములు, సోమము నుండి

సోమము అవభృధము నుండి అవభృధమును పొందవచ్చును.

29. ఇడ నుంచి ఇడను సూక్తవాక్కు నుండి సూక్తవాక్కును, ఆశీర్వచనము నుండి ఆశీర్వచనమును, శంయు నుండి శంయును పత్నీ సంయోజముల నుండి పత్నీ సంయోజములను సంష్ఠ యజస్సు నుంచి సంష్ఠ యజస్సును, సంస్థ నుండి సంస్థను పొందవచ్చును.

30. వ్రతము వలన దీక్షను, దీక్ష వలన దక్షిణను, దక్షిణ వలన శ్రద్ధను, శ్రద్ధ వలన సత్యమును ప్రాప్తించ వచ్చును.

31. ఏతావద్రూపం యజ్ఞస్య యద్దేవైర్బ్రహ్మణాకృతమ్ ।

తదేతత్సర్వమాప్నోతి యజ్ఞేసౌత్రామణీ సుతే ॥

ఇది సోమ యజ్ఞ స్వరూపము. దీనిని దేవతలు, బ్రహ్మ దర్శించినారు. సౌత్రామణి యజ్ఞమున సురాసోమము అభిషుతమైనంత యజమానికి ఇవన్నియు ప్రాప్తించును.

32. సౌత్రామణి యాగము సురాయుక్తము. దేవతల ఆసనమగు దర్భాసన యుక్తము. దీనిని మహా ఋత్విజులు నమస్కారయుక్తులై కొనసాగింతురు. మేము అర్చించువారలము. ఋత్విజ యజమానులము. మంత్రములచే సోమమును దేవతల కంపుచున్నాము. ఇంద్రుని మదోన్మత్తుని చేయుచున్నాము.

33. సురా! ఓషధులందున్న నీ యొక్క రసము కూర్చబడినది. నీతో కూడి సోమమునకు బలము చేకూరినది. మాదకమగు రసమున యజమానిని, సరస్వతిని, అశ్వినులను, ఇంద్రుని అగ్నిని తృప్తి పరచుము.

34. ఏ సోమమును అశ్వినులు అసురుడగు నముచి నుండి తెచ్చినారో దేనిని ఇంద్రియముల కొరకు సరస్వతి పరిశుద్ధము చేసినదో అట్టి శుద్ధమును, మధురమును, ఆనందకరమును, రాజగునట్టియు సోమమును నేను ఈ యజ్ఞమున సేవింతును.

35. ఆ సోమపు కొంత భాగము సురలో చేరినది. ఈ సురను ఇంద్రుడు ఉపాయముగ శుద్ధి చేసి సేవించినాడు. రాజగు ఆ సోమపు అంశముగల సురను సుమనస్కుడనై యజ్ఞమునందు సేవింతును.

36. స్వధాప్రియులగు పితరులకు స్వధాన్నము సమర్పించుచున్నాము. వారికి నమస్కారము.

స్వధా ప్రియ పితామహులకు స్వధాన్నము సమర్పించుచున్నాము. వారికి నమస్కారము.

స్వధాప్రియులగు ప్రపితామహులకు స్వధాన్నము సమర్పించుచున్నాము. వారికి నమస్కారము.

(సురాభాండములను సురలకు అర్పించి అగ్నికి ఆహుతులు అర్పించవలెను.)

పితరులు సురాపానము చేసినారు. మత్తులయినారు. తృప్తులయినారు. పితరులారా! మీరు చేతులు కడుక్కొని పరిశుద్ధులు కండి.

37. ( ఈ మంత్రములను జపించవలెను)

సోమప్రియులగు పితరులు నన్ను పవిత్రుని చేయవలెను. ప్రపితామహులు మమ్ము

పవిత్రులను చేయవలెను. శతాయుష పవిత్రమున ప్రపితామహులు నన్ను పావనము చేయవలెను.

పితామహులు శతాయుషుమగు పవిత్రమున నన్ను పావనము చేయవలెను. ప్రపితామహులు శతాయుషమగు పవిత్రమున నన్ను పావనము చేయవలెను. వారిచే చేయబడిన నేను సంపూర్ణ ఆయుష్మంతుడనగుదును గాత.

38. అగ్నీ! ఆయుష్యము కలుగు పనులను మాచే చేయింతువు. మాకు ఆయుష్యము కలుగునట్టి బలము గల అన్నమును తెచ్చి ఇమ్ము. దుష్ప్రవృత్తి గలవారిని మా నుండి దూరము చేయుము.

(ఆయుష్యము కలుగుటకు బలమును ఇచ్చు ఆహారము. దుష్టులకు దూరముగా ఉండుట అవసరమని)

39. దేవజనులు నన్ను పావనుని చేయుదురు గాత. వారు నా మనసు ద్వారా నా బుద్ధిని పావనము చేయుదురు గాత. సర్వ భూతములు నన్ను పావనుని చేయును గాత. జాతవేద అగ్ని నన్ను పావనము చేయును గాత.

40. అగ్నిదేవా! దీప్యమానుడవు నీవు నన్ను శుద్ధ ప◌త్రమున పావనము చేయుము. యజ్ఞము లక్ష్యంగా నీ స్వకర్మమున నన్ను పావనము చేయుము.

41. అగ్నీ! నీ జ్వాలలందు పావనము చేయు శక్తి పరివ్యాప్తమై ఉన్నది. ఆ మహాప◌త్ర శక్తిచే మమ్ము పావనులను చేయుము.

42. సోమము సర్వదర్శి. దానికి పావనము చేయు శక్తి కలదు. ఆ శక్తిచే మమ్ము పావనులను చేయవలెను. పావనము చేయగల వయువు సహితము మమ్ము ప◌త్రులను చేయవలెను.

43. స◌తృ దేవ! నీవు నీ ప◌త్రము మరియు అనుజ్ఞ రెండింటి తోను మమ్ము పావనులను చేయుము.

44. ◌శ్వేదేవతలకు సంబంధించినదియు - ప◌త్ర కారకమగు సురాకుంభము లభించినది. ఇందు అనేక మధుధారలు చేరిన◌. ఆ సురాకుంభము వలన యజ్ఞమునందు దేవస్తల సహితులమై కూర్చుండు ఆనందము కలిగినది. అందువలన మేము ధనస్వాములము అగుదుము గాత.

45. పితరులు సమ మనస్కులు. పద◌, అధికారములందు సమానులు. వారి యమలోకమున ◌రాజిల్లుచున్నారు. ఆ పితృలోకమున పితరులకు స్వధ లభించును గాత. యజ్ఞమును దేవత లేకదా కల్పించినారు. యజ్ఞమునకు నమస్కారము.

46. నా తోటి ప్రాణులు సమాన మనస్కులు. పద◌ అధికారములందు సమానులు. వారు ఈ లోకమున ఉన్నవారు. వారందరి సిరిసంపదలు నూరేళ్ళ వరకు నాకు చేరవలెను.

47. మర్త్యులగు మానవులకు రెండే మార్గములున్న◌. ఒకటి దేవయానము. రెండవది పితృయానము. ఈ రెంటితోనే ఈ లోకమున రాకపోకలు జరుగుచున్న◌. మాతా పితృలకు భేదమేమనిన ద్యులోకము పితరుడు, భూలోకము మాతయగును.

48. (శేషం యజమానో భక్షతి, దేవ పితరులకు సమర్పించగా ◌గిలినది యజమాని సే◌ంచును.)

ఇది పాల హ◌. ఇది నాలో ప్రజనన శక్తి కావలెను. ప్రాణ, అపానాదులకు - సమస్త అంగములకు బలము కలిగించవలెను. శుభములను కలిగించవలెను. ఈ హ◌ ఆత్మ బలము

నిచ్చునది. సంతానము నిచ్చునది. పశువులను ఇచ్చునది. లోకమునిచ్చునది. స్వర్గము నిచ్చునది అగును గాత.

అగ్ని నా ప్రజలను బహు సంఖ్యాకులను చేయును గాత.

ఋత్విజులారా! ీరు మాకు అన్నము, పాలు, బలము కలిగించండి.

49. సోమము సముపార్జించు మా పితరులు నిన్ను లోకములందు ఉన్నచో వారు ఉన్నత మధ్యమ లోకమునకు చేరుకుందురు గాత. మధ్యమలోకమున ఉన్న పితరులు ఉత్తమ లోకమునకు చేరుకుందురు గాత. ఉత్తమ లోకములందున్న పితరులు ముక్తులగుదురు గాత. కపటము తెలియని - సత్యము తెలిసిన వాయవ్య శరీర ధారులగు పితరులు ఆహ్వానముల నుండి రక్షింతురు గాత. "నో వన్తు పితరో హవేషు"

(ఈ ఆహ్వానము పై నుంచి వచ్చునది. దానిని తప్పించమనుట)

50. సోమ సముపార్జకులగు అంగిరులు, నవగ్వ, దశగ్వ అథర్వులు, భృగువులే మాకు పితరులు. ఆ యజనశీల పితరుల మంచి మనసులందు మేము నిలువవలెను. వారి శుభ సంకల్పములందును మాకు స్థానము లభించవలెను.

51. వసిష్ఠులు మా పూర్వజులు. సోమపాయులు. వారు సోమ యాగము చేసినారు. దానిని దేవతలకు అందించినారు. అట్టి మా పితరుల తోడుగా అభిలాషల యముడు హంస్సులను స్వేచ్ఛగా స్వీకరించవలెను. మాకు అభీష్ట వరములనీయవలెను.

52. శిష్ట చైతన్యవంత సోమమా! నీవు మనీషవు. మమ్ము సన్మార్గమున నడిపించుము. మా పితరులకు నీవే మార్గదర్శి వైనావు. అందువలన వారికి యజ్ఞ ఫలప్రాప్తి కలిగినది. వారు స్వర్గమందున్నారు.

53. పావక సోమమా! మా పూర్వజ పితరులు నీ అనుగ్రహముననే జ్ఞానవంతులైనారు. సోమయాగాది కర్మలు నిర్వ ర్తించినారు. నీవు వాయువు మున్నగు ఉపద్రవములకు అతీతుడవు. ఈ యజ్ఞమును ఉపద్రవములనుండి రక్షింపుము. మాకు ీరపుత్రులను, అశ్వములను ప్రసాదించి మా షయమున ధనప్రదుడవగుము.

54. సోమమా! మా పితరులతో ఏకత్వము పొంది నీవు ద్యావాపృథ్వులను స్తారపరచినావు. అట్టి నిన్ను హంస్సులచే సేంచుచున్నాము. నీ దయ వలన మేము ధనస్వాములము కావలెను.

(ఇంతవరకు సోమపాయులగు పితరుల మంత్రములు ముగిసినం. కుశాసనములపై ఆసీనులగు పితరుల మంత్రములు మొదలు)

55. కుశాసనాసీన పితరులారా! ీరు మమ్ము రక్షించుటకుగాను చక్కగా యజ్ఞమునకు చ్చేయండి. మేము ీకుగాను హంస్సులు సముపార్జించినాము. చ్చేయండి. ీనిని

సేించండి. ఎంతో శాంతి నిచ్చు అన్నమున తృప్తి చెందండి. మాకు కలుగుచున్న దుఃఖములను నివారించండి. కలుగనున్న దుఃఖ భయమును నివారించండి.

56. కుశాసన పితరులు ఎంతో జ్ఞానవంతులు. వారిని నేను బాగుగా ఎరుంగుదును. యజ్ఞపు దేవయాన, పితృయాన మార్గములను కూడా ఎరుంగుదును. ఆ మార్గములందు రాకుండుట ఉన్నది. తిరిగి వచ్చుట ఉన్నది. ఏ బర్హి షదులగు పితరులు సోమపు తమ భాగమును స్వధ ద్వారా సేింతురో వారు ఈ యజ్ఞమునకు ేచ్చేయవలెను.

57. సోమపాయి పితరులను - కుశాసనమున - స్థాపించిన ప్రియధన సోమ రసమునకు ఆహ్వానించుచున్నాము. వారు మా ఆహ్వానములను ినవలెను. మా యజ్ఞమునకు ేచ్చేయవలెను. పక్షపాతయుతముగా మమ్ము తమవారిగా చెప్పుకొనవలెను. వారు ప్రసన్ను లై మమ్ము దుఃఖములనుండి కాపాడవలెను.

(ముందు వచ్చున ి అగ్నిష్వాత్త పితరుల మంత్రములు)

58. సోమరస పానము చేయు అగ్ని ష్వాత్తులగు మా పితరులు దేవయాన మార్గమున ఇచటికి ఈ యజ్ఞమునకు ేచ్చేయ వలెను. వారు ఈ యజ్ఞమునందలి స్వధాన్నము సేించి ఉన్మత్తులు

కావలెను. వారు పక్షపాతయుతముగా మమ్ము తమ వారిగా చెప్పుకొనవలెను. మమ్ము దుఃఖములనుంచి కాపాడవలెను.

(అగ్ని స్వధాహ ిస్సులను ఆస్వాదింప చేయునట్టి పుణ్యకర్మ పితరులు అగ్నిష్వాత్తులు)

59. అగ్నిష్వాత్త పితరులారా! ీరు సన్మార్గగాములు. ఈ యజ్ఞమునకు ేచ్చేయండి. ీ కొరకు ఏర్పరచిన ిశిష్ట స్థానమును అలంకరించండి. కుశల ీద ఉంచిన స్వధా హ ిస్సులను ఆరగించండి. ప్రసన్ను లై మాకు పుత్రయుక్త గోమ, అశ్వధనమును ప్రసాదించండి.

60. అగ్నిష్వాత్త పితరులకును - ద్యులోక మధ్యమున స్వధచే ఆనందించు అగ్నిష్వాత్త పితరులకును స్వయంశోభాయమానుడగు యమరాజు తగు రీతిని శరీరములు ఏర్పరచును.

61. ఆయా ఋతువులందు జరుగు యజ్ఞములందలి తమ భాగమును అందుకొనువారును - నరాశంస చమసమున సోమరస పానము చేసిన వారునయిన అగ్నిష్వాత్త పితరులను ఆహ్వానించుచున్నాము. ిద్వాంసులగు మా పితరులు మాకు మంచి ఆహ్వానవంతులు కావలెను. సహనాభవన్తు, వారి దయ వలన మేము ధనస్వాములగుదుము గాత.

62. పితరులారా! దక్షిణదిశన కుడి తొడ బలము ీద ఆసీనులు కండి. ఆసీనులై మా యజ్ఞమును ప్రశంసించండి. మానవ సహజ చాంచల్యమున చేసిన ఏ అపరాధ కారణమునను మమ్ము బాధించకండి.

63. ఎర్రని గొర్రెల ిద ఆసీనులైన పితరులారా! హ ర్ధాత ఆసనమని - కుతప ప్రియాశ్చపితరః ఎర్రని ఆదిత్య లోకపు వారనియు అర్థము. ఆదిత్య లోక జితః పితర ఉచ్యన్తే అని ఉవటుడు)

64. అగ్నీ! నీవు పితరులకు స్వధాన్నము అందించువాడవు. నీవు ఉత్తమముగా భా ంచునదియు వాణిచే స్తుతించబడునదియు అందుకొనుటకు యోగ్యమైన ధనమును దేవతలకు అందించుము.

65. అగ్ని పితృ భోజనమగు కవ్యమును వారి వద్దకు చేర్చును. సత్యమును వర్ధిల్ల చేయును. పితరులను యజించును. అగ్నియే ఆయా దేవతలకు హ ని అందించి అందును గురించి చెప్పును. పితరులకు సహితము అందించును.

66. కవ్యవాహకఅగ్నీ! ప్రశంసితుడవైన నీవు హ ని సుగంధితము చేసి వహించినావు. స్వధను పితరులకు అందించినావు. పితరులు దానిని ఆరగించినారు. ఇక నీవు సహితము నీకు సమర్పించిన హ స్సులను ఆస్వాదించుము.

67. అగ్నిదేవా! పితరులు ఈ యజ్ఞమునకు చ్చేసినవారున్నారు. చ్చేయనివారున్నారు. మేము ఎరిగినవారున్నారు. ఎరుగని వారున్నారు. నీవు జాతవేది గదా! పితరులందరిని బాగుగా ఎరుగుదువు. స్వధల ద్వారా మా ఈపుణ్యయజ్ఞమును ఆస్వాదించుము.

68. పితరులందు చెల్లిపోయినవారున్నారు. కర్మలను త్యజించి పరబ్రహ్మను చేరినవారున్నారు. ఈలోకమందే ఉన్నవారు కలరు. యజ్ఞయాగాదులు చేయుచు

మానవులందున్నారు. అట్టి పితరులందరకు నేడు హ రన్నము అందును గాత.

69. అగ్నీ! మా పూర్వులగు ఉత్కృష్ట పితృజనులు యజ్ఞములు నిర్వహించి, ఉక్థములు పఠించి, అంతమున ప త్ర ప్రకాశమును చేరినారు. పృథ్విని ఛేదించినారు. ఎరుపుగోవులను డిచిపుచ్చినారు.

(అంగిరులు పూర్వ పితరులు. వారు నవగ్వ - దశగ్వ యజ్ఞములు చేసినారు. వేదిమున్నగు వానికొరకు నేలను త్ర్వినారు. వారు ప్రకాశమును చేరుకున్నారు. అప్పుడు వారు పణుల అధీనమున ఉన్న గోష్ఠములను రిచినారు. గోవులను ముక్తము చేసినారు)

70. అగ్నీ! కోరికలతోనే నిన్ను వేది ద ప్రతిష్ఠించుచున్నాము. కోరికలతోనే నిన్ను ప్రజ్వలింపచేయుచున్నాము. కోరికలు గల నీవు హ స్సులను కోరుచున్న పితరులను హ భక్షణకు ఇచటికి తీసికొనిరమ్ము.

71. సర్వయుద్ధములందు జయించిన ఇంద్రుడు నీటి నురగతో అసుర నముచి శిరమును ఛేదించినాడు.

(నముచి ప్రస్తావన ఋగ్వేదమందున్నది. ఇతరగ్రంథములందును ఉన్నది. నముచి వృత్రుని వంటివాడు. ఇంద్రుడు వృత్రుని వజ్రాయుధముననను, నముచిని నీటినురగతోను వధించినాడని వృత్తాంతము.)

72. అభిషుత సాత్రామాట్టు సోమము అమృతస్వరూపుడు అయినాడు. ఏలనన అతడు ఋజీషమున మృత్యువును త్యజించినాడు. దశాపంత్రమున శుద్ధమైన సోమమును పానము చేసిన సత్యబలము నిచ్చును. ఈపాలు సహితము ఇంద్రునకు మధుర అమృతప్రాయము కావలెను.

(ఋజీషం నీరసం సోమలతా చూర్ణం అని మహీధరుడు)

73. అవయవముల సారము ప్రాణమగును. హంస తనకున్న నైపుణ్యమున క్షీర నీరములను ండదీసి పానము చేయుము. అట్లే సోమమును శుద్ధిచేసి పానము చేసినంత అది సత్యజలము అగును. ఇంద్రుని ఇంద్రియము కూడ అమృతమగును.

74. సూర్యుడు జలములను శుద్ధిచేసి వానిని సోమరూపమున పానము చేయును. అట్లే దశాపంత్రమున శుద్ధిచేయబడి పానము చేసిన సోమము అమృతమగును.

(నీరు ఎంతటి కలుషితమైనను సూర్యుడు శుద్ధజలమును మాత్రమే గ్రహించును)

75. సురాసోమంఃశ్రమము నుండి ప్రజాపతి గాయత్రి ద్వారా సోమమును వేరు చేయించినాడు. అతడు అట్లు శుద్ధి చేసిన సోమమును పానము చేసినాడు. అతడు క్షత్రియులను వశపరచుకున్నాడు. ఇందువలన శుద్ధిచేసి పానము చేసిన సోమమే ఇంద్రియములకు బలము నిచ్చునను సత్యము ందితమైనది.

76. పురుషుని లింగము యోనియందు ప్రవేశించినపుడు ంర్యము ండుచును. అట్లు కానపుడు మూత్రము ండుచును. గర్భము నందున్నప్పుడు మాయకప్పిన శిశువు జన్మించినంత దానిని వదిలివేయును. ఇదియే సత్యమగును.

77. ప్రజాపతి ఎంతో ంచారించి సత్యమును అసత్యమును వేరుచేసినాడు. సత్యమునకు శ్రద్ధను అసత్యమునకు అశ్రద్ధను జోడించినాడు. ఇదియే సత్యమగును.

78. ప్రజాపతి తన జ్ఞానమున ంచక్షించి శుద్ధి చేసిన సోమమును శుద్ధిచేయని పాలను త్రాంనాడు. ఇదియే సత్యము.

79. ప్రజాపతి అభిషుత సోమ సురలను పరిశీలించినాడు. సోమమును మాత్రమే త్రాంనాడు. అట్లు పరిశీలించియే పాలను సహితము త్రాంనాడు. ఇది సత్యమగును.

80. మనీషులు తమ మనోబలమున తంత్రమును సీసమున దించుదురు. మరల దానిని ఊలుదారమున గ్రుచ్చుదురు. అట్లే అశ్వినులు, సంత, సరస్వతి, వరుణుడు ఇంద్రునకు

వైద్యము చేయుటకు యజ్ఞతంత్రము ఏర్పరచెను. ఆయంత్రమును సోమసూత్రముగ గ్రుచ్చుదురు.

81. ఇద్దరు అశ్వినులు, సరస్వతి ముగ్గురు తమ యుక్తులచే అవలీలగా ఇంద్రుని శరీరమును నిర్మించినారు. మొలకెత్తిన ధ్యానమున రోమములు, యవలమొలకలతో చర్మము, లాజలతో మాంసము నిర్మించినారు.

82. అశ్వినులును, రుద్రమార్గావర్తి సరస్వతి ఇంద్రుని శరీరపు లోపలి భాగమును నిర్మించినారు. గరికపొడి మున్నగు వానిని కర్రకు కట్టి ఎముకలు చేసినారు. గోవు తిత్తిలో మధువు నింపి 'గలనవాసము'న మూలుగును చేసినారు.

83. సరస్వతి నా సత్యులతో మనసు కలిపి మాంసిలము, చూడముచ్చటైన దేహమును అల్లుచున్నది. చిలికిన సుర రసమున ఎర్రని ద్రవము చేసినది. 'నగ్నహు'ను నేయుటకు పడుగు, పేకలు తీర్చినది.

84. పాలచే యజశీలము, అంనాశ్యము, శ్వేతమగు ిర్యమును చేసినది. సురతో మూత్రము చేసినది. ఆమాశయమునందలి అపక్వ అన్నరూపమును, పక్వాశయము నందలి అన్నమును చేసినది. ఆ సమయమున అశ్వినులును, సరస్వతియు దుర్బుద్ధిని హింసించినారు.

85. సురక్షణల ఇంద్రుడు హృదయమును హృదయముచే నిర్మించినాడు. సంత పురోడాశముచే సత్యమును ఏర్పరచినాడు. ఇంద్రునకు చికిత్స చేయుచు వరుణుడు 'యకృత్' ,'క్లోమము', లను చేసినాడు. సౌంక యాగపు ఊర్ధ్వ పాత్రలచే మతస్న మరియు పిత్తము చేసినాడు.

86. మధువు చిలుకు స్థాళులు ఆంత్రములైనం. పాలు పితుకు పాత్ర, పాడియావు, గుదము అయినం. శ్యేనపు రెక్క ప్లీనము, మాతృస్థానీయ ఆసంది మరియు యుక్తి యులనుండి నాభి, ఉదరసము ఏర్పడినం.

87. సురాభాండము గర్భము అయినది. నూరు చిల్లుల కల్లుకుండ శిశ్న మైనది. సురాభాండము పితరుల కొరకు స్వధ కలిగించును.

88. సతమను పాత్రనుండి ఇంద్రుని ముఖము ఏర్పడినది. దానితోనే తల ఏర్పడినది. పంత్ర జిహ్వ ఏర్పడినది. చప్యగుదమైనది. సుర వడకట్టు వస్త్రము ఇంద్రుని లింగమైనది. ఆ లింగమున ిర్యమున అత్యంత వేగవంతమైనది.

89. అశ్వినియను పాత్రలు ఇంద్రుని అమర నేత్రములైనం. ఛాగము నేత్రగత తేజమైనది. గోధుమలచే నేత్రలోమము ఏర్పడినది. కువలములతో రుతములు, పేశములచే కనులందలి నలుపు తెలుపు ఏర్పడినం.

90. మేకయు - సరస్వతి మేకయు ఇంద్రుని నాసిక యందలి శక్తిగా నిలిచినది. సారస్వత గ్రహములు ప్రాణముల అమరమార్గములైనం. యవాంకురముచే సరస్వతి ఇంద్రుని వ్యానవాయువు చేసినది. కుశలు - రేగులతో ముక్కునందలి వెంట్రుకలు చేసినది.

91. ఋషభుడు ఇంద్రుని బలము కొరకు తన రూపము ఏర్పరచినాడు. ఐంద్రగ్రహములు - త్రికాలశబ్ద సమర్థములగు ఇంద్రుని కర్ణములైనం. యవాంకురములు కుశలు కనుబొమలైనం. తేనెవంటి రేగు చీంుడి అయినది.

92. తోడేలు వెంట్రుకలు రోమములు - అంగము ంది వెంట్రుకలైనం. పులివెంట్రుకలు గడ్డము, ంసములయినం. సింహపు వెంట్రుకలు శిరోజములు - తలకొప్పు - తేజస్సును ఇంద్రియాదులైనం.

93. వైద్యులగు అశ్వినులు ఇంద్రునిరూపము, నూరేళ్ళ ఆయువు, చంద్రుని నుంచి అమృతజ్యోతి యగు మనసు ఏర్పరచి ంంధ అవయవములను కూర్చినాడు. చివరకు సరస్వతి అవయవములకు ఆత్మనుచేర్చినది.

94. సరస్వతి అశ్వినుల పత్నియై ఇంద్రలక్షణుని గర్భమున ధరించినది. జలముల రాజగు వరుణుడు సంపదల నింుత్తము ఇంద్రుడు పుట్టగా జలములందు ధరించినాడు.

95. పశువుల తేజస్సు, ంర్యవంతహం, చిలికిన సుధ, అనభిషుత దుగ్ధము, పట్టు తేనె మున్నగు వానిచే వైద్యులగు అశ్వినులు సరస్వతి ద్వారా ఇంద్రుని కొరకు తేజస్సును కల్పించినారు. అభిషుత అనభిషుతములచే అమృతము, ఆహ్లాదక సోమము కూడ ఏర్పరచినాడు.

(ఇంవైద్య సంబంధములట్లున్నం. భిషగ్వరలు పరిశీలించవలెను.)

## దాశరథి రంగాచార్య ంరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## సుగదీంద్రాభిషేకాన్తమను పందొంమ్మదవ అధ్యాయము సమాప్తము.

## సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

అధారం సర్వ ంద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఇరువది అధ్యాయము

1. క్షత్రస్యయోనిరసి క్షత్రస్యనాభిరసి ।

మాత్వా హింసీన్మా మా హింసీః ॥

(ఉత్తర దక్షిణవేదుల మధ్య ఒక ఎత్తు పీఠము వేయవలెను)

పీఠమా! నీవు క్షత్రియుల యోనివి. క్షత్రియుల నాభివి.

(పీఠముపై కృష్ణాజినము పరచవలెను)

కృష్ణాజినమా! నీవు పీఠమును బాధించకుము. పీఠము నిన్ను బాధించకుండను గాత.

2. వ్రతధారియు, సుకర్మయు అగు వరుణరాజు రాజ్యము నిమిత్తము ప్రజలయందు ప్రవేశించినాడు.

(యజమాని పీఠము మీద కూర్చుండవలెను. అతని ఒకపాదము క్రింద వెండి ముక్క మరొక పాదము క్రింద బంగారు ముక్క పెట్టవలెను)

రుక్మమా! నన్ను అకాలమరణము నుండి కాపాడుము. స్వర్ణరుక్మమా! నన్ను విద్యుద్ఘాతము నుండి కాపాడుము.

3. (ఆసందిపై కూర్చున్న యజమానిని అధ్వర్యు నీటితో తడుపవలెను)

యజమానీ! నేను పవితృని అనుజ్ఞలో ఉన్నవాడను. అశ్వినుల బాహువులతోను, పూషహస్తములతోను నిన్ను సంచితము చేయుచున్నాను. అశ్వినుల వైద్యము నీకు తేజస్సును బ్రహ్మవర్చస్సును కలిగించవలెనని ఆసించితము చేయుచున్నాను. సరస్వతి వైద్యము నీకు తేజస్సును, బ్రహ్మవర్చస్సును కలిగించవలెనని ఆసించితము చేయుచున్నాను. ఇంద్రుని ఇంద్రియబలము కొరకును - సిరి మరియు యశము కొరకును నిన్ను ఆసించితము చేయుచున్నాను.

4. (అధ్వర్యు యజమానిని తాకవలెను)

యజమానీ! నీవు ప్రజాపతివి అగుదువు. ప్రజాపతి ముడవగుదువు. ప్రజాపతి పదము కొరకును - ప్రజాపతివి అగుటకొరకును నిన్ను స్పృశించుచున్నాను.

(యజమాని ఇట్లు పిలుచును)

సుశ్లోకా! సుమంగళుడా! సత్యరాజా! విచ్చేయుము నావద్దకు విచ్చేయుము - "సుశ్లోకము మజ్ఞాల సత్యరాజన్!"

5. (యజమాని తన అవయవములను తాకును)

నా శిరము శ్రీ యుక్తము అగును గాత. నా ముఖము యశోయుక్తమగును గాత. వెంట్రుకలు గడ్డ ుసములు దీప్తి యుక్తములు అగును గాత. నా ప్రాణము సామ్రాట్టును, అమృతమయుడును

అగును గాత. చక్షువులు ప్రభువులు - శ్రోత్రములు ిరాట్టులు అగుదురు గాత.

6. నా జిహ్వాభద్రమగును గాత. మాట మహత్తు అగును గాత. మనసు మన్యుపూర్ణమగును గాత. క్రోధము స్వరాట్టు అగును గాత. అంగుళులు మోదము. అంగములు ప్రమోదములు అగును గాత. ుత్రుడు శత్రుంజయుడు అగును గాత.

7. నా బాహువులకు ఇంద్రుని బలము కలుగును గాత. నా చేతులందు ిరకర్మము చేరును గాత. ఆత్మ యందును హృదయమునందును క్షత్రియకర్మము వ్యాపించును గాత.

8. నా నాభి చిత్తమగును గాత. గుదము ిజ్ఞానమగును గాత. యోజి పూజ అగును గాత. అండకోశము ఆనందనందన మగును గాత. భగము సౌభాగ్యమగును గాత.

నేను నా తొడలు మరియు పాదముల ీద ప్రజలకు రాజునై నిలిచినాను. (స్వబలమున అని)

(చిత్త ిజ్ఞానయోః కో ిశేష ఇతి. ిజ్ఞానం ిజ్ఞప్తిః తజ్జః సంస్కారం చిత్తం ఇతి ఉవటః)

9. (యజమాని కృష్ణాజినము ీద ఆసీనుడగును)

నేను క్షాత్రమునందు ప్రతిష్ఠితుడనైనాను. నేను రాజ్యమునందు ప్రతిష్ఠితుడనైనాను. నేను అశ్వములందు ప్రతిష్ఠితుడనైనాను. నేను గోవులందు ప్రతిష్ఠితుడనైనాను. నేను అంగ ప్రత్యంగములందు ప్రతిష్ఠితుడనైనాను. నేను ఆత్మయందు ప్రతిష్ఠితుడనైనాను. నేను ప్రాణమందు ప్రతిష్ఠితుడనైనాను. నేను సమృద్ధియందు ప్రతిష్ఠితుడనైనాను. నేను ద్యావాపృథ్వులందు ప్రతిష్ఠితుడనైనాను. నేను యజ్ఞమునందు ప్రతిష్ఠితుడనైనాను.

(వశ్య ిశ్వః ిశ్వమే తనవశమునందున్నది అనుచున్నాడు మానవుడు. అంతటి బలమతనిది! అంతటి ిశ్వాసమతనిది. అంతటి ిశ్వాసమున్న అసాధ్యమేది?)

11. సుధనసంపన్నులగు దేవతలు ముగ్గురు - పదకొండుగురు - ముప్పది ముగ్గురు. వారికి బృహస్పతి పురోహితుడు అగును. వారందరు సిితాదేవుని ఆజ్ఞానువర్తులు. ఆ దేవతలు నన్ను దుఃఖముల నుండి రక్షింతురు గాత.

(ముగ్గురు భూలోక, ద్యులోక, అంతరిక్షములందు ఉన్నవారు. ఒక్కొక్క చోట పదకొండు మంది చొప్పున ముప్పది ముగ్గురు)

12. ప్రథమ దేవత ద్వితీయ దేవతతోను, ద్వితీయదేవతతోను, తృతీయ దేవత సత్యముతోను, సత్యము యజ్ఞముతోను, యజ్ఞం యజుస్సులతోను, యజుస్సులు

సామముతోను, సామము ఋచలతోను, ఋచలు పురోనువాక్యములతోను, పురోనువాక్యములు యాజ్యావుల తోను, యాజ్యావులు వషట్కారములతోను, వషట్కారము ఆహుతులతోను కూడి నన్ను వర్ధిల్లచేయవలెను. ఆహుతులు నా మనో రథములను సమృద్ధము చేయవలెను, 'భూః స్వాహా'

(భూః భువనం అని ఉవటుడు)

13. నాలోమములు ప్రయత్నము. త్వచ ఆనతి. మాంసము ఉపనతి. అస్థికలు ధనము. మూలుగు ఆనతి అగును.

14. దేవతలారా! మేము ిమ్ము గురించి అపరాధములు చేసి ఉండినచో అగ్ని ఆ పాపములనుండి మమ్ము ిముక్తులను చేయవలెను.

15. పగలు గాని రాత్రిగాని పాపములు చేసి ఉన్నచో వాయువు ఆ పాపముల నుండి మమ్ము ిముక్తులను చేయవలెను.

16. మేలుకొని ఉన్నప్పుడుగాని, నిద్రలోగాని పాపములు చేసి ఉన్నచో సూర్యుడు మమ్ము ఆ పాపములనుండి ిముక్తులను చేయవలెను.

17. గ్రామమందును, అరణ్యమందును, సభలందును, శూద్ర, వైశ్యుల ిషయమునను పాపము చేసినాము. భార్యా భర్తలము ఏకధర్మమున పాపములు చేసినాము. ఘటమా! నీవు ఆ పాపము లన్నింటికి నాశకమవు.

(ఘటమని మహీధర వ్యాఖ్య ఘటమనగా జీితము కావచ్చును. జీితమే అన్నింటిని నశింపచేయగలది. దానికి అంతటిశక్తి ఉన్నది.)

18. వరుణదేవా! జలము అహింస్యము, మేము అహింస్యులము. అట్లయిన పాపవశమున అభిశప్తులమగుచున్నాము. ఆ పాపములనుండి నన్ను కాపాడుము.

నిచుంపుణమను యజ్ఞిశేషమా! నీవు వేగగమనవు. అయినను ప్రస్తుతము మందగమన వగుము. ఏలనన నేను ఇంద్రియలోలుడనై దేవతల ిషయమున చేసిన పాపములను, నా మనుష్యులచే అన్యమానవులకు చేసిన పాపములను ఇక్కడి వరకు తెచ్చినాను. యజ్ఞదేవా! ఆ పాపముల క్రోధమునుండి నన్ను రక్షింపిము. ిపరీత ఫలితముల నిచ్చు సంసారబంధముల నుంచి సహితము నన్ను రక్షింపుము.

19. సాగరమందు జలగర్భమున నీహృదయము ఉన్నది. నీలో ఓషధులు, జలములు ప్రవేశించును గాత. మాకు జల ఓషధులు సుిత్రులు కావలెను. మేము ద్వేషించువారికి, మమ్ము ద్వేషించువారికి జల ఓషధులు దుష్టిత్రులు కావలెను.

(యజమాని అవభృత ప్రదేశమునుండి ఉత్తర దిశకు రెండడుగులు వేసి చేతిలోనికి నీరు తీసికొని శత్రువులున్న దిక్కున చల్లవలెను)

(జీ౦తము ుత్రుల ీద ఆధారపడినది అనుచున్నాడు. ఈ ిషయము భర్తృహరి :-

**మొదల జూచిన గడుగొప్ప పిదపగురుచ**

**యాది కొంచెము తర్వాత నధికమగుచు**

**దనరు దినపూర్వపరభాగ జనితమైన**

**ఛాయపోలిక గుజనసజ్జనులమైత్రి**

20. వడిగల నడకలవానికి పాదుకలు వదులుట వలనను - చెమటవంటి వానికి స్నానము వలన శుభ్రత కలిగినట్లును - ఘృతము జల్లించుట వలన శుద్ధమైనట్లును - జలము నన్ను పాపములనుండి ిముక్తుని చేయవలెను.

21. (ఈ మంత్రము చదువుచు జలమునుంచి బయటకు రావలెను)

ఉత్తమ సూర్యప్రకాశమును దర్శించి మేము అంధకారమును అధిగుించినాము. దేవలోకమందున్న సర్వోత్తమ జ్యోతియగు సూర్యుని పొందినాము.

22. (ఆహవనీయ ముపతిష్ఠతి - యజమాని ఆహవనీయ అగ్నిని ఉపస్థానము చేయును)

అగ్నీ! నేను జలస్నానము చేసినాను. నేను నీట తడిసినాను. తడిసియే నీ వద్దకు చేరినాను. నిన్ను చేరిన నాకు బ్రహ్మవర్చస్సు, సంతానము, ధనము కలిగించుము.

23. (సుిధమాదత్తే - యజమాని అగ్నిలోసుిధ వేయును)

సుిధా! నీవు ఇంధనమవు. నీ ప్రభావమున మేము వర్ధిల్లుదుము గాత.

నీవు సుిధవు. నీవు నీ తేజస్సువు. నీ తేజస్సును నాలో ప్రవేశపెట్టుము.

(యజమాని ఘృతాహుతులు ఇచ్చును)

పృథిి సమ్యగా వర్తితమగును. ఉష, సూర్యుడు, ిశ్వము, జగత్తులు సమ్యగా వర్తితములగును. నేను వైశ్వానర జ్యోతినగుదును గాత. నేను సమస్త అభిలాషులను అందుకొందును గాత. 'భూః స్వాహా'

(ఇదే అహం బ్రహ్మాస్మి అగును)

24. ( **యజమాన ఆహవనీయే త్రిస్రః సుిధో అభ్యాదధాతి.** యజమాని ఆహవనీయమున మూడు సుిధలు సమర్పించును.)

యజ్ఞపాలక అగ్నీ! నేను నీ యందు సంధలు సమర్పించుచున్నాను. నీ దయవలన నాకు యజ్ఞమునందు శ్రద్ధకలుగును గాత. నేను నిన్ను ప్రజ్వలితుని చేయుచున్నాను. సంధాధానమున నేను దీక్షవహించిన వాడనయినాను - **' దీక్షితో అహమ్ '**

25. ఏ బ్రహ్మలోకమున బ్రాహ్మణక్షత్రియులు కలసి సాగుదురో, ఎచట అగ్ని సహితులై సమస్త దేవతలు రాజమానులగుదురో, ఆ పుణ్యలోకములు నాకు తెలియును గాత. **"లోకం పుణ్యం ప్రజ్ఞేషం"**

27. సురా! సోమాంశమున నీ అంశము సంయుక్తమగును గాత. పర్వము పురుషునితో సంయుక్త మగును గాత. నీ సుగంధము మత్తునకుగాను సోమమును ఆలింగనము చేయును గాత.

అంనాశ్యమగు నీయొక్క రసము సోమముతో సంయుక్తమగును గాత.

28. సోమరసమును సురచే సంచితము, పరిసించితము, ఉత్సించితము చేయుదురు - పంత్రము చేయుదురు. ఇంద్రుడు - బభ్రువర్ణసుర యొక్క - మత్తులో శత్రువును 'నీవెంత నీ బలం ఎంత' అని దూశించును.

29. ఇంద్రా! ఇచట వేసిన యవలు - కరంభము - అప్పలు, శస్త్రయుక్త సోమరసము ఉన్నది. నిని నీవు ప్రాతః కాలమున సేంచుము.

30. ఋత్విజులారా! దేవతలు సామమున యజ్ఞమును వర్ధిల్లచేసినారు. సామముననే దేవతలు ఇంద్రుని కొరకని జాగరణశీల జ్యోతిని కల్పించినారు. మరల మరల వృత్రుని హతమార్చు ఇంద్రునికొరకు బృహత్సామ గానము చేయండి.

31. అధ్వర్యులారా! సోమమును రాళ్లతో దంచండి. అభిషంచండి. దశాపంత్రమున జల్లించండి. దానిని ఇంద్రుని పాపము కొరకు అర్పించండి.

32. ఎవడు సమస్త భూతములకు అధిపతియో, ఎవనిని సమస్త భూతములు ఆశ్రయించి ఉన్నవో, ఎవడు మహిమాన్వితులలో మహిమాన్వితుడో, ఎవడు సర్వసమర్థుడో, అట్టి వాని అనుమతితోనే ఈ గ్రహమును, పాత్రను, గ్రహించుచున్నాను. పరమాత్మ స్వరూపమున నేను నిన్ను అందుకొనుచున్నాను.

33. నీవు ఉపయామము ద్వారా గ్రహించబడినావు. నిన్ను అశ్వినులు - సరస్వతి - సుత్రాత ఇంద్రుని కొరకు అందుకొనుచున్నాను. గ్రహమా! ఇది నీ స్థానమగును. నేను నిన్ను అశ్వినులు - సరస్వతి - సుత్రాత ఇంద్రుని కొరకు ఇచట స్థాపించుచున్నాను.

34. (ఋత్విజః ప్రాణభక్షం భక్షయంతి)

గ్రహమా! నీవు నా ప్రాణపాలకుడవు. నా అపానపాలకుడవు. నేత్ర పాలకుడవు. నా కర్ణపాలకుడవు. నీవు నా వాణికి భేషజమవు. నా వాక్కును అనృతము నుండి మార్చి సత్కర్మలు చేయించుదానవు. నీవు నా మనసునకు సత్ప్రేరకమవు.

35. అశ్వినులు, సరస్వతి, సుత్రాత ఇంద్రునిచే దర్శించండి ఋత్విజులచే ఉపహూతమగు నిన్ను నేను భక్షించుచున్నాను.

36. ఇంద్రుడు అపూర్వ కర్మలు చేయువాడు. సోమపానమున వర్ధిల్లువాడు. ఉష ఎగిసి ఉడిగినపుడు, తూర్పున మహాజ్యోతి దర్శనము ఇచ్చినపుడు ఇంద్రుదు మేల్కొన్నాడు. ముప్పది ముగ్గురు దేవతల సహితుడై వజ్రబాహువగు ఇంద్రుదు వృత్రును వధించినాడు. నదుల ద్వారములు తెరచినాడు.

37. యజమాని ఋత్విజులచే ప్రశంసింపబడువాడు. శూరుడు. పుత్రాదులచే వంశము నిలపెట్టువాడు. పశువపాయుక్తుడు. ఆవుపాలు, తేనె హ◌స్సులందు కలుపువాడు. స్వర్ణఖండములు దక్షిణగా ఇచ్చి ఆనందింప చేయువాడు. ◌శాలహృదయుడు. అతడు ఇంద్రుని యజించును.

38. ఇంద్రుడు ఋత్విజులచే స్తుతించబడువాడు. హర్యశ్వవంతుడు. అభిగంత. ఆహూయమానుడు. సోమహ◌ వలన బలము వ్య క్తము చేయువాడు. అసురపురధ్వంసి. గోవ్రజమును ◌డిపించిన వాడు. వజ్రబాహువు. అతడు మా యజ్ఞప్రీతుడు కావలెను. యజ్ఞమునకు రావలెను.

39. ఇంద్రుడు హర్యశ్వవంతుడు. ◌స్తార◌ఖ్యాతుడు. సుఖప్రదుడు. అతడు వసువులతోను ఆదిత్యులతోను ◌చ్చేసినాడు. దర్భాసమున ఆసీనుడు అయినాడు. వేది పూర్వభాగమున స్థిరపడినాడు.

40. యజ్ఞద్వారములారా! ధ్వనిచేయండి. ఉరకండి. ముత్తైదవుల వలె ముందుకు సాగండి. ఇంద్రునకు స్వాగతము పలకండి. ◌రు ◌ర ఋతుయుక్తలు. ఉత్సవములందు ◌స్తృతినొందువారు. ◌రుడగు ఇంద్రుని కొరకు పూర్తిగా తెరచుకొనండి.

41. ఉషారాత్రులు మహత్తలు. తుహినయుతలు. ఫలప్రదాతలు. సుందర కిరణవంతలు. ◌శాల కాలతంతువును నలుపు, తెలుపురంగులతో నేయువారు. వారు శూరుడు దేవదేవుడగు ఇంద్రుని యజింతురు.

42. దేవహోతలు యజ్ఞము చేయువారు మానవ హోతలకన్న ప్రథములు, ప్రధానభూతులు. ఇంద్రుని యజ్ఞపు ప్రధాన అంగమున స్థాపించువారు. సురుచిర వాక్కుగలవారు. వారు అగ్ని వాయువులకు పూర్వదిశయందున్న ఆహవనీయ జ్యోతిని మధుఘృతధారల హ◌స్సుచే అర్చింతురు.

43. హ ంవలన వర్ధిల్లువాడు ఇంద్రుడు. అతనిని సాధ్వులగు పత్నుల వలె సే ంచువారు సర్వగమనలగు ఇడ, సరస్వతి, భారతి. ఆ ముగ్గురు దేవేరులు యజ్ఞతంతువును అ చ్ఛిన్నము చేయుదురు గాత.

44. చతురుడు, యశస్వి, ఇంద్రునకు బలము కలిగించువాడు, సర్వత్రగా , వర్షకుడు, వర్షక ఇంద్రుని పూజించువాడు, బలవంతుడనగు త్వష్ట యజ్ఞమునకు శిరస్థానమగు ఆహవనీయమున దేవతలను యజించును గాత.

45. యూపము - కసాయివలె- తనకు కట్టిన పశువులను దేవతలకు అర్పించును. అది యజ్ఞపశువుచే ఇంద్రుని కడుపు నింపును. అట్లే మధుర ఘృతమున యజ్ఞమును సుస్వాదువొనరించును.

46. వృషాయమానుడు, వర్షణశూరుడు, శత్రుపీడకుడగు ఇంద్రుదు వపాబిందురూప సోమపానము చేసి ప్రసన్నుడగును గాత. ఘృతబిందు మాత్రమున ప్రసన్నచిత్తులగు వారును, అమరులును అగు దేవతలు సహితము వపాసోమమున ఆనందమున తేలియాడుదురు గాత.

47. మమ్ము రక్షించుటకు ఇంద్రుడు ఇచటికి చ్చేయును గాత. మా ప్రశంసలు అందుకొను శూర ఇంద్రుడు మాతో కలసి సోమపానము చేయును గాత. ఇంద్రుని పూర్వకర్మములు ద్యులోకము వలె స్తవనీయములు. అట్లు వర్ధిల్లు ఇంద్రుడు మాలోన క్షా త్రమును పరిపుష్టము చేయును గాత.

48. ఇంద్రుదు అభీష్టప్రదుడు. ఉగ్రుడు, మానవపాలకుడు. వజ్రబాహువు. యుద్ధమందు శత్రువును సత్వరమే నష్టపరచువాడు. అట్టి ఇంద్రుడు మమ్ము రక్షించుటకు దూర అంతరిక్షము నుండి గాని స ప పృథ్వి నుండి గాని మా వద్దకు రావలెను.

49. మమ్ము రక్షించుటకును హ స్సులు అందుకొనుటకును, ఇంద్రుడు మాకు అభిముఖుడై త్వరత్వరగా చ్చేయవలెను. ఇది అన్నప్రాప్తి కొరకగు యుద్ధము. వజ్రధారి, ధనవంతుడు, మహామహుడగు ఇంద్రుడు ఇచట ఉండవలెను. దీనిని రక్షించవలెను.

50. రక్షక ఇంద్రుని యుద్ధములకు ఆహ్వానించబడు ఇంద్రుని శూర ఇంద్రుని పురుహోత ఇంద్రుని ఆహ్వానించుచున్నాను. అతడు మాకు శుభములు కల్గించవలెను.

51. ఇంద్రుడు సురక్షకుడు. సర్వజ్ఞుడు. సంపన్నుడు రక్షించువాడు. అతడు మాకు సుఖములు కలిగించవలెను. అతడు ద్వేషులను వధించవలెను. మాకు నిర్భయత కలిగించవలెను. అతని దయచే మేము బలశాలురము కావలెను.

52. మేము ఇంద్రుని సద్బుద్ధియందును. ప్రసన్నమనమునందును ఉండవలెను. సురక్షక,

ధనశాలియగు ఇంద్రుడు మా శత్రువులను వేరుచేసి నష్టపరచవలెను.

53. ఇంద్రా! మయూర రోమముల మందగమనల హర్యశ్వములపై మా యజ్ఞమునకు ిచ్చేయుము. మార్గమున దుష్టరాక్షసాదులు వేటకాడు పక్షిని పట్టినట్లు నిన్ను పట్ట కుండును గాత. వర్తకుడు త్వరత్వరగా ఎడారిని దాటి మంచి స్థలమునకు చేరినట్లు నీవు ఆటంకములను అధిగించి మా యజ్ఞమునకు ిచ్చేయుము.

54. వసిష్ఠగోత్రజులగు ఋషులు వర్షక, వజ్రబాహు ఇంద్రుని మంత్రములచే సంస్తుతింతురు. ఇంద్రుడు మా స్తుతులను అందుకుని ీరపుత్ర యుక్త, గోయుక్త ధనమును ప్రసాదించవలెను. అతడు మమ్ము ఎల్లవేళల శుభములిచ్చి పాలించును గాత.

55. అశ్వినులారా! అగ్ని ప్రజ్వలితుడైనాడు. మహాీరఘటము కాలి సిద్ధమైనది. సోమరసము

అభిషుతమైనది. ఇచట - ఈ యజ్ఞమునందున్న - సరస్వతి శుద్ధము, ఇంద్రునకు బలకారకమగు ఆవుపాలు పితుకుచున్నది.

56. ఆరోగ్య రక్షకులును, వైద్యులగు అశ్వినులిద్దరు మరియు సరస్వతి సోమము అభిషుతమైనంత జగములను మధువుచే పూరింతురు. వారు యజ్ఞమార్గమున ఇంద్రునకు బలము కలిగింతురు.

57. ఋత్విజులచే ప్రశంసనీయమైన యజ్ఞము ద్వారా సరస్వతి ఇంద్రునకు అభిషుత సోమము, సురాభాండము అందించినది. సోమము అభిషుతమైనంత వైద్యులగు అశ్వినులు ఇంద్రునకు మధురసరూపమును ప్రదానము చేసినారు.

58. ఇంద్రుని ఆహ్వానించునట్టి సరస్వతి ఇంద్రునకు నేత్రాది అవయవములను అందించినది. అశ్వినులు పశువుల అన్నము, ఓజస్సు ధనము ప్రదానము చేసినారు.

59. అశ్వినులు - ఇంద్రుని కొరకు - నముచి రక్తమును శుద్ధముచేసి, సోమరసమును అభిషుతము చేసినారు. సరస్వతి ఇంద్రుని దర్భాసనము ిద కూర్చుండ పెట్టినది. సోమరసము నందు చిలికిన సురను చేర్చు ఇంద్రునకు - పానమునకు - అందించినది.

(ఒకసారి నముచి ఇంద్రునితో కలసి సోమము సేించినాడు. అప్పుడు అతని రక్తము సోమమైనది. ఇంద్రుడు నముచిని వధించినాడు. అతని రక్తము పారినది. అశ్వినులు దానిని శుద్ధము చేసి సోమమును చేసినారని వృత్తాంతము)

60. శబ్దము, అవకాశముతో కూడిన ద్వారము. దిశలు, అశ్వినులు, సరస్వతి, ఇంద్రుడు ద్యావాపృథ్వుల నుండి సకల మనోరథములను పితికినారు.

61. జ్ఞానియు, సుస్వరూపియునగు సరస్వతి సహితముగా ఉషోరాత్రులు, రాత్రింబవళ్లు, ఇంద్రునకు ఇంద్రియ బలము కలిగించుచుందురు.

62. అశ్వినులారా! ీరు మమ్ము పగళ్లందు రక్షించండి. సరస్వతీ! నీవు మమ్ము రాత్రులందు రక్షింపుము. అభిషుత సోమరసపాన నిమగ్న ఇంద్రుని దైిహోతయు, అశ్వినులును రక్షింతురు గాత.

63. అశ్వినులారా! మధ్యస్థానపు సరస్వతి- ద్యుస్తానపు భారతి - పృథిి స్థానపు ఇడయను ముగ్గురు దేవేరులు చిలికిన సురసహిత సోమమును ఇంద్రునకు అందించినారు.

64. సోమరసము అభిషుతమైనది. అప్పుడు అశ్వినులు, సరస్వతి, త్వష్ట అందు ఓషధులు, మధురూపభేషజము, యశస్సు, మున్నగునం కలిపినారు. ఇంద్రునకు అందించినారు.

65. ప్రశంస్యమాన వనస్పతులు ఇంద్రునికొరకు అప్పుడప్పుడు వడకట్టిన సోమము మరియు మధువును సిద్ధము చేయును. అశ్వినులకు, ధేనుభూతియగు సరస్వతి తోడై మధుర దుగ్ధములను ఇంద్రునకు అందించును.

66. అశ్వినులారా! గోవు మున్నగు పశువులను 'మాసరము'ను జల్లించిన సురను అభిషుత సోమమును ఇంద్రునకు సమర్పించండి. వనస్పతులారా! ీరు సహితము సరస్వతి సహితులై ఇంద్రునకు సోమరసము సమర్పించండి.

67. అశ్వినులును సరస్వతియు తమ బుద్ధి బలమున నముచి శరీరము నుండి ఇంద్రుని కొరకు ఇంద్రియ బలము, పరిశుద్ధ సోమరసము, మహాధనమును తీసినారు.

68. అశ్వినులు, సరస్వతి ఇంద్రునకు హం అందించి ఇంద్రుడు నముచిని వధించినాడు. నముచి తోటివాడగు ధనిక బలదైత్యుని ఇంద్రుడు వధించినాడు.

69. పశువులు, అశ్వినులు, సరస్వతి యజ్ఞములందు హం అందించి ఇంద్రునకు బలము కలిగింతురు. ఇంద్రుని స్తుతింతురు.

70. సంత, వరుణుడు, భగుడు, ఇంద్రునకు ఇంద్రియ బలము కలిగించినారు. ఇంద్రుడు చక్కని రక్షకుడు, హంస్సులకు స్వాు. అతడు యజమానికి కోరిన వరములనీయవలెను. యజమానితో చేరవలెను.

71. సురక్షణల ఇంద్రుడు నముచి నుండి గుంజుకొని వచ్చిన బలధనాదులను హం ప్రదాత యగు యజమానికి, సంత మరియు వరుణుడు ప్రదానము చేయవలెను.

72. యజమాని కొరకు వరుణుడు క్షాత్రబలమును, సంత సంపదలను, సురక్షణ గల ఇంద్రుడు యశముతోటి బలమును -అందించుచు యజ్ఞమునకు ంచ్చేయుదురు.

73. అశ్వినులును, సరస్వతియు గోవుల వలన ఇంద్రియ బలమును, అశ్వముల వలన ిర్య బలమును హం వలన ఇంద్రుని, యజమానిని వర్ధిల్లచేసినారు.

74. సుస్వరూపులు, సువర్ణ మార్గవర్తనులు, నరాకారులగు అశ్వినులు హ◌యుక్త సరస్వతి ఇంద్రుడును సౌత్రామణి మున్నగు యజ్ఞములందు మమ్ము రక్షింతురు గాత.

75. సుకర్ములును, వైద్యులును అగు అశ్వినులు సుదుఘసరస్వతి, వృత్రహంత, శతక్రతు ఇంద్రుడు యజమానికి ఇంద్రియ బలము ప్రసాదింతురు గాత.

76. అశ్వినులును, సరస్వతియు నముచిలో ఉన్న సురను పానము చేయుచు - యజ్ఞాది కర్మ రక్షకుడును, వ్యాపకుడును అగు ఇంద్రుని రక్షించవలెను.

77. ఇంద్రా! మాతాపితృలు బిడ్డలను రక్షించినరీతి - స్వకర్మ కౌశలమున అశ్వినులు నిన్ను

రక్షించినారు. అంతియకాదు సరస్వతియు నిన్ను సే◌ంచినది. నీవో సురమణీయ సోమరసమును స్వశక్తిచే పానము చేసినవాడవు!

78. అగ్నియందు అశ్వములున్న◌. గోవులున్న◌. వృషభములున్న◌. మేశములున్న◌. ఆహ్వానములు ఉన్న◌. అగ్ని అన్నరసపాయి. సోమహుతివంతుడు. బుద్ధి ప్రదాత. ఉత్పాదకుడు. అట్టి అగ్నికి బుద్ధియందు నిలుపండి. హృదయమున శుద్ధి చేయండి.

79. శుద్ధ ఘృతము వలెను చర్మము పై సోమము వలెను అగ్నీ! నీ జ్వాలా ముఖములందు హ◌ని ఆహుతి చేసినాము. నీవు ప్రసన్నుడవగుము. మాకు అన్నము, ◌రపుత్రులను, గో, అశ్వ ధనమును, మహాకీర్తిని ప్రసాదించుము.

80. అశ్వినులు వెలుగు తోటి నేత్రములను, సరస్వతి ప్రాణము తోటి ◌ర్యమును, ఇంద్రుడు బలముతోటి ఇంద్రియ బలమును యజమానికి ప్రసాదించినారు.

81. నాసత్య అశ్వినులారా! రుద్రమార్గమున రాకపోకలు సాగించువారలారా! ◌రు గో, అశ్వయుక్త ధనసహితులై ఈ యజ్ఞమునకు ◌చ్చేయండి.

82. అశ్వినులారా! ఆ ధనము అన్యులకు అందనట్టిదియు శత్రువుల చేతికి చిక్కనట్టిదియు కావలెను.

83. బుద్ధిమాన్ అశ్వినులారా! బంగరు రంగుదియు, ధన◌చ్చునట్టిదియునగు అశ్వ, గోధనమును మాకు తెచ్చి ఇవ్వండి.

84. ప◌త్ర కర్మలు కలదియు అన్నములు గల అన్నవతియు, బుద్ధి యందు ధనమును దాల్చునట్టి సరస్వతి మా యజ్ఞమును ఆశించవలెను.

85. సూనృతములకు ప్రేరణ కలిగించునదియు -సుబుద్ధిని చైతన్యవంతము చేయునట్టి సరస్వతి మా యజ్ఞమును భరించును గాత.

86. సరస్వతి తన జ్ఞానమున మహాబలమును వెల్లడించును. సమస్త ప్రాణులందున్న బుద్ధిని ప్రదీప్తము చేయును.

87. ిచిత్ర దీప్తుల ఇంద్రా! నిన్ను నిత్యము ఆశించు సోమరసము అభిషుతమైనది - అంగుళులు, దశా పంిత్రమున పంిత్రమైనంి. నీవు త్వరత్వరగా ఈ యజ్ఞమునకు రావలసినది.

88. ఇంద్రా! నీవు కర్మాభిప్రేతవు. స్తోత్రముల ప్రేరణ గల వాడవు. సోమాభిలాషిి. స్తోత్రాభిలాషిి. నీవు త్వరత్వరగా ఈ యజ్ఞమునకు రావలసినది.

89. హర్యశ్వ ఇంద్రా! అతి శీఘ్రముగా హంిరన్నముల కొరకు యజ్ఞమునకు ిచ్చేయుము. సోమరసము అభిషుతమైనంత మా సోమరసమును నీ పొట్టలో పోసుకొనుము.

90. అశ్వినా పిబతాం మధు సరస్వత్యా సజోషసా ।

ఇంద్రః సుత్రామా వృత్రహా జుషన్తాం సోమ్యాంమధు ॥

అశ్వినులారా! సరస్వతి అభిమానముగల ిరు సోమరస పానము చేయండి. సుత్రాత, వృత్రహహంత ఇంద్రుడు సహితము సోమరసమును సేింంచును గాత.

ిద్వాంసుడు, బహుభాషా వేత్త, కిి, కథకుడు, నవలాకారుడు, నాటకకర్త, బాల సాహిత్య రచయిత, ిమర్శకుడు, చలన చిత్ర రచయిత, వ్యాసకర్త, అనువాదకుడు, వక్త, కార్మికోద్యమ కార్యకర్త, స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రగతి పథగాిు, ప్రసన్నుడగు, దాశరథి రంగాచార్య ిరచిత శ్రీ మదాంధ్ర శుక్ల యజుర్వేద సంహిత యందలి సేకాద్యాసందీహోత్రాంతమగు ఇరువదవ అధ్యాయము ముగిసినది.

సర్వేభవన్తు సుఖిన:

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ॥

ఆధారస్సర్వ ిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

## ఇరువది ఒకటవ అధ్యాయము

1. ఇమం మే వరుణ శ్రుదీ హవమద్య మృడయ

త్వామవస్యురాచకే ॥

వరుణదేవా! నేడు నీవు మా ఆహ్వానమును ఆలకింపుము. నన్ను రక్షించుమని నేను నిన్నే పిలుచుచున్నాను.

2. నేను నిన్ను మంత్రయుక్తముగ నమస్కరించి ఆహ్వానించుచున్నాను. యజమాని హంసహితుడై నీ రాకను ఆకాంక్షించుచున్నాడు.

వరుణా! నీవు కోపింపకుము. మా వద్దకు రమ్ము, మమ్ము తెలిసికొనుము.

అత్యంత ప్రశంసిత వరుణా! మా ఆయువును నష్టపరచకుము. "మాన ఆయుః ప్రమోషీః"

3. అగ్నీ! నీవు పరమ ద్వాంసుడవు. నీవే వరుణ దేవుని క్రోధమును నివారింపుము. అత్యంత యజన కుశల, హవ్యహవాక, జాజ్వల్యమాన అగ్నీ! మమ్ము ద్వేషించువారి నుండి మమ్ము డిపింపుము. మా పాపములను దూరము చేయుము.

4. అగ్నీ! నేడు ఉష వెడలినంత నీవు నీ రక్షణలచే మమ్ము రక్షించుటకు మా వద్దకు చ్చేయుము. శేష సాధన ఘృతమున ఆహ్వానించుము. వరుణుని అర్చింపుము. సుఖముల నిచ్చు వరుణనకు కడుపునిండగ సోమాన్నము తినిపించుము. ఆదరణీయ ఆహ్వానముల నీవు సహితము సంధాదులచే అభివర్ధిల్లుము.

5. అదితి మహతి. శుభకర్మ జనయిత్రి. యజ్ఞపాలిక. ప్రభూత రక్షణపతి. జరాహీనప్రభూత గమన. శుభ ఆశ్రయ. శుభనీతివతి. అట్టి అదితిని మేము నేడు మమ్ము రక్షించమని ఆహ్వానించుచున్నాము.

6. ఓషధులు యజ్ఞమయీ నౌకా! నీవు సురక్షణశీలవు. స్తారవతి. ప్రభాయుక్తవు. పాపరహితవు ఆశ్రయవతి. అదితి రూపవు. సునీతి. ఛిద్ర రహితవు. దేవసంబంధి. మాకు శుభములు కలుగవలెనని నిన్ను ఎక్కుచున్నాను. " **ఆరోహేమాస్వస్తయే** "

7. అచ్ఛిద్ర, అపాప, శతారిత్ర యజ్ఞరూప సునావను స్వశుభలకు ఆరోహించుచున్నాను.

8. త్రా వరుణులారా! మా మార్గములను ఘృత దుగ్ధములచే నింపుడు. నా లోకములను మధువుతో తడుపుడు.

9. త్రా వరుణులారా! మా జీవనమునకుగాను దీర్ఘ బాహువులను చాచండి. మా క్షేత్రములను ఘృత స్వరూప వర్ష జలమున తడపండి. నన్ను జనులందు గొప్పవాడని ప్రకటించండి. "మేత్రావరుణ హవేమ" త్రా వరుణులారా! మా ఆహ్వానమును ఆలకించండి.

10. అశ్వములు దేవరక్షక యజ్ఞమందు అపరిఁత గమనలు, స్వర్గీయులు, సర్వ, వృక్ష, రాక్షసుల నుంచి రక్షకులు, వ్యాధులను మా నుంచి నిర్మూలించునఁ. అఁ మాకు సుఖ కారకములు కావలెను.

11. అశ్వములారా! అన్నప్రాప్తికగు యుద్ధములందు మమ్ము రక్షించండి. ధనప్రాప్తి కగు యుద్ధములందును రక్షించండి. ఁరు "ఁప్రా అమృతా ఋతజ్ఞః" ఁరు ఈ మధు భాగమును పానము చేయండి. మదోన్మత్తులు కండి. చివరకు దేవమార్గమున స్వర్గమున పయనించండి.

12. అగ్ని వెలిగినాడు. వరణీయుడగు వాడు సఁధులచే సంపూర్ణముగా ప్రదీప్తుడయినాడు. గాయత్రి ఛందము మరియు సంవత్సరన్నర గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినఁ.

13. పఁత్రకర్మ తనూనపాద అగ్ని దేహమును పఁత్రము చేయు సరస్వతి- ఉష్ణిక్ ఛందము, దివ్య హఁని వహించు గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

14. వనస్పతులతో కూడిన స్తుత్య అగ్ని, అమరము, ద్యోతమానమగు సోమము - అనుష్టుప్ - ఛందము, రెండున్నర ఏండ్ల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

15. పూషతో పాటు దర్భాసనముగల అగ్ని - మరణము లేని స్తీర్ణబర్హి - బృహతీ ఛందము - మూడేండ్ల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

16. ద్యోతమాన ద్వారము, మహాదిశలు, బ్రహ్మ, బృహస్పతి, పంక్తి ఛందము, నాలుగేండ్ల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

17. గొప్పవారును శోభస్కర రూపులును అగు ఉషారాత్రులు, అమరులగు ఁశ్వేదేవతలు త్రిష్టుప్ ఛందము, భారవహన సమర్థమగు గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

18. దివ్యహోతవైద్యులు - ఇంద్రయుతులు, పరస్పర సంయుక్తులగు ఇంద్ర వాయువులు - జగతీ ఛందము, పూర్ణ వయసు గల గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

19. ఇడ, సరస్వతి, భారతి యను ముగ్గురు దేవేరులు, ఇంద్రుని ప్రజయగు మరుత్తులు, ఁరాట్ ఛందము, ధేనువు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

20. క్షిప్రవ్యాపియగు అద్భుత త్వష్ట - పుష్టిని పెంచు ఇంద్రాగ్నులు - ద్విపాద ఛందస్సు - సేచన సమర్థ గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

21. సుఖములనిచ్చు వనస్పతులు, ధనోత్పన్న సఁత, కకుప్ ఛందము, వంధ్య గోవు ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

22. మంచి రక్షణల వరుణుడు ఇంద్రునకు యజ్ఞ వైద్యము చేసినాడు. స్వాహా ఆకృతి గల వనస్పతులు, అతిచ్ఛందము, పెద్ద వృషభము ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

23. వసంతర్తువు, త్రివృత్ సోమము, రథన్తర పృష్ఠ సంస్తుతులగు వసువులు, వపారూపహ౦

ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

24. గ్రీష్మ ఋతువు, పంచదశ స్తోమము, బృహత్పృష్ఠ సంస్తుత రుద్ర దేవతలు యశముతోటి హ౦ ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

25. వర్ష ఋతువు, సప్త దశ స్తోమము, వైరూపపుష్ఠ సంస్తుత ఆదిత్యులు, ఓజస్సుతోటి హ౦ ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

26. శరదృతువు, ఏక౦౦శత్సోమము, శ్రీ, వైరాజ పుష్ఠ సంస్తుత ఋభువులు, సిరితోటి హ౦ ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

27. హేమంతము, త్రిణవస్తోమము, శక్వర పృష్ఠ సంస్తుత మరుత్తులు, బలముతో కూడిన హ౦ ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

28. శిశిరము, త్రయస్త్రి౦శ స్తోమము, రైవత పృష్ఠస్తుత అమర దేవతలు, సత్య యుక్త క్షాత్రము హ౦ ఇంద్రునకు బలము, ఆయువు కలిగించినారు.

29. గోష్పాదమందున్న ఆహవనీయాగ్నియు, దై౦ హోత అగ్నియు, అశ్వినులును, సరస్వతియు ఇంద్రుని స౦౦ధలచే యజింతురు గాత. బలము, ఆ యజ్ఞమున అజ, మేష, ధూమ్ర, మధు, గోధుమ, బదరి, యవాంకురములు భేషజములగును. తేజస్సు, బలము, పాలు, సోమరసము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

30. దై౦హోత తనూనపాదగ్ని, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. ఆ మధుమయ పథ యాగమందు అజ, మేష, బదరి, యవాంకుర, ౦హ్యాంకురములు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

31. దై౦ హోత నరాశంస ప్రయాజ దేవత, సరస్వతి, అశ్వినులు ఇంద్రుని యజింతురు గాత. సుర, మేక, అశ్వినులు చాంద్ర రథము, వప, బదరి, ౦హి, యవాంకురములు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

32. ఋత్విజుల ప్రశంసలందుకొను దై౦ హోత ఇడ, సరస్వతి, అశ్వినులు ఇంద్రాదులను గోవృషభముల ద్వారా వర్ధిల్ల చేయుచు యజింతురు గాత. యవలు, బదరి, మధు,

కర్కంధు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపిము.

33. దైం హోత, ఉన్ని వంటి కోమల బర్హి - వైద్యులు, నాసత్యులగు అశ్వినులు - సరస్వతి యజింతురు గాత. బలోపేత అశ్వము, సద్య ప్రసూత గోవు భేషజములగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

34. దైంహోతలగు దిశల వంటి, అవకాశముగల, శబ్దాయమాన ద్వారములు, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. ద్యావాపృథ్వుల సహితముగా సరస్వతి గోవై శుద్ధ జ్యోతి స్వరూప భేషజమగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

35. దైంహోత సురూప ఉష, రాత్రి, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. వారు చిత్తము, శ్రీసహితులై మాసర రూప ఓషధి, శ్యేన పత్రము మరియు కాంతిని ఇంద్రుని యందు చేర్చెదరు. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

36. దైం హోతలు, దివ్య హోతలగు అగ్ని వాయువులు, అశ్వినులు, సరస్వతి, ఇంద్రుని యజింతురు గాత. రాత్రింబవళ్ళు, జాగరణశీల సరస్వతి సీసము ద్వారా శక్తి రూప భేషజమగుదురు. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

37. దైంహోతలగు ఇడ, భారతి, సరస్వతి, అశ్వినులు, ఇంద్రుని యజింతురు గాత. సరస్వతి దేవవాణిచే త్రిధాత్రు భేషజమగును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

38. దైంహోత, బలవంతుడు, సర్వహితుడగు త్వష్ట, అశ్వినులు, సరస్వతి ఇంద్రుని - వృక, సుర, మాసరములచే యజింతురు గాత. ఈ యజ్ఞము వలన ఇంద్రునకు ఓజస్సు, వేగము, ంర్యము, సిరి, యశస్సు కలుగును గాత. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

39. దైంహోత, పశుసంస్క ర్త యూపము - భయంకరుడు, క్రోధి, వ్యాఘ్రము వంటివాడు, శతక్రతువగు ఇంద్రుడును అన్నమున సరస్వతిని యజింతురు గాత. సరస్వతి ఇంద్రునకు కోపము, బలము కలిగించును. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రాది దేవతలందు వ్యాపించును గాత. హోతా! యజింపుము.

40. దైం హోత అగ్నిని యజించును గాత. ఘృతమునకు స్వాహా. మేధలకు వేరువేరుగా స్వాహా. అశ్వినులకు అజ స్వాహా. సరస్వతికి మేష స్వాహా. సింహ బల ఇంద్రునకు వృషభ స్వాహా. భేషజులకు స్వాహా. సోమశక్తికి స్వాహా. సుత్రాత ఇంద్రునకు స్వాహా. సంతకు

స్వాహా. వైద్యుల స్వాిు వరుణునకు స్వాహా. ఘృత భక్షక దేవతలకు స్వాహా. వైద్యులను సేించు అగ్నికి స్వాహా. దుగ్ధము, సోమము, సుర, ఘృతము, మధువు ఇంద్రునందు చేరును గాత. హోతా! యజింపుము.

41. దైిహోత అశ్వినులను యజించును గాత. అశ్వినులు భాగపు వపచే మేదను సేింతురు గాత. హోతా! హిని హోమము చేయుము.

దైి హోత సరస్వతిని యజించును గాత. సరస్వతి మేష వపచే మేదను ఆస్వాదించును

గాత. హోతా! హిని హోమము చేయుము.

దైిహోత ఇంద్రుని యజించును గాత. ఇంద్రుడు వృషభపు వపచే మేదను ఆస్వాదించును గాత. హోతా! హిని హోమము చేయుము.

42. దైి హోతలు అశ్వినులు, సరస్వతి ఇంద్రుని యజింతురు గాత. అధ్వర్యులారా! ఓహో! ి సోమము ఎంతో బాగున్నది. అది ఛాగ, మేష, వృషభములచే అభిషుతమై ఉన్నది. అది తృణ, యవాంకుర, లాజలతో తేజరిల్లుచున్నది. అది మాసరములచే శుద్ధి చేయబడి మరింత మత్తు కలిగించునదై ఉన్నది. ఓహో! ఇహ పాలు కలసి ఇది అమృతమైనది. దేవతలు ఇటువైపు తరలినారు. అశ్వినులు, సరస్వతి- సుత్రాత, వృత్రహంత ఇంద్రులారా! ిరు ఈ మధుర రసమును పానము చేయండి, సకల దేవతలారా! దీనిని సేించండి. మదోన్మత్తులు కండి. హోతా! యజింపిము.

43. దైిహోత అశ్వినులను యజించును గాత. నేడు అశ్వినులు ఛాగమాంసమును తినవలెను. అది మధ్య నుంచి మేద తీయబడినది. రాక్షసాది శత్రువులు భక్షించక మున్నే మాంసాహార మానవులు ఎగబడకస మున్నే అశ్వినులు దీనిని భక్షించవలెను.

ఇది - ఈ ఆడ మేక - పచ్చని గడ్డిిద సంచరించినది. యవల తొలి మొక్కలను మేసినది. అది స్వయముగా కరిగినది. వందల స్తుతులచే స్తుత్యుడగు అగ్నిచే పచనము చేయబడినది. ప్రతి అంగమును బయటకు తీసి ఒక్కొక్క దానిని కోసి చేసిన మాంస వపాఖండములను అశ్వినులు ఆస్వాదించవలెను. ఆనందించవలెను. హోతా! యజింపుము.

44. దైిహోత సరస్వతిని యజించును గాత. నేడు సరస్వతి మేక మాంసమును భక్షించవలెను.

అది మధ్యనుండి మేద తీయబడిన మాంసము. రాక్షసాది శత్రువులు భక్షించక మున్నే, మాంసాహార మానవులు ఎగబడక మున్నే సరస్వతి దానిని భక్షించవలెను.

ఈ మేక పచ్చని గడ్డిిద సంచరించినది. యవల తొలి మొక్కలు మేసినది. అది స్వయముగా కరిగినది. వందల స్తుతులచే స్తుత్యమగు అగ్నిచే పచనము చేయబడినది. ప్రతి

అంగమును బయటకు తీసి ఒక్కొక్క దానిని కోసి చేసిన మాంస వపాఖండములను సరస్వతి ఆస్వాదించవలెను. ఆనందించవలెను. హోతా! యజింపుము.

45. దైం హోత ఇంద్రుని యజించును గాత. ఇంద్రుడు వృషభ మాంసమును భక్షించవలెను.

అది మధ్య నుండి మేద తీయబడిన మాంసము. రాక్షసాది శత్రువులు భక్షించక మున్నే మాంసాహారి మానవులు ఎగబడక మున్నే ఇంద్రుడు దానిని భక్షించవలెను.

ఈ ఎద్దు పచ్చని గడ్డి ంద సంచరించినది. యవల తొలి మొక్కలు మేసినది. అది స్వయముగా కరిగినది. వందల స్తుతులచే స్తుత్యుడగు అగ్ని దానిని పచనము చేసినాడు. ప్రతి అంగమును బయటికి తీసి ఒక్కొక్క దానిని కోసి చేసిన మాంస వపా ఖండములను ఇంద్రుడు ఆస్వాదించవలెను. ఆనందించవలెను. హోతా! యజింపుము.

46. దైంహోత యూపమును యజించును గాత. ఈ యూపము గట్టి త్రాళ్ళతో పశువులను

తనకు కట్టి ఉంచునది. ఈ యూపము దేవతలకు ఉపకారము చేయునది. ఈ యూపమే అశ్వినుల

ఛాగ హం లభ్యస్థానము. సరస్వతి మేషహం లభ్యస్థానము. ఇంద్రుని వృషభ హం లభ్య స్థానము.

ఈ యూపమును అగ్ని యొక్క హంకి ప్రియస్థానము. సోమపు, సుత్రాత ఇంద్రుని, సంత యొక్క, వరుణుని హంకి ప్రియ స్థానము. ఇది యూపమునకు అన్న స్థానము. ఘృత పాయి దేవతలకు - హోత అగ్నికి ప్రియస్థానము.

వనస్పతి రూపయూపమా! పశువులను అత్యంత ్షుబ్ధము చేసి - స్తుతి, ఉపస్తుతులచే వానిని ఆయా స్థానములందు స్థాపించుము. వనస్పతి దేవత హంని ఆరగించును గాత. హోతా! యజింపుము.

47. దైంహోత కళ్యాణకారి అగ్నిని యజించును గాత. అగ్ని అశ్వినుల ఛాగ మాంసపు ప్రియ స్థానమును యజించినాడు. అగ్ని - సరస్వతి మేష మాంసపు ప్రియస్థానమును యజించినాడు. అగ్ని - ఇంద్రుని వృషభమాంసపు ప్రియస్థానమును యజించినాడు.

అగ్ని తన ప్రియ స్థానములను యజించినాడు. సోమపు ప్రియస్థానములను యజించినాడు. సంత ప్రియస్థానములను యజించినాడు. సుత్రాత ఇంద్రుని ప్రియ స్థానములను యజించినాడు. వరుణుని ప్రియస్థానములను యజించినాడు. వనస్పతి యూపపు ప్రియ అన్న స్థానములను యజించినాడు. ఘృతపాయి దేవతల ప్రియ స్థానమును యజించినాడు. స్వయముగా తన మహిమను యజించినాడు.

అగ్ని యజ్ఞములను సేంచును గాత. హోతా! యజింపుము.

48. దర్భయే దేవత. అశ్వినులు, సరస్వతి, ఆ దర్భచేతనే ఇంద్రుని కనులకు వెలుగును, చూపును కలిగించినారు. ధనము సమకూర్చుటగాను అశ్వినులు, సరస్వతి, ఇంద్రుడు హ౦ని ఆరగించవలెను. హోతా! యజింపుము.

49. యజ్ఞశాలకు ద్వారా దేవేరులున్నారు. వారితో కలసి వైద్య అశ్వినులు, సరస్వతియు, ఇంద్రునకు బలము సమకూర్చినారు. ఇంద్రుని నాసిక యందు ఘ్రాణేంద్రియమును, ప్రాణమును ఏర్పరచినారు. ఇంద్రునకు ధనము కలుగుటకు గాను అతనికి శక్తి కలిగించినారు. ఇంద్రాదులు హ౦ని గ్రహించవలెను. హోతా! యజింపుము.

50. ఉషయు రాత్రియు యుగళ దేవతలు, అశ్వినులు, సరస్వతి ఉషారాత్రులతో కలసి ఇంద్రునకు బలము కల్గించినారు. వారు ఇంద్రుని నోట వాగింద్రియమును కూర్చినారు. ఇంద్రునకు ధనము కలుగుటకు గాను అతనికి శక్తి, స్తోమతలు కలిగించినారు. హోతా యజింపుము.

51. ద్యావాపృథ్వ్యులతో కలసి అశ్వినులు, సరస్వతి ఇంద్రుని అభివర్ధితుని చేసినారు. ఇంద్రుని కర్ణమున శ్రోత్రేంద్రియమును ఏర్పరచినారు. అతనికి కీర్తి కలిగించినారు. ఇంద్రునకు ధనలాభము కలిగించుటకు అతనికి శక్తి స్తోమతలు కలిగించినారు. ఆ ఇంద్రాదులు హ౦ని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

52. శక్తి, ఆహుతి అను దేవేరులు దుధ, సుదుధలగుదురు. వారితో కూడి అశ్వినులు - సరస్వతి ఇంద్రునకు రక్షణలు కలిగించినారు. ఇంద్రునిలో తేజము, హృదయ బలము కలిగించినారు. ధనలాభము కలిగించుటకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించినారు. ఇంద్రాదులు హ౦ని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

53. దేవతల ఇద్దరు దేవహోతలు అగ్ని - వాయువులు. వారితో కూడి అశ్వినులు - సరస్వతి, వషట్కారములు ఇంద్రుని యందు తేజస్సు ప్రవేశపెట్టినారు. హృదయమున మతిని కలిగించినారు. ధనలాభము కలిగించుటకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించినారు. ఇంద్రాదులు హ౦ని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

54. ఇడ, భారతి, సరస్వతితో కూడి అశ్వినులు, సరస్వతి బలమును కలిగించినారు. నాభియందు అగ్నిని స్థాపించినారు. ధనలాభము కలిగించుటకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించినారు. ఇంద్రాదులు హ౦ని ఆరగింతురు గాత. హోతా! యజింపుము.

55. ఇది ఋత్విజులు చేయు ప్రశంసనీయ యజ్ఞం. ఇది మత్ హ౦ర్ధానము గలది. ఇది అగ్నీధ్రనామక యజ్ఞము. దీని రథమును అశ్వినులు, సరస్వతి లాగుదురు. ఈ యజ్ఞము ఇంద్రుని యందు ౦ర్యము, అందము, అమృతము, ఉత్తమ జన్మము కలిగించును గాత. ఈ యజ్ఞమే జగత్ స్రష్టయగు త్వష్ట అగుచున్నది. హోతలారా!ఇంద్రాదులు హ౦భక్షణ చేయునట్లు యజించండి.

56. దేవతలు బంగారు పత్రముల వృక్షమునకు అశ్వినులును, సరస్వతి సుందర ఫలములగుదురు. వారును, వనస్పతి యూప దేవతయు, ఇంద్రునకు సోమాది హ ం ఫలములను ఇచ్చినారు. వారు మాకు తేజము, ఓజము, వేగము, సామర్థ్యము కలిగింతురు గాత.

ఆ దేవతలు ధనలాభము కొరకు ఇంద్రునకు శక్తి స్తోమతలు కలిగించుటకు ఇంద్రాదులు హ ంని భక్షింతురు గాత. హోతా! యజింపుము.

57. దర్భ ఓషధ సంబంధి ఉన్ని వలె కోమలము, సుఖకరము - అశ్వినులును, సరస్వతి దర్భాసనము పరచినారు. ఇంద్రా! యజ్ఞమున ఇది నీకు సుఖకరమగును గాత. అశ్వినులు, సరస్వతి దర్భతో కూడి సంపద, దీప్యమానుమన్యు, శక్తిని కలిగించుటకు ఇంద్ర సహితులై హ ంని భక్షింతురుగాక. హోతా! యజింపుము.

58. శుభయాగ కుశల అగ్ని - ద్వై హోత అగ్ని, వాయువు, ఇంద్రుడు, అశ్వినులు సరస్వతి మరియు సోమమును యథాక్రమము యజించినారు. వారు వాణిని వాణిచే పూజించినారు. సుత్రాత ఇంద్రుడు చక్కగా పూజింపబడినాడు. స ంత, వరుణుడు, వనస్పతి యూపదేవుడు సహితము చక్కగా పూజించబడినారు. ద్వై అగ్ని భౌతిక అగ్నిచే చక్కగా పూజించబడినది. మంచి పూజలందుకొను దేవహోత మానవ హోతకు కీర్తి, శక్తి, బలము, పూజ, పితరులకు అన్నము ప్రసాదింతురు గాత. ఇంద్రునకు ధనము కలిగించుటకు ఈ దేవతలందరు హ ంని భక్షింతురు గాత. హోతా! యజింపుము.

59. యజమాని - పక్వయోగ్య హ స్సులను పచనము పురోడాశమును వండుచు అశ్వినుల కొరకు భాగమును, సరస్వతి కొరకు మేషమును, ఇంద్రుని కొరకు వృషభమును యూపమునకు బంధించుచు అశ్వినులు, సరస్వతి, ఇంద్రుని కొరకు సోమము అభిషుతము చేయుచు నేడు వాస్తవముగా అగ్నిని పూజించుచున్నాడు.

60. అశ్వినుల కొరకు ఛాగము, సరస్వతి కొరకు మేషము, ఇంద్రుని కొరకు వృషభములను ధరించి వాస్తవయూపముగ వనస్పతి దేవత యజ్ఞమునకు ఉపస్థితుడు అగుచున్నాడు. అశ్వినులు మున్నగు దేవతలు పశువుల మేదచే ప్రారంభించి శేషాంగములను భక్షించినారు. వండిన పశు శరీర భాగములను కూడా వారు స్వీకరించినారు. అశ్వినులు, సరస్వతి, సుత్రాత ఇంద్రుడు వానిని భక్షించి వర్ధిల్లినారు. వారు సురా, సోమములను సహితము పానము చేసినారు.

61. ఋషిపుత్రా! ఋత్విజ అగ్నీ! నేడు ఈ యజమాని ఇందరు ఋత్విజులు ఉండగా నిన్నేల వరించినాడు? ఏలననగా ఈ అగ్ని దేవతలు అందించు వరణీయ ధనమును

యజమానికి అందించుచు, యజమాని సమర్పించు దేవతలకు అందించును.

ద్యోతమాన అగ్నీ! దేవతలు యజమానికి దానములు ఇచ్చునట్లు ప్రయత్నించుము. దేవతలు ఇచ్చిన దానములను యజమానికి అందించుము.

హోతా! ఈ యజమాని ద్వారా భద్రవాక్కు పలికించుటకు పంపబడినావు. సూక్త వచనలు పలుకుటకు మానవహోత కూడ పంపబడినాడు. హోతా! నీవు సూక్తములు పలుకుము. " సూక్తాబ్రూహి "

## దాశరథి రంగాచార్య రచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## యాజ్యాది ప్రేషణమంత్ర యుక్తమగు

## ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము.

## సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఇరువది రెండవ అధ్యాయము

1. తేజో ఽసి శుక్రమమృతమాయుష్పా ఆయుర్మేపాహి ।

దేవస్య త్వా సంతుః ప్రసవే ఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామాదదే ॥

(అథాశ్వామేధశ్చతుర్భిరధ్యాయైః తస్యఫాల్గుణశుక్లాష్టమ్యామారమ్భః. నిష్కం ప్రతి ముంచన్వాచయతి. ఈనాలుగు అశ్వమేధ అధ్యాయములు. ఇది ఫాల్గుణశుక్ల అష్టమినాడు ఆరంభమగును. నాలుగు బంగారునాణెముల హారము నిష్కమగును. అధర్యు దానిని యజమాని

మెడలో వేయును.)

నిష్కమా! నీవు తేజస్సువు. పరిశుద్ధమవు. అమృతమవు. ఆయువును రక్షించుదానవు. ఆయుర్మేపాహి - నా ఆయువును రక్షింపుము.

(అశ్వమును కట్టు త్రాడు తీసికొనవలెను)

రజ్జువా! సంతాదేవుని అనుజ్ఞలో వర్తిల్లు నేను అశ్వినుల బాహువలతోను పూషహస్తములతోను నిన్ను అందుకొనుచున్నాను.

2. యజ్ఞముల చరిత్రలో పూర్వకాలమందలి యజ్ఞములందు కూడ ఈరజ్జువునే అందుకున్నారు. యజ్ఞం ప్రారంభమై సోమము అభిషుతమై యజ్ఞము ముందునకు సాగినపుడు మేము ఈ త్రాటిని అందుకున్నాము.

3. (గుర్రమునకు కట్టమని బ్రహ్మ ఆదేశించును. అధ్వర్యు ఆ త్రాటిని గుర్రమునకు కట్టును.)

అశ్వమా! నీవు 'స్తుత్య' నామకవు. నీవు అందరకు ఆశ్రయమవు. అందరను నియంత్రించు దానవు. భరించుదానవు. స్వాహా అన్నంత నీవు సర్వ హితకారియు ుస్తరించు వాడగు - అగ్నిని

చేరుకొనుము.

4. అశ్వమా! నేను దేవతలు మరియు ప్రజాపతి కొరకు నిన్ను తెచ్చినాను. నిన్ను స్వయముగా దేవతలు, ప్రజాపతి వద్దకు చేరునట్లు చేయుదును.

(అధ్వర్యు అనుచున్నాడు) బ్రహ్మా! నేను దేవతలు మరియు ప్రజాపతి కొరకు ఈ అశ్వమును బంధింతును.

(బ్రహ్మ అనుచున్నాడు) నీవు అశ్వమును దేవతల కొరకును ప్రజాపతి కొరకును బంధించుము. యజ్ఞ సిద్ధిని పొందుము.

5. (ప్రోక్షత్యశ్వమ్. అశ్వమును ప్రోక్షించవలెను)

అశ్వమా! నీవు ప్రజాపతికి ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు వాయువునకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు ఇంద్రాగ్నులకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు ుశ్వేదేవతలకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను. నీవు సకల దేవతలకు ప్రియమవు. నిన్ను ప్రోక్షించుచున్నాను.

(అధ్వర్యు ఆదేశమున శూద్రునకు వేశ్య వలన పుట్టినవాడు, నాలుగు కనుల కుక్కను చంపవలెను. అప్పుడు అధ్వర్యు యజమానిచే అనిపించవలసినది)

**'యో అర్వన్తం జిఘాంసతి తమభ్యమితి వరుణః '** అశ్వమును చంపదలచిన వానిని వరుణుడు వధించును.

(చచ్చిన కుక్కను ఎదురు చాపమీద పెట్టి గుర్రపు క్రింది నీటిలో తేల్చవలెను)

చంపువాడు దూరమైనాడు. కుక్క దూరమైనది - **' పరోమర్తః - పరాశ్వ '**

( **యస్య శునశ్చక్షుషోసమీపే పుణ్డ్రోస్తః సచతురక్ష ఉచ్యతే.** కనుల వద్ద నామమున్న కుక్కను నాలుగు కనులది అందురు.)

6. (గుర్రమును నీటినుండి తెచ్చి స్తోకీయమను పదిలేక వేయి ఘృతాహుతులు ఇవ్వవలెను)

**అగ్నయే స్వాహా, సోమాయ స్వాహా అపాంమోదాయ** - జలములముదమునకు స్వాహా. స◌ంత్రే స్వాహా. వాయువే స్వాహా. ◌ష్ణువే స్వాహా. ఇంద్రాయ స్వాహా. బృహస్పతయే స్వాహా. ◌ుత్రాయ స్వాహా. వరుణాయ స్వాహా.

7. హింకారాయ స్వాహా. హింకృతాయ స్వాహా. క్రన్దనే స్వాహా. అవక్రందాయ స్వాహా. ప్రోథతే స్వాహా. ప్రప్రోథాయ స్వాహా. గంధాయ స్వాహా. ధాత్రాయ స్వాహా. ని◌ష్ఠాయ స్వాహా. ఉప◌ష్ఠాయ స్వాహా. సందితాయ స్వాహా. వల్గతే స్వాహా. ఆసీనాయ స్వాహా. శయనాయ స్వాహా. స్వపతే స్వాహా. జాగ్రతే స్వాహా. కూజతే స్వాహా. ప్రబుద్ధాయ స్వాహా. ◌జృంభమాణాయ స్వాహా. ◌చృతాయ స్వాహా. సంహానాయ స్వాహా. స్వాహోపస్థితాయ స్వాహా. స్వాహాయనాయ స్వాహా. ప్రాయణాయ స్వాహా.

8. పరిగెత్తు వారికి స్వాహా. వేగవంతునకు స్వాహా. క్షిప్రగతికి స్వాహా. కూర్చున్నవారికి స్వాహా. లేచినవారికి స్వాహా. తిరుగువారికి స్వాహా. తిరుగని వానికి స్వాహా. బలమునకు స్వాహా.

వేగమునకు స్వాహా. కుండ కదిలించువానికి స్వాహా. వడకువానికి స్వాహా. సే◌తునకు స్వాహా. ◌నువానికి స్వాహా. చూచువానికి స్వాహా. చూడబడువానికి స్వాహా. రెప్పవేయువానికి స్వాహా. తిన్నదానికి స్వాహా. త్రాగినదానికి స్వాహా. మూత్రించుటకు స్వాహా. కర్మకారికి స్వాహా. కర్మ చేసినవానికి స్వాహా.

**9. తత్స◌తుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ।**

**ధియోయోనః ప్రచోదయాత్ ॥**

స◌తృ దేవత పాపభర్జనకారి. వరణీయుడు. మేము అతని తేజమును దాల్తుము. ఆ తేజము మా బుద్ధులను సత్కర్మలకు ప్రేరేపించును గాత.

10. హిరణ్యస◌తను నన్ను రక్షింపుమని ఆహ్వానించుచున్నాను. అతడు జ్ఞానియగు దేవత. స్వర్గాది ఉత్తమ పదములు అతనికే తెలియును.

11. స◌త సర్వజ్ఞుడు. అతని చిత్తము మహత్తము, సత్యసాధకము. మేము స◌త మంచి మనసును యాచించుచున్నాము.

12. స◌త సుమతిని పెంచువాడు. అందరిని చిత్తములను ఎరిగినవాడు. మేము అతనిని చక్కగా స్తుతింతుము. అతని దానమును యాచింతుము.

13. స◌త శ్రేష్ఠజనుల పాలకుడు. శుభకర్మ ప్రేరకుడు. దేవతల తర్పణకు గాను స◌త దానమును యాచించుచున్నాము.

14. సకల దేవతల తర్పణకుగాను ప్రేరక సంతా దేవుని సంపదను సద్బుద్ధిచే యాచించుచున్నాము.

15. అధ్వర్యులారా! అమర అగ్నికి సంధలు అర్పించండి. ప్రబుద్ధుని చేయండి. జాగృతుడగు అగ్ని మాహంస్సులను దేవతలకు చేర్చును గాత.

16. అగ్నిహవ్యవాహనుడు. అమరుడు కోరదగినవాడు. దూత హితుడు. స్తుతులు అందుకొనును. దేవతల వద్దకు చేర్చును.

17. అగ్నిదూత. అతనిని నా ముందు స్థాపించుచున్నాను. ఈ యజ్ఞమునకు దేవతలను తెమ్మని హవ్యవాహుని ప్రార్థించుచున్నాను.

18. పంత్రకారి సోమమా! నీవు శక్తిమంతుడవు. సూర్యుని వెల్లడించినావు. ధారాగతిగల నీవు గోవులు మున్నగు పశువులకు జీవనమునిచ్చు వర్షము కలిగింతువు.

19. అశ్వమా! నీవు భూమాత సంబంధమున ఎంతో సమర్థుడవు. ద్యుపిత సంబంధమున ఎంతో ప్రభుతవంతుడవు. అశ్వ, హయ, అర్వ, సప్తి, వాజి, వృష, యజమాన, యయు, శిశు నామములు గలదానవు. నీవు దేవ మార్గము చేరుకొనుము.

దిక్పాలదేవతలారా! ఇది అశ్వము. దేవతల నిముత్తము జలముచే పంత్రము

చేయబడినది. దీనిని ఁరు ఎల్లవేళల రక్షించండి.

అశ్వమా! ఇది నీవు ఆనందించుచోటు. ఇచట ఆనందించుము. ఇది నీవు నిలుచు స్థలము.

ఇచట నిలువుము. సుఖింపుము - స్వాహా.

20. ప్రజాపతయే స్వాహా. కస్మై స్వాహా. కతమస్మై స్వాహా. స్వాహాధిమాధీతాయ స్వాహా. మనః ప్రజాపతయే స్వాహా. చిత్తం ంజ్ఞాతాదిత్యై స్వాహా. ఆదిత్యైమహ్యై స్వాహా. ఆదిత్యైసుమృడీకాయై స్వాహా. సరస్వత్యై స్వాహా. సరస్వత్యై పావకాయై స్వాహా. సరస్వత్యై బృహత్యై స్వాహా. పూష్ణే స్వాహా. పూష్ణేప్రపథ్యాయ స్వాహా. పూష్ణే నరధిశాయ స్వాహా. త్వష్టే స్వాహా. త్వష్టే తురీపాయ స్వాహా. త్వష్టే పురురూపాయ స్వాహా. ంష్ణవే స్వాహా. ంష్ణవే నిభూయపాయ స్వాహా. ంష్ణవే శిపింష్టాయ స్వాహా.

(ఇం ఔద్గ్రాభణ మంత్రములు)

21. మానవనేతలందరు సంతాదేవుని మైత్రి కోరుకుందురు. అందరు ధనము కోరుకుందురు. సంతానాదుల పోషణకు అన్నాదులు కోరుకుందురు. సంతాయ స్వాహా.

22. బ్రహ్మ! మాదేశమున యజ్ఞమును అధ్యయనశీల బ్రాహ్మణులును జన్మింతురు గాత. శూరులు, లక్ష్యభేదులు, ధరుర్ధారులు, మహారథులగు క్షత్రియులు జన్మింతురు గాత.

పాడియావులు, బరువులు మోయు ఎద్దులు, వ్యాపనశీల అశ్వములు, మనోహరస్రీలు, ఈ యజమానికి జయశీల, రథారోహి, సభాకుశల, సేచన సమర్థపుత్రులు జన్మింతురు గాత. నికామే నికామే నః పర్జన్యోవర్షతు. కోరినంత పర్జన్యుడు వర్షము కలిగించును గాత. ఓషధులు ఫలించును గాత. యోగక్షేమో నః కల్పతామ్ - మాకు యోగక్షేమములు కలుగును గాత.

( యోగక్షేమం వహామ్యహమ్ అన్నాడు శ్రీ కృష్ణభగవానుడు శ్రీ మద్భగవద్గీతలో)

23. ప్రాణాయ స్వాహా. అపానాయ స్వాహా. వ్యానాయ స్వాహా. చక్షుషే స్వాహా. శ్రోత్రాయ స్వాహా. వాచే స్వాహా. మనసే స్వాహా.

24. ప్రాచ్య దిశకు స్వాహా. అర్వాచిదిశకు స్వాహా. దక్షిణ దిశకు స్వాహా. అర్వాచ్య దిశకు స్వాహా. ప్రతీచ్యదిశకు స్వాహా. అర్వాచ్యదిశకు స్వాహా. ఉదీచిదిశకు స్వాహా. అర్వాచిదిశకు స్వాహా. ఊర్ధ్వదిశకు స్వాహా. అర్వాచ్యదిశకు స్వాహా. అర్వాచ్యదిశకు స్వాహా. ఆర్యాచ్యదిశకు స్వాహా.

25. అద్భ్యః స్వాహా. వాభ్యః స్వాహా. స్వాహోదకాయ స్వాహా. తిష్ఠన్తీభ్యః స్వాహా. ప్రవన్తీభ్యః స్వాహా. స్యన్దమానేభ్యః స్వాహా. కూప్యాభ్యః స్వాహా. సూద్యాభ్యః స్వాహా. ధార్యాభ్యః స్వాహా. అర్ణవాయ స్వాహా. సముద్రాయ స్వాహా. సరిరాయ స్వాహా.

26. వాతమునకు స్వాహా. ధూమమునకు స్వాహా. స్వాహాభ్రాయ స్వాహా. మేధకు స్వాహా. ిద్యోతమానమునకు స్వాహా. స్తనయతమునకు స్వాహా. స్ఫూర్జితమునకు స్వాహా. వర్షమునకు స్వాహా. వవర్షమునకు స్వాహా. అగ్రవర్షమునకు స్వాహా. శీఘ్రవర్షమునకు స్వాహా. ఉద్గ్రహణమునకు స్వాహా. ప్రుష్ణతమునకు స్వాహా. శీకాయతమునకు స్వాహా. పుష్పములకు స్వాహా. హ్లాదునిలకు స్వాహా. నిహారాయ స్వాహా.

27. అగ్నయే స్వాహా. సోమాయ స్వాహా. ఇంద్రాయ స్వాహా. పృథివ్యై స్వాహా. అంతరిక్షాయ స్వాహా. దివే స్వాహా. దిగ్భ్యం స్వాహా. ఆశాభ్యః స్వాహా. ఉర్వై వ్య స్వాహా. దిశే స్వాహా. అర్వాచ్యైదిశే స్వాహా.

28. నక్షత్రేభ్యః స్వాహా. నక్షత్రిభ్యః స్వాహా. అహోరాత్రే భ్యః స్వాహా. అర్ధమాసేభ్యః సాభ్వ్యహా. మాసేః స్వాహా. ఋతుభ్యః స్వాహా. అర్తవేభ్యః స్వాహా. సంవత్సరాయ స్వాహా. ద్యావాపృథింభ్యాం స్వాహా. చంద్రాయ స్వాహా. సూర్యాయ స్వాహా. రశ్మిభ్యః స్వాహా. వసుభ్యః స్వాహా. రుద్రేభ్యః స్వాహా. ఆదిత్యేభ్యః స్వాహా. మరుద్భ్యః స్వాహా. ిశ్వేభ్యో దేవేభ్య స్వాహా. మూలేభ్య: స్వాహా. శాఖాభ్య: స్వాహా. వనస్పతిభ్య: స్వాహా. పుష్పేభ్య: స్వాహా. ఫలేభ్య: స్వాహా. ఓషధీభ్య: స్వాహా. పుష్పే భ్య: స్వాహా. ఫలేభ్య: స్వాహా. ఓషధీభ్య: స్వాహా.

29. పృథివ్యై స్వాహా. అంతరిక్షాయ స్వాహా. దివేస్వాహా. సూర్యాయ స్వాహా. చన్ద్రాయ స్వాహా. నక్షత్రేభ్యః స్వాహా. అద్భ్యః స్వాహా. ఓషధీభ్యః స్వాహా. వనస్పతీభ్యః స్వాహా. పరిప్లవేభ్యః స్వాహా. చరాచరేభ్యః స్వాహా. సరీసృపేభ్యః స్వాహా.

30. అసవేస్వాహా, వసవేస్వాహా. ౦భువే స్వాహా. ౦వస్వతే స్వాహా. గణశ్రయే స్వాహా. గణపతియే స్వాహా. అభిభువే స్వాహా. అధిపతయే స్వాహా. సూషాయస్వాహా. సంసర్పాయ స్వాహా. చన్ద్రాయ స్వాహా. జ్యోతిషే స్వాహా. మలిమ్లుచాయ స్వాహా. దివాపతయే స్వాహా.

31. మఘువేస్వాహా. మాధవాయ స్వాహా. శుక్రాయ స్వాహా. శుచయే స్వాహా. నభసే స్వాహా. నభస్యాయ స్వాహా. ఉషాయ స్వాహా. ఊర్జాయ స్వాహా. సహసే స్వాహా. సహస్యాయ స్వాహా. తపసే స్వాహా. తపస్యాయ స్వాహా. అ హసస్పతయే స్వాహా.

32. వాజాయ స్వాహా. ప్రసవాయ స్వాహా. అపిజాయ స్వాహా. క్షతవే స్వాహా. స్వః స్వాహా. మూర్ధ్నే స్వాహా. వ్యశ్నువనే స్వాహా. అన్త్యా స్వాహా. భౌవనాయ స్వాహా. భువనస్యపతయే స్వాహా. అధిపతయే స్వాహా. ప్రజాపతయే స్వాహా.

33. యజ్ఞము వలన ఆయువు లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన ప్రాణము లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన అపానము లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన వ్యానము లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన ఉదానము లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన సమానము లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన నేత్రములు లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన శ్రోత్రములు లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన వాక్కు లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన మనసు లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన ఆత్మ లభించును గాత.

స్వాహా. యజ్ఞం వలన బ్రహ్మ లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన జ్యోతి లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన స్వర్గము లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన యజ్ఞం లభించును గాత. స్వాహా. యజ్ఞం వలన పృష్టము లభించును గాత. స్వాహా.

34. ఒకటికి స్వాహా. రెంటికి స్వాహా. నూటికి స్వాహా. నూటొక్కటికి స్వాహా. దివారాత్రములకు స్వాహా. స్వర్గమునకు స్వాహా.

దాశరథి రంగాచార్య ౦రచిత

శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

అశ్వమేధాహుతియను ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము.

సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఇరువది మూడవ అధ్యాయము

1. హిరణ్యగర్భః సుమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ ।

సదాధారపృథిిం ద్యాముతేమాం కస్మైదేవాయ హిషా ిధేమ ॥

సృష్టికి ఆదికాలమున ఒక్క హిరణ్యగర్భుడు మాత్రము ఉండెను. అతడే సకల భూతజాతములకు అధిపతియైనాడు. అతడే ఈ ద్యావాపృథ్వులను భరించినాడు. అట్టి ప్రజాపతికి హిస్సులు సమర్పింతుము.

2. (మహిమ గ్రహమును అందుకొనవలెను)

గ్రహమా! నీవు ఉపయామ పాత్రద్వారా గ్రహించబడినావు. ప్రజాపతికి ప్రియమవగు నిన్ను

అందుకొనుచున్నాను.

(గ్రహము వేదిపై ఉంచవలెను) ఇది నీ స్థానము.

నీ మహిమ దినములందు. సంవత్సరములందు. వాయువునందు. అంతరిక్షమునందు. ద్యులోకమునందు. సూర్యుని యందున్నది. అట్టి నీ మహిమకు, ప్రజాపతికి, అన్యదేవతలకు స్వాహా.

3. ఏ ప్రజాపతి తన మహిమ వలన సమస్త జగత్తునకు స్వాి అయినాడో - ఎవడు సమస్త ద్విపాద చతుష్పాద సంపదకు స్వాియో అట్టి ప్రజాపతికి హిస్సులు అర్పింతుము.

4. గ్రహమా! నీవు ఉపయామ పాత్రద్వారా గ్రహించబడినావు. నీవు ప్రజాపతికి ప్రియమవు. అట్టి నిన్ను అందుకొనుచున్నాను. (గ్రహమును వేదిపై ఉంచవలెను.) ఇది నీస్థానము.

గ్రహమా! చంద్రుడు నీ మహిమయే. నీ మహిమ రాత్రులందును - సంవత్సరములందును - నక్షత్రచంద్రులందును - ఉత్పన్నమైనది. అట్టి నీ మహిమకు - ప్రజాపతికి - అన్యదేవతలకు స్వాహా.

5. సూర్యుడు ఈ మహాజగత్తు ిద రోషరహితుడై భ్రిించుచున్నాడు. ఋత్విజులు సూర్యుని నుతించుచున్నారు. స్వకార్యరతుని చేయుచున్నారు. ఆ సూర్యిని వలననే ద్యులోకము గ్రహనక్షత్రాదులు వెలుగొందుచున్ని.

6. సూర్యుని అశ్వములు కమనీయ రథమున పూన్చబడున◌. శోణవర్ణలు. శత్రుదమనలు. సూర్యుని వహించు సమర్థలు. అట్టి వానిని ఋత్విజులు తమ స్తుతులచే రథమున పూన్చెదరు.

7. (అధ్వర్యు, యజమాని రథమున కూర్చుందురు. రథము యజ్ఞభూ◌దాటి నీటిలో నిలుచును. యజమాని అధ్వర్యుతో ఇట్లనును)

అధ్వర్యులారా! ఈ అశ్వములు ఇంద్రుని దేహము. ఇ◌ ఎంతో దూరము నీటి వరకు వచ్చిన◌. ◌నిని మరల అదే మార్గమున మరలించండి.

8. (రథము తిరిగి వచ్చును. గుర్రమును ◌ప్పుదురు. అప్పుడు యజమాన పత్ని అశ్వపు తల, మధ్యభాగము, పృష్ట భాగమునకు ఆజ్యము అంటించును)

అశ్వమా! వసుగణములు గాయత్రీ ఛందమున నీ తలకు నేయి అంటుదురు గాత.

అశ్వమా! రుద్రగణములు త్రిష్టుప్ ఛందమున నీ మధ్య భాగమునకు నేయి అంటుదురు గాత.

అశ్వమా! ఆదిత్యగణములు జగతీ ఛందమున నీ వెనుక భాగమునకు నేయి అంటుదురు గాత.

అశ్వమా! భూర్భువస్వః పేలాలు, పిండి, యవలు, దధి మున్నగున◌ తినుము.

ప్రజాపతీ! దేవతలారా! భుక్తశేషమును ఆరగించండి.

9. (బ్రహ్మహోతల మధ్య సంభాషణ)

బ్రహ్మ అడుగుచున్నాడు:--

హోతా! వంటరిగా పరిభ్ర◌ంచువాడెవడు? మరల పుట్టునట్టి వాడెవడు? చలికి మందు ఏది? మహా ఆవపనమేది?

10. హోత చెప్పుచున్నాడు :--

బ్రహ్మా! వంటరిగా ఆకాశమున భ్ర◌ంచువాడు సూర్యుడు. మరల పుట్టునట్టి వాడు చంద్రుడు. చలికి మందు నిప్పు అగును. మహా ఆవపనము చేయునది భూ◌.

11. బ్రహ్మ అడుగుచున్నాడు :--

హోతా! పూర్వచిత్తి ఏది? బృహత్ పక్షి ఏది? పిలిప్పిలా ఏ◌? పిశంగిల ఏ◌?

12. హోత చెప్పుచున్నాడు :--

బ్రహ్మ! ద్యులోకము, వర్షము, పూర్వచిత్తి యగును. అశ్వము బృహత్ పక్షియగును.

పృథిం పిలిప్పిల యగును. రాత్రి పిశంగిల యగును.

13. అశ్వమా! వాయువు నిన్ను పచనము నుండి రక్షించును గాత. ధూమగ్రీవాగ్ని నిన్ను మేకల నుండి రక్షించును గాత. మర్రి సోమపాత్రలతోను, బూరుగు వృక్షవృద్ధితోను, నిన్ను రక్షింతురు

గాత. రథమును లాగునది నాలుగు కాళ్ళతో సాగును. చంద్రుడు మమ్ము రక్షించును గాత. నమో గ్నయే - అగ్నికి నమస్సు.

14. రథము కళ్లెమున శోభిల్లును. కళ్ళెము గుర్రమున శోభిల్లును. జలములందు పుటిన అశ్వము జలములందు శోభిల్లును. బ్రహ్మ సోమమున శోభిల్లి పురోగంచును.

15. అశ్వమేధశ్వమా! నీవు స్వచ్ఛందముగఆ శరీరములను ఏర్పరచుకొనుము. స్వచ్ఛందముగా దేవతలను యజింపుము. అభీష్ట పదార్థములను సేంచుము. నీ మహిమ ఇతరులలో కనిపించదు.

16. అశ్వమా! మేము నిన్ను వధించుట నీకు మరణము కాదు - నష్టముకాదు. ఇక నీవు దేవయాన మార్గమున దేవతలను చేరుకుందువు. అచట పుణ్యవంతులు ఉందురు. వారు చేరిన చ9ఒట సంతా దేవత నిన్ను చేర్చుకొనును.

17. పూర్వము అగ్నియే పశువైయుండెను. దేవతలు అగ్ని పశువుతోనే యజ్ఞము చేసినారు. అగ్ని భూలోకమును జయించినాడు. అగ్నియే భూంకి అధిపతియైనాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే ఈ పృథ్వి అగును. నీవే ఈ పృథ్విని జయించగలవు. పోక్షణీ జలమును త్రాగుము. (ప్రోక్షణీ జలమును గుర్రపు నోటికి అందించవలెను)

వాయువు పశువై ఉండెను. దేవతలు వాయు పశువుతోనే యజ్ఞము చేసినారు. వాయువు అంతరిక్షమును జయించినాడు. వాయువే అంతరిక్షమునకు అధిపతియైనాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే అంతరిక్షమగును. నీవే ఈ అంతరిక్షమును జయించగలవు. ఈ ప్రోక్షణీ జలములను త్రాగుము.

సూర్యుడు పశువై యుండెను. దేవతలు సూర్య పశువుతోనే యజ్ఞం చేసినారు. సూర్యుడు ద్యులోకమును జయించినాడు. సూర్యుడే అంతరిక్షమునకు అధిపతి అయినాడు.

అశ్వమా! యజ్ఞమున వధించబడిన నీదే ద్యులోకమగును. నీవే ద్యులోకమును జయించగలవు. ప్రోక్షణీజలము త్రాగుము.

18. ప్రాణాయ స్వాహా. అపానాయ స్వాహా. వ్యానాయ స్వాహా. (పత్నులు పరస్పరము అనుకొనుచున్నారు.) అంబ, అంబిక, అంబాలికలారా! ఏ పురుషుడును మమ్ము త్వరగా అశ్వము వద్దకు చేర్చుకున్నాడు. నేను ఆలస్యమైనందున ఈ దుష్ట అశ్వము కాంపీల దేశపు సుభద్రికయను దానిని పెట్టుకొని పడుకున్నది.

19. (పత్నులు అశ్వమును చేరి తొ్ముది ప్రదక్షిణలు చేయుదురు)

గణములందు శ్రేష్టుడవగు గణపతివగు నిన్ను యాచించుచున్నాము. ప్రియులందు ప్రియపతివగు నిన్ను మేము యాచించుచున్నాము. సుఖనిధులందు శ్రేష్ఠసుఖముల అధిపతివగు

నిన్ను యాచించుచున్నాము.

వసురూప అశ్వమా! నీవే మాపతిి. (అశ్వమహిషి అశ్వము వద్ద పడుకొనును) గర్భమును కలిగించు నీ తేజమును గుంజి నా యోనియందుంచుకొనుచున్నాను. నీవు గర్భము కలిగించు

నీతేజమును నాయోనియందుంచుము.

20. అశ్వమా! రమ్ము మేము, నీవు మన నాలుగు నాలుగు కాళ్ళను చూచుదము.

అధ్వర్యు అనుచున్నాడు: అశ్వమహిషీ! ఇది స్వర్గతుల్యమగు యజ్ఞ భూి దుప్పటి కప్పుకొనుము.

( **అశ్వశిశ్న ముపస్తే కురుతే,** అశ్వశిశ్నమును యోని యందుంచుకొనును)

నేను రేతము ధరించు దానను. నాలో రేతమును చేర్చుము.

21. యజమాని అశ్వముతో అనుచున్నాడు:--

సేచక అశ్వమా! లేపిన కాళ్లతో ఈ అశ్వమహిషి యోని యందు నీ లింగమును ఉంచి వెనుకకు ముందుకు కదిలించుము. అదియే స్త్రీలకు జీవన భోజనములగును. యః స్త్రీణాం జీవభోజనః

22. ( **అధ్వర్యు అంగుళ్యా యోని ప్రదర్శన్నాహ** అధ్వర్యు కన్య యోనిని వ్రేలుచే చూపి అనుచున్నాడు.)

ఈ యోని 'ఆహలగ్' అని శబ్దము చేయుచు గెంతుపక్షియా? భగమును శిశ్నము కొట్టినపుడు యోని అంగమును ింగినట్లనిపించును.

23. (కన్య అధ్వర్యునకు ఇచ్చిన సమాధానము:--)

నీకు ముందు 'ఆహలగ్' అనుచు పాకుచున్న పక్షి ఏది? ఇది నీనోటి వలె ఏదో చెప్పుచున్నట్లున్నది. అధ్వర్యులారా! ఇక మాట్లాడకండి.

24. (బ్రహ్మ మహిషితో అనుచున్నాడు :--)

మహిషీ! నీ తల్లితండ్రులు మంచము ీంద ఉందురు. అప్పుడు నీ తండ్రి స్నేహము చేయుదును, అని పిడికిలితో శిశ్నమును పట్టి భగములోనికి త్రోయును.

25. (మహిషి అనుచున్నది:--)

బ్రహ్మా! నీ తల్లితండ్రులు కూడా మంచము ీంద రతి క్రీడ.... నీ నోరు మరేదో చెప్పనున్నది. అధిక ప్రసంగము మానుము. "మాత్వం వదో బహు"

26. (ఉద్గాత వావాతను గూర్చి)

బరువులు మోసి అలసిన వానిని లేపినట్లు - ఈ వావాతను పైకి లేపుము. అందువలన యోని మధ్యభాగము, చలిగాలికి ధాన్యము తూర్పారబట్టురైతువలె ంకసించును.

27. (వావాత ఉద్గాతను గూర్చి)

బరువులు మోసి అలసిన వానిని లేపినిలిపినట్లు, ఈ ఉద్గాతను లేని నిలబెట్టండి. ఇతని మధ్య లింగభాగము చలిగాలికి ధాన్యము తూర్పారబట్టురైతు చేతివలె వడకుచున్నది.

("వావాతాదేహ మధ్యం ఇతిమహీధరః " వావాతమన దేహమధ్యమని మహీధరవ్యాఖ్య)

28. (హోత 'పరివృక్త'ను గూర్చి)

చిన్నయోని గలదాని భగమున చిన్న లింగము దూరినపుడు అండకోశము దానియోనిపై నీటిలోనిగోవు పాదము వద్ద చేపలవలె కదలాడుచుండును.

29. (పరివృక్త హోతను గూర్చి)

దేవతలు శ్లేష్మము స్రంంచు లింగమును బలముగా యోని యందు ప్రవేశపెట్టినపుడు స్త్రీసర్వాంగములందు - ఇదికన్ను చూచిన సత్యము వంటిది - ఉరునారి యనిపించుకొనును.

30. (క్షత్తాపాలాగలీమహ)

రైతు పొలమున జింకదూరి పొలము మేయునప్పుడు రైతు, పశువు పంటతిని బలిసినది అనుకొనడు. పంటపోయినందుకు దుఃఖించును. అట్లే శూద్ర వనిత ధనికుని ఉంపుడు కత్తె అయినపుడు, దాని భర్త ధనము వచ్చునని సంతసించడు. తన భార్య వ్యభిచారిణి అయినందుకు దుఃఖించును.

31. (పాలాగలీ ప్రత్యాహ)

హరిణము పొలము మేసినపుడు పశువు బలిసినదని రైతు సంతసించడు. అట్లే శూద్రుడు ధనిక స్త్రీకి జారుడైనపుడు సంతసించడు. దుఃఖించును.

32. (అశ్వము వద్ద పడుకొనియున్న మహిషిని లేపవలెను)

ఈ అశ్వము గమనకారి. జయశీలము. వేగవంతము. దీని ప్ంత్రతకని మేము అశ్లీల భాషణ చేసినాము. ఇప్పుడు మానోళ్లు ప్ంత్రములగును గాత. మా ఆయువు వృద్ధి చెందును గాత.

33. (ముగ్గురు భార్యలు రాగి, వెండి, బంగారు సూదులచే గుర్రపు చర్మమును ఛేదింతురు)

అశ్వమా! గాయత్రి, త్రిష్టుప్, జగతి, అనుష్టుప్, పంక్తి, బృహతి, ఉష్ణిక్, కకుప్ ఛందములు ఈ సూదులచే నిన్ను సంస్కరించును గాత.

34. ద్విపద, త్రిపద, చతుష్పద, షట్పద ఛందములును ఛందోభావ, ఛందలక్షణ

ఛందములును ఈ సూదులచే అశ్వమును సంస్కరించును గాత.

35. మహానాంన్న శక్వరి ఋచలు, రైవత్సామపు రేవతీ ఋచ, సమర్థములగు అన్నిదిశలు, మేఘపు వైద్యుతవాణి అశ్వమును ఈ సూదులచే సంస్కరించును గాత.

36. అశ్వమా! రాజపత్నులు, అన్య శుభలక్షణ మహిళలు నీ రోమములు పీకుదురు గాత. దేవపత్నులు, దిశలు నిన్ను సూదులచే సంస్కరింతురు గాత.

37. వెండి, బంగారము, రాగి సూదులకట్టలు అశ్వము యొక్క శరీరమును ఛేదించుచు అశ్వశరీరముతో సంగతులు అగుదురు గాత. వేగవంతమగు అశ్వపు చర్మము ఛేదించుచు సూదులు సంస్కరించును గాత.

38. రైతులు ధాన్యమును గడ్డి నుంచి వేరు చేసి కోయుదురు. అట్లే దర్భాసనముల ంద ఆసీనులై స్తుతులచే దేవతలను యజించు వారి కొరకు ఈ లోకమున భోజనాదులు ఏర్పాటు చేయండి.

39. అశ్వమా! ఎవడు నిన్ను నరుకును? ఎవడు నీ తోలు వలుచును? ఎవడు నీ అవయవములను కోయును? ద్వాంసుడే నినన్నింటిని చేయును. మరొకడు కాడు.

40. అశ్వమా! సంవత్సరపు తేజమున ఋతువులను అనుసరించి ఋతువులే అస్థి గంధులను కోయును గాత. అం తమ కర్మములచే నీకు హంభావము ప్రాప్తింప చేయుదురు గాత.

41. అశ్వమా! మాసములు, అర్ధమాసములు సంస్కరించుచు నీ గ్రంథులను కోయుదురు గాత.

దివారాత్రులు మరుత్తులు నీ లఘు అంగములను ుడదీయుదురు గాత.

42. దైి అధ్వర్యులగు అశ్వినులు నిన్ను కోయవలెను. హుి రూపమున ప్రదానము చేయవలెను. దేవతలు నీ దేహమున సీమా రేఖలు ఏర్పరచవలెను.

43. అశ్వమా! ద్యులోక, భూలోక, అంతరిక్షములు, వాయువు నీ యొక్క ఛిద్రములను పూడ్చవలెను. నక్షత్ర సహిత సూర్యుడు నీకు స్వర్గము ప్రసాదించును గాత.

44. అశ్వమా! నీ శరీరమునందలి శిరము మున్నగు ఉత్తమాంగములు శాంతించును గాత. ఇతర చిన్న అవయవములు శాంతించును గాత. ఎముకలు మూలుగు శాంతించును గాత. సమస్త శరీరము శాంతించును గాత.

45. వంటరిగా భ్రుంచువాడెవడు? ఎవడు మరల జన్మించును? మంచుకు మందేది? మహదావ పనమెవరిది?

46. సూర్యః ఏకాకీ చరతి । చన్ద్రమా జాయతే పునః । అగ్ని ర్హి మస్య భేషజం । భూుిరావపనం మహత్ ॥

47. సూర్య సమ జ్యోతి ఏది? సముద్ర సమమైన సరస్సు ఏది? పృథ్విని ుంచినదెవరు? పరిమాణము లేనిదేు?

48. బ్రహ్మ సూర్య సమజ్యోతి యగును. ద్యులోకము సముద్ర సమాన సరోవరమగును. ఇంద్రుడు పృథ్విని ుంచిన చిరంజీి. పరిమాణము లేనిది గోవు.

(గవాహి యజ్ఞోధార్యతే. గోవు యజ్ఞమును ధరించునది అయినందున దీనికి పరిమాణము లేదు)

49. దేవుత్ర ఉద్గాతా! నా జ్ఞానమునకు నిన్ను అడుగుచున్నాను. ుష్ణువు మూడు పదములందు ఆహవనీయ, గార్హ పత్య, దక్షిణాగ్నులందు యజనము చేయగా సమస్త జగము వానిలోనే చేరిని. ఈ ుషయము నీవు ఎన్నడైన ఆలోచించినావా?

50. (ఉద్గాతా ప్రత్యాహ - ఉద్గాతబదులు చెప్పినాడు)

ఈ లోకములన్నియు చేరిన మూడు స్థానములందు నేను సహితము ఉందును. తక్షణమే భూలోకము తిరిగి వత్తును. ద్యులోకము తిరిగి వత్తును. ఒకే అంగము - మనసున - నేను స్వర్గపు ఉత్తమ స్థానమును ఎరుంగగలను.

51. బ్రహ్మ! నేను స్పర్థచే నిన్ను ఈ ప్రశ్న అడుగుచున్నాను. ఈ ిషయమున నాకు ఎట్టి సమాధానములు ఇవ్వగలవు?

పురుషుడు వేని యందు ప్రవేశించి ఉన్నాడు? పురుషుని యందు ఏ ిప్రవేశించి ఉన్న ి?

52. (బ్రహ్మ ప్రత్యాహ)

పంచభూతములందు పురుషుడు ప్రవేశించు ఉన్నాడు. పురుషుని యందు పంచభూతములు ప్రవేశించు ఉన్న ి. నిన్ను నాకు ప్రతిద్వంద్వగా భా ించి ివరించినాను. బుద్ధియందు నీవు నన్ను ిుంచిన వాడవుకావు.

53. పూర్వచిత్త ఏ ిు? పెద్దదియు భారమగు పక్షి ఏది? పిలిప్పిల ఏది? పిశంగిల ఏది?

54. వర్షము పూర్వచిత్తి అయినది. అశ్వము పెద్దదియు భారమగు పక్షి అయినది. పృథ్వి పిలిప్పిల అగును. రాత్రి పిశంగిల అగును.

55. (అధ్వర్యుర్హోతారం పృచ్ఛతి)

పిశింగిల ఎవరు? కురుపిశంగిల ఏది? దుముకుచు నడుచునది ఏది? పాకుచు సాగినది ఏది?

56. (ప్రత్యాహ)

అధ్వర్యూ! రాత్రి పిశంగిల యగును. శ్వా ిత్ కురుపిశింగిల యగును. దు ిుకి నడుచునది కుందేలు. పాకి సాగునది సర్పము.

(పిశం రూపం గిలితి భక్షయతి పిశంగిల. తన రూపమును తాను తినునది పిశంగిల. శ్వా ిత్ ఏదుపంది వంద మూలములను తినునది అని అర్థము)

57. (బ్రహ్మ ఉద్గాతను అడుగుచున్నాడు)

ఉద్గాతా! ఈ యజ్ఞమున అన్నములెన్ని? దీనికి అక్షరములెన్ని? హోమము లెన్ని? స ిుధలెన్ని? ఎందరు హోతలు ఋతువులననుసరించి యజింతురు?

నీవు యజ్ఞజ్ఞాతవని అడుగుచున్నాను.

58. (ప్రత్యాహ)

బ్రహ్మన్! ఈ యజ్ఞమున ఆరు అన్నములున్న ి. వంద అక్షరములు. ఎనుబది హోమములు, మూడు స ిుధలు కలవు. ఏడుగురు హోతలు ఋతువులననుసరించి యజింతురు. యజ్ఞం నెరగిన నేను నీకు ఈ ిషయములు చెప్పుచున్నాను.

(ఆరురుచులు, ఆరు అన్నములు, ఛందమునందలి అక్షరములు వంద. ఉష్ణిక్ 28్ధృతిః 72 ్ర 100. యూపమునకు 20 చొప్పున నాలుగు యూపములు 20 ˘4 ్ర80. 1. మృగములు

2. ప్రజాపతులు 3. పశువులు, సఁంధలు)

59. (ఉద్గాతా బ్రహ్మాణం పృచ్ఛతి)

బ్రహ్మా! ఎవనికి ఈ భువనపు నాభి తెలియును? ద్యావాపృథ్వి అంతరిక్షములను ఎవడు తెలియును? సూర్యుని ఉత్పత్తి స్థానము తెలిసినవాడెవడు? చంద్రుడు పుట్టిన స్థలము తెలిసినవాడెవ్వడు?

60. (ప్రత్యాహ)

వేదాహమస్య భువనస్య నాభిం. నేను భువనపు నాభిని ఎరుగుందును. ద్యావాపృథ్వి అంతరిక్షములను ఎరుంగుదు. సూర్యుని మహా ఉత్పత్తి స్థానమును ఎరుంగుదును. చంద్రుడు పుట్టిన స్థలమును ఎరుంగుదును.

61. (అధ్వర్యుం యజమాన: పృచ్ఛతి)

అధ్వర్యులారా! ఁమ్ము నేను పృథ్వి యొక్క పరమ అంతము అడుచున్నాను. భువనముల నాభిని అడుగుచున్నాను. సేచక అశ్వపు ఁర్యము అడుచున్నాను. వాణి యొక్క పరమ వ్యోమమును గురించి అడుగుచున్నాను.

62. (ప్రత్యాహ)

యజమానీ! ఈ వేదియే పృథ్వికి పరమ అంతము. ఈ యజ్ఞమే భువనమునకు నాభి. ఈ సోమమే సేచక అశ్వపు ఁర్యము. ఈ బ్రహ్మయే వాణి యొక్క పరమ వ్యోమము.

63. ఁశ్వమును సృష్టించినవాడు - స్వయముగనే బ్రహ్మాండ శరీరమును దాల్చినవాడగు అనాదినిధన పరమ పురుషుడే సృష్టి మహార్ణవమున కాలప్రాప్త గర్భమును ధరించినాడు. ఆ గర్భము నుండియే ప్రజాపతి ఆఁర్భఁంచినాడు. యతో జాతః ప్రజాపతి .

64. దైఁహోత సోమ మహిమన ప్రజాపతిని యజించినాడు. యజించబడు ప్రజాపతి మహిమాన్విత సోమమును పానము చేయును గాత. మానవహోతా! యజింపుము.

65. ప్రజాపతీ! ఈ భూతజాతము నీకన్న వేరు కాదు. సకల చరాచర ప్రాణులున్నఁ. వాని అన్నింటిపైన నీవే ప్రజాపతిఁ.

ప్రజాపతీ! మేము ఏ కోరికలతో నీ హోమము చేయుచున్నామో అఁ మాకు లభించును గాత. మేము ధనపతులమగుదుము గాత.

## ఆలోచనామృతము

1. యజ్ఞము ఒక్కడు చేయగలది కాదు. అందుకు అనేకుల సహకార సద్భావములు

అవసరము. కలసి పనిచేసినచో యజ్ఞమగును. ఇందరు ఒకచోట కూడుటయే మహా యజ్ఞం. యజ్ఞఫలము ఇంత మాత్రము చాలదా?

ఈ జీ◌తము ఒక మహా యజ్ఞము. ఎందరి సహకారమున మన జీవనము సాగుచున్నది. పంట పండుటకు అది మన వద్దకు వచ్చుట మహా యజ్ఞమగును. అందుకే అన్నము పరబ్రహ్మ స్వరూపమగును. దానిని పూజించవలెను. వృథా చేయరాదు.

2. వేదమునకు సకల ప్రాణులు సమములు. పూజ్యములు. ముఖ్యములు. మనసుకు పనికి వచ్చు చెట్టు, పుట్ట, గుట్ట మున్నగు వానిని పూజించుట - ఎంతటి పడమటి గాలి తగిలినను మన ఆచారము సంప్రదాయము. జీవన ◌ధానము.

ఇది మహోన్నతము, ఇందుకు సాటి వచ్చునది ఈనాటికి లేదు. నేడు ఈ ◌షనాగరికతను దాటుటకు ఇంతకు ◌ంచిన దారిలేదు.

ఈ దారి వేనవేల యేండ్లక్రింద వేదములు పరచినది!

3. మానవుల వలెనే అశ్వములకు సహితము కుటుంబము ఉన్నట్లు భా◌ంచబడినది. భార్యలు ఆలస్యముగా వచ్చినారు. అతడు ఆ అశ్వము మరొక సుభద్రతో కులుకుచున్నాడు - 18

భర్త చావమన్నాడు, అతని రూపమున భార్యకు సంతానము కావలెను. ఆమె కామమున ఎగబడినది! -19

మనుష్యుల కాపురము వంటివే జంతువుల కాపురములు ।

4. అశ్వము వద్ద రాణి శయనించినదని ఒక అపోహ ఏర్పడిఉన్నది. 'మహిషే అశ్వము ప్రాణభృత సం◌శతి ' అనగా అశ్వ మహిషి అగును. రాజ మహిషి కాదు. తరువాతి మంత్రములందు అశ్వ భార్యలే కనిపింతురు. 32 మంత్రమున 'మహిషే ముత్థాప్య' మహిషిని లేవదీసి అని అర్థము.

ఇది స్వార్థ పరులు కల్పించిన అపార్థము.

5. మైథునము సకల ప్రాణి సహజము. ఆహార నిద్రా భయ మైథునాని ఏతైహిరేకం పశుభిః నారాణాం. ఇదును గురించి ◌వరించుటలో దోషము లేదు. నేడు లైంగిక ◌ద్య అవసరమను చున్నారు గదా! అది ఆనాడే గుర్తించినారు కదా!

6. యజ్ఞమున యాగము, హోమము మాత్రమే కాదు. చెట్టు నీడనో, పందిరి కిందనో కూర్చుని జరుపు తాత్విక చర్చ కూడా అగును. ఇచట - భౌతిక ిషయములకు అతీతముగా- తాత్విక గంభీర ిషయముల చర్చ జరిగినది.

## దాశరథి రంగాచార్య ిరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## అశ్వమేధాహుతి యను ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము.

## సర్వేపి సుఖినస్సంతు.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

అధారం సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఇరువది నాలుగవ అధ్యాయము

1. అశ్వస్తూపరో గోమృగస్తే ప్రాజాపత్యాః కృష్ణగ్రీవ ఆగ్నేయో రరాటే పురస్తాత్సారస్వతీ మేష్య ధస్తాద్ధన్వో రాశ్వినా వధో రామౌ బాహ్వోః సౌమా పౌష్ణః శ్యామో నాభ్యాం సౌర్య యామౌ శ్వేతశ్చ కృష్ణశ్చ పార్శ్వ యో స్త్వాష్ట్రౌ లోమసక్థౌ సక్థ్యోర్వాయవ్యః శ్వేతః పుచ్ఛఇన్ద్రాయ స్వపస్యాయ వేహ ద్వైష్ణవో వామనః ॥

( అశ్వమేధమున ఇరువది యొక్క యూపములుండును. మధ్య యూపమును 'అగిష్ఠము' అందురు. దానికి పదిహేడు పశువులు కట్టబడును.)

అశ్వము, కొమ్ములు లేని మేక, గోవు ఇి ప్రజాపతికి సంబంధించిన పశువులు. వానిని మధ్యయూపమునకు కట్టుచున్నాను. నలుపుగొంతు మేక అగ్ని సంబంధము. దానిని అశ్వపు ముఖము వద్ద కట్టుచున్నాను. మేక సరస్వతి సంబంధి దానిని ముందు కట్టుచున్నాను. తెలుపు, నలుపు మేకలు అశ్వినుల సంబంధినులు. వానిని హనువుల క్రింద కట్టుచున్నాను. సోమ, పూషలకు సంబంధించిన మేకను అశ్వపు నాభి వద్ద కట్టుచున్నాను. సూర్య, యములకు సంబంధించిన నలుపు, తెలుపు పశువులను గుర్రపు కుడి ఎడమ ప్రక్కల కట్టుచున్నాను. త్వష్ట యొక్క రెండు పశువులను గుర్రపు వెనుక కాళ్ళను ఒక్కొక్కటి చొప్పున కట్టుచున్నాను. త్వష్ట యొక్క రెండు పశువులను గుర్రపు వెనుక కాళ్ళకు ఒక్కొక్కటి చొప్పున కట్టుచున్నాను. వాయుసంబంధి పశువును గుర్రపు తోకకు కట్టుచున్నాను. సుకర్మ ఇంద్రుని కొరకు కడుపుతోనున్న ఆవును - ిష్ణువునకు పొట్టి పశువును గుర్రపు తోకకు కట్టుచున్నాను.

(ఇ౦ పదిహేను పశువులు. ఀనిని 'పర్యంగ్య' అందురు. ఁగత యూపములందు పదహారేసి పశువులు కట్టుదురు.)

2. లోహితము, ధూమ్ర లోహితము, రేగుపండు ఎరుపు ఇ౦ సోమదేవతా సంబంధములు. పసుపు పచ్చనిది, చిలక పచ్చనిది, అరుణ బభ్రు వరుణ దేవతాకములు. కృష్ణ ఛిద్రము - శితి ఛిద్రము, సరశితి ఛిద్రము, స౦తా దేవతాకములు, నల్ల కాళ్ళది, శితి బాగువు, సర్వ శితి బాహువు బృహస్పతి దేవతాకము.

(ఀనిని మధ్య యూపమున కట్టవలెను)

౦చిత్ర వర్ణ బిందు, లఘు బిందు, స్థూల బిందు గోవులు ఁత్రా వరుణ దేవతాకములు.

(ఀనిని రెండవ యూపమున కట్టవలెను.)

3. శుద్ధ వాలము, సర్వ శుద్ధము వాలము, మణి శుద్ధ వాల పశువులు అశ్వినీ దేవతాకములు

శ్వేత, శ్వేత చక్షు, అరుణ వర్ణ పశువులు పశుపతి రుద్ర దేవతాకములు. తెలుపు చెవులని యమ సంబంధులు. గర్వయుక్త పశువులు రుద్ర సంబంధములు. నభోరూపలు పర్జన్య సంబంధులు.

(పశవః తృతీయే నియోజ్యాః )

4. ౦చిత్ర వర్ణలు, వంకర గీతల౦, ఎదురు గీతలు పశువులు మరుద్దేవతాకములు. చిక్కిన దేహములని, రక్త రోములని, తెల్లని ఆడ పశువులు సరస్వతీ దేవతాకములు. ప్లీహ కర్ణలు, హ్రస్వ కర్ణలు, రక్త కర్ణ పశువులు త్వష్ట దేవతాకములు. నల్లని మెడ గల తెల్లని చంక గల, పుండ్ర జంఘు పశువులు. ఇంద్రాగ్ని దేవతాకములు. కృష్ణపుండ్ర, అల్పాంజి, మహాంజి పశువులు ఉషా దేవతాకములు.

(చతుర్థే యూపే నియోజ్యాః)

5. ౦చిత్ర వర్ణలగు మూడు స్త్రీ పశువులు ౦శ్వే దేవతల౦. రెండున్నర ఏండ్ల ఎర్రని పశువులు వాగ్దేవత౦. ౦శేష చిహ్నములు లేని మూడు పశువులు అదితి దే౦౦. సమాన వర్ణలగు మూడు పశువులు ధాతా దేవత౦. చిన్న మేకలు దేవ పత్నుల౦.

(పంచమే)

6. నలుపు మెడ గల మూడు పశువులు అగ్ని దేవత౦. శ్వభ్రు వర్ణలు మూడు వసువుల౦. ఎరుపు రంగు మూడు పశువులు రుద్రుల౦. శ్వేత వర్ణ, అధోచ్ఛిద్రములు మూడు ఆదిత్యుల౦. నభో రూపములు మూడు పర్జన్యుని౦.

(షష్ఠే)

7. ఎత్తు◌యు, పొట్టివగు మూడు పశువులు ఇంద్ర, ◌ష్ణువుల◌. పూర్ణ శ్వేత బాహు, శ్వేత పుష్టములు ఇంద్ర - బృహస్పతుల◌. చిలక పచ్చని◌ మూడు అశ్వ దేవత◌. మట్టి రంగుని మూడు అగ్ని, మరత్తుల◌. నలుపు వర్ణపు మూడు పూష దేవత◌.

(సప్తమే)

8. కుర్వర వర్ణములగు మూడు పశువులు ఇంద్రాగ్నుల◌. రెండు రంగుల మూడు అగ్ని - సోముల◌. పొట్టి ఎద్దులు మూడు అగ్ని - ◌ష్ణువుల◌. వంధ్య మేషములు మూడు ◌త్రావరుణుల◌. మట్టి రంగు◌ మూడు - వేరుగా - ◌త్ర దేవత◌.

(అష్టమే)

9. నలుపు మెడల మూడు పశువులు అగ్ని సంబంధులు. పసుపు పచ్చని మూడు సోమసంబంధులు. తెలుపు రంగుని మూడు వాయు సంబంధులు. చిహ్న రహితులు మూడు అదితి సంబంధులు. సమాన వర్ణలు మూడు ధాత సంబంధులు. మూడు చిన్న మేకలు దేవపత్ని సంబంధులు.

(తొ◌్మదవ యూపమున కట్టవలెను.)

10. మూడు నల్లని పశువులు భూ◌ దేవతాకములు. మూడు ధూమ్ర వర్ణలు అంతరిక్ష దేవతాకములు. మూడు పెద్ద పశువులు ద్యుదేవతాకములు. మూడు ◌◌ధ వర్ణలు

◌ద్యుద్దేవతాకములు. మూడు సిధ్మరోగ పశువులు నక్షత్ర దేవతాకములు.

(పదవ యూపమునకు కట్టవలెను.)

11. ధూమ్ర మేషములు మూడింటిని వసంతమునకు బలి ఇత్తుము. తెలుపుమేకలు మూడింటిని గ్రీష్మ ఋతువునకు బలి ఇత్తుము. నలుపు మేకలు మూడింటిని వర్ష ఋతువునకు బలి ఇత్తుము. ఎరుపు మేకలు మూడింటిని శరదృతువునకు బలి ఇత్తుము. మచ్చల మూడు మేకలను హేమంతమునకు బలి ఇత్తుము. పసుపు రంగు మూడు మేకలను శిశిరమునకు బలి సమర్పింతుము.

12. ఒకటిన్నర సంవత్సరముల మూడింటిని గాయత్రికి, రెండున్నర సంవత్సరముల మూడింటిని త్రిష్టుప్‌నకు, రెండేళ్ళ మూడింటిని జగతికి, మూడేళ్ళ మూడింటిని అనుష్టుప్‌నకు, మూడున్నర ఏండ్ల మూడింటిని ఉష్ణిక్ ఛందముల కొరకు బలి సమర్పింతుము.

13. నాలుగేండ్ల మూడింటిని ◌రాట్ ఛందమునకు, మూడేండ్ల మూడు ఎద్దులను బృహతీ ఛందమునకు, మూడు వృషభములను కకుప్ ఛందమునకు, మూడు ఎద్దులను పంక్తి ఛందమునకు, మూడు గోవులను అతి చ్ఛందమునకు బలి అర్పింతుము.

14. మూడు నల్లని మెడ పశువులు అగ్ని దేవతాకములు. మూడు బభ్రు వర్ణలు సోమదేవతాకములు. మూడు ధ్వస్త వర్ణలు సంతృ దేవతాకములు. మూడు వత్సతరములు సరస్వతీ దేవతాకములు. మూడు కృష్ణ వర్ణలు పూష దేవతాకములు. మూడు పృశ్ని వర్ణలు మరుద్దేవతాకములు. మూడు అనేక రూపలు ిశ్వే దేవతాకములు. మూడు గొడ్డు ఆవులు ద్యావాపృథ్వీ దేవతాకములు.

15. వరుణ ప్రఘాస పర్వపు పదిహేను పశువులు చెప్పబడినం. మూడు కర్వర పశువులు ఇంద్రాగ్ని దేవతాకములు. మూడు కృష్ణ వర్ణ పశువులు వరుణ దేవతాకములు. మూడు చారల పశువులు మరుద్దేవతాకములు. మూడు కొమ్ములు లేని పశువులు ప్రజాపతి దేవతాకములు.

16. (అథ సాకమేధ పశవః)

తొలి చూలు మూడు పశువులను సేనావాన్ అగ్ని కొరకు వధించవలెను. వాత్య పశువులను మూడింటిని సాంతపన మరుత్తుల కొరకు, మూడు అప్పుడే పుట్టిన పశువులను గృహమేధి మరుత్తుల కొరకు, మూడు సంకల్పిత పశువులను క్రీడి మరత్తుల కొరకు, ిడి పశువులను స్తవవాన్ మరుత్తుల కొరకు వధించవలెను.

17. పద్దెనింిదవ యూపపు మహా హంయను పదిహేను పశువులు చెప్పబడినం. పందొింమదవ యూపమునకు మూడు కుర్వర వర్ణలు ఇంద్రాగ్నుల కొరకును, మూడు పెద్ద కొమ్ములం మహేంద్ర దేవత కొరకును, అనేక వర్ణ పశువులు ిశ్వ కర్మ కొరకును కట్టవలెను.

18. (పితరుల ఇష్టదేవతా పశువులు)

మూడు కృష్ణవర్ణ ధూమ్రములు సోమపాయి పితరులం. మూడు పసుపు ధూమ్రములు దర్భాసన పితరులం.

(ఇరువదవయూపమున)

కృష్ణ బభ్రువర్ణలు అగ్ని ష్వాత్త పితరులం. మూడు నల్లని పృష్టము - చుక్కలు గలం

త్ర్యంబక దేవతాకములు.

19. (శునాసీరీయ పశవః )

అగ్ని మున్నగు వారికి సంబంధించిన పదిహేను పశువులు చెప్పబడినం. మూడు కుర్వరపశువులు శునాసరీయములు.

(ఇరువది ఒకటవ యూపమున)

మూడు తెల్లని పశువులు వాయు దేవతాకములు. మూడు తెల్లనివే సూర్యదేవతాకములు.

(ఏవం సమాప్తాః యూపాః )

20. (అథారణ్యాః పశవః ఉచ్యన్తే)

వసంతము కపింజలమును, గ్రీష్మ మునకు కలర్వికమును, వర్షమునకు తిత్తిరులను, శరత్తుకు వర్తికమును, హేమంతమునకు కకరమును, శిశిరమునకు ికికిరములను బలి ఇవ్వవలెను.

21. సముద్రమునకు సింశుమారమును, పర్జన్యునకు మండూకమును, బలములకు మత్య్సములను, ిత్రునకు కులీపయ మత్య్సములను, నాక్రాస్తజలచరములను వరుణునకు బలి ఇవ్వవలెను.

22. సోమమునకు హంసలను, వాయువునకు కొంగలను, ఇంద్రాగ్నులకు సారసములను, ిత్రునకు మద్గులను, వరుణునకు చక్రవాకములను బలి ఇవ్వవలెను.

23. అగ్నికి కుక్కుటములను, వనస్పతులకు ఉలూకమును, అగ్నిసోములకు చాషలను, అశ్వినలకు మయూరములను, ిత్రావరుణులకు కపోతములను బలి ఇవ్వవలెను.

24. సోమమునకు లవపక్షులను, త్వష్టకు కులీకులను, గోపాదులను దేవపత్నులకు, దేవజాతులు మరియు గృహప్పతి అగ్నికి పారుష్ణములను బలి ఇవ్వవలెను.

25. దినములకు కపోతమును, రాత్రికి సీచాపును, రాత్రింబవళ్ల సంధులకు జతూపాత్రమును, మాసములకు జాత్యూహమును, సంవత్సరమునకు గరుడమును బలి ఇవ్వవలెను.

26. భూిికి మూషికమును, అంతరిక్షమునకు పాంకమూషికములను, ద్యులోకమునకు కశమూషికములను, దిశలకు నేవలములను, అవాంతర దిశలకు బభ్రుకులను ఆలంబనము చేయవలెను.

27. వసువులకు ఋశ్యలను, రుద్రులకు రురువులను, ఆదిత్యులకు న్యకువులను, ిశ్వేదేవులకు పృషతులను, సంధ్యలకు కులుంకులను వధించవలెను.

28. ఈశానునకు పరస్వత మృగమును, ిత్రునకు గౌరవమును, వరుణునకు మహిషమును - బృహస్పతికి గవయులను బలి ఇవ్వవలెను.

29. ప్రజాపతికి మగ ఏనుగును, వాణికి వక్రతుండమును, నేత్రములకు మశకములను, కర్ణములకు భ్రమరములను బలి ఇవ్వవలెను.

30. ప్రజాపతి, వయువులకు గౌరమృగమును, వరుణునకు అరణ్యమేషమును, యమునకు కృష్ణ మేషమును, మనుష్యరాజాయ మర్కటః సింహమునకు ఋష్యమును, ఋషభమునకు, గవయిని, క్షి ప్రశ్యేనమునకు వర్తికను, నీలింగమునకు కీటమును, సముద్రమునకు శింశుమారమును, హిమాలయమునకు గజమును ఆలంబనము చేయవలెను.

31. ప్రజాపతికి తురంగవదన కిన్నరము, ఉవమృగము, హలక్షణ సింహములగును. వృషదేవతది బిడాలము, ధాతకు కొంగ, దిశలకు కాకి, అగ్నిదేవతకు చటకము, త్వష్టకు రక్తసర్పము, పుష్కర సాధము. వాక్కునకు సారసమగును.

32. కులంగ, అరణ్యఅజ, నేవలా మయూరి సోమదేవతం. పూషదేవతది కోష్ఠము. మాయుది నక్క, ఇంద్రునిది గౌరమృగము. పిద్వునిది న్యంగుకము. అనుమతి కక్కటము. ప్రతిశ్రుతిది చక్రవాకము.

33. వలాహక, శార్గములు సూర్యదేవతాకములు. సృజయ, శాయాండకములు ుత్రదేవతాకములు. పురుషవాక్కుశారిక సరస్వతీ దేవతాకము. శ్వాంత్ భూు దేవతాకము. వ్యాఘ్ర, వృక, చిరుత, సర్పములు మన్యు దేవతాకములు - చిలక సముద్ర దేవతాకము.

34. గరుడుడు పర్జన్య దేవతాకుడు. అతిర్వాహస, దర్వాదులు వాయుదేవతాకములు. పైంగరాజ పక్షి వాక్పాలక బృహస్పతి దేవతాకము. అలజము అంతరిక్షదేవతాకము. ప్లవ, మత్స్య, మద్గునదీపతి సాగర దేవతాకము. కూర్మము ద్యావాపృథ్వీ దేవతాకము.

35. పురుష మృగము చంద్రదేవతాకము. దార్వాఘటములు వనస్పతి దేవతాకములు. తామ్రచూడము సంతృ దేవతాకము. హంస వాయు దేవతాకము. నాక్రమ, మకర, కులీప, మత్స్యములు సాగర దేవతాకములు. **"హ్రియైశాల్యకః"**

36. మృగి దిన దేవతాకము. మండూక, మూషక, తిత్తురులు సర్ప దేవతాకములు. లోపాశ అశ్వినలది. కృష్ణమృగము రాత్రిదేవతది. ఎలుగు, జతు, సుషీలిక అన్య జనులం. **"జహకావైష్ణం"**

37. కోకిల అర్ధమాసములది. ఋష్యమృగ, మయూర, సుపర్ణలు గంధర్వులం. ఉద్రము జములది. తాబేలు మాసములది. **రోహిత్కుణ్ణుణాచీ గోలత్తికా తే ప్సరసాల మృత్యులవే అసితః** మృత్యువుది నల్లని మృగము.

38. భేకి ఋతుసంబంధి. మూషిక, కశ, మంధాలములు పితృసంబంధులు. అజగరము బలసంబంధి. కపింజలము వసుసంబంధి. కపోత, ఉలూక, శశకము నిరృతి సంబంధలు. "వరుణాయ అరణ్యో మేషః"

39. శ్వేత ఆదిత్యానాం - ఉష్ట్రో, ఘృణీవాన్, వాఘ్రీనస్, మత్యా - మతికొరకు, సృమరో అరణ్యాయః రురురౌపిరః క్వయి, కుటరు, దాత్యేహ వాజినాం. కామాయ పికః.

40. ఖడ్గోమృగః వైశ్వదేవః, శ్వాకృష్ణః , కర్ణోగర్దభః , అక్షుః , రక్షసా. ఇంద్రాయ సూకరః . సింహోమారుతః. కృకలాసః , పిప్పకా , శకునిస్తే శరవ్యాయై. ిశ్వేశాం దేవానాం పృషతః.

**ఆలోచనామృతము**

1. ఇది వేదము. ఇందు ిశ్వమంతయు ఇముడును. నేటివంటి వర్గీకృత శాస్త్రములు నాడులేవు. నేటి వర్గీకృతముల వలన శాస్త్రజ్ఞులు ఇబ్బంది పడుచున్నారు. కుడి కన్ను తెలిసినవానికి ఎడమకన్ను తెలియకున్నది. నేటి శాస్త్రజ్ఞులు సంపూర్ణ శాస్త్రమును గురించి ఆలోచించుచున్నారు. ఇది మనిషికి అక్కరకు వచ్చునది. వర్గీకరణ డబ్బుకు అక్కర వచ్చునది.

2. ఈ అధ్యాయమున పశు, పక్ష్యాదులను గురించి చెప్పబడినది. ినిలో ఎన్ని నేడున్నవో,

ఎన్ని మృగ్యమైనవో పరిశీలించవలసి ఉన్నది. దేవతల సంబంధ ిషయము కూడ పరిశోధించవలెను.

నాకు తెలిసినంతలో భూిికి ఎలుకలను, కంటికి దోమలను, చెవులకు తుమ్మెదలను బలి ఇమ్మన్నాడు. ఇి వాటి వాటికి నష్టము కలిగించుని. ప్లవో మద్గుర్మత్స్యస్తే నదీపతమే. ప్లవ ముద్గుర, మత్స్యములు సాగరమునకు ఉపకరించుని. పరిశీలనలో సర్వము ిదితమగును.

**దాశరథి రంగాచార్య ిరచిత**

**శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి**

**దేవతా పశువాచకమగు ఇరువది నాలుగవ అధ్యాయము సమాప్తము.**

**అథనాస్వధనాస్సంతు.**

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఇరువది అయిదవ అధ్యాయము

1. శాదం దద్భిరవకాం దన్తమూలైర్మృదం బర్వైస్తేగాం దంష్ట్రాభ్యాం సరస్వత్యా అగ్రజిహ్వం జిహ్వాయా ఉత్సాదమవ క్రన్దేవ తాలువాజం హనుభ్యామప ఆస్యేన వృషణమాణ్డాభ్యా మాదిత్యాం శ్మశ్రుభిః పన్థానం భ్రూభ్యాంద్యావాపృథిి వర్తోభ్యాం ిద్యుతం కనీనకాభ్యాం శుక్లాయస్వాహా కృష్ణాయస్వాహా పార్యాణి పక్ష్మాణ్యవార్యాఇక్షవో ి వార్యాణి పాక్ష్మాణి సార్యాఇక్షమః

దంతములచే శాదదేవతను, ఇగుళ్లచే భవక దేవతను, దంతముల వెనుక భాగముచే మదదేవతను, దంష్ట్రములచే తేగదేవతను, జిహ్వాగ్రమున సరస్వతిని, జిహ్వాచే ఉత్సాదుని, తాలువులచే అవక్రందుని, హనువులచే వాజమును, ముఖముచే జలదేవతలకు ముదము చేకూర్చుదును.

అండకోశములచే వరుణదేవునకు, గడ్డపు వెంట్రుకలచే ఆదిత్యులకు, ుసములచే సన్థానం, కనుబొమలచే ద్యావాపృథ్వులకు, కంటిపాపలచే ిద్యుత్తులకు ముదము కలిగింతును.

శుక్లాయ స్వాహా. కృష్ణాయ స్వాహా.

నేత్రలోకమములు, కంటి రెప్పలు పారదేవతాకములు. అవార్యాణి పక్ష్మాణి.

2. అశ్వపు ప్రాణమున వాయువును, అపానమున నాసికను, క్రింది పెదిచే ఉపయామమును, పై పెదిచే సత్తును, పైకాంతిచే అంతరమును, దిగువ కాంతిచే బాహ్యమును, మూర్ధమున నివేష్యమును, తలలోని మెదడుచే స్తయత్నును, మస్తిష్కమున అశ్వినులను, కనీనికములచే ిద్యుత్తును, కర్ణములచే శ్రోత్రమును, శ్రోత్రములచే కర్ణములగు, నిమ్న కంఠముచే తేదనిని, శుష్కకంఠమున జలమును, మెడవెనుక ఉండు మన్య నాడులచే చిత్తమును సంతోషపెట్టుదును.

అదితిని శీర్షమున, నిర్జల్పమున నిరృతిని, సంక్రోశమున ప్రాణమును, స్తుపమున రేష్మణమును ఆనందపరతును.

3. మశకములచే వెంట్రుకలను, స్వపసమున ఇంద్రుని, దుముకుట వలన బృహస్పతిని, ఖురముల కూర్మమును, స్థూలగుచ్ఛములచే ఆక్రమణమును, నాడులచే కపింజలమును, జంఘులచే జవమును, బాహువులచే అధ్వానమును, మోకాళ్లచే అరణ్యమును, ఊరువులచే అగ్నిని, భుజములచే పూషను, స్కంధములచే అశ్వినులను స్కంధగ్రంధులచే రుద్రుని ఆనందింపచేతుము.

4. (గుర్రపు ప్రక్క టెముకలను 'వంక్రి' అందురు. అి ఒకవైపు 13 మరొక వైపు 13 ఉండును. ఇది వాటి దేవతానిరూపణ)

అగ్నికి మొదటి వంక్రిచే, వాయువునకు క్రింది వంక్రిచే, ఇంద్రుని మూడవ దానిచే,

సోమమును నాలుగవ దానిచే, అదితికి అయిదవ దానిచే, ఇంద్రాణిని ఆరవదానిచే, మరుత్తులను ఏడవదానిచే, బృహస్పతిని ఎనిిదవ దానిచే, ఆర్యమను తొ్మదవ దానిచే, ధాతను పదవదానిచే, ఇంద్రుని పదకొండవ దానిచే, వరుణుని పన్నెండవ దానిచే యముని పదమూడవ వంక్రిచే ప్రీతులను చేయుదుము.

5. (రెండవ ప్రక్కనుంచి)

ఇంద్రాగ్నులను తొలివంక్రిచే, సరస్వతిని రెండవదానిచే, ఁత్రుని మూడవ దానిచే, నిర్ఋతిని నాలుగవ దానిచే; అగ్ని, సోములను అయిదవ దానిచే, సర్పములను ఆరవదానిచే, ఁష్ణువును ఏడవదానిచే, పూషను ఎనిఁదవ దానిచే, త్వష్టను తొఁ్మదవ దానిచే, ఇంద్రుని పదవ దానిచే, వరుణుని పదకొండవ దానిచే, యముని పన్నెండవ దానిచే, జలమును పదమూడవ దానిచే ప్రీతులను చేతుము. ద్యావాపృథివ్యో దక్షిణం పార్శ్వం ఁశ్వేషా దేవానాముత్తరం.

6. (అథాంగాంతరాణాం దేవతా ఆహ)

మరుత్తులకు స్కంధములచే, ఁశ్వేదేవతలకు ప్రథమకీకసముచే, రుద్రులకు రెండవదానిచే, ఆదిత్యుల్యకు మూడవ దానిచే, అగ్ని సోములను నితంబములచే, కుంజమును శ్రోణులచే, ఇంద్ర బృహస్పతులను ఊరువులచే, ఁత్రావరుణులను ఊరుసంధులచే, ఆక్రమణమును నితంబస్థూలభాగముచే, బలమును నితంబస్థ కూపకులచే సంప్రీతులను చేయుచున్నాము.

7. పెద్దపేగులచే పూషను స్థూలగుదమున అంధసర్పములను, అంత్రములచే నిహతుని, హస్తిచే జలమును, అండకోశములచే వృషణుని, శేఫమున వాజిని, రేతస్సుచే ప్రజను, పిత్తకోశమున చాషుని, పాయువున ప్రదరుని, ఁష్ఠపిండములచే కూశ్మానమును సంప్రీతులను చేయుచున్నాము.

8. ఇంద్రుని క్రోడమున, అదితిని పాజస్యమున, దిశలను జత్రువున, ఆదిత్యులను భసతమున,

జమూతమును హృదయస్థ మాంసమున, అంతరిక్షమును ఆంత్రమున, నభమును హృదయస్థ మాంసమున, చక్రవాకములను మతస్నాయువులచే, దివమును వృక్కమున, గిరిని నాడ్యగ్ర భాగములచే, ఉపలములను ప్లీహమున, వల్మీకములను క్లోమమున, గుల్మములను నవనాడులచే, స్రవంతులను హిరములచే, హ్రదములను కుక్షులచే, సముద్రమును జఠరమున, వైశ్వానరుని భస్మమున సంప్రీతులను చేయుచున్నాను.

9. నాభిచే ఁధృతిని, రసమున ఘృతమును, పక్వాన్ని రసమున జలమును, వసాబిందువులచే మరీచులను, శరీరగత ఊష్మమున నీహారమును, వసచే శీనమును. బాష్పములచే పృష్వను, కంటిపుసులచే హ్లాదునిని, రుధిరమున రాక్షసులను , అనుక్త అంగముల చిత్రదేవులను, రూపమున నక్షత్రములను, చర్మమున పృథిఁని ఆనందపరచుచున్నాము. జుమ్భకాయ స్వాహా.

10. హిరణ్య గర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ ।

సదాధార పృథిఁం ద్యాముతేమాం కస్మైదేవాయ హఁషా ఁధేమ ॥

23-1 చూడగలరు.

11. యః ప్రాణతో నిమేషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ ।

య ఈశే అస్యద్విపద శ్చతుష్పదః కస్మైదేవాయ హ౦షా ౦ధేమ ॥

23-3 చూడగలరు.

12. ఎవని మహిమకు ప్రతీకగా ఈ హిమవత్పర్వతము నిలిచి ఉన్నదో, ఎవని మహిమను నదుల సహితముగ సముద్రము గానము చేయుచున్నదో, ఎవని భుజములు ఈ ౦శాల దిశలగునో అట్టి ప్రజాపతికి హ౦స్సులు అర్పించుచున్నాము.

13. ఎవడు ఆత్మను, బలమును ప్రసాదించువాడో, ఎవని శాసనమున సకల ౦శ్వములు ప్రవర్తిల్లునో, ఎవని ఆజ్ఞను సకలదేవతలు అనుసరింతురో, ఎవని కరుణ అమృతస్వరూపమగునో, ఎవని క్రోధము మృత్యువగునో అట్టి ప్రజాపతికి హ౦స్సులు అర్పించుచున్నాము.

14. సకల దిశలందు మమ్ము అహింసితులను, అనాక్రాంతులను చేయునదియు, శత్రుభేదకమును, శుభప్రదమును అగు యజ్ఞం మాకు లభించును గాత. దేవతలు మాకు సదా అభ్యుదయము కలిగింతురు గాత. వారు అప్రమత్తులై ప్రతినిత్యము మమ్ము రక్షింతురు గాత.

15. దేవతల శుభప్రదమగు సహృదయము మా ౦షయమున మరింత నిజమగును గాత. మాకు సదా దేవతల దానము లభించును గాత. మేము నిత్యము దేవతల స్నేహ పాత్రులము అగుదుము గాత. మా జీవనమునకు గాను దేవతలు మా ఆయువులను మరింత పొడిగింతురు గాత, “ దేవా నమస్కారము. ఆయుః ప్రతిరన్తు జీవసే ”.

16. ప్రాచీనస్తుతులచే మేము భగుని, ౦త్రుని, అదితిని, అహింసక దక్షుని ఆహ్వానించుచున్నాము. వారితో ఆర్యను, వరుణ, సోమ, అశ్వినులను కూడ ఆహ్వానించుచున్నాము. సుభగ సరస్వతి మాకు శుభములు కలిగించవలెను.

17. వాయుదేవత ఔషధము వంటి గాలిని సుఖకరమగునట్లు ీచును గాత. తల్లిభూ౦, తండ్రి ద్యులోకము అట్లే చేయుదురు గాత. సోమాభిషావకములు, సుఖస్థానములగు శిలలు మాకు అవే సుఖసంతోషములను కలిగింతురు గాత. అశ్వినులారా! ీరు స్వచ్ఛందముగా మాకు ఆ సుఖ సంతోషములనే కలిగించండి.

18. అతడు ఈశానుడు. సమస్త జగత్పతి. బుద్ధిని ౦కసింపచేయువాడు. సకల ఐశ్వర్య వంతుడు. అతనినే - అతనినే మేము ఆహ్వానించుచున్నాము.

పూష మా ధనములను వృద్ధి పరచును. అతడే రక్షక, పాలక, అనుపహింసిత పూష మాకు శుభములు కలిగించవలెను.

19. స్వస్తిన ఇంద్రో వృద్ధ శ్రవాః పూషా ౦శ్వవేదాః ।

స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు ॥

20. పృశ్నిమాతరములగు పృషదశ్వములు శుభగతులు - యుద్ధమునకు సాగువారు మా యజ్ఞమునకు విచ్చేయవలెను. అగ్ని జిహ్వలు, ఆలోచనాపరులు, సూర్య ప్రకాశులగు

మరుత్తులు మా యజ్ఞమునకు విచ్చేయవలెను. తమ సకల రక్షణలచే విశ్వేదేవతలు మా యజ్ఞమునకు విచ్చేయవలెను.

21. దేవతలారా! భద్రం కర్ణేభిః శ్రుణుయామ. యజనీయ దేవతలారా! భద్రం పశ్యేమ

అక్షిభిః । మా సర్వాంగములు స్థిరములు కావలెను. మేము సదా దేవతలను స్తుతించు చుండవలెను. దేవతలు ప్రసాదించిన ఆయువు మాదేహములందు నిలువ వలెను.

22. దేవతలారా! శతశరత్తులు గడిచిపోవును. ఈ వ్యవధిలోనే మా దేహములకు వార్ధక్యము ఏర్పరచినారు. అప్పుడే మా పుత్రులు తండ్రులగుదురు. జీవన యానపు ఆయువును మధ్యలో త్రుంచకండి.

(జరసం తనూనామ్, వార్ధక్యము దేహమునకు మాత్రమే! పుత్రాసో యత్ర పితరో భవంతి, తన కొడుకులు తండ్రులైనప్పుడు వార్ధక్యము)

23. అదితి ద్యులోకమగును. అదితి అంతరిక్షమగును. అదితి తల్లియగును. అదితి తండ్రియగును. అదితి పుత్రుడగును. అదితి విశ్వేదేవతలగును. అదితి పంచమానవులగును. ఇంత ఏల అదితియే సృష్టి. అదితియే ప్రజనన శక్తి. అదితర్జాత మదితిర్జనిత్వమ్

24. అశ్వము దేవభూతము. సర్పణశీలము. అట్టి అశ్వమును మేము యజ్ఞమున వర్ణించుచున్నాము. కావున మిత్రా వరుణులు, ఆర్యమ, వాయు, ఇంద్ర, ఋభుక్ష, మరుత్తులు మమ్ము నిందించరాదు.

25. అశ్వము స్నానమున పరిశుద్ధమైనది. ధనముచే కప్పబడినది. ఆజ్యసక్తు, ధనధాన్యాదుల సహితముగా అశ్వము ముందు సాగినది. ఆ వంటల పరిమళమునకు వెనుక వచ్చుచున్న ఇంద్ర పూషాదులకు ప్రియ భక్ష్యమును, మేమే అను - మేక ముందుకు ఉరుకుచున్నది.

26. ఈ మేక పూష దేవత యొక్క భాగము. విశ్వేదేవతల హితకర్త. వేగవంత అశ్వము మేకను తన ముందుకు తెచ్చుకొనును. అప్పుడు ప్రజాపతి త్వష్ట దేవతలకు ప్రియమైనదియు, ప్రథమ దేయమును అయిన మేకను అశ్వము దగ్గరకు చేర్చును.

27. అశ్వము హవిర్భూతి, ప్రతి ఋతువున దేవయాన పథగామి. ముగ్గురు మానవ హోతలు కుశములచే నీళ్ళు చల్లి అశ్వమును పవిత్రము చేయుదురు. అప్పుడు, పూషకు ప్రథమ యజ్ఞ భాగమగు మేక తన పలుకున దేవతలకు యజ్ఞ సూచన ఇచ్చును. ముందునకు వచ్చును.

28. హోతలారా! అధ్వర్యులారా! ప్రతిపస్థాతలారా! అగ్నింధ్రులారా! గ్రావస్తోతలారా! ప్రశస్తలారా! బ్రహ్మా! ఈ అశ్వమేధము సులక్షణ అలంకృతము, సమ్యక్ హుతము. ఈ యజ్ఞపు పయో, దధి, పయస్య, పురోడాశాదులను దానము చేయండి.

29. యూపము కొరకు చెట్టు కొట్టిన వారున్నారు. కొట్టిన చెట్టును మోసిన వారున్నారు. యూపపు అగ్ర భాగమున కట్టవలసిన ముక్కలను చెక్కినవారున్నారు. అశ్వము కొరకు చేయవలసిన వంటకు కట్టెలు చేర్చినవారున్నారు. వారందరి శ్రమ ఈ యజ్ఞమును సఫలము చేయుము గాత.

30. పూజ్యమగు ఈ యజ్ఞఫలము నాకు లభించినది! ఆ యజ్ఞ ఫలము నాలో చేరినది. ఈ అశ్వము దేవతల ఆశలను సఫలము చేయును గాత. దీనివలన విద్వాంసులు, ఋషులు ఆనందితురు గాత. ఈ అశ్వము దేవతలకు పుష్టి కలిగించుటకు వారికి బంధువగును గాత.

31. వేగవంత అశ్వపుత్రాడు, దాని జీను, తలకు కట్టిన త్రాడు, నోటికి వేసిన కళ్ళెము, దాని గడ్డి మున్నగునవి ఇక దేవతలకు చేరును గాత.

32. ఈగలు ముసిరిన అశ్వమాంసము. నరుకునపుడు కత్తికి అంటిన అశ్వమాంసము. కసాయి వాని చేతులకు, గోళ్ళలో చేరిన అశ్వమాంసము ఇక దేవతలకు చేరును గాత.

33. అశ్వపు పేగులందు సగము అరిగిన గడ్డి ఉండును. అది కోసినంత బయటపడును. పచ్చి మాంసము వాసన ఉండును. దానిని కోయునట్టి పుణ్యాత్ములు వానిని శుభ్రము చేయవలెను.

34. అశ్వమాంసము, నిప్పు మీద బాణలిలో వండినపుడు నేల మీద పడును. అది నేలపాలయినట్లు కాని, గడ్డిగాదమున కలసినట్లుగాని కాదు. అది సాంతము దేవతలకు చేరినది.

(భూమి దేవతయే కదా!)

35. అశ్వమాంసము ఉడుకునపుడు ఆహా! ఎంత మంచి పరిమళము అనువారుందురు. ఉడికినది తీసికొని పొండు అనువారుందురు. మాంసపు భిక్ష అడుగువారుందురు. వారందరి సంకల్పములు మా యజ్ఞమును సఫలము చేయవలెను.

36. మాంసము వండునపుడు మాటిమాటికి చూడవలసిన గిన్నె ఉండును. ఉడికినంత గుమ్మరించవలసిన గిన్నె ఉండును. అది చల్లారకుండ పెట్టవలసిన మూత ఉండును. మాంస రూప హృదయాదులను చూపు యష్టి మున్నగు పనిముట్లుండును. కోయుటకు ఉపయోగపడిన కత్తులుండును. అవన్నియు అశ్వమును దేవయోగ్యము చేయును.

37. అశ్వమా! పొగకప్పిన నిప్పు నిన్ను వండునప్పుడు చప్పుడు చేయకుండవలెను. ఉడుకు మాంసము నుండి సద్‌బుద్, సద్‌బుద్ చప్పుడు రాకుండవలెను. అగ్ని మంట

నుండి నీ వాసనను సతతము చూచునప్పుడు కదలకుండవలెను. యాజిత, భక్షిత, ఉద్యంత, వషట్కృతమయిన ఈ అశ్వమాంసమును దేవతలు గ్రహింతురు. ' దేవాస: ప్రతిగృభ్ణ్యశ్వమ్ '

38. అశ్వము వెడలుట, కూర్చుండుట, పొర్లుట, పదబంధము, అది త్రాగిన నీరు, తిన్న గడ్డి సర్వము దేవతలను చేరును గాత.

39. అశ్వమును కప్పిన బట్ట, క్రింద పరచిన బట్ట, అశ్వమునకు కట్టిన స్వర్ణ ముద్రలు శిరో భూషణము, పాద బంధము, ఇవన్నియుప్రియకర్మపు అశ్వము దేవతలను చేరు ఉపాయమగును.

40. అశ్వమా! రౌతు నిన్ను ఉరికించినాడు. నీవు ఉస్సురుమన్నపుడు ఉరుకించినాడు. మడమలతో తన్ని, కొరడాతో కొట్టి నీకు బాధ కలిగించినాడు. ఉరికించినాడు. నేను స్రువమున యజ్ఞమున హం అర్పించియు, మంత్రములు చదింయు నీ యొక్క ఆ బాధను పోగొట్టుచున్నాను.

41. వేగవంతము, దేవప్రియమగు అశ్వపు నలుబది మూడు వంక్రులను కరవాలము ఛేదించును. ఋత్విజులారా! జ్ఞానవంతులై అశ్వపు ఒక్కొక్క అవయవమును ప్రకటించండి. దీని ప్రత్యంగమును దోషరహితము చేయండి. తదుపరి ఛేదించండి.

(4వ మంత్రమున వంక్రులు 26గా చెప్పబడినది. తానిచప్రతి పార్శ్వం త్రయోదశ భవంతి అని ఉవటుడు. 4, 5 మంత్రములందు సహితము త్రయోదశి, త్రయోదశీ అని చెప్పబడినది. ఇచట మంత్రమున 'చతురస్త్రింశత్' అని చెప్పినాడు.)

42. అశ్వమును నరుకువాడు ఒక్క ప్రజాపతి. ద్యావాపృథ్వులు ఉభయులు అతనిని నియంత్రించువారు.

అశ్వమా! నేను అధ్వర్యును. నీ అవయవములను ఛేదించుచున్నాను. అట్లు వేరు చేసిన మాంస పిండములను అగ్నియందు హోమము చేయుచున్నాను.

(దేవతల కొరకు గాని నాకు కాదని చెప్పుట)

43. అశ్వమా! నీవు స్వర్గమునకు ఏగుచున్నావు. అప్పుడు నీ శరీరము నీకు ఆటంకము కాకుండను గాత. ఈ ఖడ్గము నీ శరీరమును ఆపకుండును గాత. ఆశాపరుడు, అకుశలుడు అగు కసాయి సహితము నీ శరీరమును శాస్త్ర సమ్మతముగా ఛేదించును. కోసి వృథా చేయడు.

44. అశ్వమా! నీవు యజ్ఞము కొరకు వధించబడినావు. నవా ఉపతన్మ్రియతే న ఋష్యసి. నమస్కారము. ఋష్యసి. అందువలన నీకు మరణము కలుగదు. నష్టము కలుగదు. ఇక నీవు దేవ మార్గములందు సాగుదువు. నీవు పయనించు రథమునకు ఇంద్రుని

హర్యశ్వములు, మరత్తుల పృషతులు పూన్చబడును. అశ్వినుల రాసభము ముందు మరింత వేగవంత అశ్వము సాగును.

45. దేవత్వమునకు చేరుకున్న వేగవంత అశ్వమా! మమ్ము గోయుతులను, అశ్వవంతులను చేయుము. పురుషార్తులగు పుత్రవంతులను చేయుము. ిరినందరిని పోషించతగినంత ధనమును ప్రసాదించుము. అఖండ్య అశ్వమా! మమ్ము పాపరహితులను చేయుము. హ ర్యు క్త అశ్వమా! మాకు రాజ్య ప్రదానము చేయుము.

46. మేము అశ్వమేధము చేసినాము. ఈ లోకములను సాధించినాము. శ్వే దేవతలు, మరుద్గణ, ఆదిత్య సహితుడగు ఇంద్రుడు మాకు వైద్యము చేయుదురు గాత. ఆదిత్యులతో కూడిన ఇంద్రుడు మా యజ్ఞమును, మా దేహములను రక్షించును గాత.

47. అగ్నీ! నీవు మాకు కడు దగ్గరివాడవగుము. మాకు రక్షకుడవు, శరణమవు, శుభంకరుడవగుము.

అగ్నీ! నీవు వాసకుడవు, ధనదానమున కీర్తిశాలి . నీవు మా యజ్ఞమునకు చ్చేయుము. మాకు దీప్తియుక్త ధనము ప్రసాదించుము.

అగ్నీ! నీవు అత్యంత దీప్తివంతుడవు. అందరిని ప్రకాశింప చేయువాడవు. ుత్రుల సుఖము కొరకు నిన్ను ధనము యాచించుచున్నాము.

అగ్నీ! మా ఆహ్వానములు ఆలకించుము. హింసకులందరినుండి మమ్ము రక్షింపుము.

## ఆలోచనామృతము

1. ఇది భారత దేశము. సుందర దేశము. మహోన్నత దేశము. సనాతన దేశము.

ఇది ఆర్యావర్తము. ఇది పుణ్య భూ . పునీత భూ . పురాతన భూ . పుష్ప పరిమళభూ .

ఇచటి మునులు. ఋషులు, జిజ్ఞాసువులు, ద్వాంసులు సమస్త మానవ కళ్యాణమునకు నిరంతరము వారి జీ తములను కప్పురములుగ కరిగించినారు. వారు తమ కొరకు ఇసుమంత ఆశించలేదు. సర్వేపి సుఖిస్సంతు, సమస్త మానవాళి సుఖజీవనమునకు పూలబాటలు పరచినారు!

ఈ అదృష్టము, ఈ భాగ్యము, ఈ సంపద భరత జాతికి మాత్రమే దక్కినది. ఇది ఆర్యావర్తః పుణ్యభూ ః

2. అపౌరుషేయము, భగవత్ప్రసాదనము, మునిజన సే తములగు వేదములు రత్ననిధులు

ఇ෴ భారతదేశమున అవతరించిన෴. కాని సకల మానవాళి హితము కోరున෴. ఇందలి సదాశయములు, మహోన్నత ఆలోచనలు, ෴శాలతమ దృక్పథములు మెచ్చదగినవి కానము.

ఆనోభద్రాః క్రతవో యన్తు ෴శ్వతో ෴దబ్ధాసో అపరితాస ఉద్భితః

దేవానో యథా సద෴ద్వృధే అసన్నప్రాయువో రక్షితారో దివేదివే 25-14

ఇంతటి ఉదాత్తములగు ఆలోచనములు వేదములు, ఉపనిషత్తులు, భారత సాహిత్యమునకే సాధ్యపడినది.

ఇదంతయు కొంచెపు పాశ్చాత్య నాగరికతకు తాకట్టు పడి ఉండుట భారతజనుల దైన్యము, దుస్థితి, దాస్యమును తెలియపరచుచున్నది.

ఇది సూర్యునకు పట్టిన గ్రహణము మాత్రమే! ఇ෴ భారత సంస్కృతీ భానుని కాంతి పుంజములను కప్పి ఉంచలేవు. సూర్యుని వెలుగు ప్రసరించకపోదు. ఈ జాతి మరల మానవాళికి మార్గదర్శకము కాకపోదు.

3. యజ్ఞ యాగాది క్రతువులు, హోమ కుండములు, మనసులను కదలించు మంత్రములు, పరాత్పరుని గురించిన చర్చలు, మానవ కళ్యాణపు ఆలోచనలు ఇవన్నియు భారతదేశమునకు, భారత జాతికి మాత్రమే దక్కిన మహా వరములు. ෴నిని పాటించిన భారతజాతి మరొకసారి మానవ జాతికి తలమానికమగును.

అశ్వమేధ మంత్రములు మనసును కదలించున෴. కన్నులను తడిచేయున෴. మంత్రములకు ఆ శక్తి ఉన్నది. మనిషి మనసు ఎత్తులను పెంచగలవు. నరుని మానవుని చేయగలవు. మహోన్నతుని చేయగలవు. అశ్వమా! నాదమునకు ఆశక్తి ఉన్నది!

అశ్వమేధము యాగములందు ప్రధానము. ఈ ෴షయము పురాణాదులందు వ్యక్తమయినది. దీనిని గురించి చది෴న, అనువదించిననే మనసు పులకించినది! నేత్రములు బాష్పాకులములయిన෴!! కనులారా గాంచిన ఎట్లుండెడిదో!!!

వేదములకు సకల ప్రాణి జాలము ෴ది అనంతమైన ప్రేమానురాగములు ! అశ్వము, అదెంత! దానికి నోరున్నదా! జ్ఞానమున్నదా? కాని వేదము అశ్వమును అట్లు పరిగణించలేదు.

అశ్వమును వధించిన మాట వాస్తవము. ఆ వధ ఎవరి కొరకు జరిగినది? సంకుచిత స్వార్థమునకు కాదు. సమస్త మానవాళి కళ్యాణమునకు! దేవతలను ప్రీతులను చేయుటకు!

అశ్వవధకు ఏర్పడిన అనంత కర్మకాండ మహా మంత్రములు! యాగములు!! అగ్నిహోత్రము!!! ఇది ఒక జంతువునకు జరుగు సంస్కారమా! ఒక దేవతకు జరుగు ఆరాధనయా!

'న వా ఉ ఏత న్మ్రియసే నరిష్యసి' నీకు మరణము లేదు. నష్టము లేదు అనుచున్నాడు.

అశ్వమును స్వర్గమునకు సాగనంపిన తీరు అమోఘము!!!

ఇంద్రుని హర్యశ్వములు ఆ అశ్వపు రథమునకు తగులునట! మరుత్తుల పృషత్తులు తగులునట! అశ్వినుల రాసభములు ముందర సాగునట! వానికి అగ్రమున వేగవంత అశ్వము సాగునట!

మానవుడే అశ్వమును పెంచినాడు! మానవుడే అశ్వమునకు తనంతటి అంతస్థు కలిగించినాడు. మానవుడే దానిని వధించినాడు! మానవుడే దానికి ఎంతయో కర్మచేసినాడు. మానవుడే అశ్వమును దేవతలందు చేర్చినాడు! మానవుడే దేవత అయిన అశ్వమును ప్రార్థించుచున్నాడు!!!

సుగవ్యం నో వాజీ స్వశ్వ్యయం పుంసః పుత్రాంఉత ిశ్వాపుషం రయిమ్ ।

అనాగాస్త్వం నో అదితిః కృణోతు క్షత్రంనో అశ్వో వనతాంహంిష్మాన్ ॥

మానవుని మహామహుని చేయుట జంతువును సహితము దేవతను చేయుట ఒక్క వేదమునకు మాత్రమే సాధ్యము. ఇతరమునకు అసాధ్యము! అసాధ్యము!! అసాధ్యము!!!

వేదమునే కాదు, దేనినైనను, కామెర్ల కంటితో చూడరాదు! కామెర్ల కంటికి సకలము పసుపుగనే కనిపించును!! ఎలనన అతని రక్తము పచ్చబారును.

## దాశరథి రంగాచార్య ిరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## అశ్వమేధమంత్రముల ఇరువది అయిదవ అధ్యాయము సమాప్తము.

"కాలే వర్షతు పర్జన్య: పృథిిం సస్యశాలినీ"

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

## ఇరువది ఆరవ అధ్యాయము

ఇషేత్వేత్యారభ్య దర్శ పౌర్ణమాస పిత్ర్యర్య జ్ఞాగ్నిహోత్రో పస్థాన పశుచాతుర్మాస్యాగ్నిష్టోమ వాజపేయ రాజసూయాగ్ని సౌత్రామణ్యశ్వమేధ సంబద్ధామన్త్రా వ్యాఖ్యాతాః ।

ఇదానీం ఖిలాన్యుచ్యన్తే ॥ (మహీధరవ్యాఖ్య నుంచి)

'ఇషేత్వ' అను మంత్రముతో ప్రారంభించినాము. దర్శపౌర్ణమాస, పితుర్యజ్ఞ, అగ్నిహోత్రోపస్థానపశు, చాతుర్మాస్య, అగ్నిష్టోమ, వాజపేయ, రాజసూయ, అగ్నిసౌత్రామణి, అశ్వమేధములకు సంబంధించిన మంత్రములను వ్యాఖ్యానించినాము. ఇప్పుడు ఖిలములను చెప్పుచున్నాము.

1. అగ్నిశ్చపృథిిచ సంన్నతే తే । మే సంన్నమతామదోవాయుశ్చాన్తరిక్షంచ సంన్నతే తే మే సంన్నమతామద ఆదిత్యశ్చద్యౌశ్చ సంన్నతే తేమే సంన్నమతామద ఆపశ్చవరుణశ్చ సంన్నతే తే మే సంన్నమతామదః । సప్త సంసదో అష్టమీ భూత సాధనీ । సకామాం అధ్వనస్కురు సంజ్ఞానమస్తు మేఽమునా ॥

అగ్నియు భూమియు సంగతులగుదురు గాత. సంగతులైన వారు మాకు అనుకూలురగుదురు గాత.

వాయువు అంతరిక్షములు సంగతులగుదురు గాత. సంగతులైన వారు మాకు అనుకూలురు అగుదురు గాత.

ఆదిత్యులు ద్యులోకము సంగతులగుదురు గాత. సంగతులైనవారు మాకు అనుకూలురు అగుదురు గాత.

జలము వరుణుడు సంగతులగుదురు గాత. సంగతులైనవారు మాకు అనుకూలురు అగుదురు గాత.

అగ్ని, అంతరిక్షము, వాయువు, ఆదిత్యులు, ద్యులోకము, జలము, వరుణుడు ఏడుగురు అధిష్ఠాతలు.

దేవా! మా మార్గములను అభీష్టపూర్ణము చేయుము. మమ్ము సంజ్ఞానులను చేయుము.

2. నేను జనుల కొరకు శుభవాక్కులు పలుకుచున్నాను. అం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకును, నా అనుయాయులకును శుభములు కూర్చును గాత. నా అభీష్టములు వర్ధిల్లును గాత. నేను దానములు ఇచ్చువాడను. దేవతలకు ప్రీతిపాత్రుడను కావలెను. దేవదత్తాదులు అనుకూలురు అగుదురు గాత.

3. బృహస్పతీ! ఏం రమణీయ రత్నాదులగునో, వేటిని సంపన్నులు ిక్కిలి ఆశింతురో, ఏది యజనహేతువగునో, ఏది జనసాధారణులకు కాంతివంతమగునో, ఏది బలమును దీప్తివంతము చేయునో, అట్టి ంచిత్ర ధనమును మాకు చేర్చుము.

గ్రహమా! నీవు ఉపయామమున గ్రహించబడినావు. నేను నిన్ను బృహస్పతి కొరకు గ్రహించినాను. ఇది నీ స్థానమగును. బృహస్పతి కొరకు గాను నిన్ను ఇచట స్థాపించుచున్నాను.

4. గోవంత ఇంద్రా! ఇచటికి, ఈ యజ్ఞమునకు ిచ్చేయుము. ఈ యజ్ఞసోమము శిలలచే అభిషుతుమై ఉన్నది. ఈ సోమరసమును పానము చేయుము.

గ్రహమా! నీవు ఉపయామమున గ్రహించబడినావు. నేను నిన్ను గోవంతుడగు ఇంద్రుని కొరకు గ్రహించినాను. ఇది నీ స్థానమగును. ఇంద్రుని కొరకు నేను నిన్ను ఇచట స్థాపించుచున్నాను.

5. వృత్రహంతఇంద్రా! నీవు శతప్రజ్ఞవు. ఇచటికి, ఈ యజ్ఞమునకు ిచ్చేయుము. ఈ యజ్ఞసోమము శిలలచే అభిషుతమైనది. ఆవు పాలు కలుపబడినది. ఈ సోమరసమును పానము చేయుము.

ఉపయామగృహీతో ిసేన్ద్రాయ త్వాగోమత ఏషతే యోనిరిన్ద్రాయ త్వాగోమతే.

(పైమంత్రపు రెండవ పరిచ్ఛేదము దీనికి వచనమగును)

6. వైశ్వానరుడు యజ్ఞవంతుడు. సత్యజ్యోతి రక్షకుడు. అనుపక్షీణుడు. అజస్రం ధర్మ ిమహే, అతనిని అక్షయ ధర్మమును యాచించుచున్నాను.

" ఉపయామగృహీతో ిసి వైశ్వానరాయ త్వైషతే యోని ర్వైశ్వానరాయత్వా"

7. నేను వైశ్వానరుని సద్భావనము నిలుతును గాత. ఆ రాజు భువనములకు శ్రీ వంతుడు. అతడు ఈ భూిమినుండియే పుట్టి ఈ భూిమిని ిక్షించుచున్నాడు. వైశ్వానరాగ్ని సూర్యుని యందు చేరి ప్రకాశించును.

" ఉపయామ గృహీతో ిసి వైశ్వానరాయ త్వైషతే యోనిర్వైశ్వానరాయత్వా "

8. మమ్ము రక్షించుటకు వైశ్వానరాగ్ని ిచ్చేయవలెను. వహనక్షమ ఉక్థలద్వారా ిచ్చేయవలెను. సుదూర ప్రాంతము నుండి ిచ్చేయవలెను.

" ఉపయామ గృహీతో ిసి వైశ్వానరాయ త్వైషతే యోనిర్వైశ్వానరాయత్వా "

9. అగ్ని ద్రష్ట, పావకుడు. పంచజనులహితుడు. త ిమహే మహాగయమ్, అతనిని మహాగమనము యాచించుచున్నాము.

"ఉపయామ గ్రహీతో ిస్యగ్నయే త్వావర్చస ఏషతే యోనిరగ్నయే త్వావర్చసే"

10. మహానుడు, వజ్రహస్తుడు, షోడశి ఇంద్రుడు మాకు సుఖములను ప్రసాదించును గాత. అతడు మమ్ము ద్వేషించుపాపిని హతమార్చును గాత.

" ఉపయామ గృహీతో ిసి వైశ్వానరాయ త్వైషతే యోనిర్వైశ్వానరాయత్వా "

11. ఇంద్రుడు దర్శనీయుడు. శత్రుంజయుడు. వాసహేతువు. సోమపానమున మదోన్మత్తుడు. యజమానులారా! ఆ ఇంద్రుని ి కొరకు మేము, నవప్రసూతగోవు తనదూడ కొరకు అంబారవము చేసినట్లు, స్తుతించుచున్నాము.

12. ఉద్గాతలారా! కాంతి ధనుడగు అగ్ని కొరకు, అత్యంత ప్రాపణీయ, బృహత్సామమును గానము చేయండి.

అగ్నీ! మహిషవలె నీధనము, నీ అన్నము దానార్థమే ఉద్గ ితమగును.

యథాప్రథమపరిణీతాస్త్రీ గృహాత్ భోగార్థం పతింప్రతి ఉద్గచ్ఛతి . మొదటి భార్య పతి భోగము కొరకు ఇంటినుండి వెడలును. అగ్నియు అట్లే ధన, అన్నములను దానము కొరకే ధరించును.)

13. అగ్నీ! మేము నీ స్తుతులు గానము చేయుచున్నాము. ఇంకను గానము చేయుదుము. ిచ్చేయుము. సోమరసము సిద్ధముగా ఉన్నది. సే ించుము. మదోన్మత్తుడవగుము. ఏహి - రమ్ము.

14. యజమానీ! ఋతువులు నీ యజ్ఞమును ిస్తరించును గాత. మాసములు హ ిని రక్షించును గాత. సంవత్సరములు నీ యజ్ఞమును భరించును గాత. వారందరు మా సంతతిని పాలింతురు గాత.

15. పర్వతముల వద్దను, నదుల సంగమ స్థలములందును, ిప్రుల బుద్ధియందును సోమము వర్ధిల్లును.

16. సోమమా! నీ రసాంశము పైకి ఎగిసినది. ఆహుతుల ద్వారా ద్యులోకమునకు చేరినది. అదే

వర్షరూపము దాల్చినది. ఉగ్ర, సుఖస్వరూప, మహాకీర్తిమయమై పృథ్వికి చేరినది.

17. సోమమా! నీవు ధనప్రాపకుడవు. యజనీయ ఇంద్ర, వరుణ, మరుత్తుల కొరకు

అభిషుతమగుము.

18. మానవుల సమస్త ధనములను సోమస్వా ి మా వద్దకు చేర్చవలెను. దానిని మేము ితరణ చేయుదుము. అనిభ ించుము.

19. దేవతలు మా యజ్ఞములను ఋతువుల ననుసరించి స్వీకరింతురు గాత. అట్లయిన మేము గోవులు, అశ్వములు, పుత్రులు అన్యపదార్థములందు సమృద్ధులము అగుదుము. ద్విపద, చతుష్పాత్తులచే మేము పరిపుష్టులము అగుదుము.

20. అగ్నీ! మంచిని కోరు దేవపత్నులను, త్వష్టను కూడ సోమపానమునకు తీసికొని రమ్ము.

21. ఋతుదేవతలారా! మా యజ్ఞమును కీర్తించండి.

బహుపత్నుల అగ్నీ! నేష్టా! సోమపానము చేయండి.

ీరే కదా రత్నములిచ్చువారు. త్వంహిరత్నధా అసి.

22. ఋత్విజులారా! అగ్ని ధనదాత. అత్యంత సోమప్రియుడు. అగ్నికి సోమపు ఆహుతులు అర్పించండి. అందుకు సంబంధించిన పనులు చేయండి. నేష్టసహితము దేవతలలో కూడి సోమపానము చేయును గాత.

23. ఇంద్రా! ఇదిగో ఈ సోమరసము నీ కొరకే వేచి ఉన్నది. రమ్ము ప్రసన్నుడవగుము. యథేచ్ఛగా సేింపుము. ఈ దర్భాసనమున కూర్చుండుము. సోమరసమును నీ ఉదరమున పోయుము.

24. దేవపత్నులారా! ీరు ఆహ్వాన సులభులు. రండి. ిచ్చేయండి. దర్భాసనము ీద కూర్చోనండి. ముచ్చట్లాడండి. త్వష్టా! దేవపత్నుల సహితుడవై, సచ్ఛీలుడవగునీవు, స్వేచ్ఛగా సోమము సేించుము. మదోన్మత్తుడవగుము.

25. సోమమా! ఎంతో రుచికరమవై, మాదకమవై ధారగా పిత్రమగుము. ఇంద్రుని పానమునకు అభిషుతమగుము.

26. సోమమా! రాక్షసహంత. ిశ్వద్రష్ట సోమపాత్ర ఇనుమున మలచబడి సోమము నిలుచునట్లు చేయబడినది. సోమము ద్రోణకలశమున ప్రశాంతముగా చేరును గాత.

## దాశరథి రంగాచార్య ిరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## అనుక్త మంత్రకథనమను ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము.

## లోకాస్సమస్తాస్సుఖినోభవంతు

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ఇరువది ఏడవ అధ్యాయము

1. సమాస్త్వాగ్న ఋతవో వర్ధయంతు సంవత్సరా ఋషయో యానిసత్యా ।

సం దివ్యేన దీదిహి రోచనేన ిశ్వా ఆభాహి ప్రదిశాశ్చతస్రః ॥

అగ్నీ! వర్షము, ఋతువులు, సంవత్సరములు, ఋషులు, సత్యము నిన్ను వర్ధిల్లచేయవలెను. నీవు నీ దివ్య ప్రభచే దేదీప్య మానుడవగుము. సంపూర్ణముగ నలు దిశలను

ప్రకాశింపచేయుము.

2. అగ్నీ! సంంధితుడవు అగుము. యజమానిని ప్రబోధితుని చేయుము. మహాసౌభాగ్యము కొరకు నిలువుము.

అగ్నీ! యజమాని నీకు దగ్గరగా కూర్చుండును. అతనిని బాధించకుము. నీ ఋత్విజులే యశోవంతులు అగుదురు గాత - ఇతరులు కాదు - మాన్యే.

3. అగ్నీ! ఈ ఋత్విజులు నిన్ను కీర్తించుచున్నారు. ినుము. మాకు కళ్యాణ కారి అగుము.

అగ్నీ! నీవు శత్రుహంతవు. మా శత్రువును జయించువాడవు. నీవు ప్రమాద రహితుడవగుము. యజ్ఞగృహమున నిరంతరము ప్రజ్వరిల్లుము.

4. అగ్నీ! నీవు ఇచట ధనమున వహింపుము. పూర్వము అగ్ని చయనము చేసినవారు నీచే తిరస్కరింపబడకుందురు గాత. క్షత్రియులు నీ అధీనమున ఉందురు గాత. నిన్ను ఉపాసించు యజమానికి బాధలు ఉండరాదు. అతడు వర్ధిల్లవలెను.

5. దీర్ఘాయువు అగ్నీ! క్షత్రియుల ద్వారా ఉద్దీప్తుడవు అగుము. ిత్ర సూర్యిని కలసి నీ ిత్రుడగు యజమానికి హితము చేకూర్చుము.

అగ్నీ! మా సజాతుల మధ్య నిలువుము. వర్ధిల్లుము. నీవు రాజుల యజ్ఞములకు ిధ రూపముల ఆహ్వానించబడువాడవు. దేదీప్యమానుడవగుము. "దీదిహీహ"

6. అగ్నీ! నిహంతలను, హింసకులను, అన్య మనస్కులను అదాతలను లంఘింపుము. పాపములను పారద్రోలుము. తదుపరి మాకు ీరపుత్రయుక్త ధనమును ప్రసాదించుము.

7. జాతవేద అగ్నీ! నీవు అహింసితుడవు. అక్షయుడవు. ిశేషరూపమున శోభాయమానుడవు. క్షత్రియులచే ఉద్దీప్తుడవై దేదీప్యమానుడవగుము. మానవులకు గల మృత్యుభయాదులను సకల దిశలనుండి తొలగించుము. నీ యొక్క శుభంకర జ్వాలలచే మమ్ము పాలింపుము. వర్ధిల్లచేయుము.

8. సంతా, బృహస్పతులారా! ఈ యజమానిని ప్రబోధితుని చేయండి. ఇతడు సుమతి. ఇతనిని మరింత సుమతిని చేయండి. ఇతనిని మహా సౌభాగ్యమున వర్ధిల్లచేయండి. ఇతని యజ్ఞమున ిశ్వేదేవతలు తృప్తులు అగుదురు గాత.

9. బృహస్పతీ! పరలోక సంబంధములును, యముని నరకాది పాపముల నుండి మాకు ిముక్తి కలిగించుము.

దేవ భిషక్కులు అశ్వినులు తమ యుక్తులచే మా నుండి మృత్యువును తొలగింతురు గాత.

10. అగ్నీ! మేము పరంజ్యోతిని దర్శింతుము గాత. అంధకారమును దాటుదుము గాత. దేవతలకు ఒకే దేవతయు ఉత్తమ జ్యోతియు అగు సూర్యుని చేరుకుందుము గాత.

11. ఈ అగ్ని సంధలు ఉన్నతము కావలెను. ఇతని స్వచ్ఛకాంతి జ్వాలలు ఉన్నతములు కావలెను. యజమానపుత్రుల ముందు ఈ దీప్తి శిఖలు ఉన్నతములు అగును గాత.

12. అగ్ని జలములకు పౌత్రుడు. ప్రాణ వంతుడు. సర్వ ధనవంతుడు. దేవతలకు ఇతడే

ద్యోతమానుడు. అగ్ని మా మార్గములను ఘృత, మధుమయములు చేయును గాత. "పథో అనక్తు మధ్వా ఘృతేన"

13. అగ్నీ! నీ ఋత్విజులచే స్తుతించబడువాడవు. మధుర ఘృతమూలమున యజ్ఞమున వ్యాపించువాడవు. సంత పుణ్యవంతుడు. లోకములచే కీర్తించబడువాడగును.

14. యజ్ఞము ప్రారంభమైనది. యజ్ఞ నిర్వాహకుడగు అధ్వర్యు జ్ఞానమూర్తి స్తుతించుచు బయలుదేరినాడు. ఘృతము, హం, స్రువము మున్నగు వానిచే యజ్ఞమునకు వచ్చుచున్నాడు.

15. అధ్వర్యుడు మహిమాన్వితుడగు అగ్నిని యజించును. అగ్ని హంయుతుడు. వాసయితుడు. చేతనాప్రదుడు. ధనదాత. అధ్వర్యు అగ్నికి బలకర హంస్సులు అర్పించవలెను.

16. ద్వారా దేవేరులు వ్రత ధారిణులు. స్థానము గ్రహించినంత యజ్ఞమును ఐశ్వర్య వంతము చేయుదురు. వారు అగ్నికర్మములు వహించి యజ్ఞమును రక్షింతురు. ిశ్వేదేవతలు ీరి కార్యములను రక్షింతురు.

17. ఉషా రాత్రులు దేవతాస్త్రీలు, ఈ అగ్నికి భార్యలు వారు. గార్హ పత్యాగ్ని యందున్న మమ్ము, శాస్త్రోక్తమగు ఈ యజ్ఞమును రక్షింతురు గాత.

18. దైంహోతలు, అగ్ని, వాయువులు, మా యజ్ఞమును మహోన్నతము చేయుదురు గాత. వారు అగ్ని జ్వాలలను నుతింతురు గాత. మా యజ్ఞమును సఫలము చేయుదురు గాత.

19. స్తూయమానలగు ముగ్గురు దేవేరులు - ఇడ, సరస్వతి, భారతి - దర్భాసనమున ఆసీనలగుదురు గాత.

20. శీఘ్రముగా లభించునదియు - అద్భుతమును - అనేక స్థానము లందున్నదియు - ీర్యశాలి యగు ధనమును త్వష్టదేవుడు మా నాభి స్థానముల పడవేయును గాత.

21. స్రుకమా! అత్యంత హిర్దానము చేయుము. దేవతలను హిర్భుక్తులను చేయుము. శాంతియుత అగ్ని హిని సంస్కరించుచున్నాడు.

22. జాతవేద అగ్నీ! ఇంద్రునకు హిన్వేకరింపుము. ఈ హిని ిశ్వే దేవతలు ఆస్వాదింతురు గాత.

23. అన్నమున బలిసినియు, ధనవర్ధకములగు నియుతాశ్వములను సుప్రజ్ఞ, శ్వేత వాయువు అధిష్ఠించును. ఆ నియుతములు వాయువు ముందు వచ్చి నిలుచును. అప్పుడు యజమానాదులందరు, సుపుత్ర ప్రాప్తి కలుగు యజ్ఞాది కర్మలు చేయుదురు.

24. ద్యావాపృథ్వులు ధనము కొరకని వాయువునకు సృష్టించినారు. ఆ ద్యోతమాన వాయువును వాగ్దేి స్వయముగా స్వీకరించినది. జనాకీర్ణ మార్గములందు శ్వేత, ధనస్వాి వాయువునకు నియుతాశ్వములు లభించును.

25. జలము లోకములన్నింటిని తన గర్భమున దాల్చినది. అట్లు గర్భము దాల్చిన జలము తనలోన వేడిని పుట్టించినది. అప్పుడు దేవతలకు ఏకమాత్ర ప్రాణమగు హిరణ్యగర్భుడు అవతరించినాడు. అతనికి మేము హిస్సులర్పింతుము. "కస్మైదేవాయహిషా ిధేమ"

26. ఏ అంతర్యాి తన మహిమచే దక్ష ప్రజాపతిని గర్భమున దాల్చినాడో, ఎవడు యజ్ఞమును కల్పించినాడో - ఎవడు సమస్త జలమును సర్వదిశల నుండి చూచి తెలిసినాడో, ఎవడు దేవతలకు ఏకమాత్ర దేవతయగునో "కస్మైదేవాయ హిషా ిధేమ"

27. వాయువా! నీవు నియుత అశ్వముల ీద యజ్ఞము కొరకని యజమాని ఇంటికి వెళ్లుదువు. అచటి నుండి వచ్చి మాకు అన్నము, సరిపడునంత ధనము పుత్రులు అశ్వగోధనమును ప్రసాదించుము.

28. వాయువా! నీవు నీ శత, సహస్రక నియుతములతో యజ్ఞమునకు ిచ్చేయుము. ఈ తృతీయ సవనమున తృప్తి చెందుము. దేవతలారా! నిరంతరము శుభములు కలిగించి మమ్ము రక్షించండి.

29. వాయువా! నియుతాశ్వ సహితుడవై ిచ్చేయుము. శుక్రమను పానపాత్ర నీ కొరకు వేచియున్నది. నీవు సదా అభిషుత గృహమునకు వెళ్లువాడవు కదా!

30. ఇది దేవయజ్ఞము. శుక్ర గ్రహము నిండుగా సోమపాత్ర సమర్పించుచున్నాను. వాయువా! నియుతాశ్వయుక్తుడవై సోమపానమునకు, ఈ యజ్ఞమునకు ిచ్చేయుము.

31. వాయువు అగ్రగంత, యజ్ఞము వలన సంప్రీతుడు, కళ్యాణకారి. అతడు నియుతాశ్వములను, శుభములను వెంటపెట్టుకొని యజ్ఞమునకు రావలెను.

32. వాయువా! నీకు వేనవేల రథములున్న◌. వాని◌ద నియుతవంతుడవై సోమపానమునకు ◌చ్చేయుము.

33. వాయువా! నీవు జగత్ స్వరూపుడవు. సమృద్ధుడవు. నీవు ఒకటి, రెండు, పది, ఇరువది, మూడువందల అశ్వములపై పాత్రలను, ధనమును యజ్ఞమునకు తెచ్చెదవు. వానిని ఇచటనే వదలి వెళ్ళుము.

34. వాయువా! నీవు ఋతపతి◌. త్వష్టకు జామాతవు. నిన్ను మేము అన్నములు యాచించు చున్నాము.

35. శూరఇంద్రా! పాలు పితుకని ఆవులు దూడల కొరకు అంబారావము చేసినట్లు, మేము నిన్ను సంస్తుతించుచున్నాము. స్వర్గద్రష్ట, చరాచర జగత్తునకు స్వా◌ని స్తుతించుచున్నాము.

36. ఇంద్రా! నీవంటివాడు దేవలోకమున లేడు. భూలోకమున లేడు. ఇప్పటికి పుట్టలేదు. ముందు పుట్టబోడు.

ధనవాన్ ఇంద్రా! మేము అశ్వకాములము. హ◌ సహితులమై గోకా◌యగు నిన్ను ఆహ్వానించుచున్నాము.

37. ఇంద్రా! అన్నలాభము కొరకు ఋత్విజులు నిన్ను ఆహ్వానించుచున్నారు.

వృత్రహంత ఇంద్రా! మేము వర్షము కోరియు అశ్వములు కోరియు యజ్ఞకర్తలమై, శ్రేష్ఠ పాలకుడవగు నిన్ను ఆహ్వానించుచున్నాము.

38. వజ్రహస్త, పూజనీయ ఇంద్రా! నీ తేజము వలననే నీవు స్తుతించబడుచున్నావు. నీవు

గోవులు, రథములు కలవాడవు. జయశీల అశ్వమునకు అన్నము ఇచ్చినట్లు - మాకు అశ్వములనిమ్ము.

39. ఇంద్రుడు ◌చిత్రుడు. నిత్యము వర్ధిల్లువాడు. అతడు ఏ స్తుతులకు, ఏ అభిషవాది క్రియలకు ప్రసన్నుడై మాకు ◌త్రుడు కాగలడు?

40. ఇంద్రా! బలములందు అత్యంత బలము కలిగించు హ◌రన్నమేది? దేనివలన నీవు బలయుతుడవై గూఢముగ దాచిన గోధనాదులను వెలికి తీయగలవు?

41. ఇంద్రా! నీవు మా ◌త్రులకు - నీ స్తోతలకు రక్షకుడవగుము. రక్షించుటకు గాను నీవు వందల రూపములు ధరించువాడవు కదా!

69. సంతాదేవా! బాధించనియు, శుభములు కలిగించు రక్షణలచే మా ఇంటిని కాపాడుము. నీవు హిరణ్మయ అగ్నియే జిహ్వగా కలవాడవు. మాకు నవీన సుఖశాంతులు ప్రసాదించుము. ఎవడేని పాపియు, నిందకుడును మమ్ము వంచిన సమర్థుడు కారాదు.

70. యజమాన దంపతులారా! అధ్వర్యులు సోమమును అభిషవించిన రీతి మీరు అధ్వర్యులచే నిగ్రామ జలమున అభిషితులైనారు.

వాయుదేవా! నీవు నియుతాశ్వములను రథమునకు పూన్చుము. యజ్ఞగృహమునకు విచ్చేయుము. మత్తు కలుగునట్లు అభిషుత సోమరసము - నీ భాగమును - సేవింపుము.

71. గోమాతలారా! మీరు మమ్ము రక్షించండి. మహా యజ్ఞమునకు స్వరూపప్రదానము చేయు ద్యావాపృథ్వులారా! మీరు మమ్ము రక్షించండి. మీ ఉభయుల **"కర్ణాహిరణ్మయా"** చెవులు బంగారపువి.

72. మిత్రావరుణులారా! మీరు విద్వాంసులకు హితకరులు. యజమాని సహితముగ యజ్ఞగృహమున ఉండువారు. సోమపానము చేయువారు. దుష్టఘాతకులు. మీరు త్వరత్వరగా విచ్చేయండి.

73. దైవి అధ్వర్యులగు అశ్వినీద్వయమా! మీ సూర్యప్రభా భాసిత రథమున శీఘ్రముగ విచ్చేయండి. మీరు యజ్ఞమును మధువుచే ఆసించితము చేయువారలగుదురు.

74. ఈతని వ్యాపించునట్టి వక్రకిరణములు క్రింద ఉన్నవి - పైన ఉన్నవి. అవి మహిమాన్వితస్రష్టలు. స్వధ, ఆహారము - క్రింద ఉన్నది - మానవ ప్రయత్నము దాని మీద ఉన్నది.

75. ఆతడు ద్యావాపృథ్వులను పూరించినాడు. స్వర్గమును పూరించినాడు. వైశ్వానర కర్మవంతులగు యజమానులను భరించినాడు. కవులు మరియు అన్నముకొరకు స్థాపించ బడినాడు. అన్నప్రాప్తి మరియు యాగార్థము అతనిని అగ్ని భావమున రప్పించుచున్నాము.

76. ఇంద్రాగ్నులు వృత్రహనన నిపుణులు. సోమమున మదోన్మత్తులు. వారు ఉక్తములు, స్తుతులు, సాధువాదములచే కీర్తించబడుదురు.

77. అమృతపుత్ర దేవతలు మా స్తుతులను ఆలకింతురు గాత. వారు మాకు సుఖప్రదాతలు అగుదురుగాత.

78. ఇంద్రుడు అనుచున్నాడు:--

శస్త్రములు, స్తుతులు నాకు సుఖప్రదములు అగుచున్నవి. అభిషుత సోమములు బలము నిచ్చుచున్నవి. నా వజ్రము నాకు సాయపడుచున్నది. యజమానులు నన్ను రమ్మని ప్రార్థించుచున్నారు. ఉక్థములు నన్ను కోరుచున్నవి. హర్యశ్వములు నన్ను యజ్ఞదిశగా తీసికొని

పోవుచున్నాం.

79. మరుత్తులు పల్కుకుచున్నారు:--

ఇంద్రా! నిన్ను ంంచిన వాడులేడు. నీకు సమానుడు కూడలేడు.

నిన్ను తెలిసిన దేవత ఏడి?

ఇంద్రా! నీవు ఇంతకు ముందు చేసిన కార్యములను గాని ఇప్పుడు చేయుచున్న కార్యములను గాని - ఇంతకు ముందు పుట్టినవాడుగాని - ముందు పుట్టబోవువాడు గాని చేయజాలడు.

80. ఇంద్రుడే సమస్తలోకములందు సర్వశ్రేష్ఠుడు. అతడే ఉగ్రుడు. అతడే తేజస్వి. అతని పుట్టుకయే అట్టిది. సద్యోజాతుడగు ఇంద్రుడు శత్రువులను పరిమార్చినాడు. ఇంద్రుని అనుయాయులు దేవతలు. అతని వలననే రక్షించువారై ఆనందించుచున్నారు.

81. బహుధన ఆదిత్యా! ఇదిగో ఇం నా స్తుతులు ఇం నిన్నే ప్రార్థించుచున్నాం.

ఆదిత్యా! అగ్నికన్న తేజస్వులు, పంత్రులు ంద్వాంసులయిన స్తోతలు నిన్ను స్తుతించుచున్నారు.

82. ఆదిత్యుడు ఆర్యజగత్తుచే సేంంచబడువాడు. ధనముదాచిన వాడు, శత్రువు, హింసకుడు, వజ్రమున కన్న కఠిన హృదయము వాడు దాచిన ధనముకూడ - ఆదిత్య! నీదే అగును కదా!

(పిసినారికి ధనము దక్కదని)

83. ఈతడు - ఈ ఆదిత్యుడు - వేలమంది ఋషులచే వేల తీరుల స్తుతించబడువాడు. ఇతడు సముద్రమువలె ంస్తరించి ఉన్నవాడు. ఇతని మహిమ సత్యమగును. ఇతని బలమును ంద్వాంసులు స్వరాజ్య యజ్ఞమున స్తుతింతురు.

84. సంతాదేవా! బాధించనింయు శుభములు కలిగించు నీ రక్షణలచే మా ఇంటిని రక్షింపుము. నీవు హిరణ్మయ అగ్నియే జిహ్వగా జలవాడవు. మాకునంన సుఖశాంతులు ప్రసాదించుము. ఎవడేని పాపియు, నిందకుడును మాకన్న సమర్థుడు కారాదు.

85. వాయుదేవా! మా యజ్ఞము సత్ స్తోమములచే స్వర్గమును అంటుచున్నది. నీవు దానిని అందుకొనుము. ఈ పాత్రయందు నిండిన సోమము దేశపంత్రమున శుద్ధము చేయబడి, దుగ్ధాదులచే కలుపబడి, ంర్యప్రదమై యున్నది. దీనిని నీకొరకే సిద్ధము చేసినాము.

86. ఇంద్రాగ్నులు దర్శనీయులు. సుహవులు. వారిని ఆహ్వానించుచున్నాము. వారి రాక మాలో ఒక్కొక్కరిని ఆరోగ్యవంతులను చేయును గాత. కలసినపుడు ఆనందింతుము గాత. " సంగమే సుమనా అసత్ "

87. ఏ మానవుడు తన అభీష్టసిద్ధి కొరకు ◌త్రావరుణులు హ◌గ్రహించు రీతి అనుకూలురును చేసికొనుచున్నాడో అతని యజ్ఞమున సత్యమునకు శాంతి కలుగును.

88. అశ్వినులారా! యజ్ఞమునకు ◌చ్చేయండి. దర్భాసనమున ఆసీనులు కండు. సోమరసమును సే◌ంచండి. అభీష్ట వరదులారా! ధన◌జేతలారా! వర్షజలము కురిపించండి.

మమ్ము వధించకండి. రండి.

89. మంత్రములకు అధిష్ఠానదేవత బ్రహ్మణస్పతి యజ్ఞమునకు వచ్చును గాత. సూనృతా దే◌ ◌చ్చేయును గాత. శత్రువును కలవరపరచువారును. నరాశంస సవన రక్షకులును, మానవ హితకరులగు దేవతలు మా యజ్ఞమును సంపన్నము చేయుదురు గాత.

90. సోమము ఆహ్లాదకము, జల◌శ్రము, సుపర్ణము, సోమము ద్యులోకమునకు పరుగులు తీయుచున్నది. పసుపు రంగు కలిగి, అత్యధికమై అనేకులచే కోరబడు సోమము ధనధ్వని చేయుచు సాగుచున్నది.

91. యజమాని దంపతులారా! ◌రక్ష కొరకు ◌శేష దేవతలను - ◌ అభీష్టలాభమునకు ◌శేష దేవతలను - అన్నలాభమునకు ◌శేషదేవతలను - మా దివ్యస్తుతులచే స్తుతించి ఆహ్వానించుచున్నాము.

92. మహానుడు, సర్వాగ్రణియగు అగ్ని ద్యులోకమున ◌శేషకాంతులచే శోభిల్లుచున్నాడు. అగ్ని భూ◌ వలన జలమున వర్ధిల్లి, అన్నదాతయగు అగ్ని తన జ్యోతిచే చీకట్లను తరుముచున్నాడు.

93. ఇంద్రాగ్నులారా! ఉషపాదహీన. అట్లయ్యు పాదములున్న జనుల కన్న మున్నే అవతరించును. ఆమెకు శిరము లేదు. అయినను పలుకగలదు. ఆమె ముప్పది అడుగులు నడువగలది.

94. తేజోవంతులగు దేవగణములు మానవుల కొరకు ఒకేసారి ధనవంతులు అగుదురు గాత. వారు నేడు మాకు ధనము ప్రసాదింతురుగాత. ఇతర దినములందును వారు మా ధనము ప్రసాదింతురు గాత. మా పుత్రపౌత్రాదులను ధనవంతులను చేయుదురు గాత.

95. ఇంద్రుడు పాపనాశకుడు. అతడు దారిద్ర్యము మున్నగు సకల దౌర్భాగ్యములను దూరము చేసినాడు. అప్పుడు అతడు కీర్తిశాలి అయినాడు.

మరుద్గణయుక్త ఇంద్రా! దేవతలు నీ మైత్రి కొరకు నిరంతరము ప్రయత్నించుచుందురు.

96. మరుత్తులారా! ీరు మహానుడగు ఇంద్రుని కొరకు స్తుతులు ఉచ్చరించండి. వృత్రహంతయు, శతక్రతువగు ఇంద్రుడు తన శతధారి వజ్రమున వృత్రుని వధించును.

97. అభిషుత సోమపు మత్తునందున్న ఇంద్రుడు ఈ యజమాని ీర్యబలమును వర్ధిల్లచేయును. పూర్వ కాలము వారివలె నేటివారు అతని మహిమలను వర్ణింతురు.

ఇంద్రుని మహిమలను వేలమంది వేలరీతుల స్తుతింతురు.

## దాశరథి రంగాచార్య ిరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## సర్వమేధికమను ముప్పది మూడవ అధ్యాయము సమాప్తము.

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ముప్పది నాలుగవ అధ్యాయము

1. యజ్జాగ్రతో దూరముపైతి దైవం తదుస్తుప్తస్య తథైవేతి ।

దూరంగమం జ్యోతి షాం జ్యోతిరేకం తన్మేమనః శివ సంకల్పమస్తు ॥

మనసు దివ్య శక్తియుక్తమైనపుడు జాగృతమానవుని కన్న దూరమున వ్యక్తమగుచున్నది. నిద్రలో ఉన్న మానవుని మనసు సహితము అదేిధముగా దూరమున వ్యక్తమగును.

నా మనసు దూరము ప్రయాణము చేయగలది. అది జ్యోతులందు ఒకే జ్యోతి. నా మనసు శుభసంకల్పములది అగును గాత.

2. కర్మవంతుడును, ిద్వాంసుడును, ీరుడును అగువాడు యజ్ఞములందును అన్య ధనలాభ కార్యములందును మనసు చేతనే కర్మ చేయుచున్నాడు. నామనసు జనులందు అపూర్వమును, ప్రకాశమానమగు జ్యోతి యగును.

తన్మేమనః శివసంకల్పమస్తు. అట్టి నా మనసు శుభసంకల్పములది అగును గాత.

3. ఏది ప్రజ్ఞానమగునో, ఏది ిచిత్రమగునో, ఏది ధృతి యగునో, ఏది జనుల అంతరములందలి ఋతసంజ్ఞక జ్యోతియగునో - ఏది లేకున్న ఎవ్వాడును కర్మచేయజాలడో.

తన్మే మనః శివసంకల్పమస్తు.

4. ఇది మనసు. దీని వలననే భూత, భ◌ష్యత్, వర్తమానాత్మక సమస్త జగములు ప్రవర్తిల్లుచున్న◌. మనసు వలననే సప్తహోతల యజ్ఞము ◌స్తరించుచున్నది.

తన్మే మనః శివసంకల్పమస్తు.

5. రథనాభియందు ఫలకముల వలె మనసునందు ఋగ్యజుస్సామములు ప్రవర్తిల్లు చున్న◌. మనసునందే జనుల మంచి చెడులు అంతర బహిరములు ఉన్న◌.

తన్మే మనః శివసంకల్పమస్తు.

6. నిపుణుడగు సారథి తన రథమును గమ్య స్థానమునకు చేర్చును. కళ్లెము పట్టి గుర్రమును అదుపులో ఉంచును. అట్లే జనుల మనసులు అటు నిటు ఉరుకులు పెట్టును. ఈ మనసు హృదయమునందు ప్రతిష్ఠితము. జరారహితము. వేగవంతము.

తన్మే మనః శివసంకల్పమస్తు.

(యదజరం అనుచున్నాడు. వార్థక్యము దేహమునకే కాని మనసునకు కాదనుచున్నాడు.)

7. అన్నము తేజస్సు గలది. బలము గలది. నేను అన్నమును స్తుతించుచున్నాను. అన్న బలముననే ఇంద్రుడు వృత్రుని ముక్కలు ముక్కలుగా నరికినాడు.

8. అనుమతే! నీవు మా మనోరథములను ఆమోదించుము. మాకు శుభములు కూర్చుము. కర్మము, బలము కొరకు నన్ను ప్రోత్సహించుము. ఆయూంషితారిషః - మా ఆయువులను

పెంచుము.

9. అనుమతి దే◌ నేడు మా యజ్ఞములను ఆమోదించును గాత. అనుమతి హవ్య వాహక అగ్ని హ◌ర్దాత యజమానికి సుఖప్రదులు అగుదురు గాత.

10. పొడుగు జడలసినీవాలీ! నీవు దేవతల సోదరి◌. నిన్ను ఆహ్వానించుచున్నాము. హ◌ని సే◌ంపుము. మాకు సంతానము కలిగించుము.

(యా పూర్వా◌మావాస్యా సా సినీవాలి అని ఐతరేయము. అమావాస్యకు పూర్వపుది సినీవాలి. చంద్రకళ కానవచ్చెడి అమావాస్య అని శబ్దరత్నాకరము)

11. అయిదు ఉపనదులు సరస్వతి నదిలో సంగ◌ంచును. అయిదు నదులుగా ప్రవహించు సరస్వతి ప్రవాహ ప్రదేశమున ఒకే నది అగుచున్నది.

(ఉపనది నదిలో కలసినపుడు ఉపనది పేరు ఉండదు. నది పేరే ◌గిలును. ప్రయాగలో యమున గంగలో కలియును. అప్పటినుండి అది గంగయే యగును)

12. అగ్నీ! నీవే ప్రథమ అంగిర ఋషి◌. ద్యుతిమంతుడవగు నీవు దేవతలకు శుభంకరుడవగుము. ◌త్రుడవు అగుము.

క్రాంతద్రష్టలు, ◌దిత కర్మలు, మెరుపుల బరిశల వారలగు మరుత్తులు నిన్ను సే◌ంతురు.

13. అగ్నీ! నీవు ద్యుతిమంతుడవు. వందనీయుడవు. మా ధనములను, పుత్రులను రక్షింపుము. నీవు పుత్ర, పౌత్రులను, గోవులను రెప్పవాల్చక రక్షించువాడవు. మేము నీ యజ్ఞమందే ఉన్నాము.

14. అధ్వర్యులారా! ◌రు ప్రజ్ఞానులు. పడి ఉన్న కట్టెలో అగ్నిని తెచ్చిపెట్టండి. కోరినంతనే అరణి తక్షణమే అభిషిక్త అగ్నిని పుట్టించినది. అరణిని మధించినంత రక్తజ్వాలావంతుడును, పృథ్వి పుత్రుడగు అగ్ని జ్ఞానయుతుడై ఉత్పన్నుడైనాడు. ఇతని కాంతి మెరుపులు మెరియుచున్నది.

15. జాతవేద అగ్నీ! యజన స్థానమును, పృథ్వికి నాభియునగు ఈ వేది యందు హవ్యము వహించుటకు నిన్ను ఏర్పరచినాము.

16. ఇంద్రుడు బలకా◌. స్తుతి లభ్యుడు. స్తుత్యుడు. ఋక్కులచే ప్రతిపాదితుడు. నరరూపుడు. లబ్ధ ప్రతిష్ఠుడు. అతని కొరకు - అంగిర సమముగా, బలప్రాపక స్తోమము స్మరించుచున్నాము. మంత్రములు ఉచ్చరించుచున్నాము.

17. ఋత్విజులారా! బలకా◌యు, మహానుడగు ఇంద్రుని కొరకు మహా సోమాన్నమును, స్తోమ ఉపయోగి సామమును సమకూర్చండి. ఈ సామము వలననే మా పూర్వజులగు అంగిరసులు ఇంద్రుని అర్చించినారు. గోవులను పొందినారు.

18. ఇంద్రా! సోమ సంపాదకులగు స్నేహ యజమానులు నిన్నే ఆపేక్షింతురు. సోమమును అభిష◌ంతురు. హ◌రన్నమును వేది ◌ద ఏర్పరతురు. జనుల నిందల భరింతురు.

ఏల ఇవన్నియు? ఏలననగా నీ వల్ల వారికి ప్రజ్ఞాన ◌శేషము లభించుచున్నది.

19. ఇంద్రా! ఎంతటి దవ్వైనను నీకు దూరము కాదు. నీ హర్యశ్వముల ◌ద యజ్ఞమునకు రమ్ము స్థిర బలుడగు ఇంద్రుని కొరకే ప్రాతః సవనాదులుచేయబడుచున్న◌. అగ్ని స◌ద్ధమైనది. సోమము సిద్ధమైనది.

20. సోమమా! నిన్ను యుద్ధములందు సహించజాలరు. నీవు సర్వత్ర వ్యాప్తుడవు. జల వర్షకుడవు. బలరక్షకుడవు. యుద్ధ ◌జేతవు. శుభనివాసి◌. సుకీర్తిమంతుడవు. జేతవు. నిన్ను ఆనందింప చేయుచున్నాము. "త్వామనుమదేమసోమ"

21. సోమమే నవప్రసూత గోవును ఇచ్చువాడు. వ్యాపన శీల అశ్వదాత. కర్మఠ. పుత్రదాత

సోమమునకు ఆహుతులు అర్పించువాడు సదనమున సాధువు. యజ్ఞమున సాధువు, సభలందు సాధువు, **" పితృ శ్రవణుడు "** అగుచున్నాడు.

22. సోమమా! నీవే ఈ జలములను, ఓషధులను, గోవులను సృష్టించినావు. నీవే ిశాల అంతరిక్షమును వ్యాపింపచేసినావు. నీవే జ్యోతి వలన అంధకారమును నష్టపరచినావు.

**" త్వం జ్యోతిషాం తమో వవర్థ "**

23. సోమమా! నీ దివ్య మనమును ఉదారము చేయుము. నీ ధనమునందలి ఒక చిన్న భాగమును మాకు అందించుము. నిన్ను ఎవరును ఆటంక పరచరాదు. యజ్ఞమందు నీవు మమ్ము ఉభయ లోకములకు యోగ్యులమగునట్లు ఆరోగ్యవంతులను గాంచుము.

24. బంగరు కిరణముల సూర్యుడు భూంకి సంబంధించిన ఎనింది దిక్కులను, మూడు లోకములను, యోజనముల కొలది దూరములను, సప్త సముద్రములను ప్రకాశింప చేయుచున్నాడు. హంర్దాత యజమానికి వరణీయ రత్నాదులు ప్రసాదించుచు ఉదయించుచున్నాడు.

25. హిరణ్యపాణియు, ిశిష్ట రూపమున జనులను దర్శించువాడగు సంత ద్యావాపృథ్వులందు సంచరించును. ఉదయించిన భానుడు వ్యాధులను బాధించును. సూర్యుడు అస్తంంచినంత తన కృష్ణ ప్రకాశమున ద్యులోకమును శూన్యముగా మార్చును.

26. హిరణ్యహస్తుడు, ప్రాణవంతుడు, శుభసంస్తుతుడు, సుఖప్రదాత, తేజోవంతుడగు సూర్యుడు మాకు అభిముఖుడు అగును గాత. ప్రతిరోజు రాత్రి స్తూయమానుడగు సూర్యుడు రాక్షస యాతుధానులను అపసిద్ధము చేయుచు ఊర్ధ్వస్తుడు అగుచున్నాడు.

27. సంతృదేవా! నీ మార్గము ప్రాచీనము. ధూళిరహితము. సాధు సంపాదితము. దానిని ంధాత అంతరిక్షమున నిర్మించినాడు. అట్టి సుగమ్య మార్గముననే నేడు నీవు యజ్ఞమునకు ంచ్చేయుము. మమ్ము నీ వారిని చేసికొనుము.

28. అశ్వినీ ద్వయమా! రండి. సోమరసమును సేంచండి. మాకు సుఖ శాంతులు ప్రసాదించండి. ంరు ం అఖండ, రక్షణలచే మమ్ము సురక్షితులను చేయండి.

29. అశ్వినులారా! మాలో కర్మవంతమగు బుద్ధిని నింపండి. ంరు దర్శనీయులు, సేచకులు.

మా అభీష్టములను యజ్ఞమయము చేయండి. జూదము ఆడకుండుటకును, రక్షణ కొరకును, అభ్యుదయమునకు గాను ంమ్ము ఆహ్వానించుచున్నాము.

అశ్వినులారా! అన్నప్రాప్తి కలుగు యజ్ఞమున మాకు సాయపడండి.

30. అశ్వినులారా! బాధించనట్టి, సుగమ రక్షణలచే మీరు రాత్రింబవళ్ళు మమ్ము రక్షించండి. మిత్ర, వరుణ, అదితి, సింధు, ద్యులోక భూలోకములు సహితము మాకు అట్టి రక్షణలే ప్రసాదింతురు గాత.

31. సవితది బంగరు రథము. అతడు ఆ రథము మీద సాగినాడు. రాత్రియును నలుపు లోకమునుండి వెడలి, దేవతలను, మానవులను వారి వారి కార్యములందు నియమించును. లోకములన్నింటిని. వీక్షించుచు వచ్చుచున్నాడు.

32. రాత్రీ! ఉత్పాదక అంతరిక్షము సహితముగా సంపూర్ణ భూలోకమున నిండినావు. మహతీ! నీవు ద్యులోక స్థానములకు సహితము వ్యాపించినావు. చీకట్లు, తమ బలములను కూర్చుకొని, సర్వత్ర నిండిపోయినవి.

33. అన్నదాత్రీ ఉషా! మేము స్వయముగను, మా పుత్ర పౌత్రాదులను జీవింపచేయునట్టి ధనమును మాకు ప్రసాదించుము.

34. ప్రాతరగ్నిం ప్రాతరిన్ద్రం హవామహే ప్రాతర్మిత్రావరుణా ప్రాతరశ్వినా ।

ప్రాతర్భగం పూషాణం బ్రహ్మణస్పతిం ప్రాతః సోమముతరుద్రం హవేమ ॥

పైన పేర్కొన్న దేవతలందరును ప్రాతః కాలమున ఆహ్వానించుచున్నాము.

35. ప్రాతః కాలమున అదితి పుత్రుడు, అజయుడు, ఉగ్రస్వభావుడు, విశేషరూపము ధరించువాడగు భగుని ఆహ్వానించుచున్నాము. ఆకలిగొన్నవారు ఆదరమున "ఉదయించుము" అనునట్టియు రోగగ్రస్తులు, రాజులు "ఉదయించుము" అనునట్టియు భగుని ఆహ్వానించుచున్నాము.

36. హే నేతా! భగదేవా! నీవు సత్యధనుడవు. ధనాదులు దానము చేయునపుడు మాకు ధనములనిమ్ము. మమ్ము ఉదారులను చేయుము. మమ్ము అశ్వ, గోసహితముగ వర్ధిల్లచేయుము. మేము సేవకాదులు కలవారలము కావలెను.

37. మేము ప్రస్తుతము ధనికులము కావలెను. సాయంకాలమునను, మధ్యాహ్నమందును ధనికులము కావలెను. సూర్యోదయమున ధనికులము కావలెను. మేము సర్వదా దేవతల సుబుద్ధి యందు వర్తిల్లుదుము గాత. " వయం దేవానాం సుమతౌ స్యామ "

38. దేవతలారా! భగుడే ధనవంత దేవత అగును గాత. మేము అతని వలెనే ధనవంతులము అగుదుము గాత. భగుదేవునే సర్వజగత్తులు అధికముగా ఆహ్వానించును.

భగదేవా! నీవు మాకు పురోగామివి అగుము. " నో భగ పుర ఏతా భవేహ "

( యః భగః ధర్తా ధారయితా సర్వస్య జగతః । సర్వ జగత్తులను ధరించువాడును, ధరింప చేయువాడును అని ఉవటుడు

భగమాదిత్యం అని మహీధరుడు

భగః యజ్ఞోభాగః అని శతపథము

భగస్యవా ఏతన్నక్షత్రం యదుత్తరే ఫల్గునీ అని తైత్తరీయము

" భగ ఏవ భగవాఁఅస్తు " అని ఈ మంత్రము. భగవాన్ అనిన ధనవంతుడు)

39. అశ్వసమ యజ్ఞము కొరకును, పుత్ర పదము కొరకును ఉషస్సులు ప్రకాశించుచున్నవి. ఉషస్సులు ధనదాతయగు భగుని మాకు ప్రత్యక్షము చేయవలెను. అశ్వము రథమును తెచ్చినట్లు భగదేవత మాకొరకు ధనము తేవలెను.

40. అశ్వములు, గోవులు, పుత్రులను ప్రదానము చేయునట్టి ఉషస్సులు మాకు హితములు అగును గాత. తుహిన బిందువులను తుడుచుచు నిత్య ప్రవర్థమానులగు ఉషస్సులు

" పాతస్వస్తభిః సదానః "

41. పూషా! మేము నీ యజనమందున్న వారలము. " రిష్యేమకదాచన " మేము ఎన్నటికి నష్టపడకుందుము గాత. యజ్ఞమునందు నిన్ను స్తుతించు వారలమగుదుము గాత.

42. పూష వాక్కు మరియు క్రియవలన అభిముఖుడు అయినాడు. అతడు పథముల రేడగు సూర్యుని అందుకొనును. ఆనందమూలము, శోకనాశకుడగు పూష మాకు ధనాదులు ఇచ్చును గాత. అతడు మా యజ్ఞములకు సిద్ధి కలిగించును గాత.

43. జగద్రక్షకుడు, అదమనీయుడగు విష్ణువు మూడు పాదములు ఉంచినాడు. కావుననే అతడు ధర్మములను దాల్చినాడు. " అతో ధర్మాణి ధారయన్ "

44. విష్ణోర్యత్పరమం పదమును నిష్కాములు, అప్రమత్తులగు విద్వాంసులు ఎరుగుందురు.

45. పృథివి జలవతి. సర్వలోక ఆశ్రయణీయ. ద్యావాపృథ్వులు విస్తృతలు, జలదాయనులు శుభరూపలు. జరారహితలు. ప్రభూతరేతస్కలు. అవి వరుణధర్మమున దృఢీకృతలైనవి.

46. నాసత్య అశ్వినులారా! ముప్పది ముగ్గులు దేవతల సహితులై మీరు సోమపానమునకు గాను యజ్ఞమునకు విచ్చేయండి. మా ఆయువును పెంచండి. పాపములను కడిగివేయండి. ద్వేషించుశత్రువులను కట్టివేయండి. మాకు శుభములు కలిగించుటకు మా వెన్నంటి ఉండండి.

48. మరుత్తులారా! ఇది మీ స్తోమము. ఇయ్యది మీ స్తుతి ఈ యజమాని స్వార్థము లేనివాడు. మాననీయుడు. ఇతనికి వర్షము కలిగించుటకు మేము మిమ్ము ఆహ్వానించుచున్నాము. బాల్య, యవ్వన, వృద్ధావస్థలందు మా దేహములను పటిష్ఠము చేయుటకు మిమ్ము ఆహ్వానించుచున్నాము.

49. స్తోమ, ఛంద, కర్మ ప్రమాణ సహితులైన దివ్యసప్తర్షులు సృష్టి యజ్ఞమును సాధించినారు. పూర్వకల్పపు దివ్య ఋషుల మార్గమును అనుసరించి ఈ ఋషులు ధీమంతులై సృష్టికార్యమును - సారథి గుర్రముల కళ్లెమును అందుకున్నట్లు - ప్రారంభించినారు.

50. ఆయుష్యము, బ్రహ్మవర్చస్సు, ధనసమృద్ధి, శత్రుభేదనము, వెండి బంగారములు, తేజస్సు ఇవన్నియు జయము కలిగించుటకు గాను నాలోన కూడును గాత.

51. ఇది దేవతలందు తొలుత పుట్టిన తేజము. దీనిని రాక్షస పిశాచాదులు సహించజాలవు. దాక్షాయణ హిరణ్యమును ధరించిన మానవుడు దేవతలందును, మానవులందును ఆయుష్మంతుడగుచున్నాడు.

(దాక్షాయణ ుత్యలంకార ాశేషః ఇతి ఉవటః )

52. ప్రసన్న మనస్కులగు దక్షుని సంతానము శతానీకునకు స్వర్ణాభరణములు కట్టినారు. అదే ధముగా నేను శతశరదాయుష్యము కొరకు స్వర్ణాభరణములు ధరించుచున్నాను. అందువలన నేను ఆయుష్మంతుడను, బుద్ధి మంతుడను అగుదును గాత.

53. అహిర్బుధ్న్య, అజ ఏకపాత్, పృథ్వి, సాగరము, ాశ్వేదేవరలు మా ఆహ్వానములు ఆలకింతురు గాత. యజ్ఞవర్ధక, ఆహూయమాన, మంత్రసంస్తుత, ఋషి ప్రశంసిత దేవతలు మమ్ము రక్షింతురుగాత.

54. చిరకాల శోభాయమాన ఆదిత్యుల కొరకు నేతులు కారు స్తుతివచనములను జుహువుచే హోమము చేయుచున్నాము. మా యొక్క ఆ వచనములను ుత్ర, ఆర్యమ, భగ, వరుణ, దక్ష, అంశములు ఆలకించవలెను.

55. సప్త ఋషులు - త్వక్, చక్షు, శ్రవణ, రసన, ఘ్రాణ, మనోబుద్ధులుగా ఈ దేహమున నిలిచి ఉన్నారు. వారు అప్రమాద భావమున ఈ దేహమును రక్షించుచున్నారు. వారు నిద్రించినంత ఆత్మయందు లీనము అగుదురు. అప్పుడు ఎన్నటికి నిద్రించని జీవనదాతలగు ప్రాణాపానములు జాగృతములై ఉండును.

56. దేవతలను అపేక్షించు మేము ుమ్ము యాచించుచున్నాము. ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే. సుదాతలగు మరుత్తులారా! దగ్గరికి రండి. ఇంద్రా! నీవు సహితము త్వరగా యజ్ఞమునందు చేరుము.

57. మంత్రాధిపతి బ్రహ్మణస్పతి ఉక్థార్హ మంత్రములు చదువుచున్నారు. వానియందు ఇంద్ర, వరుణ, ుత్ర, ఆర్యమదేవతలు తమ తమ ఇండ్లు కట్టుకొనుచున్నారు.

58. బ్రహ్మణస్పతే! త్వమస్యయన్తా - నీవు దీని నియంతవు. నీవు మా సూక్తమును తెలియుము. మా పుత్రులను సంప్రీతులను చేయుము. దేవతలచే రక్షింపబడిన లోకము లన్నియు కళ్యాణమయములై ఉన్నవి.

ఎవడు ఈ విశ్వమునకు విశ్వకర్మ యగునో, ఎవడు నాకు తండ్రియగునో, ఎవడు అన్నపతిక యగునో అతడు నాకు అన్నము ప్రసాదించును గాత.

దాశరథి రంగాచార్య విరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

బ్రహ్మయజ్ఞార్థకమను ముప్పది నాలుగవ అధ్యాయము సమాప్తము.

మే మనః శివ సంకల్పమస్తు

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ముప్పది అయిదవ అధ్యాయము

( పితృమేధ సంబంధినో మన్త్రా ఉచ్యన్తే - పితృమేధ సంబంధ మంత్రములు చెప్పబడుచున్నవి)

1. అపేతో యన్తు పణయో విసుమ్నా దేవపీయవః ।

అస్యలోకః సుతావతః ।

ద్యుభిరహోభిరక్తు భిర్వ్యక్తం యమో దదాత్వవ సానమస్మై ॥

అసుఖకారులు, దేవహింసకులగు పణులు ఇచటి నుండి తొలగి పోవలెను. ఇదియే అభిషవకారి స్థానమగును. ఋతువులు, దివసములు, రశ్మిల యొక్క ఈ స్థానమును యముడు ఈ మృతునకు ప్రదానము చేయును గాత.

2. మృతుడా! నీ అంగముల కొరకు సవిత పృథ్వి లోపల స్థలముకోరును గాత. అందుకు ఎద్దులను కూర్చుము.

3. ఈ స్థలమును వాయువు పవిత్రము చేయును గాత. సవిత పవిత్రము చేయును గాత. అగ్నితేజము, సూర్యుని కాంతి ఈ స్థానమును పావనము చేయుదురు గాత.

(ఆ స్థలమున నాలుగు చాళ్లు నాగలి దున్నవలెను)

ఎద్దులను నాగలి నుంచి ిడువవలెను.

4. (ఆ స్థలమును త్ర్వ మృతుని అస్థికలను పాతి పెట్టవలెను.)

ఓషధులారా! అశ్వత్థమున ీరు ఆసీనులు అయి ఉన్నారు. పలాశపత్రములందు నివసించి ఉన్నారు. ీరు నరుని సేించవలసి ఉన్నది. భూిలోన చేరండి.

5. మృతుడా! సిత నీ అస్థికలను భూి వడియందు చేర్చును గాత. భూదేి! ఈ మృతుని కొరకు నీవు శాంతి దాయిని అగుము.

6. మృతుడా! నీటితావరము వద్ద నిన్ను ప్రజాపతి యందు చేర్చుచున్నాను. ఆ ప్రజాపతి మా పాపములను దహించును గాత.

7. మృత్యువా! నీ మార్గము దేవయానము మాత్రముకాదు. మరేదైనా దూరపు మార్గమున తొలగిపొమ్ము. చెవులు కన్నులున్న నీతో చెప్పుచున్నాను. నీవు మా సంతానమును తాకకుము. మా ీరులను తాకకుము.

8. మృతుడా! వాయువు నీకు సుఖకరుడు అగును గాత. సూర్యుడు సుఖంకరుడు అగును గాత. ఇటుకలు సుఖంకరములు అగును గాత.

(సమాధియందు ఇటుకలను పేర్చవలెను)

మృతజీి! ఈ పార్థివ అగ్నులు నీకు సుఖము కలిగించును గాత. అి నిన్ను దహనము చేయకుండును గాత.

9. నీ కొరకు దిశలు ఏర్పడును గాత. నీకు జలము అత్యంత సుఖదమగును గాత. నదులు నీకు సుఖములను ఇచ్చును గాత. అంతరిక్షము శుభప్రదమగును గాత. దిశలన్నియు నీకు వెల్లడి యగును గాత.

10. బంధువులారా! ఇది గులకరాతి నది. సంబాళించుకొనండి. నిలదొక్కుకొనండి. దాటండి.

అశుభములను అన్నింటిని ఈ నదిలో ిడుచుచున్నాము. శుభంకరములు, పథ్యములగు

అన్నములచే దాటుచున్నాము.

11. అపామార్గమా! నీవు కిల్బిషము, కృత్య, దుష్ట స్వప్నమును మా నుండి తొలగించుము.

12. జలము మరియు ఓషధులు మాతో నిజమైన స్నేహము చేయవలెను. మేము ద్వేషించువారికి మమ్ము ద్వేషించువారికి జలములు, ఓషధులు శత్రు భావము వహించును గాత.

13. మేము ఎద్దుతోకను పట్టి దానిని తాకుచున్నాము. ఈ వృషభము సురభి పుత్రుడగును. ఇది మాకు శుభములు సమకూర్చవలెను. దేవతలకు ఇంద్రుని వలె ఇది మాకు రక్షణ యగును.

అగ్నిదేవా! హ◌ని అందించుము.

14. అంధకారమునకు ఆవల స్వర్గీయ జ్యోతిని దర్శించినాము. దేవతలందు ఏకమాత్ర దేవతయగు సూర్యుని, అతని ఉత్తమ జ్యోతిని చేరుకున్నాము.

15. (గ్రామ శ్మశానాన్తరే మర్యాదాలోష్టం నిదధాతి - గ్రామ శ్మశానమునకు అవతల లాంఛన ప్రాయమగు శిలను ఉంచవలెను.)

ఇది - ఈశిల జీ◌ంచియున్నవారికి హద్దు అగుచున్నది. అన్య జీ◌తుడు ఎవడును మృత్యువాత పడరాదు. జీవులు మృత్యువును పర్వతపు చాటున దాచివేయుదురుగాక. జీవులందరు బహుకర్మవ్యాప్రుతులై **' శతసం జీవంతు శరదః '** - శతశరత్తులు జీ◌ంతురు గాత.

16. అగ్నీ! మా ఆయువులను పావనము చేయుము. మాకు వర్షము కలిగించుము. **" ఆరే బాధస్వ దుచ్ఛునామ్ "** తుచ్ఛులను మాకు దూరమున హింసించుము.

17. అగ్నీ! నీవు హ◌ వలన వర్ధిల్లువాడవు. ఘృతము వలన పరిపూర్ణ స్వరూపుడవు. ఘృతమున పుట్టి పెరిగెదవు. మధురము, రుచికరమగు గోఘృతమును పావనము చేయుము. తండ్రి తన కొడుకువలె - మా పుత్రాదులను రక్షించుము స్వాహా.

18. ఇతడు గోదానము చేసినాడు. అగ్నికి ఆహుతులు అర్పించినాడు. దేవతలకు హ◌ని అందించినాడు.

శ్మశానము నుండి తిరిగి వచ్చినవారిని ఎవడు ఏడిపించగలడు?

19. పచ్చిమాంసము తిను అగ్నిని పారద్రోలుచున్నాను. అది పాపము మోసుకొని శ్మశానమునకు తరలునుగాక.

ఇచట - ఈ యజ్ఞ గృహము నందలి - ఈ అగ్ని తద్భిన్న మైనది. ఇచట పుట్టినది. అతడు దేవతలను ఎరుగును. స్వాధికారమును ఎరుగును. **" దేవోభ్యో హవ్యం వహతు '** దేవతలకు హ◌ని వహించవలెను.

20. అగ్నీ! నివు జాతవేది◌. పితరులు దూరమున ఎచట ఉన్నారో నీకు తెలియును. వారి కొరకు వపను కొని పొమ్ము. ఆ పితరుల కొరకు మేద యొక్క నదులు ప్రవహించును గాత. **" సత్యా ఏషామాశిషః సన్నమంతాం స్వాహా "** వారి నిజమగు ఆశీస్సులుమాకు అందును గాత. స్వాహా.

21. ఆస్మాత్త్వమధి జాతో ఽసి త్వదయం జాయతాం పునః ।

అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా.

అగ్నీ! నీవు ఇతని నిమిత్తము ఆవిర్భవించినావు. ఇతడు మరల నీలో జన్మించును గాత. ఇతనికి స్వర్గము కలుగునట్లు స్వాహా.

## దాశరథి రంగాచార్య విరచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## పితృమేధమను ముప్పది అయిదవ అధ్యాయము సమాప్తము.

## "యచ్ఛానః శర్మం సోమము ప్రథాః "

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ముప్పది ఆరవ అధ్యాయము

1. ఋచం వాచం ప్రపద్యే మనో యజు: ప్రపద్యే సామ ప్రాణం ప్రపద్యే చక్షు:

శ్రోత్రం ప్రపద్యే ।

వాగోజః సహోజో మయి ప్రాణాపానౌ ॥

ఋగ్రూపము వాణిని చేరుచున్నది. మనోరూపము యజుస్సును చేరుచున్నది. సామరూపము ప్రాణమును చేరుచున్నది. చక్షువులు, శ్రోత్రమును చేరుచున్నవి. నాకు వాక్కు, శత్రువును సహించుబలము, వీర్యము, ప్రాణాపానములు లభించవలెను.

2. నా యొక్క చక్షువులు, హృదయమందున్న రంధ్రములను బృహస్పతి పూరించవలెను. "శంనో భవతు భువనస్యయాపతిః " జగముల స్వామి నాకు శుభములు సమకూర్చవలెను.

3. భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।

ధియో యోనః ప్రచోదయాత్ ॥

అర్థమునకు 3-5 చూడండి.

4. ఇంద్రుడు ిచిత్రుడు. నిరంతర వర్షకుడు. అతడు ఏ స్తుతులకు ప్రసన్నుడగును? తన రక్షణల సహితుడై మాకు ుత్రుడు ఎట్లగును? ఎట్టి అతి సుందర స్తుతులు ిని అతడు మాకు రక్షకుడగును?

5. ఇంద్రా మత్తునిచ్చు పదార్థములందు ఏది అత్యంత మాదకమగును? ఏ సోమ రసము నిన్ను ఉన్మత్తుని చేయును? ఏ బలమున నీవు అత్యంత శక్తివంతుడవగుదువు? శత్రు ధన ిభేదనము చేసితెత్తువు?

6. ఇంద్రా! మా ుత్రులగు స్తోతలను నీ యొక్క నూర్లకొలది రక్షలతో ఎప్పుడు రక్షింతువు?

7. అభీష్ట వర్షక ఇంద్రా! ఏ రక్షణలచే నీవు మమ్ము ఆనందింపచేయుదువు? ఏ స్తుతులకు

ప్రసన్నుడవై స్తోతల కొరకు ధనము నింపి తెచ్చెదవు?

8. **ఇంద్రో ిశ్వస్య రాజతి** - రాజగును. **శంనో అస్తు ద్విపదే** - రెండు కాళ్ల జీవులకు శుభము కలుగును గాత. **శం చతుష్పదే.**

(శం అనగా శుభము, సుఖము. దీనిని తరువాత వచ్చు మంత్రములకు అన్వయించుకొనుడు)

9. **శంనో ుత్రః శం వరుణః శంనో భవత్యర్యమా ।**

**శంన ఇన్ద్రో బృహస్పతిః శం నో ిష్ణు రురుక్రమః ॥**

10. **శంనో వాతః పవతాం శంనస్తపతు సూర్యః ।**

**శంన కనిక్రదద్దేవః పర్జన్యో అభివర్షతు ॥**

11. మాకు పగళ్లు సుఖదములు కావలెను. రాత్రులు సుఖదములు కావలెను. ఇంద్రాగ్నులు స్వరక్షణలచే సుఖ ప్రదులు కావలెను. హిస్సులు అందుకున్న ఇంద్రవరుణులు మాకు శుభప్రదులు కావలెను. అన్న ప్రాపక యజ్ఞమున ఇంద్ర - పూషలు మాకు శుభప్రదులు కావలెను. ఇంద్ర సోములు మాకు సుఖజీవనము ప్రసాదించవలెను.

12. అభీష్ట సిద్ధికిని, త్రాగుటకును, ద్యుతిమంత జలము మాకు సుఖప్రదమగును గాత. జలములు మాకు సుఖము కలుగునట్లు ప్రవహించును గాత.

13. భూిు! నీవు మా కొరకు సుఖ స్వరూపవగుము. కంటకరహితవగుము. నివసింపచేయు దానవగుము. "యచ్ఛా నః శర్మ సప్రథాః " మాకు ఎన్నో సుకుములను ప్రదానము చేయుము.

14. జలము సుఖదము. మాకు వర్చస్సు కలిగించుటకు గాను జలమునకు బలములు కలుగవలెను.

15. జలమా! నీ యొక్క సారము ఎంతో సుఖకరము. వాత్సల్యముగల తల్లులు పిల్లలకు చన్నిచ్చినట్లు - జలమా! నీ సారమున మమ్ము భాగస్వాములను చేయుము.

(జలమును చనుబాలతో పోల్చుచున్నాడు.)

16. జలమా! యజ్ఞ గృహమునకు నీవు అనుకూలవు అయినరీతి మాకు నీవు ప్రభూత ప్రమాణమయిన లభింపుము. మమ్ము పావనములను చేయుము.

17. ద్యౌః శాన్తి రన్తరిక్షంశాన్తిః పృథిఁశాన్తి

రాపః శాన్తి రోషధయః శాన్తి ।

వనస్పతయః శాన్తి ర్విశ్వేదేవా ః శాన్తి ర్బ్రహ్మ శాన్తి

సర్వమ్ శాన్తిః శాన్తి రేవశాన్తిః స్మాశాన్తిరేధి ॥

దేవతల పేర్లు శాంతి మాత్రమే ఉన్నందున అర్థము వ్రాయుటలేదు.

అన్నింటికి శాంతి శాంతికే శాంతి. అది మాకు సమస్త శాంతులు కలిగించును గాత.

(ఇన్ని శాంతించినపుడే మానవాళికి శాంతి. ఏ ఒక్కదానికి అశాంతి ఏర్పడినను, మానవ జీఁతము అల్లకల్లోలము అగును. వరదలు, తుఫానులు, భూకంపము వంటిఁ ఆయా దేవతల

అశాంతికి చిహ్నములు)

18. మహాఁర ఘటమా! నీవు నా దేహమును పటిష్ఠము చేయుము. సర్వభూతములు నన్ను ఁత్ర దృష్టిచే చూడవలెను. నేను సహితము సర్వ భూతములను ఁత్ర దృష్టిచే చూడవలెను. " ఁత్రస్యచక్షుషా సఁక్షామహే" ఉభయులము పరస్పరము స్నేహ దృష్టి కలిగియుందుము గాత.

19. మహాఁర ఘటమా! నీవు నన్ను దృఢ పరుచుము. మేము నీ కృపాదృష్టియందే జీఁంతుము. నీ కృపాదృష్టి యందే వర్ధిల్లుదుము.

20. నమస్తే రసహరణశీల జ్యోతీ! నమస్తే జ్వాలామయీ!

అగ్నీ! నీ జ్వాలలు శత్రువులను మాత్రమే తపింపచేయవలెను పావకా! మా కొరకు మాత్రము నీవు కళ్యాణకారిఁ అగుము.

21. మెరుపునకు నమస్సు. ఉరుమునకు నమస్సు మాకు సుఖశాంతులు కలిగించదలచిన వారందరికి నమస్సు.

22. ఎవరి వలన మాకు భయముండునని నీవు గ్రహింతువో వారి వలన మమ్ము నిర్భయులను చేయుము. శం నః కురు. మాకు సుఖములు కలిగించుము. ప్రజాభ్యో అభయం. మా సంతానమును నిర్భయులను చేయుము. మా పశువులకు భయము లేకుండ చేయుము.

23. సుఃమిత్రియాన ఆప ఓషధయః సన్తు దుర్మిత్రియా

స్తస్మైసన్తు యో ఃస్మాన్ద్వేష్టి యంచ వయం ద్విష్మః

అర్థమునకు 35-12 చూడండి.

24. తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ ।

పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతం శ్రుణుయామ శరదః శతం. ప్రబ్రనామ శరదః శతం. మదీనా శ్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్ ॥

దేవతలచే నియఃఇంచబడిన సర్వచక్షువగు సూర్యుడు తూర్పున ఉదయించుచున్నాడు.

మేము నూరు శరత్తులు దర్శింతుము గాత. నూరు శరత్తులు జీఃంతుము గాత. నూరు శరత్తులు ఃనుచుందుము గాత. నూరు శరత్తులు చక్కగా మాట్లాడుదుము గాత. నూరు శరత్తులు దీనులము కాకుందుము గాత. నూరేండ్లు దాటి మరింత జీఃంతుము గాత.

(నూరేళ్లు జీఃంచుటకు మాత్రము కాదు. అవయవములన్ని బాగుండి దైన్యము లేక జీఃంచవలెనని ఆశించుచున్నాడు. అట్టి జీఃతము మరింత సాగునని)

దాశరథి రంగాచార్య ఃరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

శాంతి పాఠార్థమను ముప్పది ఆరవ అధ్యాయము సమాప్తము.

"శాంతిః సామా శాన్తిరేధి"

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ఃద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

# ముప్పది ఏడవ అధ్యాయము

1. దేవస్యత్వాస◌ంతుః ప్రసవే ◌శ్వినోర్బాభ్యాం పూష్ణో హస్తాభ్యాం ।

ఆదదే నారిరసి ॥

(మట్టి త్రవ్వు అభ్రిని పట్టుకొని)

అభ్రీ! నేను స◌ంతా దేవతా ప్రేరణయందు ఉన్నవాడను. అశ్వినుల బాహువులతో పూష హస్తముల చేతను నిన్ను పట్టినాను. నీవు నారీ రూపమవు.

2. ◌ద్వాంసులు. ద్విజులు, యజమాని యొక్క మహా ఋత్విజులు మనసులను ఏకాగ్రము చేసినారు. తమ బుద్ధి వృత్తులను ఏకాగ్రము చేసినారు. ప్రజ్ఞానియగు హోత యజ్ఞ◌ధిని జరిపించును. ఇది స◌ంతా దేవత మహా పరిస్తుతి అగును.

3. ద్యోతమాన ద్యావాపృథ్వులారా! ఇది పృథ్వికి దేవయజన స్థానమగు యజ్ఞము. ద్యులోకము నుండి జలమును - పృథ్వి నుండి మట్టిని తీసి యజ్ఞమునకు శిరోభూతమగు మహా ◌ర ఘటము చేయుచున్నాను.

(నేలను త్ర◌్వ మట్టిని చేతిలోనికి తీసుకొనవలెను)

మృత్తికా! యజ్ఞము కొరకును, యజ్ఞ శిరోభూతమగు మహా ◌రఘటము కొరకును నిన్ను అందుకొనుచున్నాను.

4. చెదలు దేవతలారా! అన్నింటి కన్న ముందు భూ◌ి ఉత్పన్న మైనది. భూతముల ఉత్పత్తి

కన్న ముందు ◌ురు పుట్టినారు. ఇది దేవయజన స్థాన యజ్ఞము. ఈ యజ్ఞమునకు శిరోభూతమగు

మహా◌ర ఘట నిర్మాణమునకు ◌ు మట్టిని తీసికొనుచున్నాము.

(పుట్ట మట్టిని తీసికొనవలెను)

వల్మీక మృత్తికా! మహా ◌రఘట నిర్మాణమునకు నిన్ను తీసికొన్నాము.

5. ఆది కాలమున ఈ పృథ్వి కొద్దిగా ఉండెను. పృథ్వి! పృథ్వియొక్క దేవయజన స్థాన యజ్ఞమున యజ్ఞ శిరోభూతమగు మహా ◌రఘటనిర్మాణము కొరకు నిన్ను తీసికొందును.

(పందులు ముట్టెలతో త్ర◌్వన మట్టిని తీసికొనవలెను.)

మృత్తికా! యజ్ఞం కొరకు నేను నిన్ను తీసుకొనుచున్నాను. యజ్ఞ శిరోభూత మహా ిర ఘటము కొరకు నిన్ను సేకరించినాను.

6. పూతికా తృణమా! నీవు ఇంద్రుని ఓజస్సున ఉత్పన్న మైనావు. పృథ్వి యొక్క దేవయజన స్థాన యజ్ఞమున - యజ్ఞ శిరోభూత మహాిరఘట నిర్మాణమునకు నిన్ను అందుకొనుచున్నాను.

(మేక పాలు తీసుకొనవలెను.)

దుగ్ధమా! యజ్ఞము కొరకును, యజ్ఞ శిరోభూతమగు మహా ిర ఘట నిర్మాణము

కొరకును ిమ్ము స్పృశించుచున్నాను.

7. (కృష్ణాజినము పట్టుకొని "పరివృత్తము" వైపు నడువవలెను.)

బ్రహ్మణస్పతి ిచ్చేయును గాత. సత్య, ద్యుతి మంత ద్యావాపృథ్వులు ిచ్చేయుదురు గాత. ిరుడు, మానవ హితకారి, పంక్తి, సాధకుడు మా యజ్ఞమును జరిపింతురు గాత.

(పదార్థములను ఒక చతురస్ర స్థలమున 'పరివృత్త' మందు పెట్టవలెను.)

పదార్థములారా! యజ్ఞము, యజ్ఞ శిరోభూతమగు మహా ిర ఘటము కొరకు ిమ్ము ఇచట పరివృత్తమున చేర్చుచున్నాను.

(పుట్ట మన్ను, పందులు త్ర్వన మన్ను, పూతికా తృణములను పాలతో కలిపి పిసుకవలెను.)

పదార్థములారా! యజ్ఞము మరియు యజ్ఞశిరోభూత మహాిర ఘటము కొరకు ిమ్ము కలుపుచున్నాను.

(క్రమముగా మూడు మహాిరఘటములను ిధి ప్రకారము చేయవలెను.)

మహాిరఘటములారా! యజ్ఞము కొరకును, యజ్ఞ శిరో భూత యజ్ఞ దేవత కొరకును ిమ్ము నిర్మించుచున్నాను.

8. ప్రథమ మహా ిర ఘటమా! నీవు యజ్ఞపు శిరమవు. (తాకవలెను) యజ్ఞం కొరకును, యజ్ఞ శిరోభూత యజ్ఞ దేవత కొరకును నిన్ను తాకుచున్నాను.

ద్వితీయ మహా ిరఘటమా! నీవు యజ్ఞపు శీర్షమవు. (తాకవలెను) యజ్ఞము కొరకును యజ్ఞ శిరోభూత దేవత కొరకు నిన్ను తాకుచున్నాను.

తృతీయ మహా ిరఘటమా! నీవు యజ్ఞపు తలవు. యజ్ఞం కొరకును యజ్ఞ శిరోభూత దేవత కొరకును నిన్ను తాకుచున్నాను. (స్పృశించవలెను)

మహాిర ఘటములారా! యజ్ఞము కొరకును, యజ్ఞ శిరోభూత దేవత కొరకును ిమ్ము నున్నగా చేయుచున్నాను.

ఏవమగ్రిమౌ మన్త్రౌ

9. ప్రథమ మహా ిర ఘటమా! పృథిి యొక్క దేవయజన స్థాన యజ్ఞమందు సేచక అశ్వపు లద్దిచే నిన్ను ధూపితము చేయుచున్నాను.

ద్వితీయ మహాిరఘటమా! పృథిి యొక్క దేవయజన స్థాన యజ్ఞమందు సేచక అశ్వపు లద్దిచే నిన్ను ధూపితము చేయుచున్నాను.

తృతీయ మహా ిరఘటమా! అశ్వస్య త్వా వృష్ణః శక్నా ధూపయాిు దీవయజనే పృథివ్యాః

మఖాయత్వా మఖస్యత్వా శీర్ష్ణే । మఖాయత్వా మఖస్యత్వా శీర్ష్ణే ।

మఖాయత్వా మఖస్యత్వా శీర్ష్ణే । మఖాయత్వా మఖస్యత్వా శీర్ష్ణే ।

10. (పక్వానుద్ధరతి - కాలినవానిని తీయవలెను.)

ప్రథమ మహాిరఘటమా! ఋజు ద్యులోకము కొరకు నిన్ను నిప్పుల ిద నుంచి దింపుచున్నది.

ద్వితీయ మహా ిరఘటమా! వర్షించి సకల కార్యములు సాధించు అంతరిక్షము కొరకు నిన్ను నిప్పుల ిది నుంచి దించుచున్నాను.

తృతీయ మహా ిరఘటమా! మేము నివసించుటకు ఆధార భూతమగు భూిు కొరకు నిన్ను అగ్గి ిది నుంచి దింపుచున్నాను.

మహా ిరఘటములారా! యజ్ఞం కొరకును, యజ్ఞ శిరోభూత దేవత కొరకును ిమ్ము నేను పాలచే తడుపుచున్నాను. (మేక పాలతో తడుపవలెను)

మహా ిర సంభరణం సమాప్తమ్

11. (బ్రహ్మానుజ్ఞాతో యామాయత్వేతి మహాిరం ప్రోక్షతి - బ్రహ్మచే అనుమతి పొందినవాడై యమాయతో మొదలిడి మహా ిరులను ప్రోక్షించును)

ఘర్మమా! యమ, యజ్ఞ, సూర్య తాపము కొరకు నిన్ను జలముచే ప్రోక్షించుచున్నాను.

ఘర్మమా! సిితా దేవత నీకు మధుర ఘృతము పూయును గాత. (నేతి పూత వేయవలెను.)

(ఆవపు ఇసుక క్రింద నూరు మాషముల వెండి పాతిపెట్టవలెను.)

రజతమా! నిప్పు నేలను కాల్చకుండ కాపాడుము.

(మూడు కుండలను కాలుటకు ఆవమున పెట్టి ఆవమును మూయవలెను. ఆవపు నలుదిశలు నిప్పు అంటించవలెను.)

ఘర్మమా! నీవు చంద్ర కాంతి వంటి దానవు. అగ్నితేజము వంటి దానవు. సూర్య తాపము వంటిదానవు.

12. (కాలి బయటికి తీసిన మహా ీరములను వ్రేలిచే తాకి చూచిన యజమాని చెప్పవలసినం)

పృథ్వీ! నీవు ప్రాగ్దిశన అగ్ని ఆధిపత్యమున ఉన్నదానవు. రాక్షసాదులు నిన్ను వేధించజాలరు. నాకు ఆయుష్యము ప్రసాదించుము.

భూిు! దక్షిణదిశయందు ఇంద్రుని ఆధిపత్యమున ఉన్నదానవు. పుత్రవతిం. నాకు సంతానము ప్రసాదించుము.

ధరిత్రీ! నీవు పశ్చిమదిశన సంత ఆధిపత్యమున ఉన్నదానవు. నీవు సుఖముల కొరకు ఆశ్రయణీయవు. నీవు నాకు దర్శన శక్తిని ప్రసాదించుము.

రత్నగర్భా! నీవు ఉత్తర దిక్కున ధాత ఆధిపత్యమున ఉన్నదానవు. ఋత్విజులు ఆశ్రయించు యజనీయ స్థానమవు. నాకు ధన సమృద్ధిని ప్రసాదించుము.

ధాత్రీ! నీవు ఊర్ధ్వ దిశన బృహస్పతి ఆధిపత్యమున ఉన్నదానవు. సర్వము ధరించుదానవు. నాకు ఓజస్సు ప్రసాదించుము.

(మహా ీర ఘటములు దక్షిణ భూిు ీద యజమాని చేతిని బోర్ల వేయును.)

మహా ీరమునకు దక్షిణమున ఉన్న స్థలమా! నాకు నాశనము కలిగించు రాక్షసాదుల నుండి నన్ను కాపాడుము.

(ఉత్తరము వైపు చేయిపెట్టవలెను.)

ఉత్తర భూిు! నీవు మనువు యొక్క అశ్వమవు. మనోరశ్వాసి.

13. ఘర్మమా! నీవు స్వాహా ఆకారపుదానవు. నీవు మరుత్తులచే ప్రతిష్ఠించబడిన దానవు. (ఘర్మమున నూరు మూషముల బంగారము పెట్టవలెను.)

స్వర్ణ శతమాషమా! నీవు నన్ను ద్యులోకమునంటు రాక్షసాదుల నుండి రక్షింపుము.

(కృష్ణాజినముతో ఘర్మమును ఁసరవలెను.)

ప్రాణ, అపాన, వ్యానములను ఒక్కొక్క ప్రవర్గ్యమున ఉంచుచున్నాను.

14. ప్రవర్గ్యము దేవతలకు గర్భము, స్తుతులకు పిత. ప్రజలకు అధిపతి. ప్రవర్గ్యము సఁతతో కలసి పోయినది. అది సూర్య సహితముగా వెలుగుచున్నది. సూర్యేణ రోచతే.

15. ఘర్మము అగ్నిచే ఏకీ భూతమైనది. సఁతతో కలసిపోయినది. సూర్యునిచే శోభిల్లినది. స్వాహాకారఘర్మము సూర్య తేజముతో, సఁతతో, సూర్యునితో, సూర్యునితో కూడి వెలుగొందుచున్నది.

16. ఏ దేవత ద్యులోకమును, కిరణములను దాల్చువాడగునో, ఎవడు మనుష్య భావ రహితుడగునో, ఎవడు సూర్యుని నుండి ఆఁర్భఁంచినాడో, ఆ దేవత మాకు వాక్ శక్తిని ప్రసాదించును గాత.

17. రక్షణ ధర్మము గల ఆదిత్యుడు ఆకాశము నుండి పడడు! అతడు ఁభిన్న మార్గములందలి రాక పోకలను చూచుచున్నాడు! అతను తన కిరణముచే కూడినవాడై సకల లోకములందు స్వచ్ఛందముగ సంచరించును!!

18. ఘర్మమా! నీవు సకల భువన స్వాఁఁ. మనస్పతిఁ. వాచస్పతిఁ. నీవు దేవశ్రుతుడవు. దేవత వగుము. యజ్ఞములందు దేవతలను రక్షింపుము.

అశ్వినులారా! ఈ యజ్ఞమున దధ్యంగ అధ్వర్యు - బ్రాహ్మణులు ఎరుగవలసిన మధు ఁద్యను - మధు ఁద్యా పూజకులగు ఁకు బోధించినాడు. అట్టి అశ్వినులగు ఁరు కూడ మాకు రక్షకులు కావలెను.

19. ఘర్మమా! హృదయమున నీవు, మనసున నీవు, దిఁయందు నీవు, సూర్యుని యందు నీవు. నీవు ఊర్ధ్వగతిఁ అగుము. మా యజ్ఞమును స్వర్గమందలి దేవతలకు చేర్చుము.

20. **ఘర్మమా! పితానో ఁసి.** నీవు మాకు తండ్రిఁ. పితానో బోధి. మా తండ్రిగా ఎరుగుము. **నమస్తే. అస్తు మా మాంహింసీః** (తండ్రిఁ కావున ) మమ్ము ఎన్నడును బాధించకుము.

(ముసుగు తొలగించి ఘర్మమును దర్శించు యజమానపత్ని అనవలసినది.)

మహాఁరా! నీవు ఁర్యమునకు అధిదేవతయగు త్వష్ట యుక్తుడవు. మేము స్త్రీలము. మైథు నము నిఁత్తము నిన్ను ముట్టుకుందుము. నాకు పుత్రులను, గోవులు మున్నగు పశువులను ప్రసాదించుము. **అరిష్టాహం సహాపత్యా భూయాసమ్** - నా పతితో కూడి బాధలు లేకుండ జీఁంతును గాత.

21. **అహః కేతునా జుషతాం సుజ్యోతిర్జ్యోతిషా స్వాహా.**

రాత్రిః కేతునా జుషతాం సుజ్యోతిర్జ్యోతిషా స్వాహా.

పగలు జ్యోతి సహితమై సుజ్యోతిష్మంతుడగు సూర్యునకు స్వాహా. రాత్రి శుభ జ్యోతి సహితయై సుజ్యోతిష్మంతుడగు అగ్నికి స్వాహా.

(రౌహిణ హోమమునకు రెండు ఘృతాహుతులు ఇవ్వవలెను.) (అగ్నిర్వైఘర్మః - తప్త ఇవవై ఘర్మః ఆదిత్యోవై ఘర్మః । ఆదిత్యః ప్రవర్గ్యః ఘర్మము, ప్రవర్గ్యము ఆదిత్యుడే అగును.)

## దాశరథి రంగాచార్య ురచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## అభ్యాऽది రౌహిణాంతమను ముప్పది ఏడవ అధ్యాయము సమాప్తము.

## యతో యతః సంహసే తతోనో అభయం కురు ।

## శం నః కురు ప్రజాభ్యో భయం పశుభ్యః ॥

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ుద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

1. (గోవును కట్టునట్టి రుజ్జువును పట్టుకొనవలెను)

దేవస్యత్వా సంతుః ప్రసవే ుశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్

ఆదదే ుత్యైరాత్నాసి ।

నేను సంతా దేవత అనుజ్ఞ యందు ఉన్నవాడను. ఈ రజ్జువును అశ్వినుల బాహువులతోను, పూష హస్తములతోను పట్టుకొనుచున్నాను. ఇది అదితికి మేఖల అగును.

2. ఇడా! ుచ్చేయుము. అదితీ! ుచ్చేయుము. సరస్వతీ! ుచ్చేయుము. గోమాతా! ుచ్చేయుము.

(ధవలి ఏహి ఏవంత్రిః - గోమాతా! ుచ్చేయుము అని మూడు సార్లు పిలువవలెను.)

3. రజ్జువా! నీవు అదితి మేఖలవు. ఇంద్రాణి శిరోభూషణమవు.

(త్రాడుచే గోవు వెనుక కాళ్ళు కట్టవలెను.)

వత్సమా! నీవు పూషవగుదువు.

(దూడను ిడువవలెను.) దూడా! ఘర్మమునకు కొన్ని పాలు ఉంచుము. (దూడను తొలగించవలెను)

4. గోమాతా! అశ్వినుల కొరకు పాలు ఇమ్ము. సరస్వతి కొరకు పాలు ఇమ్ము. ఇంద్రుని కొరకు పాలు ఇమ్ము. (పాలు పితుకవలెను.)

(పితుకునప్పుడు చి్ముపడిన పాల చుక్కలను ఉద్దేశించి) ఇద ఇంద్రునకు

ఆహుతియగును.

5. తల్లీ సరస్వతీ! నీ స్తనము సుప్తమట్లున్నది. అది సుఖ స్వరూపమగును. రత్నములు ఇచ్చునదగును. ధనలాభము కలిగించునది అగును. సుదాత అగును. సకల వరణీయ ధనములను పోషించునదగును. నీ స్తన్యము ఇచ్చుటకు మా వైపు మరలుము. నేను ిశాల అంతరిక్షమును అందుకొనగలను!

(సప్త ఇవాస్తే అనుపభోక్త న్యైః ఇతరులు అనుభిించనిది)

6. (పరీశాసావదత్తే - రెండు పరీశసములను పట్టుకొని - ద్యావా పృథ్వీ పరీశాసౌ ఇతి శత పథం)

ప్రథమ పరీశసమా! నీవు గాయత్రీ ఛందమవు. ద్వితీయ పరీశసమా! నీవు త్రిష్టుప్ ఛందమవు.

(పరీశసములచే మహాీరమును పట్టవలెను.)

ఘర్మమా! నిన్ను ద్యావాపృథ్వుల కొరకు గ్రహించుచున్నాను.

(మహాీరఘటమును తుడిచి ఉపయమన స్రువమున దానిని పట్టుకొనవలెను)

ఘర్మమా! నిన్ను నేను అంతరిక్షపు ఉదరము నుంచి గ్రహించుచున్నాను.

(మహా ీర ఘటమును మేకపాలచే తుడుపవలెను.)

ఇంద్రా! అశ్వినులారా! తేనెటీగలు కూర్చిన ఈ మధువును సేిించండి. వసువులారా! ఈ పలను వర్షము నిచ్చునట్టి సూర్యుని కిరణములకు సమర్పించండి.

7. సముద్ర రూప వాయువునకు స్వాహా. సహగతి వాయువునకు స్వాహా. అప్రధర్షిత వాయువునకు స్వాహా. ప్రతిధర్షిత వాయువునకు స్వాహా. రక్షక వాయువునకు స్వాహా. అశ్లేశద వాయువునకు స్వాహా.

8. వసురుద్ర యురతక్త ఇంద్రునకు స్వాహా. ఆదిత్య యుక్త ఇంద్రునకు స్వాహా. శత్రు హంత ఇంద్రునకు స్వాహా. ఋభు, ిభ్వ, వాజయుక్త సంతాయ స్వాహా. బృహస్పతియే త్వా ిశ్వదేవ్యావతే స్వాహా.

9. **యమాయ త్వాంగిరస్వతే పిత్రుమతే స్వాహా । ఘర్మాయ స్వాహా ఘర్మః పిత్రే !**

10. అధ్వర్యు దక్షిణ దిశన కూర్చుండి సకల దేవతలను యజించును. అందువలన దిశలన్నియు దక్షిణ దిశయందు ప్రతిష్ఠితములై ఉన్నం.

అశ్వినులారా! ఘర్మస్థ మధువు యొక్క స్వాహా కృత అంశమున పానము చేయండి.

11. (మహాిరమును మూడు సార్లు పైకి ఎగురవేసి పట్టుకొనవలెను)

ఈ యజ్ఞమును ద్యులోకమునకు చేర్చుము. చేర్చుము ఈ యజ్ఞమును ద్యులోకమునకు స్వాహాగ్నయే యజ్ఞియాయ. యజనీయ అగ్నికి స్వాహా. శం యజుర్భ్యః యజువులు మాకు శుభములు కలిగించును గాత.

12. అశ్వినులారా! రాత్రింబవళ్ళు ి రక్షణలచే హృదయంగమ ఘర్మస్థ మధువును

సేించండి. **నమో ఆదిత్యాయ. నమో ద్యావాపృథిిభ్యాం.**

13. అశ్వినులారా! ఘర్మము యొక్క మధుర దుగ్ధములను సేించండి. ద్యావాపృథ్వులు మా కార్యములను ఆమోదింతురు గాత. ఇంద్రాదుల దానాదులు మా యజ్ఞమందే అగును గాత.

14. అతితప్త ధర్మమా! వర్షము కొరకు పుష్టినొందుము. అన్నము కొరకు పుష్టి నొందుము. బ్రాహ్మణ, క్షత్రియుల కొరకు పుష్టి నొందుము. ద్యావాపృథ్వుల కొరకు పుష్టి నొందుము.

ధర్మమా! నీవు జగత్తునుధరించుదానవు. సుధర్మమవు. మమ్ము హింసించకుము. మాకు ధనాదులు అందించుము. బ్రాహ్మణ క్షత్రియులను మా అధీనులను చేయుము.

15. (శకలైర్జుహోతి)

స్నేహోత్పాదక పూషకు స్వాహా. గ్రహణకారి ప్రాణములకు స్వాహా. ప్రతిరవకారి ప్రాణములకు స్వాహా. పితృభ్యః ఊర్ధ్వ బర్హిభ్యో ధర్మ పావభ్యః స్వాహా. ద్యావాపృథిి భ్యాం స్వాహా. ిశ్వేభ్యో దేవేభ్యో స్వాహా.

16. ఋత్విజులచే నుతించబడు రుద్రునకు స్వాహా. జ్యోతిచే జ్యోతిష్మతియగు ప్రజ్ఞాపక దినమార్తాండునకు స్వాహా. జ్యోతిచే జ్యోతిష్మతి యగు ప్రజ్ఞాపక అగ్నికి స్వాహా.

అత్యంత ీరుడగు అగ్నియందు మధువు హోమము చేయబడినది. తేదేవ ధర్మ నమస్తే - మా మా హింసీః - మమ్ము బాధించకుము.

17. ధర్మమా! నీ సుబుద్ధియు, ిస్తారమహిమయు ఈ ద్యులోకమును ప్రభాితము చేసిని. నీ యశస్సు పృథ్వి యందంతటను వ్యాపించినది.

అగ్నీ! నీవు ఎంతో గొప్పవాడవు. రక్తవర్ణపు నీ పొగను పెంచుము. దేవతలకు ప్రియతముడవగు నీకు జాజ్వల్యమానుడవగుము.

18. ధర్మమా! నీ కాంతి ద్యులోకమందున్నది. గాయత్రి ఛందమున ఉన్నది. హిర్ధాన గృహమున ఉన్నది. ఆ కాంతి వర్ధిల్లును గాత. స్వాహా.

ధర్మమా! నీ జ్యోతి అంతరిక్షమున ఉన్నది. త్రిష్టుప్ ఛందమున ఉన్నది. అగ్నీధ్ర గృహమున ఉన్నది. ఆ జ్యోతి వర్ధిల్లును గాత. స్వాహా.

ధర్మమా! నీ వెలుగు భూలోకమందున్నది. జగతీ ఛందమునందున్నది. సదస్సునందున్నది. ఆ వెలుగు వర్ధిల్లును గాత. స్వాహా.

(అధ్వర్యు మూడు శలాకలపైన ఘృతాహుతులు ఇచ్చును.)

19. మహాీరమా! క్షత్రియుల పరమ పాలన కొరకు నిన్ను అనుసరించుచున్నాము. బ్రాహ్మణుల దేహముల కొరకు పాలించును. ప్రజయందు ధర్మము ధరింప చేసి నందున నిన్ను అనుసరించుచున్నాము. నవ శుభముల కొరకని మేము నిన్ను అనుసరించుచున్నాము.

(హోమానంతర మధ్వర్యుః పత్నీమగ్రేకృత్వా శాలాయ నిష్క్రమతీత్యర్థః హోమము ముగిసినంత అధ్వర్యు పత్నిని ముందుంచుకొని నిష్క్రిించును)

20. మహా ీరము నాలుగు దిశల రూపమగు నాలుగు కోణముల యజ్ఞమునకు నాభియు

ిస్తార యుక్తము అగును. సప్రథాః సనో ిశ్వాయుః సప్రథాః సనః సర్వాయుః - ఆ మహాీరము మాకు ిశ్వమందలి ఆయువును, సర్వాయువును ప్రసాదించవలెను. మా నుండి ద్వేషమును తొలగించుము. కుటిలత్వము తొలగించుము. జగదనుగ్రహ రూపమునందు కలసిపోవుదుము గాక.

21. ధర్మమా! ఈ పాలు నిన్ను పూరించునిి. నీవు వానిలో నిండి పొమ్ము. వర్ధిల్లుము.

(మూడు మహా ీరములందు పాలునింపవలెను)

మహాీరమా! నీ దయ వలన మేము వర్ధిల్లవలెను. మాకు ధన ధాన్య సమృద్ధి కలుగవలెను.

22. మహాీరము అభీష్ట వర్షకము. రసహారి. ుత్రుని వంటి ప్రియము. అదిమరల మరల శబ్దము చేయును.జలధారము. ధననిధి యగు మహాీరమ సూర్యునితో కలసి ప్రకాశించుచున్నది.

23. సుుత్రియాన అప ఓషధయః సన్తు దుర్మిత్రియా స్తస్మై

సన్తుయో ుస్మాన్ద్వేష్టి యంచ వయం ద్విష్మః

35-12 చూడగలరు.

24. ఉద్వయం తమసస్పరిస్వః పశ్యన్త ఉత్తరమ్

దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్

20-21 చూడండి.

25. ( సుధమాదాయహవనీయే భ్యాదధాతి. సుధను అందుకొని ఆహవనీయ అగ్నియందు వేయును.)

కట్టే! నీవు సుధవు. ఆహవనీయాగ్ని సుధే! నీ కృప వలన మేము వర్ధిల్లుదుము గాత. నీవు సుధవు. తేజస్సునకు కారణమవు. నాయందు తేజస్సు కలిగించుము.

26. (దధి ఘర్మ గ్రహణమ్. పెరుగుకుండపట్టి)

ఇంద్రా! ద్యావాపృథ్వులు ఎంత ుస్తారములగునో, సప్తసాగరములు ఎంత ుస్తారములగునో అంతటి పరిమాణము గల పాత్రయందు అన్నము నింపి పట్టుకున్నాను. అది అక్షయము. అది నాయందు అక్షయము అగును గాత.

27. ఇంద్రుని ప్రసిద్ధమహాబలను నాలో చేరవలెను. సంకల్ప సంపద నాలో చేరవలెను. సంకల్పబలము నాలో చేరవలెను. ఆదిత్యజ్యోతి, వేదజ్యోతి, బ్రహ్మజ్యోతి సహితమగు ధర్మము

నాలో చేరవలెను.

28. పాలయొక్క సారభూతమగు పెరుగు ఈ ఘటమునందు నిండియున్నది. దీని ప్రభావమును మేము రానున్న - రానున్నసంవత్సరముల వరకు అనుభ్యుంతుము గాత.

ఘటమా! నీవు కాంతి స్వరూపమవు. స్వీకర్తవు. సు - సుఖపాలకమవు. ఈ దధిహోమశేషము. ఇంద్ర పేతము. ప్రజాపతి భక్షితము. మాధుర్యయుక్తము. ఆహ్వాతము. ఇటువంటి నీ దధి అంశమును, ఆహ్వానించబడినవాడనై భక్షించుచున్నాను.

దాశరథి రంగాచార్య ిరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

మహా ిర నిరూపణమును ముప్పది ఎని ుదవ అధ్యాయము సమాప్తము.

మయిత్యాదిన్ద్రియం బృహన్మయి దక్షో మయి క్రతుః

ఘర్మస్త్రిశుగ్వి రాజతి ిరాజా జ్యోతిషాసహ బ్రహ్మణా తేజసా సహ. ।

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## ముప్పది తొ ుమ్మదవ అధ్యాయము

ప్రవర్గ్యే ధర్మభేదే ప్రాయశ్చిత్తమ్ - ప్రవర్గ్యమున ధర్మలోపమునకు ప్రాయశ్చిత్త ఆహుతులు

1. స్వాహా ప్రాణే భ్యః సాధిపతికేభ్యః ।

పృథివ్యై స్వాహా ిగ్నయే స్వాహాన్తరి క్షాయస్వాహావాయవే స్వాహా ।

దివే స్వాహా సూర్యాయ స్వాహా ॥

హిరణ్యగర్భుని సహితముగ వర్తిల్లు ప్రాణమునకు స్వాహా. పృథి ికి స్వాహా. అగ్నికి స్వాహా. అంతరిక్షమునకు స్వాహా. వాయువునకు స్వాహా. ది ికి స్వాహా. సూర్యునకు స్వాహా.

2. దిశలకు స్వాహా. చంద్రాయస్వాహా. నక్షత్రేభ్యః స్వాహా. జలములకు స్వాహా. వరుణాయ స్వాహా. నాభ్యై స్వాహా. ప ిత్రునకు స్వాహా.

3. వాక్కునకు స్వాహా. ప్రాణాయ స్వాహా. ప్రాణాయస్వాహా. చక్షుషే స్వాహా. చక్షుషే స్వాహా. శ్రోత్రాయ స్వాహా. శ్రోత్రాయస్వాహా.

4. మనో కామన, సంకల్పము, వాణి, సత్యము, పశువుల రూపము, అన్నపురసము, యశము మరియు లక్ష్మి నాయందు ప్రవేశించును గాత - స్వాహా.

5. (నిష్ఠిత అభిస్పర్శ నుండి మేకపాలు కలుపుటకు వరకు మహా◌ిరమును "సంభ్రియమాణము" అగును. ఇందు సమయలోపము జరిగినంత ప్రజాపతికి ఆహుతులు ఇవ్వబడును ) ప్రజాపతయే స్వాహా.

(కుశల◌ిద ఉంచువరకు సంభృతియగును. దానికి లోపము కలిగిన సామ్రాట్ దేవత యగును) సామ్రాట్టునకు స్వాహా.

(మూంజుపోల ◌ిద ఉంచువరకు దానిని సంపన్నము అందురు. దానిని "సంపన్నము అందరు. దానికి లోపము కలిగిన ◌శ్వేదేవతలు దేవత యగుదురు) ◌శ్వేదేవతలకు స్వాహా.

(పరిశాసములు గ్రహించు వరకు దానిని 'ప్రబృక్తము' అనబడును. దానికి లోపము జరిగిన ధర్మము దేవతయగును.)

ధర్మమునకు స్వాహా.

(ఉద్యమానము నుండి మేకలపాలచే తడుపుట వరకు 'ఉద్యతము' అనబడును. దానికి లోపము జరిగిన తేజస్సు దేవత యగును) తేజస్సునకు స్వాహా.

(పాలు తెచ్చి మేకపాలతో తడుపుట వరకు ఘర్మము అశ్వినీ దేవతాకమగును. దానికి లోపము జరిగిన) అశ్వినులకు స్వాహా.

( ఘృతము తెచ్చి దానిలో తడుపుట వరకు పూష దేవతాకమగును. లోపమునకు) పూష దేవతకు స్వాహా.

(ఘర్మమున ఘృతము పోయువరకు మరుద్దేవతాకమగును. లోపమునకు ) పూష దేవతకు స్వాహా.

(మథించినపుడు పడిన ఘృతబిందువులు ◌ిత్ర దేవతాకము. అక్కడ లోపము జరిగిన) ◌ిత్రాయ స్వాహా.

(ఆహవనీయమున తీసికొని పోబడు ఘర్మము వాయు దేవతాకమగును. దానికి లోపము జరిగిన) వాయువునకు స్వాహా.

(ఆహుయమాన ఘర్మము అగ్ని దేవతాకమగును. దానికి లోపము కలిగిన) అగ్నయే స్వాహా.

(హుత హోమము తరువాత ఉత్తర ఘర్మకార్యము మొదలగుటకు ముందు వరకు వాక్ దేవతాకమగును. అచటి లోపమునకు ) వాగ్దేవతకు స్వాహా.

6. ప్రథమ దినము స◌తాదేవతాకము. నాటి ధర్మలోపమునకు స◌తకు స్వాహా.

రెండవ రోజు అగ్నిదేవతాకమగును. నాటి ధర్మలోపము జరిగిన అగ్నికి స్వాహా.

మూడవ రోజు వాయుదేవతాకమగును. నాటి ధర్మలోపమునకు వాయవే స్వాహా.

నాలుగవ రోజు ఆదిత్యదేవతాకమగును. వాటి ధర్మలోపమునకు ఆదిత్యునకు స్వాహా.

అయిదవ రోజు చంద్రదేవతాకమగును. నాటి ధర్మలోపమునకు చంద్రాయ స్వాహా.

ఆరవ రోజు ఋతుదేవతాకమగును. నాటి ధర్మలోపమునకు ఋతువులకు స్వాహా.

ఏడవ రోజు మరుద్దేవతాకమగును. నాటి ధర్మలోపమునకు మరుత్తులకు స్వాహా.

ఎనిిదవ రోజు బృహస్పతి దేవతాకమగును. నాటి ధర్మలోపమునకు బృహస్పతికి స్వాహా.

పదవరోజు వరుణ దేవతాకమగును. నాటి ధర్మలోపమునకు వరుణ దేవతకు స్వాహా.

పదకొండవ రోజు ఇంద్ర దేవతాకమగును. నాటి ధర్మలోపమునకు ఇంద్రునకు స్వాహా.

పన్నెండవ రోజు ిశ్వేదేవతాకమగును. నాటి ధర్మలోపమునకు ిశ్వేదేవతలకు స్వాహా.

8. (అశ్వమేధికం ఆ అధ్యాయ సమాప్తే. అధ్యాయసమాప్తము వరకు అశ్వమేధికము)

అశ్వపు హృదయముచే అగ్నిని సంప్రీతుని చేయుదును. అగ్రభాగమున అశ్వినులను, సమస్త హృదయఖండమున పశుపతిని, యకృతిచే భవుని, మతస్నాయువలచే శర్వుని, మన్యువుచే ఈశానుని, పేగులలోని మాంసముచే మహాదేవుని, పెద్ద పేగులచే ఉగ్రదేవుని, వసిష్ఠ, హనుహృదయము, తల యొక్క మాంసములచే శింగి దేవతను సంప్రీతులను చేయుదురు.

9. అశ్వపు రక్తమున ఉగ్రుని, అశ్వపు శుభకార్యములచే ిత్రుని, దుష్ట కార్యములచే రుద్రుని,

క్రీడలచే ఇంద్రుని, బలమున మరుత్తులను, ప్రమోదమున సంధ్యలను సంప్రీతులను చేయుదును.

భవునిది కంఠస్తమాంసము, రుద్రునిది ప్రక్కల మాంసము, మహాదేవునిది యకృత్తు,

శర్వునిం పెద్ద పేగులు; పశుపతిది పురీతతనాడియగును.

10. లోమేభ్యః స్వాహా లోమేభ్యః స్వాహా త్వచే స్వాహా త్వచే స్వాహా లోహితాయ స్వాహా లోహితాయ స్వాహా మేదోభ్యః స్వాహా మేదోభ్యః స్వాహా ।

మాంసేభ్యః స్వాహా మాంసేభ్యః స్వాహా స్నావభ్యః స్వాహా స్నావభ్యః స్వాహా స్వాహాస్థభ్యః స్వాహా స్థభ్యః స్వాహా మజ్జభ్యః స్వాహా మజ్జభ్యః స్వాహా । రేతసే స్వాహా పాయవే స్వాహా॥

11. ఆయాసాయ స్వాహా ప్రయాసాయ స్వాహా సంయా సాయ స్వాహా ◌యాసాయ స్వాహా ద్యాసాయస్వాహా ।

శుచే స్వాహా శోచతే స్వాహా శోచమానాయ స్వాహా శోకాయ స్వాహా ॥

12. తపసే స్వాహా తప్యతే స్వాహా తప్యమానాయ స్వాహా తప్తాయ స్వాహా ధర్మాయ స్వాహా।

నిష్కృత్యై స్వాహా ప్రాయశ్చిత్యై స్వాహా భేషజాయ స్వాహా ।

13. యమాయ స్వాహా న్త కాయ స్వాహా మృత్యవే స్వాహా బ్రహ్మణే స్వాహా బ్రహ్మ హత్యాయై స్వాహా ।

◌శ్వేభ్యో దేవేభ్యః స్వాహా ద్యావాపృథి◌భ్యాం స్వాహా ।

## దాశరథి రంగాచార్య ◌రచిత

## శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి

## ధర్మాది నిష్కృతి యను ముప్పది తొ◌్మదవ అధ్యాయము సమాప్తము.

మయిత్యదిన్ద్రియం బృహన్మయి దక్షో మయిక్రతుః ।

ఘర్మస్త్రిశుగ్విరాజతి ◌రాజా జ్యోతిషా సహ బ్రహ్మణ తేజసాసహ ॥

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం ।

ఆధారం సర్వ ◌ద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

## నలుబదవ అధ్యాయము

సమాప్తం కర్మకాణ్డ◌దానీం జ్ఞానకాణ్డం ప్రస్తూయతే. కర్మకాండము పూర్తి అయినది. ఇక జ్ఞాన కాండమును ప్రస్తా◌ంచుచున్నాను.

1. ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।

తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య స్విద్ధనమ్ ॥

ఇది సొంతము ఈశ్వరమయుము. ఈ లోకమున అగుపించు సమస్త చరాచర ప్రపంచము ఈశ్వరమయము. ఈశ్వరుడు ప్రసాదించిన వానిని అనుభవించుము. మరొకని ధనమునకు ఆశపడకుము.

2. మానవుడు కర్మ చేయుచునే నూరేండ్లు జీవించ నిచ్ఛగించవలెను. అందుననే ముక్తి

ఉన్నది. మరొక మార్గములేదు. ఆ విధముగా చేయువానికి కర్మలు చుట్టుకొనవు.

3. అసూర్య మను లోకములు ఉన్నవి. అవి అంధకారము తమస్సులతో నిండి యుండును.

ఆత్మహనులగు జనులు మరణానంతరము ఆ లోకములకు చేరుదురు.

(అంతరాత్మ ఆక్రందన వినక అకార్యములు చేయువాడు ఆత్మహననుడు)

4. అతడు నిశ్చలుడు. ఒక్కడు. మనసును మించిన వేగవంతుడు. వేగమును దేవతలు అతనిని అందుకొనజాలరు. అతడు తొలినుండియే సర్వత్ర వ్యాపించినవాడు. పరిగెత్తు ఇతరులను అతడు దాటిపోవును. అతని యందే గాలి, నీరు నిలిచి ఉన్నవి.

5. అతడు కదులు వాడగును. కదలనివాడగును. అజ్ఞానికి అతడు బహుదూరము. జ్ఞానికి అతడు అతి దగ్గర. అతడు సర్వాంతర్యామి. అతడే బాహ్య ప్రపంచము.

" తదన్తరస్య సర్వస్య తదు సర్వసాస్య బాహ్యతః"

6. ఎవడు సర్వ భూతములను తనలో చూచుచున్నాడో సర్వభూతములందు తనను చూచుచున్నాడో, అతనికి సందేహమున్నది ఉండదు.

7. ఎవడు సర్వభూతములను తానుగానే గ్రహించుచున్నాడో, అతనికి మోహమెక్కడ? శోకమెక్కడ? 'ఏకత్వమను పశ్యతః ' అతడు అన్నింటిని ఏకముగ చూచువాడు కదా!

8. అతడు సర్వవ్యాపకుడు. వీర్యరూపుడు. కాయము లేనివాడు. వ్రణము లేనివాడు. స్నాయు

బంధములకు అతీతుడు. శుద్ధుడు, పాప బంధములు లేనివాడు. విద్వాంసుడు. మనీషి, పరితః వ్యాప్తుడు. స్వయంభువు. అతడే కాలానుగుణముగా పంచభూతాత్మక సృష్టిని ఏర్పరచును.

9. అసంభూతిని ఉపాసించువారు అంధతమమునకు చేరుదురు. సంభూతి యందే మునిగిన వారు మరింత అంధకారమునకు చేరుదురు.

( మృతస్యసతః పునః సంభవోనాస్తేతి అసంభూతిః పునర్జన్మ లేదనుట అసంభూతి.

ఆత్మ్యై వాస్మి నాన్యత్కించిదస్తీత్యయమభి ప్రాయః తాను తప్ప అన్యము లేదనుట సంభూతము)

10. స్థూల జగత్తును ఉపాసించుట వలన ఒకే ఫలము కలుగును. అసంభూత మూల జగత్తును ఉపాసించుటవలన వేరు ఫలము కలుగును. మాకు బ్రహ్మతత్త్వ ివేచన కలిగించిన ిద్వాంసులు అది అసంభవమని చెప్పగా ిన్నాము.

11. ఉత్పత్తి, ినాశము, రెండింటిని వెంట వెంట తెలిసిన పండితుడు ినాశమున మృత్యువును దాటి సంభూతి ద్వారా అమృతత్వము నొందును.

12. అిద్యను ఉపాసించువారు అంధతమమున చేరుదురు. ఆత్మ ిద్య కాక అన్య ిద్యారతులు మరింత అంధతమమునకు చేరుదురు.

13. ఆత్మజ్ఞానమునకు అమృతత్వ ఫలమని కొందరు అనుచున్నారు. అిద్యకు పితృలోక ఫలమని కొందరు అనుచున్నారు. అట్లని జ్ఞానకర్మల ిచక్షణ గల ిద్వాంసులు అన్నారని ినుచున్నాము.

14. ిద్య, అిద్య రెంటిని వెంట వెంట తెలిసి కొన్నవాడు. అిద్య వలన మృత్యువును దాటి ిద్యవలన అమృతత్వము నొందుచున్నాడు.

15. ప్రాణము వాయువునందు, ఆత్మ అమృతత్వమునందు లీనములగును. దేహము బూడిద అగును. కావున పరమాత్మను స్మరించుము. లోకమును స్మరించుము. చేసిన దానిని స్మరింపుము.

16. అగ్నేనయ సుపథారాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని ిద్వాన్ ।

యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం ిధేమ ॥

17. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।

యో ిసావాదిత్యే పురుషః సో సావహమ్ ॥

ఓం ఖం బ్రహ్మ

సత్యపు ముఖమును బంగారు పాత్ర కప్పిపెట్టినది. ఆదిత్యుని యందున్న పరమ పురుషుడను నేనే అగుదును.

ఓం మహా బ్రహ్మన్

ిద్వాంసుడు, బహుభాషావేత్త, కిి, కథకుడు, నవలకారుడు, నాటకకర్త, బాలసాహిత్యకారుడు, ిమర్శకుడు, చలనచిత్ర రచయిత, వ్యాసకర్త, అనువాదకుడు, వక్త, కార్మికోద్యమకర్త, స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రగతి పథగాిు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఆకాడిు బహుమతి గ్రహీత, ప్రపన్నుడు, బుధజన ిధేయుడగు దాశరథి రంగాచార్య ిరచిత

శ్రీమదాంధ్ర వచన శుక్లయజుర్వేద సంహితయందలి పరమాత్మనిరూపకమగు నలుబదవ అధ్యాయమును శుక్ల యజుర్వేద సంహితయు

సర్వము సమాప్తము.

ద్యౌః శాన్తి రన్తరిక్షం శాన్తిః పృథిిీ శాన్తి రాపః శాన్తి రోషధయః శాన్తిః

వనస్పతయః శాన్తిర్విశ్వే దేవాః శాంతి ర్బ్రహ్మ శాన్తిః సర్వంశాన్తిః శాంతిరేవశాన్తి: సామాశాన్తిరేధి ॥

# శ్రీకృష్ణ యజుర్వేద తైత్తిరీయ సంహిత
# (1)

## కృష్ణపక్షం

**వాగర్థా% ివసంపృక్తౌ, వాగర్థ ప్రతిపత్తయే ।**
**జగతఃపితరౌ వందే, పార్వతీ పరమేశ్వరౌ ॥**

ఇదిప్రార్థన. అర్థన అంటే అడగడం, కోరడం. ప్రార్థన చక్కగా,శుచిగా, శుభ్రంగా, పవిత్రంగా అర్థించడం.ఈ అర్థించడం ఎవరిని? ఉన్నవాణ్ణి - ఇవ్వగలవాణ్ణి. ఉన్నవాడు,ఇవ్వగలవాడు ఎవడు?సృష్టి, స్థితి, లయ కర్త పరాత్పరుడు. అంతా అతనిదే.ఈశా వాస్యమిదంసర్వం. అతడుచరాచర జగత్తుకు తల్లీ - తండ్రీ - 'త్వమేవ మాతాచపితాస్త్వమేవ' బిడ్డ తల్లి రొమ్ముని తంతుంది.ముఖం రక్కుతుంది. తల్లి కోపగించుకోదు. కొట్టదు.మురిసిపోతుంది. ముద్దాడుతుంది. అమృతంవంటి చనుబాలిస్తుంది. తనయ/తనయుడు లక్షతప్పులుచేయును గాత. **'నాన్నా' అంటే తండ్రికరిగిపోతాడు. ఉన్నది సాంతం దోచిస్తాడు.**

భగవానుడుఈశ్వరుడు. సమస్తమూ అతనిదే! అతడు కరుణామయుడు- కరుణా సముద్రుడు - బిడ్డ ఆ ర్తనాదం వింటాడు. ఉరుకుతాడు.

గజేంద్రుడుమొసలి వాతపడ్డాడు. సకల ప్రయత్నాలు చేశాడు. ఓడాడు."నీవే తప్ప నితః పరంబెరుగమన్నింపం దగున్ దీనునిన్ / రావే ఈశ్వర! కావవే వరద!సంరక్షింపు భద్రాత్మకా" అనిమొత్తుకున్నాడు.

అప్పుడుస్వామి ఎలా ఉన్నాడు. 'రమావినోది' అయి ఉన్నాడు. లక్ష్మీ దేవితోసరస సల్లాపాలలోఉన్నాడు. విన్నాడు :- "విహ్వల నాగేంద్రము 'పాహి పాహి'యన గుయ్యాలించిసంరంభియై"

**సిరికింజెప్పడుశంఖ చక్ర యుగముంజేదోయి సంధింపడే**
**పరివారంబునుజీరడభ్రగపతిం బన్నింప డాకర్ణికాం**
**తరధమ్మిల్లము జక్కనొత్తడు వివాద ప్రోద్ధత శ్రీ కుచో**
**పరిచేలాంచల మైన వీడడు గజ ప్రాణాన నోత్సాహియై**

స్వామిగజప్రాణం రక్షించాలనే ఆవేశంలో బయలుదేరాడు! ఎలా?
లక్ష్మికిచెప్పడు. రెండు చేతుల్లో శంఖచక్రాలు ధరించడు.భృత్యులను పిలవడు. గరుడుని కోసంచూడడు. చెవుల మీద పడిన జుట్టును సవరించడు.లక్ష్మీదేవి చన్నుల మీద చెంగునైనావదలడు.

ఈ పద్యాన్నిగురించి ఒక కథ వుంది. భక్త శిఖామణి పోతనామాత్యునికిఈ పద్యం సందిగ్ధం అయింది.గంటం తాళ పత్రాలు వదిలాడు. నదీతీరానికి వెళ్తానని భార్యతోచెప్పాడు. వెళ్ళాడు. అటువెళ్లాడోలేదో మరలి వచ్చాడు. గంట అందుకున్నాడు. పద్యం పూర్తిచేశాడు.భార్యతో అన్నం పెట్టించుకున్నాడు. భోంచేశాడు. వెళ్లాడు.అప్పుడు పోతన పద్యం స్ఫురించిందని వచ్చాడు.
భార్యచకితురాలయింది. 'ఇప్పుడే కదా పద్యం పూరించి, భోంచేసివెళ్ళారు' అన్నది.
పోతనగబగబా పద్యం చదివాడు. అతనికి కన్నీరు మున్నీరయింది.

